# బాగోగులు



మూలం:

**ఎహ్రెన్‌బర్గ్**

తెనుగు:

**పిచ్చేశ్వరరావు**

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ఈ నవలని గురించి ....

సోవియట్ యూనియన్‌లో ఒకానొక రాష్ట్ర ముఖ్య పట్టణంలోని జీవితానికి సంబంధించిన కథ యిది. ఆ పట్టణంలోని డాక్టర్లు, స్కూలు టీచర్లు, చిత్రకారులు, ఇంజినీర్లు, సామాన్య ప్రజలు సజీవంగా కన్పిస్తారీ నవలలో. వారివారి కార్యకలాపాలతో బాటు, ఆంతరంగిక జీవితాల్నీ, వ్యక్తిగత సంబంధాల్నీ, భావాల్నీ, లక్ష్యాల్నీ, బలహీనతల్నీగూడా వాస్తవికంగా, హృదయానికి హత్తుకునేట్లు, కళ్ళకు కట్టినట్లు వ్యక్తీకరిస్తాడు రచయిత.

ఇంగ్లీషులో యీ పుస్తకం పేరు 'థా'. అంటే గడ్డకట్టుకున్న మంచు కరగడం అన్నమాట; అంతేకాదు, ఆమని ఆగమనానికిగూడా అదొక సూచన. ఈ కథ దృష్ట్యా చూస్తే, యిదొక్క వాతావరణంలోనే, భూమిమీద గడ్డకట్టుకున్న మంచులోనే కలిగే మార్పుమాత్రమే కాదు; సాంఘిక, రాజకీయ రంగాలలోనూ, ప్రజల హృదయాలలోనూగూడా కలిగే మార్పు.

సోవియట్ ప్రజాజీవితంలోని మంచినీ, చెడునీ, జరిగే మార్పుల్నీ చిత్రీకరించుతోంది కాబట్టి, తెలుగు అనువాదానికి 'బాగోగులు' అని పేరుపెట్టాను.

రష్యన్‌లలో పేర్లు చాలా పొడుగుగా వుంటాయి. ఆ పేరులో ఏదో ఒక భాగాన్ని తీసికొని సంబోధించే సాంప్రదాయంగూడా వుంది వారికి. ఉదాహరణకి: ఈ నవలలో ఫాక్టరీ డైరెక్టర్ పేరు: జురావ్లియోవ్, ఇవాన్, వాన్యా, ఇవాన్ వాస్సిలెవిచ్; యిన్ని విధాల సంబోధనలవల్ల తెలుగు పాఠకులకి తికమక కలుగుతుందనే వుద్దేశ్యంతో, ఆయా పేర్లలో తేలికైన భాగాన్నిమాత్రమే పేరుగా రూఢిచేసి వుపయోగించాను అనువాదంలో. ఆ పేర్లల్లో ప్రధానమైనవాటి నిక్కడ పొందుపరుస్తున్నాను.

4



| | |
|---|---|
| డిమిట్రీ | ఎంజినీరు |
| ఇవాన్ | ఫాక్టరీ డైరెక్టరు |
| ఎలీనా | అతని భార్య |
| షూరా | కూతురు |
| పావ్లోవ్నా | ఎలీనా తల్లి |
| పుఖోవ్ | స్కూలు టీచరు |
| నాదెజా | అతని భార్య |
| సోన్యా | కూతురు |
| ఒలోడ్యా | కొడుకు, చిత్రకారుడు |
| సావ్చెంకో | మరొక ఎంజినీరు |
| తానెచ్కా | నటి |
| వీరా | డాక్టరు |
| సబురోవ్ | చిత్రకారుడు |
| గ్లాషా | అతని భార్య |
| సొకొలొవస్కీ | ప్రధాన డిజైనరు |
| మాయా | అతని మొదటి భార్య |
| మాషా | కూతురు |
| ఎగొరోవ్ | చీఫ్ డిజైనరు |

— పిచ్చేశ్వరరావు.

# 1

అంతమందిముందునిలబడి మాట్లాడాలంటే లైబ్రేరియన్ కొద్దిగా గాభరాపడింది: ఆ తొందరలో కళ్ళజోడు ముక్కుమీంచి నుంచి జారిపోయింది గూడాను. లేచి, నిలబడి, "తర్వాత మాట్లాడేందుకు కామ్రేడ్ బ్రెయ్నిన్‌ని ఆహ్వానిస్తున్నాను. ఆ తర్వాత కామ్రేడ్ డిమిత్రీ కొరొలెయెవ్ మాట్లాడతారు" అని అన్నది.

నల్లని, సన్నని కనుబొమలు ఆశ్చర్యంగా, కొద్దిగా పైకెత్తాడు డిమిత్రీ; ఈ మీటింగ్‌లో మాట్లాడాలని ఆయనకి తెలియదనిగాదు; తెలుసు. లైబ్రేరియన్ యెప్పుడో చెప్పింది ఈ సభలో మీరు మాట్లాడాలని; అందు కంగీకరించాడు గూడాను.

ఫ్యాక్టరీలో వాళ్ళకందరికీ అతనంటే గొప్ప గౌరవం. డిమిత్రీ లేకపోతే, ఇప్పుడు తయారై బయటబడ్డ యంత్రపరికరాలు యింకా మూడు మాసాలవరకూ తయారయ్యేవి కావని పట్టణ కమిటీ కార్యదర్శితో ఇవాన్ జురావ్లియోవ్, స్వయంగా చెప్పాడు. ఇవాన్ ఆ ఫ్యాక్టరీ డైరెక్టరు. అంటే తెలివితేటలున్న ఎంజనీర్ కాబట్టి డిమిత్రీని అందరూ గౌరవించేవారని కాదు- ఒక్క ఎంజనీరింగ్‌లోనే కాకుండా, ఇంకా అనేక విషయాలతనికి క్షుణ్ణంగా తెలుసు. తెలివితేటలున్న మనిషి, గర్వంలేదు. అందుకూ అతనంటే అందరికీ యిష్టం. ఎవర్నిబడితేవాళ్ళని ఛెడాఫెడామని అంటూండే ఛీఫ్ డిజైనర్ సొకొలొవస్కీ గూడా ఎప్పుడూ డిమిట్రీని ఒక్క మాటన్నపాపాన పోలేదు. ఇక లైబ్రేరియన్ సంగతి చెప్ప పనే లేదు. ఆవిడ డిమిత్రీతో సాహిత్యాన్ని గురించి చర్చించింది. "చెకోవంటే ఆయన కెంతయిష్టం అనుకున్నాను." అని కనబడ్డ వాళ్ళందరితోనూ చెప్పింది తర్వాత. అలాంటి డిమిత్రీ లేకుండా, పాఠకులసభ జరగనే జరగదని చెప్పడం అనవసరం. ఈ సభ జరిపా

లని నెలరోజుల్నుంచి ఒకటే యాతన పడింది లైబ్రేరియన్, పరీక్షల కూర్చునే బడిపిల్లలాగా.

ఎంజినీర్ బ్రెయ్నిన్ ముందున్న టేబుల్‌మీద పెద్దపెద్ద కాగితాలకట్టలు పరిచాడు ఉన్నసమయం చాలదేమోనని భయపడ్డట్టు మహాతొందరగా, ఎవరో తరుముకొస్తున్నట్టు మాట్లాడాడు, కళ్ళజోడు పైకీ, కిందకీ సర్దుకుంటూనూ, అప్పుడప్పుడూ ఆగి, కాగితాలమీద వ్రాసుకున్న నోట్స్ చూసుకుంటూనూ:

"ఈ నవల్లో లోపాలున్నమాట నిజమే ననుకోండి; ఆ లోపాల్ని యింతకుముందు, నాకంటేముందు మాట్లాడినవాళ్లు ఎత్తిచూపారు గూడాను. అదంతా నిజమే. కాని, ఏమిటన్నట్టైతే యీ నవలుంది చూశారూ, చక్కని విజ్ఞానంవుంది యీ నవల్లో. కథానాయకుడు జుబ్ట్సోవ్ వేసిన అడవి పెంపకం పథకం ఎందుకని విఫలమైందంటారు? ఈ గ్రంథకర్త యేమిటన్నట్టైతే యీ సమస్యని చాలా బాగా యెత్తిచూపాడు - జుబ్ట్సోవ్ ఉన్నాడే, అతను విమర్శ, ఆత్మవిమర్శలకున్న ప్రాముఖ్యంవున్నది చూశారూ, దాన్ని తక్కువ అంచనా వేశాడు. పార్టీ కార్యదర్శి షబాలిన్ సలహాగూడా అతను తీసుకుంటేనే బాగుండే దనుకోండి. కాని ఏమిటన్నట్టైతే, సమిష్టి నాయకత్వం వుంది చూశారూ, దాన్ని, ఆసంగతి, మర్చిపోతే కలిగే ఫలితాలేమిటో రచయిత చక్కగా చూపించాడు. ఈ పుస్తకంమీద వచ్చిన విమర్శలన్నిటినీ గమనించి రచయిత కొన్నికొన్ని సంఘటనల్ని మారిస్తే, ఈపుస్తకం వుంది చూశారూ, యేమిటన్నట్టైతే మన సువర్ణ సాహిత్యంలో చేరతగు దని నొక్కి వక్కాణించవచ్చు."

హాలంతా జనం క్రిక్కిరిసి కూర్చున్నారు. తలుపులదగ్గరా, కిటికీలబయటాగూడా నిలబడి వింటున్నారు. ఇవ్వాళ జరిగే వుపన్యాసాలన్నీ ఈమధ్యనే అచ్చైన ఒక కొత్తనవల్ని గురించి. వ్రాసింది

గూడా ఒక కొత్తరచయిత; యువకుడు. ఈ పట్టణంలో చిన్న గాలి దుమారంలేపిందీనవల. బ్రెయ్నిన్ వుపన్యాసం వినేవాళ్ళకేమీ హాయిగాలేదు: నవల్లోనుంచి పెద్దపెద్ద భాగాలుతీసి ఉదహరిస్తాడు; మెదిత్తే కదిత్తే "యేవి! టన్నట్టైతే" అంటాడు. మళ్ళీ లైబ్రేరియన్ లేచి నిలబడి "ఇకిప్పుడు డిమిట్రీ మాట్లాడుతారు; తర్వాత, కామ్రేడ్ స్తోల్యారోవా" అనేప్పటికి అందరికీ ప్రాణాలు లేచివచ్చినట్లైంది.

డిమిట్రీ బాగానే మాట్లాడాడు; అందరూ శ్రద్ధగా విన్నారు. కాని, లైబ్రేరియన్ కిదంతా వింతగావుంది; ఛెకోవ్‌ని గురించి మాట్లాడేప్పుడు డిమిట్రీ యిలాగాదు మాట్లాడింది. జుబ్ట్జోవ్‌ని యిలా దుయ్యబడతాడెందుకు ? అతని కీనవల నచ్చినట్లు కనబడడంలేదు; ఐనా పొగుడుతున్నాడు. "షెబాలిన్- కపటనాటకం ఆడే కార్యదర్శి-; నిజాయితీ, వయసూవున్న ఫెడరోవా...అవి రెండూ వాస్తవమైన పాత్రలు. జుబ్ట్జోవ్ మట్టుకు జుబుట్జోవ్ గూడా కళ్ళముందాడే పాత్ర "అంటున్నాడు.

"నిష్కర్షగా చెప్పాలంటే, కథానాయకుడి వ్యక్తిగత జీవితాన్ని గురించి రచయిత బయటబెట్టిన విషయాలు నాకు నచ్చలేదు. రచయిత వర్ణించిన సంఘటనలాంటిది జరగడం అసంభవం; అది అచ్చుకొట్టినట్లుండే సంఘటన- టిపికల్ సంఘటన - అసలే కాదు. జుబ్ట్జోవ్‌లాంటి నిక్కచ్చైన మనిషి, తన స్నేహితుడి భార్యని, అందులోనూ బుర్రకేవీలేని సీతాకోకచిలుకని, ఆశయాల్లో గూడా తనతో ఏవిధంగానూ తులతూగలేని స్త్రీని, ప్రేమించుతాడనీ, ప్రేమించగలడనీ మనం నమ్మాలన్నమాట ? చాలాచౌకబారు ఫలితాలకోసం వని రచయిత ఈ సంఘటన్ని ప్రవేశపెట్టాడనిపిస్తూంది నాకు. న్యాయానికి మన సోవియెట్ పౌరులు అంత చౌకబారు మనుషులేమీగాదు. మన సోవియట్ ప్రజలు మంచి నిక్కచ్చి

మనుషులు; శాధ్యతలు తెలిసినవాళ్లు. ఏదో బూర్జువా నవల్లో నుంచి తీసుకుని అతుకు పెట్టినట్టుగా వుంది. ఈ సంఘటన."

ప్రేక్షకులందే పనిగా చప్పట్లు కొట్టారు. అందులో కొందరు ఆయన వ్యంగ్యంగా అన్నమాటలు విని, చాలా సంతోషించారు: ఏదో ఒక నవల వ్రాసేందుకని నిర్దేశాలు అందుకుని, వెళ్ళవలసిన చోటుకు వెళ్ళి, అక్కడుండేవాళ్ళ నొక డజను మందిని ఆయా ప్రశ్నలువేసి, నోట్‌బుక్కుల్లో వ్రాసుకుని, "నవల వ్రాయడానికి సరిపడ సంగతులు దొరికాయి" అని చెప్పే కొంతమంది యువ రచయితల్ని హేళన చేశాడు. ఆ కథానాయకుడికంటే గొప్పవాళ్ళ మనే సంతృప్తితో కొందరు భుజాలు చరుచుకున్నారు; దిమిత్రీ యెంతగానో తెలివిగలవాడని తెలుసుకాబట్టి యింకొందరు చప్పట్లు కొట్టారు.

"రచయితని తలెత్తకోనివ్వకుండా మాట్లాడాడులే; చాలా బాగా మాట్లాడాడు" అన్నాడు ఇవాన్ జురావ్లియోవ్ లైబ్రేరియన్‌తో. (ఇవాన్ వేదికమీదనే, అధ్యక్షవర్గం స్థానంలో కూర్చున్నాడు). లైబ్రేరియన్ ఏమీ మాట్లాడలేదు.

ప్రేక్షకుల్లో చప్పట్లుచరచనావిడ బహుశా ఒక్క ఎలీనాయే నేమో. ఆవిడ ఇవాన్‌భార్య; పంతులమ్మ. "ఎలీనా ఎప్పుడూ యింతే; నలుగురితోనూ కలవదు"అని నిట్టూర్చాడు భర్త.

ఉపన్యాసం ముగించుకుని, వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు దిమిత్రీ. కూర్చున్నాడేగాని అతనాలోచనలన్నీ ఒకదానికొకటి పొంతనలేకుండా నడుస్తున్నాయి: మళ్ళీ జ్వరం వస్తున్నదనుకుంటా—ఛ.. అవతల ఆ ట్రెయిన్ ప్రాజెక్టు...అసలు నేను ఉపన్యాసం యివ్వకుండా వుంటేనేబాగుండేది. చెప్పిందిమాత్రం యేంవుంది? వొట్టి మాటలు; వాళ్ళింతవరకూ నమ్ముతూవచ్చిన సూత్రాలేగా. తలంతా దిమ్ముగావుంది. హాల్లో ఊపిరాడడంలేదు.

కాత్యా స్తోల్యారోవా మాట్లాడుతూంది; కాని అతను వినడంలేదు. ఆవిడ ఉపన్యాసంమధ్య కరతాళధ్వనులు చేశారు

ప్రేక్షకులు. అతని కాశ్చర్యంవేసింది. అతను కాత్యాని ఎరుగును. ఫ్యాక్టరీలో పనిచేస్తుంది. ఎప్పుడూ హుషారుగా వుంటుంది. తెల్లని రంగు. ఉన్నాయా, లేవా అన్నట్లుగా వుంటాయి కనుబొమలు. జీవితం అంటే ఆశ్చర్యంతో, సంతోషంగా తేరిపార జూస్తున్నదా అన్నట్లుగావుంటుంది ఆవిడముఖం ఎప్పుడూనూ. ఆవిడా యిప్పుడు మాట్లాడుతున్నది. బలవంతాన వినడం ప్రారంభించాడు:

"కామ్రేడ్ డిమిట్రీ అలా ఎందుకన్నాడో నా కర్థం గావడం లేదు. ఈ నవల ఒక మహాగ్రంథమని నేనేమీ అనడంలేదు. టాల్‌స్టాయ్ వ్రాసిన 'అనా కరేనీనా' లాగా వున్నదనీ అనడంలేదు. కాని యీ పుస్తకం చదవబుద్దేస్తుంది; దీనికీ, బూర్జువా నవల్సకీ యేమిటో సంబంధం నాకు తెలియడంలేదు. మనిషికి హృదయం ఉంటుంది; అంచేత మనిషి ఆవేదన పడతాడు అని అనిపిస్తుం దీపుస్తకం చదివింతర్వాత. అందులో తప్పేం వుంది? ఇంతెందుకు, నా జీవితంలో గూడా అలాంటి అనుభవాలున్నై. ... పుస్తకం మొదలెడితే చివరిదాకా చదివితేనేగాని వదిలిపెట్టబుద్ధిగాదు. ఈ పుస్తకాన్ని వూరికే త్రోసేస్తే కాదు."

"ఎప్పుడూ నవ్వుతూవుండే కాత్యా గూడా ఆవేదన పడిందన్నమాట? 'మనిషికి హృదయం ఉంటుంది'" అనుకున్నాడు డిమిట్రీ. అతని కింకేమీ వినిపించలేదు; హాల్లో కూర్చుని వున్నాడన్న మాటేగాని, హాల్లో ఎవరున్నారో, యేం జరుగుతూందో గూడా అతనికి పట్టినట్టులేదు. రెప్పవెయ్యకుండా ఎలీనావంక చూశాడు. గత కొన్ని మాసాలనుంచి పడుతూన్న బాధంతా ఒక్కసారి పైకుబికింది. ఎలీనా అతన్ని ఒక్కసారిగూడా తలెత్తి చూడలేదు. ఆవిడ తనవైపు చూస్తూన్నప్పుడే తానుగూడా ఆవిడవైపు చూడాలనుకున్నాడు. భయంవేసింది. ధైర్యంలేదు. అదీ యిప్పటి పరిస్థితి. కాని, మొన్న వేసవికాలంలో యిద్దరూ కలిసి కూర్చుని మాట్లాడుకునేవారు, హాస్యాలాడుకునేవారు, అదేపనిగా వాదించుకుంటూ కూర్చునేవారు.

ఇవానింటికి చాలాసార్లు వెళ్తూండేవాడు; ఇవాన్ అంటే డిమిట్రీకి పెద్ద యిష్టమంటూ యేమీ వుండి కాదు; ఎలీనాతో మాట్లాడుతూంటే సరదాగా వుండేది, అందుకని వెళ్తూండేవాడు. ఆవిడకి తెలివితేటలున్నాయి; అలాంటివాళ్ళతనికి మాస్కోలో కనిపించలేదు. ఇక్కడి దారేవేరు: ఇదొక రాష్ట్రం; చిన్న పట్టణం. పెద్ద హడావుడేమీ వుండదు. చదువుకోవాలన్నా, ఆలోచించుకోవాలన్నా యెక్కువ అవకాశం వుంటుంది. ఇక్కడకూడా ఎలీనాలాంటి వాళ్లు కన్పించరు; ఎలీనా లోతైనమనిషని యెవరికైనా ఇట్టే తెలిసి పోతుంది. ఇవాన్‌తో ఎలా కాపురం చెయ్యగలుగుతూందో గూడా అర్థంకాదు; ఐనా భార్యా భర్తలిద్దరూ బాగానే వుంటున్నారు. ఒక చిన్న పిల్ల గూడాను, ఐదేళ్ళమ్మాయి.

ఆరోజుల్లో, ఎలీనా కళ్ళల్లో హాయి కన్పించేది; చక్కని ప్రశాంతమైనహాయి. "ఆవిడేనా? అందం అంటే ఆవిడ్నే చెప్పాలి" అన్నాడొకసారి వయసులోవున్న ఎంజనీరు, సావ్‌చెంకో. "కాదు కాదు, ఆవిడ ముఖానొక్కసారి చూస్తేచాలు యికజన్మలో మరచి పోలేం" అన్నాడప్పుడు డిమిట్రీ తలూపుతూ. ఆవిడ కురులమీద సూర్యకిరణాలు పడుతూంటే అటే చూడబుద్ధేసేది. ఆవిడకళ్ళు ఒక్కోసారి గేలిచేస్తున్నట్లూ, గేలిచేసి రెచ్చగొడుతూన్నట్లూ వుండేవి; ఒక్కోసారి యెంతో విచారంగా వున్నట్లుండేవి; అంతు చిక్కేవిగాదు......

'ఆరోజులే వేరు; చాలామంచిరోజులు, అనుకున్నాడు డిమిట్రీ. హోటల్లోనుంచి బయటికి, బజారులోకి, వచ్చాడు; 'అబ్బ! ఏధవ మంచు!' ఇంతకుముందు, ఈ మీటింగ్‌కి వస్తూన్నప్పుడు వాతావరణం అంతా చక్కగావుంది దివ్యంగా.

నడుస్తున్నాడేగాని మనసు మనసులో లేదు: సభని గురించి గాని, తన ప్రసంగాన్ని గురించిగాని ఆలోచించడమే లేదు. ఎలీనా జీవితంలో రేగిన తుఫానూ, గత కొన్నివారాలుగా అదేపనిగా జ్వరంలోలా కంటూన్న కలలూ, ఇదివరకెప్పుడూ ఎరగని నిస్సహా

యతా- పీడితోనే నిండిపోయింది. తలంతా అతనికన్నీ అబ్బవస్తాయనీ, అన్నీ కలిసొస్తున్నాయనీ అతనంతటి అదృష్టవంతుడు లేడనీ అనుకుంటారతని స్నేహితులు; అదీ నిజమే. ఈ రెండుసంవత్సరాల్లోనూ అతనికొచ్చిన పేరు యింతా అంతాగాదు. కాని, ఆ రెండు సంవత్సరాలకి పూర్వం యింకొన్ని సంవత్సరాలు గడిచాయి. అతనికిప్పుడు ముప్ఫైఐదేళ్లు. జీవితం అతన్నేమంత చెడగొట్టలేదు. దారి చేసుకుంటూ ముందుకు నడిచాడు. మంచి నిబ్బరం వున్న మనిషి; నోటికొసల్లో కన్పించే బండగీతలూ, కళ్లూ- ఆ కళ్ళు సిద్ధాక్షిణ్యంగా వున్నట్లూ వుంటై, ప్రతివిషయాన్ని సానుభూతిగా చూచి అంగీకరిస్తూన్నట్లూ వుంటై- మొఖమూ, నుదురూ- ఆ నుదురు ముఖాన్ని కప్పడానికి ముందుకు వంగుతూన్నట్లు టుంది- అవి చూస్తేనే చాలు అతను మంచి నిబ్బరం వున్న మనిషని తెలుస్తుంది.

1936. డిమిట్రీ అప్పుడు పదోక్లాసు చదువుతున్నాడు. వాళ్ళ మారుటినాన్న అరెస్టయ్యాడు. మర్నాడుదయం డిమిట్రీ వూళ్ళోకెళ్ళాడు. మీషా గ్రీబోవ్ కన్పించాడు; మీషా అతనికి మంచి స్నేహితుడు. డిమిట్రీ మీషాని పిలిచాడు; తన విచారాన్నతనితో చెప్పుకుందామని, సలహా అడుగుదామని; మీషా పలకలేదు, ముఖం బిగదీసుకుని రోడ్డుకి ఆవైపున నడుస్తున్న వాడల్లా అవతలివైపు కెళ్ళిపోయాడు. కొన్ని రోజులు గడచింతర్వాత డిమిట్రీని స్కూల్లోనుంచి వెళ్ళగొట్టారు. "నువ్వేం చేశావురా నాయనా" అని ఏడ్చింది తల్లి. "అట్లా అనుకోగూడదమ్మా. అప్పుడప్పుడూ, అక్కడక్కడా యిలాంటివి జరుగుతూనేవుంటాయ్" అన్నాడు తను. తర్వాత ఫ్యాక్టరీలో చేరాడు. కొత్తస్నేహితులు దొరికారు. తన పని తాను చూచుకునేవాడు. రాత్రిళ్ళపూట చదువుకునేవాడు. "చూస్తావుగా అమ్మా, ఇట్లాగే ఎప్పుడో యూనివర్సిటీలో కెళ్ళి కూర్చుంటా యేమనుకున్నావో" అన్నాడు తల్లితో.

కొన్ని సంవత్సరాల తర్వాత. ఆగస్టునెల. విచారంగా, ధైర్యాన్ని చిక్కబట్టుకుని నడుస్తున్నాడు స్టెప్పీల్లో. అతని దళం

తిరోగమిస్తోంది. ఆదళాధిపతి, జెనరల్, విసుమకుపడే వాడు తన మీద. నువ్వొట్టి పిరికివాడివి, నిన్నేంచేస్తానో చూడంటూ కోపం అంతా వెళ్ళగక్కడానికి తనమీదే పడేవాడు. "ఏం ఫర్వాలేదు; కోప్పడుతున్నాడుగా, మనం బాగుపడతాఁ వన్నమాట" అన్నాడు డిమిట్రీ తన స్నేహితుల్తో. తర్వాత, భుజంమీద గాయం తగిలింది. హాస్పిటల్లో చేర్చారు. ఆరుమాసాలు న్నాడక్కడ. తర్వాత మళ్ళీ యుద్ధరంగాని కెళ్ళాడు; ఇక యుద్ధమయ్యే వరకూ అక్కడేవున్నాడు. నటాషా అనే సిగ్నల్ ఆఫీసర్‌ని ప్రేమించాడు. బ్రెస్లావ్ వచ్చిన తర్వాతగాని ఆయమ్మాయి గూడా తనని ప్రేమిస్తోందని కనుక్కో-లేకపోయాడు. "నువ్వో" వింటో యేమీ పట్టనట్లుంటావ్; నిన్ను చూస్తేనే భయఁవేసేదినాకు. కాని నిన్ను చూడగానే తెలుసుకున్నా నీ మనసు" అన్నది నటాషా. యుద్ధమైపోయిం తర్వాత, హాయిగా బ్రతకొచ్చునని కలలుకన్నాడు డిమిట్రీ. కాని నటాషా చనిపోయింది. ఆ చావుకి అర్థంలేదనిపించింది—లీప్జిగ్ వీధిలో, మే 10 న, మందు గని ప్రేలింది; అప్పటికి చావుని గురించి ఆలోచించడం గూడా మానేశారు అందరూ. ఐనా, ఆ గని ప్రేలింది; నటాషాని పొట్టన బెట్టుకుంది. కాని డిమిట్రీ ఈ విషయం యెవ్వరికీ చెప్పలేదు; అలాగే ఆ విచారమంతా మింగుతూ, రెండో కంటికి తెలియకుండా కాలం గడిపాడు. చాలాకాల మయ్యిం తర్వాత, ఒకనాడు "పెళ్ళి చేసుకోవేఁ నాయనా, దగ్గరదగ్గర ముప్ఫయ్యేళ్ళొచ్చినై. నేను కాస్తా గుటుక్కుమంటే యిక నీకు మంచీ చెడ్డా చూసే వాళ్ళెవరుంటారు?" అని వాళ్ళమ్మ అడిగితే, అప్పుడు చెప్పాడు "అమ్మా నాసర్వస్వాన్నీ యుద్ధంలోనే పోగొట్టుకున్నానమ్మా. ఇప్పుడు పెళ్ళిసంగతి ఆలోచించాలన్నా ఆలోచించ లేనమ్మా" అని.

ఈ విచారాన్నంతా మరచిపోవాలంటే ఒక్కటే మార్గం కనిపించిందతనికి – పని. యంత్ర నిర్మాణం కోర్స్ తీసుకున్నాడు. యంత్ర నిర్మాణాన్ని గురించి అతను వ్రాసిన థీసిస్ అంతా మెచ్చుకున్నారు. అతన్నా సంస్థలోనే వుద్యోగం యిచ్చి వుంచాలను

కున్నారు. కాని ఎవరో తమకున్న పలుకుబడి వుపయోగించుకుని ఆ వుద్యోగం కొట్టేశారు; ఓల్గా జిల్లాలో ఒక ఫ్యాక్టరీకి వెళ్ళాలి వొచ్చింది డిమిట్రీ. వెళ్ళాడు. తెలివిగలవాడనీ అదృష్టవంతుడనీ అతనికి పేరొచ్చి పడిందిక్కడే. యువకులంటే ఇవాన్ జురావ్లి యోవ్ మహా అనుమానంగా చూచేవాడు; ఆలాంటివాడుగూడా డిమిట్రీకి తెలివి తేటలున్నాయని ఒప్పుకున్నాడు. పట్టణ సోవియెట్‌కి కూడా ఎన్నికయ్యాడు డిమిట్రీ; అక్కడ తరచు మాట్లాడుతుండే వాడు గూడాను. కార్మికుల కతనంటే నమ్మకం కుదిరింది, మనసు విప్పి మాట్లాడేవారు. మనిషిమంచివాడనీ, హోదా పెరిగినా మనసు మారలేదని వాళ్ళకంతనంటే మహా అభిమానం.

అలాంటివాడికి యిప్పుడిదేమిటి? తనని తానే సంబా ళించుకోలేకపోతున్నా డెందుకని? ఈ మంచులో పడి, ఎక్కడికి పోవడం బుర్రనంతా ఎలేనాను గురించి ఆలోచనల కప్పజెప్పి! ఆలోచనలు గూడాకాదు, తన జీవితంలోనుంచి ఆవిడిని వెళ్ళ గొట్టడంగూడా సాధ్యంకాదనే భావం వెంటబడి తరుముతోంది. మరీబుద్ధి, లేకుండా పోతూందే, చిన్నపిల్లల్లా తన గతానికీ, దీనికీ సంబంధం యేమన్నావుందా.

గాలి వీచింది. మంచ దేపనిగా కురుస్తూంది. దారి కన్పించడం లేదు. చెవులు వినిపించడంలేదు. నడుస్తున్నవాడల్లా, యెవరోవచ్చి నిలవేసినట్లు, ఆగిపోయాడు డిమిట్రీ; కనుబొమలు పైకిలేపి ఫకాలున నవ్వుకున్నాడు. "ఇంతకంటే గమ్మత్తింకేంవన్నా వుంటుందా!" అను కున్నాడు. "ఇలాంటివేవీ జరగవనేగా నేను వేదికెక్కి చెప్పింది. అదిగూడా యేమీ నదరకుండా, బెదరకుండా. 'జుబ్‌ర్జోవ్'లాంటి మనిషి వుండడు, రచయితే అతన్ని సృష్టించాడు. వెళ్లి స్నేహితుడి భార్యని ప్రేమించమన్నాడు, నలుగురిలోనూ నిలబెట్టి అవమానిం చాడు, కథెలాగూ ముగించాలి కాబట్టి కథానాయకుణ్ణి ఆర్కిటిక్ పంపించాడు, అని, ఔను ఈ డిమిట్రీకి అదంతా ఎక్కడ నచ్చు తుంది, ఎందుకు నచ్చుతుంది. ఎలా సహిస్తాడు" గనక చౌకబారు

ఫలితాలకోసమని రచయిత ఈ సంఘటన ప్రవేశపెట్టాడనిపిస్తోంది నాకు. ఇది అన్నుకొట్టినట్టుండే సంఘటనకాదు; టిపికల్‌గా లేదు.' ఊఁ అదీ అసలువిషయం. విన్నారాఅండీ డిమిత్రీ సర్గెయెవిచ్‌గారూ, అసలు విషయం అదీ: నీలాంటివాళ్లూ, జుబ్జొవ్‌లాంటివాళ్లూ యీ లోకంలో వుండరు. మీ రందరూ ఊహాజనితులు, తోలు బొమ్మలు, ఇలాంటి వాళ్లసలుండరు. తెలిసిందా అండీ.

'ఇప్పుడు ఎలీనా యేమనుకుంటూందో? నేనొక అధికార దర్పం వున్నవాణ్ణనా? చౌకబారు అబద్ధాలకోరుననా? మిగతా వాళ్లకి తెలిసినా తెలియకపోయినా, ఆవిడమాత్రం కనుక్కో-గలదు. ఇలాంటి విషయాల్ని ఆడవాళ్లిట్టే పసిగట్టేస్తారు. నటాషా మట్టుకు నటాషా; చివరిదాకా, ఆవిడతో, అసలు విషయం చెప్పాలంటేనే ధైర్యం వుండేదికాదు నాకు. కాని నటాషా అంతా పసిగట్టింది. "నాకు మొదట్నుంచీ తెలుసు. సోజా పట్టణం దగ్గర – గుర్తుందా? – విమానాల దాడి జరుగుతున్నప్పుడు గస్తం చేసుకోక మానసని పట్టుబట్టావే–అప్పుడూ నాకు తెలిసిపోయింది". అని తర్వాతెప్పుడో చెప్పింది. యంత్రాల మంచిచెడ్డలంటే చెప్పగలననుకో, కాని భావాల సంగతీ, అనుభవాల సంగతీ, ఉద్రేకాల సంగతీ వస్తేమట్టుకు...ఎలీనా నవ్వుకుంటూందేమో నన్నుచూచి.

'ఐనా, అదంతా యెందుకులే యిప్పుడు? ఎలీనా, ఇవాన్ జురావ్లియోవ్ భార్య, మాదారులే వేరు. ఈ వైధవాలోచనల్ని వూరికే అరెకట్టొచ్చు. కాని, ఇలాంటిది జరగడానికే వీల్లేదని యెందుకన్నాను? "అసంభవం" అని అనాల్సిన పనేం వొచ్చింది? అర్థంకావడంలేదే. వాళ్ళని తప్పుదారిని పట్టించుదామని మట్టుకుగాదు. ఐనా, నాలో యేం భావాలు రేగుతున్నాయనేది నా స్వంత విషయం. నా స్వంత వ్యవహారం. పుస్తకం అంటే, అదివేరు; నలుగురూ చదివేది. ఇలాంటి భావాల్ని పుస్తకంలో కెక్కించడం వొనకని? అంటున్నా యెవళ్ళకి మాత్రం యేం లాభం వుంటుంది? జుబ్జొవ్ తన పని చెడగొట్టుకోవడం అంటే – అది నిజమే; పాత

కుడికి కొంతమేలు కలుగుతుంది. గుణపాఠాలు నేర్చుకోవడానికి వీలుంది. కాని జుబ్జోవ్ తన స్నేహితుడి భార్యని గురించి యేమనుకున్నదీ—అదంతా అసంబద్ధం. ప్రేమంటే సిమెంటులాంటిది – అందరూ అంగీకరిస్తారు గూడానూ ఆ మాటంటే. కాని యిదేం ప్రేమ – తుప్పులాంటిది; తినేస్తుంది; నాశనంచేస్తుంది. నేనట్లా ఉపన్యాస యివ్వడమే కరెక్టు...అసలిప్పుడాలోచించాల్సిందదికాదు; నన్ను నేను సంబాళించుకుని, తమాయించుకోవాలి.'

వీధి దీపం తెల్లగా వెలుగుతోంది. వీధిదీపంచుట్టూ వున్న మంచుని చూస్తే–గాభరాపడో, ఉద్రేకపడో పక్షులగుంపులు పైకెగురుతూనూ, యెగిరి కిందపడుతూనూ, కిందపడి మళ్ళీపైకెగురుతూనూ, వున్నట్లుంది. వీధిదీపం కింద యిద్దరు ప్రేమికులు నించునున్నారు. గాఢంగా కౌగిలించుకుని, లోకమే మరచిపోయి. కాత్యా కాదుగదా అనుకున్నాడు డిమిట్రీ. దీపంకింద నుంచున్నవ్యాళ్ళాయి ఆశ్చర్యపడ్డట్లేమిటో అన్నది; ప్రేమికులిద్దరూ ముందుకు సాగారు. డిమిట్రీ నవ్వుకున్నాడు. 'కాత్యా ఐనా ఒకటే యింకెవరైనా ఐనా ఒకటే...నేనూ నటాషా కలిసి యిలాగే తిరుగుతూండే వాళ్ళం బెర్లిన్ బయటున్న పార్కులో. ఆ పార్కులో ఒక్క చిన్న సరస్సుండేది. అందులో తామర పూలుండేవి. ఒకనాడు మేవక్కడుండగా మేజరొచ్చి పడ్డాడు గూడాను...వయసే అలాంటిది; వయసులో వున్నప్పుడంతా ఆనందంగానే వుంటుంది. లాభంలేదు; ఇలాంటి ఆలోచనల్ని దరికిరానీగూడదు; వచ్చినా రానివ్వగూడదు.'

బజారులన్నీ నిర్మానుష్యంగా వున్నై, అందరూ యిళ్ళకెళ్ళిపోయారు – జుబ్జోవ్ చేసిన పని మంచిదో చెడ్డదో నిర్ణయించాలని చూచినవాళ్ళూ, 'అంతర్ధానమయ్యే స్త్రీ' అనే నాటకం చూచినవాళ్ళూ, పశువుల నెలా పెంచాలనేవాళ్ళూ, కాలం గడిపేందుకని స్నేహితుల యిళ్ళకెళ్ళిన వాళ్ళూ, అందరూ యిళ్ళకెళ్ళిపోయారు. కొత్తగా కట్టిన యిళ్ళ కిటికీలు తపతప కొట్టుకొంటూ, మంచుతో కుస్తీలు పడుతూ బంగారంలా మెరిసిపోతున్నాయి నాటక రంగం

మీద కట్టిన తెరలమీదలాగా. ఈ యిళ్లే పగటిపూట చూస్తే విసుగుపుడుతుంది. ఈ యిళ్లల్లో మనుషులుంటారు — నిద్రపోతూ, కీచులాడుకుంటూ, బాధపడుతూ, హాయిననుభవిస్తూ — జీవితంలో అన్నిరకాలూ వుంటాయి. అదికాదు అసలు విషయం, అసలు విషయం — పని.

ఏదో వొకపనిలోపడితే బ్రతికి పోతాననుకుంటూ గబగబా నడిచాడు, డిమిట్రీ. "ఇక బ్రెయ్నిన్ ప్రాజెక్టుని గురించి ఆలోచించాలి" అనుకున్నాడు చీకట్లో మెట్లెక్కుతూ నిష్పూర్గిసి. వెళ్ళి డ్రాయింగులన్నీ టేబుల్‌మీద పరిచాడు. గదంతా వేడిగా వున్నట్లుంది. ఊపిరాడలేదు. కిటికీ తలుపులు తెరిచాడు. మంచు లోపలికొచ్చింది. 'మళ్ళీ జ్వరం వస్తున్నట్లుంది. వెధవ అనుమానాలూ నేనూనూ. పని చెయ్యాలి— పని.'

ఇదివరకెప్పుడూ పనిచేస్తూ కూర్చుంటే అలాగే కూర్చునేవాడు పనిచేసుకుంటూ, కదలకుండా మెదలకుండా అర్థరాత్రైనా సరే. ఇప్పుడె దుకనో ఊరికే యిటూ అటూ కదుల్తాడు. కాసేపు కుర్చీమీద వెనక్కివంగుతాడు. ఏష్ట్రేతీసి అక్కడున్న దాన్ని ఇక్కడ పెడతాడు లేకపోతే లాంప్ అటూ యిటూ జరుపుతాడు. లేస్తాడు. అటూ యిటూ తిరుగుతాడు, తెల్లని గోడలమీద పడి, భయపడిన అపరిచితుడిలా తచ్చట్లాడుతుంది అతని నీడ.

'బ్రెయ్నిన్ చెప్పింది నిజమే. అదంతా వేడిచేసి, మూసపోయడంలో వుంటుంది. దీన్ని గురించి రేపు ఇవాన్ జురావ్లిమోవ్‌తో మాట్లాడాలి. బహుశాయిప్పుడు ఇవానూ ఎలీనాకలిసి కాఫీ తాగుతూ వుంటారు. డిమిట్రీ మరీ గుమాస్తాకి మల్లే మాట్లాడాడు' అంటుంది ఎలీనా. అని నవ్వుతుంది. అతనూరుకోడు, నా తరఫునే మాట్లాడాడు. "నవల్ల సంగతతనికి తెలియకపోతే తెలియకపోవొచ్చుగాని, అతని పనిలో అతను ఉద్దండుడులే. మన క్కావలసిందదీ" అనంటాడు. నిజమేనయ్యా, ఇవాన్‌వాసిలెవిచ్, మన క్కావలసింది పనే. ఎలీనా నవ్వినప్పుడా కళ్లు మరింత నల్లబడ

తాయి, ఒక్కొక్కప్పు డావిడ నవ్వితే యేదో విచారం లోతులు చూచుకున్నట్లుంటుంది... వెధవాలోచనా నేనూనూ. స్పీడ్ తగ్గించే గేరును గురించి మాట్లాడాలి ఇవాన్‌తో...'

ఐదయ్యింది. 'ఈ మార్పులుచేస్తే బ్రెయిన్ ప్రాజెక్ట పని కొస్తుంది...ఇంకా యేం పడుకుంటాను యిప్పుడు. మేలుకున్నా లాభంలేదు – మళ్లీ ఆ గొడవంతా గుర్తుకొస్తుంది. ఈ మార్పులన్నీ ఒక కాగితంమీద పెడ్తే? జురావ్లియోవ్ కలాచేస్తే నచ్చుతుంది, ఒక గంట గడిపెయ్యొచ్చుగూడాను... అనుకున్నాడు డిమిత్రీ.

అతను బయటికి వెళ్లేప్పటికి, యింకా మంచుపడుస్తూనేవుంది. కాని బజార్లలో సంచారం ప్రారంభమైంది. ఎవరి పనులకి వాళ్లు గబగబా పోతున్నారు. వీధి లాంతరింకా వెలుగుతూనే వుంది తెల్లగా. మంచు యింకా ఎగిరెగిరిపడుతూనే వుంది పిట్టలగుంపులా. ప్రేమికులు మాత్రం లేరక్కడ. దారేపొయ్యేవాళ్లు మాట్లాడుకునే మాటలు రెండుమూడు వినిపించాయి డిమిత్రీకి:

"బలేసినిమాలే. రాత్రంతా నిద్దరే పట్టలా"

"ఎగొరోవ్‌తో చెప్పు, శలవిస్తాన్లే, యీ మాత్రానికబద్ధం వాట్టంవెందుకు..."

"ఏం జనంవనుకున్నా, కదల్టానికూడా వీల్లేకపోతే"

డిమిత్రీ ఆలోచించాడు: 'యేమిటీ వెధవగొడవంతా! వెధవ గొడవని అనుకున్నా వదిలిపెట్టదెందుకనో! అసలెప్పటికైనా వదుల్తుందా అసి? ఇదంతా పుస్తకాల్లో ఇదివరకే చదివా. ఇప్పుడు అనుభవించాలనుకుంటా.'

అనుకోకుండానే నవ్వేశాడు; 'అర్థంలేదు, ఐనా హాయిగా వున్నట్టేవుంది."

# 2

విహారానికెళ్ళిపోయిన తర్వాత, ఇంటికెళ్ళి, టీ అదీ తీసుకురావడానికి వంటింట్లోకెళ్ళింది ఎలీనా. ఏదో వాళ్ళతో మాట్లాడుతూనే వుంది గాని, ఇవాన్ మాత్రం అనుమానపడ్డాడు మనిషి వొంట్లో యేమీ బావున్నట్టులేదేఅని. ఐనా, "యేం, అలావున్నావ్ !" అని సూటిగా ప్రశ్నించలేదు అదృష్టవశాత్తూ. "బళ్లో పిల్లలకి మంచిమార్కులివ్వలేదా యేమిటి" అనడిగాడు. పెద్దబరువు దింపినట్లయ్యింది ఎలీనాకి; "ఊఁ" అన్నది.

ఇవ్వాళ ప్రొద్దునల్లా పనిచేస్తూనేవున్నాడు ఇవాన్; పత్రిక చదువుకోడానికూడా సందుచిక్కలేదు. ఇప్పుడు పత్రికతీసి చదవడం ప్రారంభించాడు టీ తాగుతూనే పత్రిక చదువుకుంటున్నాడు. అప్పుడప్పుడూ, మధ్యమధ్య "నికిఫోరోవ్ జబ్బాదిలిందన్నమాట" అనో, "నిజంగానే కంప్రెసరు యీమధ్యెక్కడా దొరకడంలేదు అందుకేమీ సందేహంలేదు" అనో వ్యాఖ్యానం చేస్తున్నాడు. అతనేదన్నా సరే, నిజమేనంటూ ఒప్పేసుకుంది ఎలీనా.

అతనట్లా చదువుకుంటూ వుండటమేబాగుంది ఎలీనాకి; ఆలోచించుకునేందుకు వీలుగావుంది. తన అనుభవాన్ని మరమ్మతు చేసుకోవడం సాధ్యంకాదని యిప్పుడే తెలిసొచ్చినట్లనిపించి దావిడకి. అదంతా కడుపులోపెట్టుకుని బ్రదకడంఅంటే మాటలుకాదు.

ఇప్పుడంటే అప్పుడప్పుడూ ఒంటరిబ్రదుకనిపిస్తోందిగాని, చదువుకునేరోజుల్లో ఎలీనాకి స్నేహితులు చాలామంది ఉండేవారు. ఫాక్టరీలోగూడా తనతో మాట్లాడేవాళ్ళెవ్వరూ కనిపించడంలేదు. తనకంటే జీవితంలో యెక్కువ అనుభవం వున్నవాళ్ళతో మాట్లాడుతూ కూర్చోవాలనిపిస్తోంది (ఎలీనాకి నవ్వొచ్చింది – చేస్తోన్నదేమో నలుగురికి పాఠాలుచెప్పేపంతులమ్మ ఉద్యోగం, వాళ్లదగ్గరా,

వీళ్ళదగ్గరా నేర్చుకోవాలనుకోవడమేమిటి తను !). ఒక సంవత్సరం క్రితంవరకూ, స్కూల్లో ఫుఖోవ్ వుండేవాడు. పట్టణంలోకల్లా చెప్పుకోదగ్గమనిషి. అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. చాలా పాత బోల్షివిక్. బడిపంతులు పనిలోగూడా ఆయన్ని మించిన చెయ్యి లేదు. ఆయనంటే అందరికీ అపరిమితమైన గౌరవం. ఎలీనా కాయ నంటే గొప్ప భక్తి. మొట్టమొదటిరోజుల్లో, స్కూల్లో ఉద్యోగం చేస్తూన్నప్పుడు పిల్లల గల్లంతూ అదీచూచి ఎలీనా గాభరాపడిపో యేది. ఫుఖోవ్ వచ్చి అదికాదమ్మా యిది అని చెబుతూండేవాడు. స్వంతకూంతురులాగా చూచుకునేవాడు. రానురాను ఎలీనా కూడా ఆయన అభిప్రాయం యేమిటో తెలుసుకుని, ఆ అభిప్రాయాల కనుగుణంగా నడుచుకోవాలని అనుకోవడం ప్రారంభించింది. మొన్న శీతాకాలంలో ఆయన జబ్బుపడ్డాడు. విశ్రాంతి తీసుకోక పోతే లాభంలేదన్నారు డాక్టర్లు. పనిజెయ్యడానికి వీల్లేదన్నారు. ఇప్పుడు కాస్త ఫర్వాలేదు. కొద్దిగా కోలుకున్నాడు. అప్పుడప్పుడూ స్కూలుకొచ్చి వెళ్తున్నాడుగూడాను- స్కూలుకి రాకుండా వుంటే బ్రైమెలా గడుస్తుందమ్మా అంటాడు-ఐనాగానీ, తన కష్టాలన్నీ చెప్పి ఆయన్నిగూడా విసిగించడ మెందుకులే అనుకుంది ఎలీనా. తనేమైనా చిన్నపిల్లా చితకపిల్లా; ముప్ఫయ్యేళ్ళొచ్చాయి నెత్తిమీదికి. తనకాళ్ళ మీద తను నిలబడ్డం యిప్పటిగ్గూడా నేర్చుకోకపోతే యెలా. ఐనా, మంచీచెడ్డా చెప్పుకుంటే వినే మనిషి లేకపోవడం కష్టమే ననిపించింది ఎలీనాకి.

ఎలీనా స్నేహితుల్లో డాక్టర్ వీరా ఒకరు. ఫుఖోవ్ జబ్బుపడ్డ రోజుల్లోనే ఎలీనాకీ, వీరాకీ పరిచయంకలిగింది. వాళ్లు కలుసుకున్న మొట్టమొదటిరోజు ఎలీనాకింకా గుర్తున్నది: తన భర్త యిప్పటికీ యింకా తనకపరిచితుడేనని ఎలీనా గుర్తించింది ఆవేళే; తర్వాత, రాత్రంతా యేడుస్తూ కూర్చుంది. వీరా అంటే ఎలీనాకిష్టమే కాని ఆవిడ డాక్టరు, ఎప్పుడూ యేదోఒకపనిలో మునిగి తేలుతూంటుంది. అందువల్లకలుసుకునేందు కెక్కువ అవకాశం వుండేదికాదు. అదీగాక,

వీరా యెప్పుడూ యితరులకి దూరం దూరంగావున్నట్లు కనిపించేవి. ఆవిడభర్త యుద్ధంలో చచ్చిపోయాడు; "రెండోసారి యికకుదరడం కష్టంలే"అని చెప్పింది ఎలీనాతో డాక్టర్ వీరా. ఇంకా ఆవిడతో తన కష్టా లేం చెప్పుకుంటుంది? – ఆవిడ కష్టాలావిడికి వున్నవనే వున్నై ౨.

డిమిట్రీతో ఎలీనాకి స్నేహం చాలా తొందరగానే కలిసింది. యుద్ధాన్నిగురించీ, జర్మనీనిగురించీ, తన స్నేహితుల్నిగురించీ చెప్తూ తూండేవా డతను; అతను చెబుతూంటే అంతా కళ్ళకు కట్టినట్లుం డేవి; అదంతా తనకు తెలిసినట్టే వుండేవి. ఇద్దరూ కలిసి పుస్తకాల్ని గురించి చర్చించుకునేవారు. వొరోపయెవ్ – ఒక పుస్తకంలో పాత్ర – బ్రదుకంతా అదృష్టమేనని నమ్మడం కష్టమనిఅనేది తను. కాదు, అలాంటివి జరుగుతాయి; నమ్మించేట్టే వున్నదనేవా డతను. ఇంకో పుస్తకంలో లిస్త్రొపాద్ అనే పాత్రంటే అతనికి చాలా యిష్టం; అతనికి హృదయం లేదనుకునేది తను. "గ్రాస్మన్ బాగానే వ్రాస్తాడు. యుద్ధాన్నిగురించి అతను వ్రాసిందంతా నిజమే. కాక పోతే అతని పుస్తకాల్లో కథానాయకులు కాస్త ఎక్కువగా వాద నలు చేస్తారు. అందుకని అప్పుడప్పుడూ ఆ పాత్రలు వాస్తవికం కాదేమో'' ననిపిస్తుంది అనేవా డతను. తాను నవ్వేది: "అక్కడికి నువ్వెప్పుడూ వాదన జెయ్యనట్టు" అని. డిమిట్రీ సిగ్గుపడి, "మనం ప్రతిదీ మరీ అంత వ్యక్తిగతంగా చూడకూడదు. . . . ఐనా, అసలు నీకు విసుగేస్తోందిలాగుంది . . . " అనేవాడు.

నటాషాని గురించిగాని, తన బాల్యాన్ని గురించిగాని అత నెప్పుడూ చెప్పలేదావిడకి. ఐనా, ఎందుకనో గాని, తన భర్త అను కున్నంత అదృష్టవంతుడుకాదు డిమిట్రీ అని అనుకునేది ఎలీనా. అతనిలో యేదో కనుపించని ఆవేదన వున్నదనీ, అశాంతి వున్నదనీ, మనోనిబ్బరం వున్నవాడు కాబట్టి అదంతా తొక్కిపడుతున్నాడనీ ఆవిడ గ్రహించింది. అందుకనే 'మనిషంటే అతనూ'అని అనుకునేది.

కొరియా యుద్ధవిరమణని గురించి అతను క్లబ్బులో మాట్లా డాడు: అమెరికా పథకం యెలావిఫలమైందో చెప్పాడు;

స్పెయిన్‌లో యుద్ధవిరమణకీ, ఈ యుద్ధవిరమణకీ భేదంవున్నదన్నాడు. "ఇప్పుడు దురాక్రమణదారులు యిదివరకంటె త్వరగా యుద్ధంలోకి దిగరు; వాళ్ళకి బుద్ధొచ్చింది. ప్రపంచమంతటావున్న శాంతి ప్రియులు బలపడ్డారు." అన్నాడు క్లబ్బునుంచి యిద్దరూ కలిసి బయటకొచ్చారు. "మా సంస్థలో ఒక కొరియా అమ్మాయి వుండేది- చిన్నమ్మాయి, పసిపిల్లలాగా ... నా కెప్పుడూ ఆ అమ్మాయే గుర్తుకొస్తుంది.... యెంత చక్కగా నవ్వేదని. ఇంత జరిగినా... మళ్ళీ యిప్పుడాఅమ్మాయి అంత అందంగానూ నవ్వగలదను కున్నప్పుడల్లా నాకెంతో ఆనందంగా వుంటుంది" అన్నాడు డిమిత్రీ తనతో. యుద్ధ విరమణనిగురించి మాట్లాడిన డిమిత్రీనీ, ఆ కొరియా అమ్మాయి నవ్వునిగురించి మాట్లాడిన డిమిత్రీనీ తానుతప్ప బహుశా యింకెవ్వరూ యెరగరేమో ననుకున్నది ఎలీనా.

కాని, అతన్ని పూర్తిగా అర్థంచేసుకో లేదేమోనని గూడా అనిపించేది. పదోక్లాసులోచదివే పాపోవానుగురించి చెప్పిందొకసారతనికి: "చూశావా, వాళ్ళా అమ్మాయిని స్కూలునుంచి వెళ్ళగొట్టేశారు. ఎందుకెళ్ళగొట్టాలిసొచ్చిందో యెవళ్ళకీ అర్థంకాలేదు. చివరికి, పట్టణకమిటీ జోక్యం కలిగించుకున్నతర్వాతగాని మళ్ళీ చేర్చుకోలేదు. పదిహేడేళ్ళమ్మాయికి ఈ గొడవంతాచూస్తే యెట్లా వుంటుంది? ... పగవాళ్ళకొద్దు బాబూ ... అసలిదంతా చేసింది ఫోమిన్ అనే అతను. ఐనా, అతన్నెవళ్ళూ మందలించనుగూడా లేదు. చూస్తూ వూరుకోవాల్సిన పనేనా యిది?"

డిమిత్రీగూడా తనతో ఏకీభవిస్తాడనుకుంది ఎలీనా; డిమిత్రీ పల్లెత్తి ఒక్కమాటగూడా అనలేదు. ఏదో గుర్తుకుతెచ్చుకుంటున్నట్లు మెదలకుండా కూర్చున్నాడు. అదే తన భర్తైతే, "భయం వేసేదల్లే వుంది" అనుకునేది. డిమిత్రీ అంటే వల్లమాలిన గౌరవం ఎలీనాకి. ఇంకా నా కర్థంగాని విషయాలు చాలా వున్నయన్నమాట అనుకుని వూరుకుంది.

తనకు తెలియకుండానే డిమిత్రీ అంటే అనుబంధం ఏర్పడింది. నాలుగురోజులు రాకపోతే చాలు; "జబ్బు చెయ్యలేదుగదా; మీరు కనుక్కున్నారుగా" అనడిగేది భర్తని. అదంతా మొన్నటి వేసవి కాలంవరకూ. అంతవరకూ వాళ్ళ స్నేహం చక్కగా, మామూలుగా, హాయిగా నడిచింది. తర్వాత తను శలవుతీసుకుని కకేషస్ పర్వతాల దగ్గర కెళ్ళాడు. మళ్ళీ వచ్చిందగ్గర్నుంచీ అదో తరహాగా, విచారంగా వున్నట్టుంటున్నాడు. 'నచ్చినమ్మాయి నెవరినైనా కలుసుకున్నాడేమో; ఐనా లాభంలేక పోయిందేమో' అనుకున్నది తాను. మరీ యీ మధ్య తప్పుకు తిరుగుతున్నాడు. ఒకటి రెండుసార్లు బజార్లో కనిపించాడు. పని బాగా ఎక్కువగా ఉందనీ, రెండు, మూడు రోజుల్లో తప్పకుండా యింటికొస్తాననీ చెప్పాడు. తప్పకుండా వస్తానని మరీ మరీ చెప్పాడు. చెప్పికూడా ఎందుకని రావడంలేనా అని పదేపదే అనుకుంది. "ఎందుకూ అతన్ని గురించి యింతిదిగా ఆలోచిస్తున్నాను. ప్రేమించడంలేదుగదా నే నతన్ని" అనుకున్న దొక నాడు అకస్మాత్తుగా. ఛ, నా వయసులో యిలాంటి చిలిపి పను లెవళ్లుచేస్తారు అనుకుని సర్దుకుంది: అంత బాగా దగ్గరకూర్చుని మాట్లాడే వాళ్లెవళ్ళూ వూళ్ళో లేరుగదూ, అదీగాక, బాగా స్నేహంగూడా అయ్యిందా . . . అందుకని . . . అంతే.

మొన్న లైబ్రరీలో జరిగిన మీటింగుకి వెళ్ళాలనిలేదసలు తనకి. వ్రాసుకొచ్చిన నోట్సుల్లోనుంచీ, పత్రికల్లో పడ్డసమీక్షల్లో నుంచీ, కథని పదిరకాలుగామార్చి మాట్లాడుతారు వచ్చిన వాళ్ళందరూ...వూరికే విసుగుపుడ్తుంది. మీటింగుకి తప్పకుండా బయల్దేరాలని ఇవాన్ పట్టుబట్టాడు. పట్టణకమిటీ కార్యదర్శి వస్తాడట. "అందరూ వస్తారు. నన్నుముట్టకు నామాలకాకంటూ నువ్వొక్కడకూర్చోవడం యెందుకు?'' అన్నాడు.అదీగాక లైబ్రేరియన్ చెప్పింది-డిమిత్రీగూడామాట్లాడతాట్ట ఆపుస్తకాన్ని గురించి. ఎలీనాకి కోపంవచ్చింది: "ఐతే నాకేం." ఇవాన్ నవ్వాడు: ఈ ఆడవాళ్ళే

యింత. నిన్నటిదాకా డిమిట్రీఅంటే పడిచచ్చేది; ఇవ్వాళతని వుప న్యాసం వినడమన్నా కష్టమే.

చివరి కా మీటింగింతపని చేస్తుందని ఎలీనా కలలోగూడా అనుకోలేదు.

డిమిట్రీ ఉపన్యాసం ప్రారంభించిం దగ్గర్నుంచీ, హాల్లోనించి బయటికెక్కడికన్నా పారిపోయి, రెండు చేతుల్తోనూ ముఖం కప్పు కుని యేడవాలనిపించింది...అతను మాట్లాడేదంతా తనని గురించి కాదూ? ఇన్నిరోజుల్నుంచీ తనింటికెందుకు రావడంలేదో చెబు తున్నాడు. 'ఇప్పుడంతా తెలుస్తూంది. ఆ నవల్లో కథానాయికలా గానే నేనుగూడా బుర్రేమీలేని వొఠి శీతాకోక చిలుకనన్న మాట; నేనంటే అదన్నమాట అతని అభిప్రాయం. నేనతన్ని ప్రేమిస్తున్నా నని నిర్ణయం చేసేసుకుని, నాకుపన్యాసం దంచుతున్నాడన్న మాట! అతను చాలా మంచి మనిషనీ, అత నాలోచించవలసిన విషయా లింకా చాలా వున్నాయనీ, అదీగాక అస లిలాంటి వ్యవహారాలు సాగడం అసంభవం అనీ నే నర్థం చేసుకోవాలి; అదీ అతని వుద్దేశం. ఈ నీతిబోధంతా నాకోసమే. ఈ మాటలు పదిమందిలోనూ చెప్పడం దేనికి? ఇంటికొచ్చి, వొంటరిగా, నాతోనే చెప్పొ చ్చుగా. ఆలోచించే చేస్తున్నాడు- ఇలా చెబితే నన్నింకా బాగా అవమానించొచ్చునని. ఇక చచ్చినా నే నతనిజోలికి పోకుండా చేసుకోవాలని. అందుకూ అత నిక్కడ చెబుతున్నది. అత నంత బాధ పడాల్సిన పనేమీలేదు. ఇకతనికి చచ్చినా కన్పించను.'

మీటింగైపోయింతర్వాత ఇవాన్‌తో కలిసి బయటికొచ్చింది. బయట మంచదేపనిగా కురుస్తోంది. టాక్సీని పిలుస్తానన్నాడుఇవాన్. కాదు, నడిచే వెళ్దామని పట్టుబట్టింది. నడిచన్నా వెళ్తే, ఇంటి కెళ్లేప్పటికి స్థిమితపడతానేమో నను కున్నది ఎలీనా. దారిపొడుగూతా డిమిట్రీ అంటే మండిపడుతూనేవుంది. కాని యింట్లో అడుగుపెట్టిందో లేదో అర్థమైపోయింది; తా నింత మండిపడవలసిన అవసర మేమీ లేదు. అసలు తప్పంతా తనదే. ఇప్పటిగ్గాని తెలిసిరాలేదావిడకి - డిమిట్రీని

ప్రేమిస్తున్నాననీ, అతను రాకపోవడమే యిన్నిరోజులుగా తాను బాధపడేందుకు కారణమనీ, ఇక తనకు సంతోషమంటూ ఉండదనీ, మనశ్శాంతంటూ వుండదనీ వెంటనే వంటింట్లోకి వెళ్ళిపోయింది. టీ తొందరగా వేడెక్కలేదు, అదీ మంచిదేనైంది; ఇవాన్ కళ్ళబడకుండా కూర్చునేందుకు వీలుచిక్కింది. ఉన్న కోపమంతా పోయింది. డిమిత్రీ మంచిపనేచేశాడు; తనని హెచ్చరించాడు. ఎక్కడ, ఎప్పుడు, ఎలా హెచ్చరించాడనేది వేరేసంగతి. అతని కర్తవ్యం అతను పూర్తి చేసుకున్నాడు. ఆవిడ కర్థంకాని దతనికి అర్థమైంది; తెగతెంపులు చేసుకున్నాడు శుభ్రంగా. ఇక తన బ్రతుకు తాను బ్రతకాలి. కాని,...ఎట్లా?

భోజనాల గదిలో కెళ్ళి ఇవాన్‌ముందు రొట్టెలు పెట్టింది. ఇవాన్ తింటూంటే, తాను టీ తాగుతున్నట్లుగా నటిస్తూ కూర్చుంది. ఒక పేజీఅంతా వున్న వ్యాసమేదో చదువుకుంటున్నాడు; బ్రదికించాడు... "నిజంగా, నా భర్త యితనేనా?" అని ఆశ్చర్యపోయింది ఎలీనా.

*　　　　*　　　　*

టీచర్ కోర్సు చదువుతూన్నప్పుడు కలుసుకున్నది ఎలీనా ఇవాన్‌ని. విద్యార్థులందరూ ఆవాళ నాటకమాడుతున్నారు. అంతకు ముందే వచ్చాడతను ఆ పట్టణానికి. యువతీలోకంలో కలిసి మెలిసి తిరగడమంటే తనకిష్టమని చెప్పాడు. తర్వాత ట్రెయినింగ్ కాలేజీకి చాలా తరచుగా వస్తూండేవాడు ఆవాళ్టి నాటకంలో ఎలీనా ఒక చిన్నపాత్ర వేస్తోంది (ఎలీనా యేమంత మంచి నటికాదు). కాని, నాటకమైపోయింతర్వాత అందరూ డాన్స్ చేస్తున్నప్పుడు "మనిద్దరం కలిసి డాన్స్ చేద్దామా" అన్నాడు ఇవాన్. తానంగీకరించింది. ఇద్దరూ కలిసి డాన్స్ చేశారు తర్వాత చాలాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. చివరికి హాస్టల్‌దాకా వచ్చి సాగనంపి వెళ్ళాడు.

ఇది జరిగి ఆరేళ్ళయింది. అప్పటికీ, యిప్పటికీ ఇవాన్ చాలా మారిపోయాడు. లావెక్కాడు, శరీరం దొందబారింది, జారిపోతున్నట్లుంటాయి బుగ్గలు, తలగూడా నెమ్మది నెమ్మదిగా బట్టతలై పోతూంది. ఇంకా 37 ఏళ్ళుగూడా రాలేదు; అప్పుడే యాభై యేళ్ళవా డనుకుంటున్నారు చూచినవాళ్ళందరూ. ఇదివర కతని కళ్ళల్లో యేవో కలలు దోబూచులాడుతున్నట్లుండేవి; ఇప్పుడ దేమీ లేదు, ఎంతో నిశ్చింతగా అంతా తమకే తెలుసునన్నట్లుంటా యతని కళ్లు. అతను నవ్వుతూంటే, అతన్తో కలిసి నవ్వుదామని గూడా అనిపించదు ఎవ్వరికీనీ. మొత్తంమీద చాలా మారి పోయాడు.

లేక, అతని భార్య కొక్కదానికే అలా కన్పిస్తున్నాడా? మొదట్లో అతను మంచి హుషారుగావుండేవాడు జీవితమంటేనే సంబర పడుతున్నట్లు, భవిష్యత్తంతా మంచిదేనన్నట్లు, మనం సాధించలేని పనే లేదన్నట్లు. అందుకనే ఎలీనాని ఆకర్షించగలిగాడు కూడా. అత నిప్పటికీ, ఈ విషయంలోమాత్రం అలాగే వున్నాడు; ఏమీ మారలేదు. ఐనా ఎలీనాకి కోపంవస్తూంది. ఈ మధ్యొకసారి వాళ్ళింటికి ఎగొరోవ్ వచ్చాడు. ఎగొరోవ్ ఫాక్టరీలో చీఫ్ఎంజినీర్. పాపం, కళ్ళనీళ్లు పెట్టుకుంటూ వచ్చి, తన భార్యకి కాన్సరొచ్చిందని డాక్టర్లు చెప్పారని చెప్పాడు. ఆ మాటలు వింటూంటే ఎలీనాకు దుఃఖం పొంగుకొచ్చింది. ఇవానేమో "ఏంఫర్వాలేదు; అదే నయం వౌతుంది. మనవాళ్ళిప్పటికీ మందులు కనిపెడుతున్నారుగా" అన్నాడు. అని, మరుక్షణంలోనే "ఆ స్టాలిన్గ్రాడ్కి పంపాల్సిన మెషీన్లసంగ తేమిచేశారు. వాళ్ళూపిరాడనివ్వకుండా ఉత్తరాలు రాస్తున్నారు. అప్పుడే మూడుసార్లు రాశారు" అన్నాడు.

ఎలీనాకు మరపుకురాని సంగతి యింకొకటుంది. గడచిన వేసవిలో పట్టణ కమ్యూనిస్ట్ కమిటీ కార్యదర్శివచ్చి, "కార్మికులుండే ఇళ్ళు గుడిసెలకంటే కనాకష్టంగా వున్నై, వాళ్ళకి కొత్త యిళ్ళు కట్టించడానికి డబ్బు గ్రాంటై సంవత్సరంపైగా ఐంది;

ఆ డబ్బేం జేశావు ?" అని ఇవాన్‌ని, ఎలీనా ముందే, అడిగాడు. ఇవాన్ నించున్నవాడు నించున్నట్టు జవాబుచెప్పేశాడు: "ఆ డబ్బెట్టి కొత్త పనిముట్లు పట్టుకు రాకపోతే, ఫాక్టరీ మూలబడిపోయేది. మన కోటాగూడా పూర్తయ్యేది గాదు. వాటి మూలాన్నేగా అనుకున్న దానికంటే 16% ఎక్కువ ఉత్పత్తిచేశాం. మీరు పొగిడి, మా వీపులు చరిచారుగా ఉత్పత్తెక్కువ చేశామని. అవిలేకపోతే ఇంకేమైనా వుండా, తలెత్తుకు తిరగ్గలిగే వాళ్ళమా మనం? ఇక యిళ్ళ సంగతంటావా, యేం ఫర్వాలేదు. మనం చచ్చిపోయింతర్వాత గూడా అవట్లాగే చెక్కుచెదరకుండా వుంటాయి. ఈమాత్రం బాగాగూడా లే నిళ్ళు చూశా న్నేను మాస్కోలో" అంటూ.

'ఈ మనిషే యింత. ఏంజరిగినా నదరడు, బెదరడు. ప్రతి దానికీ యేదో వొక సమాధానం చెబుతాడు- యేం ఫర్వాలేదని. ఈ మనిషే యింత. వొఠి స్వార్థుడు' అనుకుంది ఎలీనా.

పడుచుదనంలో వున్నప్పుడు ఎప్పుడూ నవ్వుతూ హుషారుగా వుండేవాడు; అందుకనే ఆకర్షించేవాడు. కాలం గడిచేకొద్దీ ఆ నవ్వులూ లేవు; ఆ హుషారూ లేదు. ఉద్యోగంలోగూడా అతని కష్టాలతను పడ్డాడు. మూడేళ్ళక్రితం వొకసారి అతని వుద్యోగం వూడిపోతుందనిగూడా చెప్పుకున్నారు అందరూ; రెండుసార్లు మాస్కో వెళ్ళిరావలసివచ్చిందిగూడా. ఎలాగో ఆగణ్ణం దాటి గట్టెక్కాడు. బహుశా అందుకనేనేమో అతనివ్వుడంత యెక్కువగా నవ్వంది? లేకపోతే బాధ్యత లెక్కువై సతమతమౌతున్నాడా? ఇదంతా కాకుండా అసలూరికే లావెక్కిపోతున్నాడా? ఇప్పుడు కూడా, అప్పుడప్పుడూ కొత్త యంత్రాల్ని గురించిగాని, మాస్కోలో తన నందరూ అభినందించారని చెప్పేప్పుడుగాని, లేకపోతే తనమీద గుర్రుపెట్టుకుని వుద్యోగం వూడగొట్టించాలని చూచిన నికిఫొరోవ్‌ని గురించీ, చివరి కా నికిఫొరోవ్ యెత్తులు యెలా పారలేదో చెప్పేప్పుడుగాని— ఇవాన్ చాలా హుషారుగా నవ్వుతూ వుంటాడు; కాని ఎలీనా కిదంతా చూస్తే ఇవాన్ కావాలని, తెచ్చిపెట్టుకుని,

నవ్వుతున్నా డనిపించేది. నిజానికి ఇవాన్‌కి ఆ ఫాక్టరీయే పంచప్రాణా లూను. తానే ఫాక్టరీ, ఫాక్టరీయే తాను అనుకునేవాడతను. ఎవ రైనా వచ్చి స్నేహంతో కరస్పర్శచేస్తే, తన ఫాక్టరీ బాగా పని చేస్తోంది కాబట్టే వీ ళ్ళింత స్నేహం చూపుతున్నారనుకునేవాడు. ఉత్పత్తికోటా పూర్తి గాకపోతే, అదంతా తన స్వంత, దురదృష్టమే నని అనుకునేవాడు.

ఫాక్టరీపని లేకపోతే ఇవాన్ చేసేపని ఇంకొక్కటేవుంది: చేపలుపట్టడం. ఆదివారం వుదయంపూట బయల్దేరేవాడు ఖిత్రోవ్‌ని వెంటబెట్టుకొని. చేపల్నిగురించి ఖిత్రోవ్‌తో వాదిస్తున్నప్పుడు పదిహేడేళ్ళవాడిలాగా కన్పించేవాడు. ఇదంతా చూస్తుంటే ఎలీనాకి చిరాకువేసేది. ఏం? యేదైనా పుస్తకం చదువుకోగూడదూ? లేక పోతే యే నాటకమైనా చూచేందుకు వెళ్ళగూడదా. అదేంపనికి రాదు; తేలుతూవుండే ఆ గేలంపుల్లని చూస్తూ, గంటలతరబడి కూర్చోవాలిట.

అసలు యీ ఇవాన్ ఆ ఖిత్రోవ్‌తో స్నేహం ఎందుకు చెయ్యాలోగూడా అర్థంకాలేదు ఎలీనాకి. ఖిత్రోవ్ తన పని తను బాగానే చేస్తాడు; హాయిగా పెళ్ళిగూడా చేసుకున్నాడు. బాగా బలిసిన పసిపాపలా ఎర్రగా, బుర్రగా, బొద్దుగా వుంటాడు. చెప్పిన మాటే చెప్పి, నూరోసారిగూడా కడుపుబ్బేట్లు నవ్వగలడు. ఇవాన్ తెలివితేటలంటేనూ, ఇవాన్ అదృష్టమంటేనూ అతని కపరిమితమైన గౌరవం. చేపలు పట్టడాని కెళ్ళినా వాళ్ళిద్దరే కలిసివెళ్తారు; వేట కెళ్ళినా అంతే; కూర్చుని చదరంగం ఆడినా అంతే. "బ్రతకడం తెలిసినవాడు" అనేవాడు ఇవాన్, ఖిత్రోవ్‌నిగురించి. చీఫ్ డిజైనర్, సొకొలొవ్‌స్కీమాత్రం ఖిత్రోవ్‌ని అసహ్యించుకుంటాడు: "ఖిత్రోవా? వాడిజన్మలో వాడు నదిని చూచినపాపానగూడా పోలేదు. ఇప్పుడంటే నదిలోనే పుట్టి నదిలోనే పెరిగి, చేపలు పట్టు కుంటూనే బ్రదికినట్టు మాట్లాడతాడు" అంటాడు. ఖిత్రోవ్‌ని చూస్తేనే చికాకేసేది ఎలీనాకి. "అబ్బ, అన్నిటికీ తలూపుతూవుండే

ఆ డూడూ బసవన్నతో ఎట్లా మాట్లాడబుద్ధేస్తుంది మీకు ?" అని ఇవాన్‌తో అప్పుడప్పుడూ చిర్రాగ్గా అనేది. "ఫ్రెట్రోవ్ ఫూలను కుంటున్నావేమో. కాదు కాదు. ఒక్కోసారి చాలా మంచి విషయాలు, యింతవరకు మనం నెప్పుడూ విననివి చెబుతాడు. ఐనా నువ్వు ప్రతిదీ చాలా తేలిగ్గా చూస్తావు. నీకు తెలియదులే" అనేవాడు ఇవాన్.

తానన్నా, తమ కూతురన్నా ఇవాన్‌కి చాలా యిష్టమని ఎలీనాకీ తెలుసు; కాని అతన్ని పెళ్ళిచేసుకున్నప్పుడావిడ కోరుకున్నదీ 'యిష్టం' కావాలని కాదు, ఆవిడకి జీవితమంటే యేమిటో తెలియదని అతని ఉద్దేశం. "నువ్వెప్పుడూ యింతే, శాస్త్రం చెబుతారే, రూపాయడిగి దమ్మిడీ యిస్తే మాట్లాడకుండా పుచ్చుకున్నాడని. నువ్వూ అంతే. అ దిలావుండాలి, యి దలావుండా లంటావు. జీవితం వంటే యేమిటనుకున్నావ్; అంత తేలిగ్గాదు" అని యెగతాళి చేసేవాడు.

పెళ్లైన మొదటిరోజుల్లో ప్రేమనిగురించీ, జీవితాశయాన్ని గురించీ, సుఖమంటే యేమిటో చెప్పమనీ ఇవాన్‌తో మట్లాడాలని ప్రయత్నించేది ఎలీనా. ప్రేమగాచూచి, చిరునవ్వు నవ్వి, యింకా చాలా పనుంది; చేసుకోవాలి" అని సంభాషణ తెగగొట్టేసేవాడు. ఎలీనా చాలా మంచిభార్యనే ఇవాన్ వుద్దేశంగూడా. ఆవిణ్ణి చూసుకొని ఆనందించుకునేవాడు గూడాను: ఆవిళ్ళోనూ ఒకలోపం వున్నమాటనిజమే, ఎప్పుడూ తనలోపలి భావాన్నిగురించి మాట్లాడమంటుంది; ఐనా అదేం పెద్ద లోపంకాదు. ఆడవాళ్ళ కింతకంటే గొప్ప లోపాలింకా లక్ష వుండొచ్చు.

డిమిట్రీతో ఎలీనా స్నేహం చెయ్యడంచూచి ఇవాన్ సంతోషించాడు. అతనేమీ అసూయ పడలేదు: ఎలీనా అలాంటిదికాదు; మంచీ చెడ్డా తెలుసు. యెవరికోసన్నా మాట్లాడ్డమంటే సరదా ఎలీనాకి. కాస్సేపు సరదాగాతిరిగినా యిబ్బందిలేదు? అదీ సహజమే. ఆడదితో కూర్చుని కబుర్లుచెప్పేందుకు తనకి టైమూలేదు; అలాంటి

తెలివితేటలూ లేవు. డిమిత్రీ అంటే వేరు. తనకున్న తెలివితేటల్ని ప్రదర్శించుకోవడమంటే అతనికి సరదా, ఎలీనా నోరు తెరచుకొని వింటూంటే, అదొక ఆనందం డిమిత్రీకి.

డిమిత్రీ యింటికి రావటం మానేసేప్పటికి ఇవాన్ కాశ్చర్యం వేసింది : ఎలీనా కతనంటే విసుగుపుట్టిందా ? అంత తెలివిగలవాడన్నా విసుగుపుట్టిందీ. "ఎట్లాగైనా ఎలీనాకి నేనంటే మహాయిష్టం; అందులో సందేహమేమీ లేదు" అనుకున్నాడు ఇవాన్.

పెళ్ళిచేసుకున్న తర్వాతగూడా పంతులమ్మపని మానననని షరతుపెట్టింది ఎలీనా పెళ్ళిచేసుకునేటప్పుడు. వంటాగింటా చేసేందుకు కాదు తానింతాకష్టపడి డిగ్రీ తీసుకున్నది. ఆవిడకి బడికెళ్ళి, పిల్లలకి పాఠాలుచెప్పడమంటే మహాయిష్టం. ఇంటికొచ్చిం తర్వాత గూడా, ఇవాన్‌కి ఆ పిల్లలు వ్రాసిన వ్యాసాలూ అవీ చూపించాలనీ, పుష్కిన్ గొప్పదనాన్ని గురించి చెప్పాలనీ, హెడ్మాష్టరు చేసే తెలివితక్కువ పనుల్ని గురించి ఇవాన్‌తో మాట్లాడాలనీ ప్రయత్నం చేసేది. "ఏం ? నా కింకేమీ పనిలేదనుకున్నావా ? స్కూలు టీచరు పనీ కష్టమే ననుకో; ఫాక్టరీ పని అంతకంటే కష్టం, తెలుసా" అనేవాడు ఇవాన్.

అతని ఉద్యోగాన్ని గురించి అభిప్రాయభేదాలున్నై. అతనిదేం వుంది యేమెండ కాగొడుగు పడతాడనీ, ఫ్యాక్టరీ బాగా నడుస్తూ వుందంటే అందుకు కారణం డిమిత్రీ, ఎగొరోవ్, సాకొలొవిస్కీ బ్రెయిన్ లేననీ, ఇవాన్ లేకపోతే యింకా బాగా సాగేదనీ, అనేవాళ్ళూ ఉన్నారు. అతను బాగా మానేజ్ చెయ్యగలడనీ, అదీగాక మంచి నిక్కచ్చిమనిషిగూడాననీ, యింతకంటే యింకా కావలసింది మాత్రమేం వుంటుందనీ అనేవాళ్ళూ ఉన్నారు. అతనంటే పెద్ద గొప్ప అభిప్రాయం వున్నవాళ్ళూ లేరు; అంతబాగా చెత్త అభిప్రాయంవున్నవాళ్ళూ లేరు. అతనంటే యెవరికీ గాఢమైన భావాలు – ప్రేమగానీ, ద్వేషంగానీ – లేవు.

అతనిలో అతనికి చాలాగట్టి విశ్వాసం వుందని అనుకునేది ఎలీనా; అదీ కన్పించదు, ఒక్కోసారి వూరికే బేలగా మాట్లాడే వాడు. తనకొచ్చిన సందేహాలు తనక్రింద పనిచేసేవాళ్ళతో చచ్చినా చెప్పేవాడు కాదు; అంతా తానే స్వయంగా నిర్వహించాలని అతని అభిప్రాయం. మంత్రులికి పంపేరిపోర్టుల్లో ఇవాన్ వున్నదాన్ని యింకా సమపిపూసి మారేడుకాయచేస్తాడు అనుకునేవాడు డిమిట్రీ. ఇవాన్ మాత్రం అలా అనుకునేవాడుకాదు- డిమిట్రీకి యంత్రా లంటే యేవిటో తెలుసుగాని, మానేజ్మెంట్లో వుండే గొడవలేం తెలుసు? మాస్కోలో వున్నవాళ్ళకి తన కష్టాలన్నీ చెబితే యేమవా తుందో ఇవాన్‌కి తెలుసు. "ఇవాన్ ప్రతిదానికీ ఊరికే గాభరా పడ తాడు" అనుకుని, కళ్ళెర్రజేస్తారు. పరమాన్నం కావాలనుకునే వాడికి పచ్చిపులుసు వొడ్డిస్తే ఊరుకుంటాడా? "నోరెట్లా మూసు కోవాలో, యెప్పుడు మూసుకోవాలో తెలుసుకోవాలి" అనేవాడు ఎలీనాతో ఇవాన్. వొట్టి పిరికివాడనుకునేది ఎలీనా. ఐనా, ఇవాన్ మూడు సంవత్సరాలు సైన్యంలో పనిచేశాడు. కీవ్ పట్టణాన్ని రక్షించడానికి ప్రాణాలొడ్డి యుద్ధం చేశాడు. అతని స్నేహితులు ఇప్పటికీ అతని ధైర్యాన్ని ప్రశంసిస్తుంటారు. "నిజమే, యుద్ధంలో చస్తే చావొచ్చు; అందులో సందేహమేమీలేదు చావడానికే, మహారాజులా చచ్చిపోవచ్చు. కుర్చీలో కూర్చోబెట్టి చెప్పరా అట్లా యెందుకు చేశావో అంటే... అదివేరు యిదివేరు దీనికంటే అదే మంచిది" అని అనేవాడు ఇవాన్ యుద్ధాన్ని గురించి ఎలీనాతో చెబుతూ.

గట్టనివా ళ్ళన్నంటేనే, ఫాక్టరీమాత్రం యీ ఆరేళ్ళ లోనూ ఎప్పుడూ, ఒక్కసారిగూడా, ఆగిపోయినపాపాన పోలేదు. నిజమే; కార్మికుల ఇళ్ళకోసం కేటాయించిన డబ్బు ఫాక్టరీకోసం ఖర్చుపెట్టడం రూల్సుకి వ్యతిరేకమని ఉపమంత్రి అన్నమాటనిజమే. "ఆఁ అదేవుందిలే; మంత్రులలాగే అనాలి కాబట్టి అంటూంటారు. నాలాగానే వాళ్ళకూడా ఉత్పత్తంటేనే యెక్కువమోజు. కాక

పోతే సైకట్లా అంటూ వుంటారు. అనాలి కాబట్టి” అని ఇవాన్ వుద్దేశం. అందుకనే కార్మికులందరికీ యిళ్లున్నాయనీ, పెద్ద యిబ్బందంటూ యేమీలేదనీ, ఎట్లాగో మూడుబ్లాకుల యిళ్లు గట్టడానికి ప్లానులన్నీ సిద్ధంగానే వున్నాయనీ మంత్రికి జవాబుచెప్పాడు, అట్లాగే జవాబుచెప్పాలి కాబట్టి. ఆ ప్లానులన్నీ సిద్ధంగా వున్నమాటగూడా నిజమే. అవన్నీ ఎగడే సిద్ధమైనై. ఐతేనేం, ఇప్పుడప్పుడే వాటి నమలుచేయ్యడానికి ఇవాన్ సిద్ధంగాలేడు. సెంట్రల్‌కమిటీ ప్లీనమ్ పూర్తికాగానే, కార్యనిర్వహణ కమిటీ అధ్యక్షుడు, సిబిర్ త్సేవ్, వచ్చి “చూశావా ఇవాన్, పేపర్లలో యేం రాశారో? కార్మికుల కందరికీ యీ పాటికే కొత్తయిళ్లు కట్టియివ్వాల్సిందని వాళ్ళ అభిప్రాయం” అన్నాడు. “కడదాం; కట్టకేంచేస్తాం” అన్నాడు ఇవాన్. అన్నాడేకాని తర్వాత సిబిర్ త్సేవ్‌నీ, అతనన్నమాట లన్నీగూడా మరిచిపోయాడు. ఇవాన్ దద్దమ్మేమీ కాదు; అతనిబుద్ధి అంతమొత్తనిదీ కాదు.

ఈ మధ్యనే ‘ఇజ్వెస్తియా’ (సోవియట్ ప్రభుత్వం పత్రిక)లో యీ ఫాక్టరీనిగురించి ఒక వ్యాసంగూడా పడింది. ఆ పత్రిక విలేఖరి వొచ్చినప్పుడు ఇవాన్ ఏమన్నాడో తెలుసా: “ఇదిగో అబ్బాయ్, నన్నుగురించేమీ వ్రాయొద్దు. ఉత్పత్తెలా పెరిగిందీ అన్నీ అంకెవేసి యిచ్చానుగా; అది వ్రాయి చాలు. కావాలంటే మా డిమిట్రీ పేరుగూడా వ్రాయి; చాలా కష్టపడి పనిచేశాడు. అన్నిటికంటే ముఖ్యం కార్మికులు; వెళ్లి వాళ్ళని కలుసుకో” అన్నాడు. ఎంత చెబితేనేం, ఆ విలేఖరి వెళ్లి ఇవాన్‌నిగురించే వ్రాశాడు “సోవియట్ పరిశ్రమల్లో చాలా ఆదర్శమైన డైరెక్టర్; అటు అనుభవమూ వుంది, ఇటు సాహసమూ వుంది. వీటికితోడు తెలివితేటలూ వున్నై” అని. పట్టణ నిర్వాహణకమిటీ అధ్యక్షుడు ఫోన్‌చేసి ఇవాన్‌ని అభినందించాడు. నవంబరు 6న విప్లవ దినోత్సవాలు జరిగినప్పుడు, అధ్యక్షవర్గం స్థానంలో ప్రాంతీయ సైనిక అధిపతి ప్రక్కనే కుర్చీ

వేశారు ఇవాన్‌కి. "ఇవాన్ పలుకుబడి రోజురోజుకీ పెరిగిపోతూంది" అని అనుకుంది పట్టణం అంతా.

ఈమధ్యనే మాస్కోనుంచి వచ్చిన చిత్రకారుడు, ఒలోడ్యా, ఇవాన్ బొమ్మ గీస్తున్నాడు ఏటేటా జరిగే చిత్రప్రదర్శనానికని. ప్రఖోర్ కొడుకే ఒలోడ్యా. "నే నెప్పుడూ గెలిచే గుర్రంమీందే పందెం పెడతా" నంటాడు ఒలోడ్యా. అతను ఇవాన్ బొమ్మగియ్యడానికి కారణం, అదిగీస్తే బహుమానం తప్పకుండా వొస్తుందని; పేరొస్తుందని. స్థానిక పత్రిక ఆ చిత్ర ప్రదర్శనాన్ని గురించి వ్రాసేప్పుడు తనని గురించి తప్పకుండా బాగా వ్రాస్తుంది; ఇవాన్ బొమ్మని పట్టణంలో వున్న మ్యూజియం కోసం యెలాగూ కొనుక్కుంటారు. ఇవాన్ తన కొచ్చిన మెడల్సన్నీ పెట్టుకుని, పెద్ద టేబుల్ ప్రక్కన కూర్చుని బొమ్మగీయించుకుంటున్నాడు. ఆ టేబుల్ మీద పెద్దనమూనా యంత్రం గూడా ఒకటి పెట్టుకున్నాడు సగం పైగా పూర్తైన బొమ్మ చూచి ఎలీనా మూతి విరిచింది—ఇవాన్ మరీ టర్కీకోడిలాగా వున్నాడు,

తన భర్త లోతుపాతులన్నీ యెరుగుదునని ఎలీనా అనుకునేది కాని ఆవిడకి తెలియనివీ, ఆవిడ తెలుసుకోనివీ యింకా చాలా వున్నాయి. ఎగొరోవ్‌తో, చివరి రోజు వరకూ, "యేం ఫర్వా లేదు; అదే నయమవుతుంది" అంటూనే వున్నప్పటికీ, ఎగొరోవ్ భార్య చనిపోయిందని తెలిసినప్పుడు ఇవాన్ నిజంగానే చాలా బాధపడ్డాడు. అక్కడిదాకా యెందుకు? రోజూ ఆ కార్మికులుండే గుడిసెలు చూచినప్పుడు గూడా అలాగే బాధపడేవాడు; చిన్నప్పటి రోజులు గుర్తొచ్చేయి - అతను పుట్టింది కలూగా జిల్లాలో ఒక కుగ్రామంలో. అక్కడిళ్లూ యిలాగే వుండేవి తేమతేమగా, చీకటి చీకటిగా రేపోమాపో పడిపోతాయేమో నన్నట్లు. కాని, వెంటనే సరిపెట్టేసుకునేవాడు: ఫర్వాలేదు; ఇంకా కొంతకాలం నిలబడతాయిలే యిళ్ళు. ఆ ఫ్యాక్టరీ కట్టకపోతే దమ్మిడీకైగ్గూడా మా కేవాళ్ళం కాదసలు. ఐనా వాళ్ళకి మాత్రమేం? బాగానే

వున్నారు, వాళ్ళ తండ్రుల్లోనూ తాతల్లోనూ పోల్చిచూస్తే బోలెడు సుఖాలనుభవిస్తున్నారు యిప్పుడు. వచ్చేయేడు యెట్లాగూ కొత్తిల్లు కడుతున్నాంగా. అసలింతివిగా నిరుత్సాహపడగూడదు. భార్య జబ్బుగా వున్నప్పుడు ఎగొరోవ్‌కి దిలాసా చెప్పాలిసిందే; దిలాసా యిస్తానని అనుకునే వచ్చేంటాడు నా దగ్గరికి. అదీ అసలు రహస్యం-చెక్కని చూడకుంటూ వుంటేసరి; దాని దారినదే పోతుంది.

ఒకసారి ఫాక్టరీలో ఒక గదిలో నిప్పంటుకుంది. ఇవాన్ యేమీ గాభరాపడకుండా, చెయ్యవలసిన పనులన్నీ తానే దగ్గరుండి చేయించి, ఆ నిప్పునంతా యిట్టే ఆర్పేయించాడు. తర్వాత, అప్పు డాగిపోయిన పని పూడ్చటానిగ్గాను తాను కూడా వుండి రాత్రల్లా పనిచేయించాడు పనివాళ్ళతో. నాలుగైదు రోజుల్దాకా ఫాక్టరీ అంతా చెప్పుకుంటూనే వుంది అతని గొప్పని గురించి. "చూశావా, ఇవాన్ అంత చొరవలేని మనిషా? ఐనా యేమీ గాభరా పడకుండా యెంత బాగా చేశాడో" అన్నాడు డిమిట్రీ సొకొలొవస్కీతో. డైరెక్టర్‌ని ఎప్పుడూ యెగతాళి చేస్తూండే సొకొలొవస్కీ గూడా "నిజమే, యెవళ్లో గాని చెబుతూంటే విన్నా ఒక గమ్మత్తైన మొగ్గవుందట. అది యెన్నేళ్లైనా అట్లాగే వుంటుందట పైకి కన్పించకుండా మొదలు కోసేస్తే వెంటనే తన్నుకొచ్చి నట్లొచ్చేస్తుందట పైకి. ఇవాన్ గూడా అంతే— చాలా సామాన్య రకం డైరెక్టరు; అతను మేలుకోవాలంటే తుపాను రావాలన్న మాట" అన్నాడు.

అసలు ఎలీనాకి మొట్టమొదట, భర్తమీదనుంచి మనసు మారడానికి కారణం డిమిట్రీగాదు. అసలుకారణం ఒక సంవత్సరం క్రితం ఎలీనాకీ, ఇవాన్‌కీ జరిగిన సంభాషణ. ఆ సంభాషణ జరిగిందని ఇవాన్‌కి గుర్తుగూడావుండివుండదు. ఆ వాళ వాళ్ళమ్మాయి, షూరాకి జ్వరంవచ్చింది. ఆ పట్టణంలో పిల్లల డాక్టరొకడున్నాడుగాని, ఆయనకీ అప్పుడు జబ్బుగానేవుంది. ఎలీనాకి భయంవేసింది; షూరాకి న్యూమోనియా వచ్చిందనే ఆవిడ నమ్మకం. ఇవాన్ అప్పుడు ఫాక్టరీలో

వున్నాడు; అతనికి ఫోన్ చేసింది. "మన హాస్పిటల్లో డాక్టర్ వీరా వుందిగా; ఆవిడకు కబురు పంపించు" అన్నాడు. డాక్టర్ వీరా వచ్చింది. అది సామాన్య జ్వరమేననీ, షూరా గుండెల్లో ఇబ్బందేమీ లేదనీ చెప్పింది. ఎలీనా చాలా సంతోషించింది కాని ఆ ఆందోళనలో "నిజంగానే, మరి అమ్మాయి గొంతెట్లా పీలుస్తుందే" అనడిగింది. అనుకోకుండానే, వీరాకి కూడా కోపం వచ్చేసింది: "నా మాట లంటే ఆ మాత్రం నమ్మకం లేకపోతే నన్ను పిలవడం ఎందుకు? అన్నది. వెంటనే ఎలీనా క్షమాపణ కోరుకుంది: "క్షమించమ్మా. నేనన్నదీ నాకే తెలియదు. నిజంగా; నిన్ను అవమానించి కాదు నే నా మాటన్నది. నిజంగా," వీరా కళ్ళంట నీళ్లు గిర్రున తిరిగినై నెమ్మదిగా "క్షమించాల్సింది నేను కాదు; నువ్వు. నాదే తప్పు. నాకుమరీ వూరికే కోపం వస్తూంది, ఒక్కొక్కసారి యెంతెంత మాటలంటారని అందరూ... 'ప్రావ్దా'లో ఆ వార్త పడ్డప్పటి నుంచీ * మరీనీ... ఛీ-డాక్టర్లే యిట్లా, నాకు మల్లే, ప్రవర్తిస్తే యెట్లా" అన్నది. ఎలీనా మరింత సిగ్గుపడింది. ఆపూట డాక్టర్ని యింటివరకు తీసుకొని వెళ్ళి దిగబెట్టి వచ్చింది. అప్పట్నుంచీ వాళ్లిద్దరూ స్నేహితులై పోయారు.

ఆ రోజునుంచీ ఎలీనా తన భర్తని ద్వేషించడం ప్రారంభించింది. ఆ పూట చాలా ఆలస్యంగా వచ్చాడు. ఇంటికి అలిసిపోయి, ఆకలితో వచ్చి, షూరా ఎలావుందని అడిగాడు. వీరాతో జరిగిన సంభాషణంతా చెప్పింది ఎలీనా. ఇవానేమీ మాట్లాడలేదు. "ఛా, ఇదంతా అసహ్యం కాదూ? అసలు దానికీ, డాక్టర్ వీరాకీ సంబంధం యేమిటి...?" అని అడగడం మొదలెట్టింది. "మరీ అంత యిదొత్తావెందుకు? ఆవిణ్ణి పిలవమని చెప్పిందీ నేనేగా. వీరా మంచి డాక్టరే. ఆవిడంటె నాకేమీ దురభిప్రాయం లేదు. ఐనా

* కొంతమంది సోవియట్ నాయకుల్ని చంపేందుకు డాక్టర్లు కుట్రచేశారనీ, ఆ డాక్టర్లనందరినీ అరెస్టు చేశారనీ 'ప్రావ్దా' పత్రికలో వార్త పడినప్పటి సంగతి.

అందర్నీ నమ్మటం మంచిది కాదు. అందులో సందేహమేమీ లేదు" అన్నాడు ఓదారుస్తున్నట్టు.

మాటమాటనకుండా ఆ గదిలో నుంచి వెళ్ళిపోయింది ఎలీనా. అప్పటివరకూ, గొంతుక దాకా వున్న దుఃఖం పెగలు కుంటూ పైకొచ్చిపడింది. అదేపనిగా వెక్కివెక్కిడుస్తూ "ఇతనా నాకు భర్త!" అనుకున్నది ఎలీనా పదే పదే.

తర్వాతెప్పుడో ఒకసారి ఫాక్టరీలో ఆ నిప్పు గొడవ జరిగిం తర్వాత డిమిట్రీ వచ్చి, ఇవాన్ ధైర్యాన్ని గురించి చెబుతూంటే, "డిమిట్రీ, నీకు తెలియదు. డిమిట్రీ ఆయనంత పిరికివాడూ, కటికి వాడూ వుండడు; నీకు తెలియదు" అని అనకుండా వుండలేక పోయింది.

తర్వాత, పత్రికల్లో క్రెమ్లిన్ డాక్టర్ల విడుదల వార్తలు పడగానే డాక్టర్ వీరా యింటికి ఒక్క గంతుమీదెళ్ళింది ఎలీనా; వెళ్ళి వీరాని గట్టిగా కౌగలించుకుంది.

"ఐతే, ఆ డాక్టర్లేమీ యెరగరన్నమాట. మీ వీరా అనవ సరంగానే గాభరాపడిందన్నమాట" అన్నాడు ఇవాన్ ఆవాళ సాయంత్రం ఆవులిస్తూ.

అతనికి తానంటే అపేక్ష వుందని ఎలీనాకి తెలియదని కాదు; తెలుసు. ఐనా, అతనితో కాపురం చేస్తూండడానికి కారణం జాలికాదు; అతన్ని వదలిపెట్టేస్తే ఆర్థికంగా యిబ్బందులు కలుగుతాయనే భయమూ లేదు - ఆవిడ వుద్యోగం ఆవిడకుంది. తానూ, తన కూతురు షూరా హాయిగా బ్రదుకొచ్చును ఆ జీతంతో. కాపురం జేస్తూవుండడానికి కారణం ఆ కూతురే. షూరాకి తండ్రంటే ప్రేమ; తండ్రికూడా అంతే. షూరాతో మాట్లాడేప్పుడు మనిషే మారిపోయినట్లుండేవాడు నవ్వుతూ, పేలుతూ. వాళ్ళిద్దర్నీ విడదీయడం యెలా! 'ఇందులో షూరా తప్పూ లేదు. ఆ తప్పంతా నాదే. నేనేగా అతన్ని పెళ్ళిచేసుకుంది. చేసుకున్నవాళ్ళకి చేసు

కున్నంత; అనుభవించక తప్పదు' అని సమాధానం చెప్పుకునేది తనకు తాను.

'ప్రేమ లేకపోతేమాత్రమేం. ఉద్యోగం వుంది, స్నేహితులున్నారు, షూరా వుంది, వాళ్ళతో కాలంగడపొచ్చు. నాకోసమని షూరాని తండ్రికి దూరంచెయ్యడం యెందుకు. నిజమే, ఇవాన్ స్వార్థపరుడే, భయస్తుడే; దొంగ కాదుగా, తన కేమీ ద్రోహం చెయ్యలేదుగా. నే సిక్కడే వుంటే షూరా కే బాధా వుండదు' అని సరిపెట్టుకోవా లనుకునేది ఎలీనా.

డిమిత్రీతో స్నేహమయ్యాక భర్త సంగతి ఏమంత పట్టించుకో లేదు. డిమిత్రీ రావడం మానేసేంతర్వాత, తన భావా లేమిటో ఇదమిద్ధమని నిర్ణయించుకోలేక బాధపడింది; ఆ బాధలోనూ భర్త సంగతి పట్టించుకోలేదు. బయటికి ఆ మార్పు లేమీం కన్పించలేదు; రోజూ భర్త యింటికిరాగానే టీ యిచ్చి ఫాక్టరీ సంగతు లేమిటని అడుగుతూనే వుండేది. ఇక తన బ్రతుకంతా షూరాకోసమూ, స్కూలుకోసమేనని నమ్మిందికూడానూ.

ఇవ్వాళ, క్లబ్బులో మీటింగైపోయినతర్వాత, తెలిసొచ్చింది తన హృదయం డిమిత్రీ కెప్పుడో అర్పితమైపోయిందని. ఆ సంగతి తెలిసేప్పటికి, తానే నిర్ఘాంతపోయింది. ఏమిటో వళ్లంతా చీమలూ జెర్రులూ ప్రాకుతూన్నట్లుంది: ఇవాన్ ఆ టీ తాగడం యెప్పుడు పూర్తౌతుందా అని చూస్తూ కూర్చుంది.

టీ త్రాగుతూ, పేపరు చదువుకుంటున్న వాడల్లా పేపరు మూసి ప్రక్కన పెట్టి "నీకు డిమిత్రీ వుపన్యాసం నచ్చలేదన్నా వెందుకని? నాకు చాలా బాగా వుందని పించిందే. ఆ పుస్తకం నేను చదవలేదనుకో, సోవియెట్ కుటుంబాన్ని గురించి అత నన్న మాటలు బాగానే వున్నాయి. అందులో సందేహ మేమీ లేదు" అన్నాడు ఇవాన్.

నిండుకుండలాగా జవాబు చెప్పింది ఎలీనా: "అసలు నేనతను చెప్పిందంతా సరిగ్గా వింటేగా. క్లబ్బుకు రానని చెవితే విన్నారూ

మీారు. ఆ యేడోక్లాసు పిల్లలగోడవే తెవఁలక యేడుస్తున్నా నేను. ఇంకా చెప్పాల్సిన పాఠాలు బోలెడున్నై; చెప్పిందికూడా చదవలేక కొందరుపిల్లలు వెనకబడిపోతున్నారు. ఆ టీ తాగడఁవయ్యిందా; నే నెళ్ళి షూరా పని చూస్తాను".

షూరా నిద్రపోతోంది, కప్పుకున్న దుప్పటి ప్రక్కకి త్రోసేసి. దుప్పటి తీసి షూరాకి కప్పింది ఎలీనా; ప్రక్కనే కూర్చునేప్పటికి కండ్లంట నీళ్లు గిర్రున తిరిగినై. షూరాక్కూడా యీ కష్టాలు తప్పవా? 'మగపిల్లడైతే ఆదారి వేరు: నే నంటే ఫర్వాలేదు. స్కూలున్నది. స్కూల్లో పిల్లలున్నారు. ఐనా నీకే యీ కష్టాలు తెలిస్తేనా...ప్రతిరోజూ ఒక గణ్డంగా వుందిగదా...చిట్టితల్లీ, నా బంగారుతల్లీ యేంచేద్దాఁవమ్మా మనం? నా కేవీఁ అర్థంగావడం లేదమ్మా. ఏవీఁ తోచడంలేదమ్మా...ఏవీఁ...'

# 3

పాఠకుల సభకి ముసలి స్కూలుమాస్టరు, పుఖోవ్ కుటుంబంలో వాళ్ళెవళ్ళూ వెళ్ళలేదు; ఐనా, ఆరోజు గుర్తుంచుకోదగ్గ రోజే వాళ్ళందరికీనీ. సోన్యా ఆ సభకి వెళ్లాలనే అనుకుందిగాని, అది వాళ్ళ నాన్న పుట్టినరోజైపోయింది; సోన్యా పుఖోవ్ కూతురు. పుఖోవ్‌కిది అరవైనాలుగో జన్మదినం. ఆరు నూరైనాసరే, నూరారైనాసరే, ఆవేళ విందిచ్చి తీరాలిసిందే నన్నది నాదెజా. నాదెజా పుఖోవ్ భార్య. అంతకుముందు మూడు రోజుల్నుంచీ నాదెజా గొణుగుడు వినీ, వినీ విసుగెత్తిపోయింది పుఖోవ్‌కి – పిండి దొరకడంలేదు; ఊళ్ళో ఏ షాపులోనూ కోడన్నదిగూడా దొరకడం లేదు; చివరికి కోడిగుడ్డు కంటిలో కలికానికి కావాలన్నా దొరకడం లేదు పనిగట్టుకుని మాయమైపోయినట్టు.

పుఖోవ్ నవ్వుకున్నాడు: ఈ ముసలిదే అంత, యింట్లో కలికానికికూడా యేమీలేవని అంటూనేవుంటుంది, చివరికి విందు రోజు వచ్చేప్పటికి వచ్చినవాళ్ళ పొట్టలు పూర్తైపోతాయి.

తన పిన్నమ్మ కూతుర్నీ, చెల్లెలి భర్తనీ పిలవకపోతే కుదరదన్నది నాదెజా; వాళ్లు తనవైపు బంధువులు. చెల్లెలి భర్తకూడా పుఖోవ్‌కున్న వయసే వుంటుంది. హెడ్మాస్టరుగా పనిచేశాడు. ప్రస్తుతం పెన్షన్ పుచ్చుకుంటున్నాడు.

పుఖోవ్ వద్దులెమ్మన్నాడు; సోన్యా స్నేహితుల్నీ, ఒలోద్యా స్నేహితుల్నీ పిలుద్దామన్నాడు. "వాళ్లు హుషారుగా మాట్లాడుకుంటూంటే చూడాలనుంది" అన్నాడు.

అవడానికి నలుగురితోనూ కలిసి మెలిసి తిరిగే మనిషే పుఖోవ్. అతనికి బ్రెయ్నిన్ అన్నా, మాజీ హెడ్మాస్టరన్నా వాళ్ళతో కూర్చుని మాట్లాడడమన్నా యిష్టమే. నాదెజా పిన్నమ్మ కూతురు

వస్తే ఒక పట్టాన వదలదు; గంటలతరబడీ కూర్చుని మాట్లాడుతుంది తన అనారోగ్యాన్నిగురించీ, తాను చేస్తున్న ఒంద్రుమట్టి స్నానాన్నిగురించీనీ; అదంతా యిష్టంగానే వింటూ కూర్చునేవాడు పుఖోవ్. అప్పుడప్పుడూ వెళ్ళి ఎగోరోవ్‌తో కూర్చుని మాట్లాడి వచ్చేవాడు. ఎగోరోవ్ భార్య యీమధ్యనే పోయింది. వెళ్ళి కాస్సేపు ఓదార్చి, యంత్రాన్నిగురించో, ఐసెన్‌హోవర్ ఉపన్యాసాన్నిగురించో, ఎగోరోవ్ కూతురు సంగీతప్పాఠాన్ని గురించో మాట్లాడి వస్తూండేవాడు. ఇదంతా పుఖోవ్‌కి బాగానే వుండేది; కాని పడుచువాళ్ళతో కూర్చుని మాట్లాడడమంటే యింతకంటే హుషారుగానూ, సరదాగానూ, సంతృప్తిగానూ వుండేది; ఇంకా ఆయనలో యువకుల్లో వుండే స్ఫూర్తి వున్నదేమో తెలియదు; లేకపోతే ముప్ఫయ్యేళ్ళ పైచిల్లరదాకా టీచర్‌గా పనిజెయ్యడం మూలాన యువతాలోకాన్ని క్రిందనుంచి పైదాకా - అంతా - అర్థం చేసుకున్నాడేమో - పరీక్షలంటే పుట్టేభయం, ప్రథమ ప్రేమానుభవం తెచ్చిపెట్టే చిక్కులు, పేరుకోసం కనే కలలు, ఇవన్నీ ఆయనకు తెలిసినవే.

ఒంటరిగా వున్నాననే భావం పుఖోవ్‌కి అప్పుడప్పుడూ కలిగేదేకాని, అదిగూడా కుటుంబ సరిహద్దుల్లో వున్నప్పుడే; బయటికెళ్ళినప్పుడుగాదు.

ముప్ఫై సంవత్సరాలు హాయిగా కాపురం జేశాడు. వయసులో వున్నప్పుడు ఆవిడగూడా పంతులమ్మ పనే చేస్తుండేది. మొట్టమొదటి సంతానం, ఒలోద్యా, 1920 లో పుట్టాడు. ఆ యేడే కరువుగూడా వచ్చింది. భర్తకి చూపించుదామని నాదెజా ఆ పసిగుడ్డు నెత్తుకుని భర్తవుండే హెడ్‌క్వార్టర్స్‌దగ్గర కెళ్ళింది; గేటులో వుండే సెంట్రీ ఆవిణ్ణాపి "ఇదిగో పిల్లా జాగ్రత్త కిందపడేసేవ్" అన్నాడు. సన్నగా బక్కపల్చగా నాదెజా అప్పుడు చిన్నపిల్లలాగానే వుండేది. తర్వాతొక సంవత్సరానికి ఇంకోకూతురు కలిగింది కాని నెల తిరక్కముందే చనిపోయిందా బిడ్డ. నాదెజాకి బాగా

జబ్బుచేసింది; ఆపరేషన్ రెండుసార్లు చెయ్యాల్సొచ్చింది. తర్వాత పుఖోవ్ స్కూలుమాష్ట రయ్యాడు. నాదెజా గృహిణి కార్య క్రమంలో పడిపోయింది. సోన్యా కడుపున పడేప్పటికే, అంతకు పూర్వం చిన్నపిల్లలాగా వున్నప్పుడు కన్నకలలన్నీ నాదెజా మరచి పోయింది—ఆ రోజుల్లో వ్రాసుకున్న డయరీ, చదివిన పుస్తకాలూ. మనిషిప్పుడు లావెక్కింది, నున్నబడింది. చిన్నప్పటి సంగతులు తలుచుకుంటే యిప్పుడావిడికి ఆశ్చర్యంవేస్తుంది: ఆ సైనికుల మీటింగుల్లో ఉపన్యాసాలిచ్చిందీ, కడుపుతూన్నా లక్ష్యపెట్టకుండా గుర్రం మీద స్వారిజేసిందీ, కరపత్రాలువెయ్యడ లోనూ, పంచడంలోనూ భర్తకు సాయంజేసిందీ యింకెవరో ననిపిస్తుంది. అదంతా యేదో పూర్వచరిత్ర అనిపిస్తుంది! ఇప్పుడావిడ ప్రపంచమే వేరు. ఇప్పుడా ప్రపంచం పరిధి తక్కువ, అనుబంధం యెక్కువ.

పుఖోవ్ జబ్బుపడ్డప్పుడు, అతని ప్రాణాన్ని కాపాడ్డమే తన జీవిత పరమావధి అనుకుంది నాదెజా. డాక్టర్లు చెప్పినమాట విన డనీ, ఒక పథ్యమూ, పాడూ చెయ్యడంలేదనీ, మరీ చిన్నపిల్లాడిలా ఐపోతున్నాడనీ, ఆ జబ్బెంత ప్రమాదమోగూడా తెలియనట్లు ప్రవర్తిస్తున్నాడనీ కనపడ్డవాళ్ళకల్లా చెప్పేది. న్యాయానికికయెంతో కాలం బ్రతకనని పుఖోవ్‌కి తెలుసు; అంచేత రోగిష్ఠిలా మంచం మీద పడుకోవడమంటే తలనొప్పివేసేది – 'ఈ జబ్బు కిప్పుడు లొంగామా ఏక్‌దమ్మున ఎంజినాగిపోతుంది' అనుకునేవాడు.

బాగుపడ్డాననీ, ఇక మళ్ళీ తనపని తాను చేసుకుంటాననీ అన్నాడు పుఖోవ్ ఒకనాడు ప్రొద్దున్నే లేచి; వాళ్ళిద్దరి పెళ్ళి అయిం తర్వాత యింతవర కెప్పుడూరానంత కోపంవచ్చింది నాదెజాకి. కేక లేసింది, యేడ్చింది, డాక్టర్ల దగ్గరికి పరుగెత్తింది. "నిజమే, మంచం మీద పడుకుని కదలకుండా, మెదలకుండా వుండడమే మంచిదనుకో, నే నాయనకి చెప్పిందికూడా అదే. నీ కింకోకమాట చెప్పనా, ఒక్కొక్కసారి డాక్టర్లకంటే రోగంవిషయం రోగులకే యెక్కువ తెలుస్తుంది. పని చెయ్యకపోతే, అసలే బ్రతకలేనన్నాడు నాతో.

నేనే నువ్వైతేనా, నోరెత్తేదాన్నిగాదు; ఆయనిష్టంవచ్చినట్టు చెయ్యనిచ్చేదాన్ని" అన్నది డాక్టర్ వీరా. నాదెజా వూరుకోలేదు. హెడ్మాస్టర్ దగ్గరికెళ్ళింది, పట్టణకమిటీ కార్యదర్శి దగ్గరకెళ్ళింది; పుఖోవ్ పనికెళ్ళలేదు.

పుఖోవ్ వూరికే చేతులు ముడుచుకునీ కూర్చోలేదు. ఇదివరకు తనదగ్గర చదువుకున్న పిల్లల్లో కొందరికి దగ్గరితీశాడు. వాళ్ళతండ్రులు రెండో ప్రపంచయుద్ధంలో మరణించారు; పరిస్థితులు గూడా గడ్డుగా వున్నాయి. ఆ పిల్లల్తో కూర్చుని, వాళ్ళకిచ్చిన హోమ్‌వర్క్ (యింటిదగ్గర చేసేందుకుఇచ్చినపని) చెయ్యడానికి సాయపడుతుండేవాడు. కూర్చుని పాతజీవితం నెమరేసుకుంటూ, విప్లవం ఎందుకు, యెట్లా ప్రారంభమైందో, తానొకసారి లెనిన్‌ని యెలా చూడగలిగాడో, చివరికి విప్లవ వ్యతిరేకులెలా ఓడిపోయారో, ఒకటేమిటి అన్నీ చెప్పేవాడు వాళ్ళకి.

రోజు రోజుకూ పుఖోవ్ చిక్కిపోతున్నాడనీ, బలహీనుడౌతున్నాడనీ నాదెజా కనిపెట్టింది. "ఒకనాడు కాకపోతే ఒకనాడైనా యీ గాలి తిరుగుడుమాని మంచంమీద పడుకోగూడదూ" అని వేడుకునేది కళ్ళనీళ్ళతో. పుఖోవ్‌కి ఆవిడమాటలు వింటే కోపంవచ్చేదికాదు; తనమీదున్న ప్రేమమూలాన్నే ఆవిడలా మాట్లాడుతూందని తెలుసతనికి. అంచేతనే, గుండెనొప్పితో బాధ పడేప్పుడుగూడా, ఆ బాధ బైటకి తెలీనీకుండా, ఆవిడ చూస్తూందనుకున్నప్పుడల్లా చిరునవ్వు నవ్వుతుండేవాడు.

చిన్నప్పటినుంచీ ఒలోడ్యా - కొడుకు - అంటే నాదెజాకి చాలా యిష్టం; చక్కగా వుండేవాడు చిలిపిచూపులు చూస్తూనూ. "పైకంత బుద్ధిమంతుడికిమల్లే వుంటాడుగాని, యెంత కాల్చుకు తింటాడని" అంటూ చెప్పేది గొప్పగా యిరుగు పొరుగువాళ్ళతో. తుంటరి పనులు చేసేవాడుకాదు, తన యీడు పిల్లల్తో పోట్లాడేవాడు కాదు, కాని వాళ్ళ నాన్నంటేమాత్రం యెప్పుడూ గౌరవంగా మాట్లాడిన పాపానపోలేదు ఒలోడ్యా; వొదిగున్నట్టే వుండేవాడు, మర్యాదగా

నవ్వుతున్నట్టే వుండేవాడు, "ముసలాయన" అనేసేవాడు. క్లాసు పిల్లల్ని యేడిపించేవాడు; ఆడపిల్లలమీద వెక్కిరిస్తూ పాటలు పాడేవాడు; యెవ్వరూ లేనప్పుడు చూచి, పంతుళ్ళని వెక్కిరిస్తూ బ్లాక్ బోర్డుమీద బొమ్మలు గీసేవాడు. వాళ్ళనీ, వీళ్ళనీ వెక్కిరిస్తూ కాపీ పుస్తకాలమీద వేసిన బొమ్మలు యింటికొచ్చి తల్లికి చూపించేవాడు. ఆవిడ సంతోషం పట్టలేకపోయేది; 'నిజంగానే నా బిడ్డ పెద్దవాడై బొమ్మలు రాస్తాడేమో' అనుకునేది.

చిత్రలేఖనం నేర్చుకునేందుకని మాస్కో వెళ్లాడు ఒలోడ్యా. సెలవుల్లో యింటికొచ్చినప్పుడు కూర్చుని తల్లితో అదేపనిగా కబుర్లు చెప్పేవాడు: తన ఉపాధ్యాయుల్ని వెక్కిరిస్తూ, 'రెడ్ పాపి' అనే హోటల్లో కలుసుకున్న ఆడవాళ్ళని గురించీ, తన స్నేహితురాళ్ళ గురించీ' అన్ని అనుభవాలూ తీరిన ఆరిందాలాగా మాట్లాడేవాడు తల్లితో. ఆవిడ కామాటలు వింటూంటే భయమేసేది. "కాస్త అబ్బాయితో మాట్లాడరాదండీ; పాడుసావాసంలో, పడిపోతాడో, ఏమో" అనేది భర్తతో. పుఖోవ్ నిట్టూర్చేవాడు; తాను చెయ్యగలిగినదంతా చేశాడు - అదికాదనిచెప్పి చూశాడు, తప్పురా నాయనా అని చెప్పాడు, కోపంవచ్చి నాలుగు తిట్టాడు కూడాను. లాభంలేకపోయింది; కర్మట్లావుంటే తనేం జేస్తాడు. "ఎంత చెడిపోయిన కుర్రాళ్ళనైనాసరే, పుఖోవ్ చిటికెలోకి మార్చేస్తాడు" అనేవాళ్లు అందరూ. కొడుకుదగ్గరమాత్రం అవి కానీ గూడా కొరగాకుండా పోయాయి. తండ్రిచెప్పిన మాటకాదని చచ్చినా అనేవాడుకాదుకొడుకు; చెప్పిందంతా విని, చివరికి ఆయన వంకొకసారి తేరిపార జూచి, కళ్లు చికిలించేవాడు. తన మాటలంటే కొడుక్కి విలువలేదనీ, తన్నుచూచి నవ్వుతున్నాడనీ యిట్టే అర్థమైపొయ్యేది పుఖోవ్ కి.

చిత్రకళాశాలలో అధ్యయనం పూర్తికాగానే 'సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో విందు' అని ఒక పెద్దచిత్రం గీశాడు ఒలోడ్యా. ఆచిత్రాన్నందరూ ప్రశంసించారు; మాస్కోలోనేవుండి పనిచేసేందు

కొక స్టుడియోగూడా యిచ్చారతనికి. అప్పటినుంచీ అప్పుడప్పుడూ తల్లికి డబ్బుపంపుతూండేవాడు; త్వరలోనే పెళ్ళిచేసుకోబోతున్నానని ఒకసారి ఉత్తరంగూడా వ్రాశాడు. కాని తర్వాత అతను పెళ్ళి చేసుకోదలచుకున్న అమ్మాయి ఒక ఫిల్మ్ ప్రొడ్యూసర్‌ని పెళ్ళిచేసుకుంది. ఒలోడ్యాకి కోపంవచ్చింది. తర్వాత తనుగీసిన 'కర్మాగారంలో సభ' అనే చిత్రానికి బహుమతి రాకపోయేప్పటికి మరీ కోపం వచ్చింది. ఆ వళ్లుతెలియని కోపంలోనే ఒకసారి, చిత్రకారులందరూ కలిసి చేసుకున్న మహాసభలో, నోటికొచ్చినట్లల్లా మాట్లాడాడు ఒలోడ్యా; అందరూ గౌరవించే చిత్రకారులకి అసలేమీ తెలియనే తెలియదన్నాడు; బహుమతులు పొందినవాళ్ళు బహుమతుల కర్హులు కారన్నాడు. మాస్కోలో అతనికొక స్టుడియో పొరపాటున యివ్వడం జరిగిందనిచెప్పి, ఆయేడు బహూకృతి పొందిన మరో చిత్రకారుడికి ఆ స్టుడియో అప్పగించారు. అలాగే, అందరి మన్ననలకీ పాత్రుడైన ఉక్కు కర్మాగారంలోని కార్మికుడి చిత్రం గీయాలని అంతకుపూర్వంయిచ్చిన బాధ్యతనిగూడా ఉపసంహరించుకున్నారు కారణం చెప్పకుండానే. ఇంత జరిగింతర్వాతకాని ఒలోడ్యాకి తెలిసిరాలేదు యిదంతా తానానాటి సభలో పేల్చిన పేలుడు ఫలితమేనని. చేసినతప్పు సరిదిద్దుకోవడం ప్రారంభించాడు; తా నవమానించిన చిత్రకారుల్ని ప్రశంసించాడు, తానుగీసిన చిత్రాల్ని తానే ఖండించుకున్నాడు. తా నొట్టి అసమర్థుణ్ణని అంగీకరించాడు. ఉన్నట్టుండి, చివరికొకనాడు, రాష్ట్రాల్లోకి వెళ్లి పారిశ్రామిక కేంద్రాల్లో దైనందిన జీవితాన్నిచూచి అనుభవం సంపాదించుకోబోతున్నాననిచెప్పి, మాస్కోలో రైలెక్కాడు.

చివరికెలాగైతేనేం యింటికి చేరుకున్నాడు. మాస్కోలో జరిగినగొడవ యెవరికీ చెప్పలేదు సరిగదా, తనను ఒక ముఖ్యమైన పనిమీద యిక్కడికి పంపించారనీ, ఒక గొప్పవిషయాన్ని గురించి పెద్ద చిత్రం వొకటి గీయబోతున్నాననీ తల్లికి చెప్పాడు.

ఆరుమాసాలు గడిచాయి. పట్టణంలోవున్న పత్రికా సంపాదకుడు, ఒలోద్యా గీసిన 'ఇద్దరు కార్మికులు' అనే చిత్రాన్ని చూశాడు. —"ఎంత గొప్పచిత్రం! పత్రిక చదువుతున్న ఆ కార్మికుల కళ్ళు చెప్పే భావాలలోతులు చూడండి! తప్పకుండా మా పత్రికలో ప్రచురిస్తాం; అసలీ బొమ్మమీదే ఒక వ్యాసంగూడా వేస్తాం" అన్నాడు, ఒలోద్యా పేరు స్టాలిన్ ప్రైజ్ కోసం సూచిస్తారనిగూడా చెప్పుకున్నారు. నాదెజా కొడుకుని మెచ్చుకుంది. పెదవి విరిచి, "నీకది బాగుందా? వొట్టి నాసిరకం బొమ్మ. మాస్కోలో వాళ్ళు యింతకంటే బాగా గీస్తారని కాదనుకో, యేమిటో, అసలా బొమ్మని గురించి ఆలోచించటమే అనవసరం" అన్నాడు ఒలోద్యా.

"చూశారూ, అబ్బాయి పెళ్ళిచేసుకో దలుచుకున్నమ్మాయంటే వాడికి పంచప్రాణాలూ ననుకుంటానండీ; అసలు వాడూరికే యిదౌతాడు ... అబ్బాయి గీసిన బొమ్మ చూశారా?" అని రహస్యంగా అడిగింది భర్తని నాదెజా. చెబుదామా, వద్దా అనుకుంటూనే "వాడి ఆలోచనలంటేనే గిట్టదు నాకు. నిన్నమొన్నటికి నిన్న వాడు సోన్యాతో యేదో పుస్తకాన్నిగురించి మాట్లాడుతూంటే విన్నా. ఆ పుస్తకంలో భావాలేమీ లేవు: బాగాలేదు అంటోంది సోన్యా. వీడేమన్నాడో తెలుసా. భావాలుంటే లాభమేంటి, నీ పీకమీదికి తెచ్చిపెడతాయన్నాడు. 'పుస్తకం చదివితే, అందులో మార్క్సిస్ట్ తత్వం వుండాలి. అదుంటే చాలు యింకేమీ ఉండక్కర్లా. ఈ రోజుల్లో భావాలకి డబ్బిచ్చే వాడెవ్వడు? తెలివిగలవాళ్ళకి భావాలేమీ వుండవ్; వొట్టి తలతిక్కవాళ్ళకే...' అన్నాడు. వాడదౌతున్నాడు, ఇదౌతున్నాడని అంటావుగాని వాడితనాన్ని చెడగొట్టకుండావుంటే చాలు. అదే పదివేలు. చిన్నప్పట్నుంచీ అంతే వాడు. వొట్టి సినిక్ ..." అనేశాడు పుసోవ్. మనిషి హృదయంలోనుంచి వచ్చిన మాటలేమో, పుసోవ్ వొళ్ళంతా గడగడ వణికిపోయిందా మాటలనేప్పుడు. నాదెజాకి

భయంవేసింది: "వూరుకోండిక. ప్రతిదానికీ అంత యిదౌతా రెందుకూ" అన్నది.

ఇదివరకటి లాగానే, యిప్పుడూ, ఒలోద్యా విషయంలో పుఖోవ్ పొరబడుతున్నా డనుకుంది నాదెజా; ఎప్పుడూ కుంతుకు - సోన్యా-నే సమర్థిస్తాడాయె. సోన్యా అంటే అతని కిష్టమైనమాట నిజమే ఐనా, యీమధ్య సోన్యాఅన్నా పుఖోవ్ కేమిటో దూరం దూరంగా వున్నట్లనిపిస్తోందని, పాపం నాదెజాకి తెలియదు. సోన్యాకి కూడా దూరమైపోవడాని క్కారణం తన తప్పే ననుకునే వాడు పుఖోవ్ - ఈ కొత్త తరంవాళ్ళని అర్థంచేసుకునే శక్తి తనలో లేదేమో; సోన్యా వయసులో తానెట్లా వున్నాడో, సోన్యా గూడా యిప్పు డట్లాగే వుండాలని తన ఉద్దేశం; ఔను మరి, పిల్లల భావాలు తండ్రులకెలా అర్థమౌతాయి. 'ఒలోద్యాసంటే విమర్శించ డానికి నాకు హక్కుంది; వాడొట్టి స్వార్థపరుడు. సంపాదనకోసమూ, పేరుకోసమూ యేమైనా చేస్తాడు. వాడీడువాళ్ళల్లోగూడా వాడంటే యిష్టంలేని వాళ్లు చాలామంది ఉంటారు. సోన్యాలో యేం లోపం వుందని? - ఏమీలేదు. అప్పుడప్పుడూ యెప్పుడైనా నేను సోన్యాని అర్థం చేసుకోలేక పోయానంటే, అందుక్కారణం బహుశా నేను పాత కాలపు మాటలు మాట్లాడ్తానేమో. ఐతే, మరి స్కూల్లో పిల్లల్తోగాని, సావ్ చెంకోతోగాని, ఎలీనాతోగాని మాట్లాడేప్పుడు నాకివేమీ అడ్డంరావే. ఎక్కడుందీలోపం? వ్యక్తుల్ని ఎంతెక్కువగా ప్రేమిస్తే అంతెక్కువ కష్టమేమో వాళ్ళనర్థం చేసుకోవడం.'

సోన్యా యెప్పుడూ చాలా గంభీరంగా వుంటుంది, యెంత వుత్సాహంవున్నా బయటికి కనపడనీదు, తన హృదయం విప్పి ఎవరితోనూ మాట్లాడదు. సావ్ చెంకో అంటే సోన్యాకి నిర[illegible]ం లేదని తలిదండ్రులకి తెలుసు. సావ్ చెంకో యువకుడు, [illegible]; సోన్యని చూడ్డానికి యింటికి గూడా వస్తుండేవాడు [illegible] అతనిగురించి సోన్యాతో మాట్లాడదామని చాలసార్లు ప్రయత్నిం చింది నాదెజా. "నిజమే, అతను మంచివాడే; నాకూ అతనికీ

పరిచయంగూడా బాగానేవుంది. అంతమట్టుకే...మీవూరికే అవీ యిదీ అనుకోబోకండి” అనేది సోన్యా, యేమీ పట్టనట్టు. సావ్ చెంకోని నాయెజా చాలా సాదరాహ్వానించింది భోజనానికి - సోన్యా పుట్టినరోజునొకసారి; ఒలోద్యా మాస్కోనుంచి వచ్చిన్నాడొక సారి. మిగతా అతిథుల్నందర్నీ చూచినట్లే చూచేది సోన్యాయితన్ని, అతనితో వొంటిగా, యేకాంతంగా వున్నప్పుడుమాత్రం ఆవిడలో యేదో మార్పొచ్చేది. ఆవిడముఖం కళకళలాడేది, కళ్ళల్లో చల్లదనం తొణికిసలాడేది. ఐదారు మాసాల్క్రితం వొకసారి యిద్దరూ కలిసి పట్టణం బయటికి షికారుకెళ్ళారు. రోడ్డుప్రక్కల చెట్లన్నీ పచ్చటి ఆకుల్తో కళకళలాడుతూవున్నై; కాని ఆ నిశ్శబ్దంలో యెక్కడో యేదో వేదన, విచారం దాక్కున్నట్లుంది. సోన్యా ఆగి, యేవో చేతికందిన పూలు కోసుకుంది; తర్వాత మళ్ళీ యిద్దరూ కలిసి ముందుకు నడిచారు యేమీ మాట్లాడుకోకుండా. రోడ్డుదిగి, కాలిదారిన చెట్లలోకి నడిచారు. అగస్మాత్తుగా సావ్ చెంకో రెండు చేతుల్తోనూ కౌగలించుకున్నాడు సోన్యాని. ఒక్క త్రుటికాలం తనని తాను మరచిపోయింది సోన్యా, అతన్ని ముద్దుపెట్టుకుంది, మరుక్షణంలోనే తెప్పరిల్లి రోడ్డువైపుకు నడిచింది. దారిలో, యిద్దరూ కలిసి యింటికొస్తూన్నప్పుడు “యింకా కొన్ని రోజులు ఆగడం మంచిది. ఫిబ్రవరిలోగాని తెలియదు నేనెక్కడికి వెళ్ళవలసిందీ... నువ్వొకచోటా నేనొకచోటా, వుంటే లాభమేమిటి... నన్ను పెళ్ళిచేసుకుని వంటింట్లో వుంచుదామని చూస్తున్నావా? యిప్పుడిప్పుడే నీకు యిల్లెలాగూ దొరకదు, ఫాక్టరీ పై కెట్టను నీకివ్వనూ యివ్వరు; నువ్వొచ్చింది గూడా యీ మధ్యనాయె”అన్నది సోన్యా. సావ్ చెంకో కిదంతా వింటే పిచ్చెక్కినట్లయ్యింది; పెళ్ళి పోయ్యాక—యింత వెనకా, ముందూ ఆలోచిస్తుందే ఈ సోన్యా? అతను వెళ్ళిపోగానే, పక్కమీద పండుకుని, తలగడలో తలదూర్చి సోన్యా వెక్కి వెక్కి యేడ్చిందని అతని కేం తెలుసు? ‘మరీ తెలివి తక్కువగా మాట్లాడానా? మాట్లాడా ననుకుంటా. భవిష్యత్తుగురించి

ఆలోచించొద్దూ మరి! సామాన్యంగా మగవాళ్ళే ఆలోచిస్తారు యిలాంటి విషయాలు; కాని అతనికా కుర్రవాడు, నేనుగూడా మాట్లాడకపోతే యెట్లా. ఆ మాటలన్నీ వినాలంటే నాకూ అసహ్యంగానే వుంటుంది మరి! అతనికేమీ అర్థంగాదు, అతను లేనిదే నేను బ్రతకలేను' అని అనుకున్నదని అసలే తెలియదు.

వాళ్ళ నాన్నలాగానే ప్రతీదాన్ని గురించీ సంబంధం లేనట్టు వాదిస్తూందా? లేక, అలా మాట్లాడకపోతే 'ఆదర్శవాదమూ', 'తెలివితక్కువా' అనుకుంటారేమోనని నటిస్తూందా? అని ఆలోచించాడు సాష్ చెంకో. సాహిత్యం అంటే యెంతో అభిరుచి ఆవిడకి, ఐనా ఎంజినీరింగ్ చదువుకొంది - వాళ్ళ నాన్నకు కూడా అర్థం కాలేదు ఎంజినీరింగెందుకు తీసుకుందో. "అది చదివితే చాలా వుపయోగం; వెంటనే మంచి వుద్యోగం దొరుకుతుంది" అన్నదతనితో. చదువు ప్రారంభించిందో లేదో ఎలక్ట్రో-టెక్నిక్స్ అంటే సరదా పడింది, ఐనా, "ప్రస్తుతానికిదే అవసరం లే" అన్నది. కవిత్వం అంటే అందులోనూ బ్లాక్, లెర్మొంటోవ్‌ల కవిత్వం అంటే బాగా యిష్టం, పైకి వాళ్ళ నాన్నతో మాత్రం "కవంటే మయకొవస్కీయే కవి" అనేది. నాదెజా యింటి పనులు చేస్తుంటే యెప్పుడూ ఆవిడ చేతిలో పని అందుకునేది—తల్లిని చూచి విచారపడేది; తల్లికంటే తానే నయం, యిద్దరూ కలిసి షాపుకెళ్తే యెప్పుడూ తానే బేరంచేసి కావలసినవన్నీ కొనేది షాపులో, వున్న గుంపునందరినీ తప్పించుకుని, అందరికంటే ముందు. వాళ్ళ నాన్న అదేపనిగా పని చేస్తున్నాడని తల్లి విసుక్కుంటూంటే "యేదో వొకటి చెయ్యాలిగా అమ్మా, లేకపోతే నాన్నకి మాత్రం యేం తోస్తుంది" అని సర్ది చెప్పేది. మీషా బాగా చదువుతుందనో, సెన్యా లెక్కలు బాగా చేస్తుందనో తండ్రి చెబుతూంటే, 'నాన్నతో పోల్చుకుంటే నేనే పెద్దదాన్నన్నమాట' అనుకునేది తనలో తాను.

తండ్రి పుట్టినరోజున వెళ్ళి ఆయన్ని అభినందించింది సోన్యా, పుఖోవ్ చిరునవ్వు నవ్వాడు: "ఇందులో సంతోషించవలసిందేం

వుందమ్మా; యింతకాలం బ్రతికానన్నమాటేగాని చేసిందేవుంది?" సోన్యా నవ్వింది: "అదికాదు నాన్నా, నీకింతవయసొచ్చినట్లే అనిపించదు నాకు."

పుట్టినరోజు విందుకు అతిథులొచ్చారు; ఒలోద్యా స్నేహితులు; చిత్రకారుడు సబురోవ్, అతని భార్య, నాటకాల్లో నటించే ఆర్లోవా — ఆవిడ్నందరూ తానెచ్కా అనేవారు. సావ్ చెంకోని గూడా ఆహ్వానించింది నాదెజా; క్లబ్బులో మాట్లాడాలనీ, కాస్త ఆలస్యంగా వస్తాననీ చెప్పాడతను.

విందు జరుగుతుండగా, సబురోవ్‌ని వెక్కిరించి యేడిపించాలని చూశాడు ఒలోద్యా; సబురోవ్ తన అభిప్రాయమేమిటో చెప్పేశాడు గాని నెమ్మదిగా, గొణుక్కుంటూ మాట్లాడాడేమో యెవరికీ అతను చెప్పిన ముక్క వొక్కటీ అర్థంకాలేదు.

చిన్నప్పుడు సబురోవ్, ఒలోద్యా ఒక స్కూల్లోనే చదువుకున్నారు; స్నేహితులు గూడాను. పెద్దవాళ్ళయ్యాక; యెవరిదారి వారిదయింది. ఒలోద్యా యెప్పుడూ కీర్తిగురించీ, డబ్బునుగురించీ కలలు కనేవాడు, యేయే చిత్రకారులికి బహుమతులొచ్చాయో, యెవరెవరి చిత్రాల్ని విమర్శకులు తిట్టిపోశారో బాగా తెలుసును అతనికి. సబురోవ్ వేరు: అతని గొడవేమిటో అతనిది: ఎప్పుడూ ప్రకృతి దృశ్యాల్ని చిత్రీకరిస్తూ వుండేవాడు. అతనికి జీవితంలో రెండే రెండు ముఖ్యం: ఒకటి చిత్రాలు; రెండు తనభార్య గ్లాషా. గ్లాషాకి యెప్పుడూ యేదోవొక జబ్బు. ఏదో అచ్చు ఆఫీసులో ప్రూఫ్‌రీడర్ పని గ్లాషాకి. ఆవిడ తెచ్చే ఆ చిన్న జీతంలోనే గడుపుకోవాలి యిద్దరూ; చాలీ కాదు, అంతా హస్తాహస్తమే. నాదెజా పళ్ళెంలో పెట్టేవన్నీ ఆవురావురుమంటూ సబురోవ్ తినటం చూస్తేనే చాలు వాళ్ళ బ్రతుకెంత గడ్డుగా గడుస్తూందో తెలుసుకునేందుకు. అంతే తన సర్వస్వం అన్నట్లు చూస్తుంది గ్లాషా యెప్పుడూ అతనివంక. ప్రకృతి చిత్రాలతో పాటు పెళ్ళైన తర్వాత భార్య చిత్రాలుగూడా గీశాడు సబురోవ్. ఆ బొమ్మల్లో గ్లాషా అందంగావుండేది కాదు

గాని, యేదో అనిర్వచనీయమైన ఆకర్షణమాత్రం కన్పించేది ఆ బొమ్మల్లో. సబురోవ్ చాలా చక్కని చిత్రకారుడనీ - బహుశా మిగతావాళ్ళకంటే చాలా మెరుగేనేమోననీ, కాని అతనికి స్ఫూర్తి లూజనీ, చెప్పేవాడు ఒలోడ్యా తలిదండ్రుల్తో: "అంతేకాని యిప్పుడేం గీస్తే లాభంవో అతనికి తెలియదు; లాభ లేదు, పైకిరాలేదు" అనేవాడు చివరికి.

"ఇంకా యీ తరాన్ని జయించాలనే కలలు కంటున్నావా" అని కదిలించాడు విందు జరుగుతూండగా.

రాఫేల్‌ని గురించీ, వర్ణజ్ఞానాన్ని గురించీ, చిత్రరచనని గురించీ యేదో వుద్రేకంగా గొణిగాడు సబురోవ్. ఇంతలో "పళ్ళెంలో యేరిపోతున్నై; తిన్నాయనా" అన్నది నాదెజా.

సావ్‌చెంకో కోసమని ఛాంపెన్ చివరిదాకా అట్టేపెట్టింది నాదెజా. సావ్‌చెంకో వచ్చి రావడంతోనే సోన్యా యెక్కడుందోనని దొంగచూపులు చూశాడు. ఏదో నాటకాన్ని గురించి తానే చ్కాత్తో మాట్లాడుతోంది సోన్యా; కన్నెత్తిగూడా అతని వంక చూళ్ళేదు.

"మీాటెం గెలావుంది" అనడిగాడు పుఖోవ.

"డిమిట్రీ వుపన్యాసంవింటే నా కాశ్చర్యం వేసింది" అన్నాడు సావ్‌చెంకో. "డిమిట్రీ తెలివితేటలు గలవాడూ, బాగా గ్రహించ గలవాడూ అనుకున్నాను. అతనుగూడా రూళ్ళకర్ర సిద్ధాంతాలే వల్లించాడు. నవల చదివారా మీారు?"

"ఉహుం, చదవలేదు" అని నిట్టూర్చాడు పుఖోవ్. "నాకంత తైంవేది? బాగానే వుందన్నారే."

"మంచో, చెడ్డో నాకు తెలియదు, కాని ఆలోచింపచేట్టు చేస్తుంది. అందులో ప్రేమను గురించిగూడా వుంది; యెవరికీ సుఖం లేని ప్రేమ...అదే డిమిట్రీకి నచ్చలేదు. వ్యక్తిగత విషయాలు నవల్లోకి తేగూడదట— హృదయాల్లోకి దూరి శస్త్రచికిత్స పరీక్ష చెయ్యడం వెందుకూ!' అంటాడు. ఈ మాటలే గ్రెయ్నిన్ అంటే

నే నేదంత విస్తుపోయ్యేవాణ్ణి కాదు. డిమిత్రీ గూడా చిలకపలుకులే పలుకుతాడనుకోలేదు నేను."

ఒలోడ్యా సకిలించాడు: "తెలివి గలవాడు కదూ; లోప లున్నది చెప్పడం ఎందుకనుకున్నాడేమో!"

పుగోవ్‌కి కోపం వచ్చింది: "అందరూ నీకుమల్లేనే వుండరు లేవోయ్; డిమిత్రీ ఖచ్చితమైన మనిషి, అది తెలియదేమో నీకు."

కాస్సేపెవరూ మాట్లాడలేదు - పుగోవ్ సాధారణంగా అంత కటువుగా మాట్లాడడు. తర్వాత,

"నేను డిమిత్రీకంటే ముందే మాట్లాడవలసొచ్చింది; అతని తర్వాత ఛాన్సు నాకొస్తే వుండేది తమాషా. అతని తర్వాత మాట్లాడినావిడ బాగానే జవాబు చెప్పిందనుకోండి. ఏమాట కామాటే చెప్పాలి; అందరూ మనసువిప్పే మాట్లాడారు... ఈ మధ్య పుగోవ్ యిలాంటి మీటింగుల కెళ్ళడం లేదనుకుంటాను... అసలే నవలే కొత్తారకం విషయాన్నెత్తుకుంది - మనం మన వ్యక్తి గత జీవితాల్లో చేసేదొకటీ, బయటికి చెప్పే దొకటీ. అలాంటి పుస్తకాలు కావాలని అందరికీ వుంది" అని తిరిగి సంభాషణ ప్రారంభించాడు స్కాచెంకో.

ఇంతలో తానెచ్కా అందుకొంది: "నాటకాలుమట్టుకు నాటకాలూ అంతే... ఈ మధ్య మూడు కొత్త నాటకా లొచ్చాయి... అన్నీ ఒకటే సజ్జు... ఒక్కటీ ఆడదగ్గది లేదు... అసలు కళంటే ..."

"అసలు విషయం అదీ" అన్నాడు సబురోవ్. "మీరు చెప్పింది అక్షరాలా నిజం. కళ నేదొకటుందని యిదివరకెప్పుడో గుర్తించాల్సింది మనం. నువ్వు లక్ష చెప్పు, ఒలోడ్యా, నేన్నిట్లో వాదించలేనుకాని, రాఫేల్ చిత్రాలతో, కలర్ ఫోటోగ్రఫీ నెలా పోల్చగలం? నక్కెక్కడ, నాగలోకం ఎక్కడ?"

ఒలోడ్యా నవ్వాడు: "సరేనయ్యా, మీ రాఫేల్ మా చిత్ర కారుల సంఘంలో చేరడానిక్కూడా పనికిరాడు. ఎప్పుడో యింకో

యాభై సంవత్సరాలతర్వాత పనికొస్తాయని మేం నీలాగా చిత్రాలు వెయ్యలేం బాబూ; అదట్లావుంచు నీ చిత్రాలకా యాభై సంవత్సరాల తర్వాతైనా గౌరవం వస్తుందని నే నేమీ హామీ యివ్వడం లేదు" అన్నాడు.

"అలా అనబోకండి ఒలోద్యా, ఈయన నీమధ్య గీసిన చిత్రం చూడలేదు మీరు – ఎంత గొప్పగా వుందని" అంటూ గొణిగింది గ్లాషా.

"అది సరే, డిమిత్రీ అట్లా యెందుకుమాట్లాడేడో ఇంతవరకర్థంగావడంలేదు నాకు. నేనాయన్తో పనిజెయ్యడం మొదలెట్టి దగ్గర దగ్గర యేడాది కావస్తూంది; చాలా సిన్సియరైన మనిషి, ప్రతిమాటలోనూ కన్పిస్తుందా సంగతి. అలాంటిమనిషి జుబ్జోవ మీదవిరుచుకుపడ్డాడెందుకు?" అనడిగాడు మళ్ళీ సావ్చెంకో.

ఈసారి సోన్యా జవాబు చెప్పింది: "నేనూ చదివా ఆనవల; డిమిత్రీ చెప్పింది కరెక్టే. సోవియెట్ మనిషి, ప్రకృతి మీద విజయం సాధిస్తే చాలదు; తన భావాల్నిగూడా అదుపులో పెట్టుకోవాలి; తనలో రేగే భావాల్నిగూడా జయించగలగాలి. జుబ్జోవ ప్రేమ గుడ్డిదనే చెప్పొచ్చునుగూడా. నవ లన్నతర్వాత పాఠకుడికి కొత్త విషయాలు నేర్పాలిగాని, గందరగోళపెట్టగూడదు."

సోన్యాకి జవాబు చెప్పాలన్న హడావుడిలో, ముందున్న గ్లాసు తన చేతికి తగిలి పడిపోయిందనిగూడా గమనించలేదు సావ్చెంకో: "జుబ్జోవ్ ప్రేమ గుడ్డిది కాదు; గొప్పది... అది చాలా గొప్పప్రేమ... అన్నిటినీ మూసలో పోసి అచ్చుగుద్దినట్టు నీటుగా బయటికి తియ్యడం కాదు......" అన్నాడు.

ఇదంతా చూస్తున్న నాదెజా 'సోన్యాని ప్రేమిస్తున్నాడు సావ్చెంకో. అందుకేమీ సందేహం లేదు; ఆమేమో పట్టనట్టూరుకుంటుంది. ఎవరిపోలికలొచ్చినై దీనికి? నాపోలికాదు, వాళ్ళ నాన్నవీ కాదు ...' అనుకుంది.

అందరూ ఛాంపేన్ తాగుతున్నారేమో- ఒకళ్ళ మాటొకళ్లు వినకుండా, ఎవరిష్టంవొచ్చినట్లు వాళ్లు బిగ్గరగా మాట్లాడుతున్నారు. 'వర్ణాల్లో విచిత్రం యేవిటంటే' అంటూ అరుస్తున్నాడు సబురోవ్, 'ప్రేమంటే ప్రేమే, నువ్వొప్పుకున్నా అంతే, వొప్పుకోకపోయినా అంతే' అంటోంది తానెచ్కా- లేచి నిలబడి; ఆవిడన్న మాటల్లా అంటూ ప్రేమ నభినయించాడు ఒలోడ్యా.

నాలు గడుగులువేసి, కిటికీదగ్గర కెళ్ళి బయటికి చూశాడు పునరోవ్; బయట మంచు తెల్లగా మెరుస్తోంది. 'సోన్యా సంగతి అంతుపట్టకుండా వుండేది; సాష్ చెంకోవి యేడిపించడాని కందేమోలే అంటే అదీకాదు, అతను లేనప్పుడూ అట్లాగే మాట్లాడుతుంది. ఆ దృష్టితో చూస్తే, సోన్యా చెప్పేదీ నిజమేనేమో. జౌనంటానికీ, కాదనేందుకూ, నే నెవర్ని? వృద్ధాప్యం వచ్చిపడి ది' అనుకున్నాడు.

ఎవరి గొడవలో వాళ్లుండడం చూచి, ఎవరికీ తెలియకుండా, నెమ్మదిగా తనగదిలోకి జారుకుంది సోన్యా. లైటు వెలిగించకుండానే వెళ్ళి మంచం మీద కూర్చుంది. ఒక్కనిమిషంసేపైనాసరే, ఒంటరిగా కూర్చోకపోతే బ్రదకలేననిపించింది. 'మరీ మతిపోయిందనుకుంటూ నాకు. నా ఎక అతను చూస్తే చాలు, అదేవిటో అంతా నటన ప్రారంభిస్తాను. నటనగూడా కాదు; అటు ఆలోచించనూలేను, ఇటు మాటాడనూలేను. ఛ, యిక నన్ను నేను కంట్రోలు చేసుకోవాలి. అందరితోనూ మాట్లాడినట్టుగానే, అతన్తోగూడా సహజంగానే మాట్లాడాలి యిక; లేకపోతేనా, నన్నూరికే అసహ్యించుకున్నా అసహ్యించుకుంటాడు. ఇవ్వాళగూడా నన్నవమానించాడు ప్రతీదాన్నీ మూసలోపోసి, అచ్చుగుద్దినట్టు, నీటుగా ... అంటూ. మరీ అధ్వాన్నంగా వుండేది! యితరుల్లాగా నేనుమాత్రం ఫీల్ కావడంలా - వాళ్ళకంటే యింకాస్త యెక్కువే ఫీలౌతా నామాట కొస్తే - కాని అట్లా ఫీల్ కావడమంటే తలనొప్పి నాకు, అసహ్యం; నిజంగానే ...'

సావ్ చెంకో గూడా గదిలోకొచ్చాడు. కన్ను పొడుచుకున్నా కనిపించడంలేదు; సోన్యాగూడా కన్పించలేదు. చేతుల్తో తడుము కుంటూ మంచందగ్గరికెళ్ళాడు. సోన్యాభుజం తగిలింది. కౌగలించు కుని ముద్దుపెట్టుకున్నాడు.

"మరిపోతారండా మరీనీ యెవరన్నా వస్తారేమో."

"ఈ ధోరణి ఆలోచనలు యెప్పటికి మానేస్తావే? నువ్వో గనక నిజంగా నన్ను ప్రేమిస్తుంటే..."

ఉన్నదున్నట్టు గబగబా లేచి, లైటువేసింది. అతనివంక తీవ్రంగా చూచింది: "సరే, తెలిసిందిగా నిన్ను ప్రేమించడంలేదని ఇంకెప్పుడూ మాట్లాడొద్దులే ఆ విషయం."

"అదికాదు సోన్యా, నా మాటను..."

"చెప్పిందిచాలు యిక బయటికెళ్దాం పద, యెవరన్నా చూడ గలరు...నాన్న బాధపడతారు గూడానేమో—ఇదాయన పుట్టిన రోజు గూడాను."

ఇంకాస్సేపటికి విందు పూర్తైపోయింది. సావ్ చెంకో యింటికి బయల్దేరాడు; సోన్యా పల్లెత్తి మాటాడనూలేదు; కన్నెత్తి చూడనూ లేదు.

సావ్ చెంకో విచారపడుతూ నడిచా డింటికి, మంచులో నాని ముద్ద ఐయిపొయ్యాడు. క్లబ్బునుంచి తొందరతొందరగా వచ్చే శాడు సోన్యా యింటికి యేదో ఆనందం, యేదో హాయీ, సౌఖ్యమూ దొరుకుందామని – పెద్ద ఫూల్‌లాగా. 'ఇరవయ్యేదే లొచ్చినైనాకు, నా యౌవనం ఐపోయింది. నేను ఉాహాగానం చేస్తా ననీ; ప్రతీదాన్నీ అతిశయోక్తిగా మాటుస్తాననీ, నా కాళ్ళమీద నేను నిలబడలేననీ – టూడు డిమిట్రీ. అతనన్నది పనేమన్నమాట. అతనకేదంతా నిజమేనేమో? ప్రేమకింత ప్రాముఖ్యం దేనికి? యిప్పట్నైతే వుద్యోగం వుంది; డిమిట్రీకి నేనంటే నమ్మకం గూడాను. ముందు యుండెన్నో పరీక్షలున్నై: నూతనశకానికి నాంది వ్రాస్తున్న రోజుల్లో బ్రతుకుతున్నాం. నాలాంటి యువకుడు 1941 లో వసంత

కాలాన్ని చూచి, విఫల ప్రేమని తలచుకుని విచారించుతాడని వూహించుకోగలం!? మళ్ళీ ఆ యువకుడే, కొన్నికాలంతర్వాత స్టాలిన్‌గ్రాడ్ పట్టణ రక్షణ బాధ్యతలు స్వీకరిస్తాడని అనుకోగలం? యేమో, ఒకటి జరిగితే, రెండోది జరగ్గూడదా మాత్రం యెక్కడుంది? మా బాబాయి యుద్ధంనుంచి తిరిగిరావడం నాకింకా గుర్తుంది. ఎప్పుడూ అదెట్లాచేస్తాం, యిదెట్లా నడుపుతాం అంటూ ప్రశ్నలువేసి వేధించుకు తినేవాణ్ణి; ఒకనాడొక యువతి ఫోటో చూపించి, "గ్రీషా నా ఆనందమంటే యేమిటో అర్థమైందోయ్ నాకు" అన్నాడు, ఆరుమాసాల తర్వాత యుద్ధంలో ప్రాణాలొదిలాడు. విడని ముడిలాంటిదీ జీవితం ... యెప్పుడూ సోన్యాని గురించేగదా నా ఆలోచనలు; బాబాయి గుర్తుకొచ్చింది గూడా సోన్యా మూలాన్నే; ఇప్పుడెళ్ళి ఆవిణ్ణి చూచేందుగ్గూడా వీల్లేదు నాకు. ఇంకెవరినైనా ప్రేమిస్తుందా? ప్రేమించానని చచ్చినా చెప్పదు; మహాభిమానం. నాకా అభిమానాలేవీ లేవు, ఎవరి ముందైనాసరే, చెప్పేందుకు సిద్ధమే — నేనూ నా ఆనందం యేమిటో తెలుసుకున్నాను; ఎక్కడున్నదో కనుక్కున్నాను; పోగొట్టుకున్నాను.

* * *

ఛాంపేన్ తాగడంవల్ల తలనొప్పి వచ్చిందని చెప్పింది సోన్యా తల్లితో. తెల్లవారే లేచి అన్నీ సర్దుతాననీ, యిప్పుడెళ్ళి పండుకుంటాననీ చెప్పింది.

బట్టలు మార్చుకోకుండానే వెళ్ళి పడుకుంది; సాషా చెంకోని గురించి ఆలోచించడం ప్రారంభించింది: 'నిజంగానే నాకు మతి పోయింది. అతని మతీ అంతే, పోయిందనుకుంటాను... యెప్పుడూ యిట్లాగే పోట్లాడుకుని విడిపోతుంటాం యెందుకని? అసలు మా యిద్దరి తత్వాలూ వొకటి కాదనుకుంటా; ప్రేమొక్కటుంటే చాలదు. నిష్కర్షంచేసుకోని మనిషి జీవితాన్ని పంచుకునేదెలా? ఇక నే నతన్నిగురించి ఆలోచించగూడదు. అతను మంచివాడు,

నిష్కపటి, నిక్కచ్చి మనిషి. అసలు సంగతి అదికూడా కాదు. నా కతనంటే ప్రేమే. ఐనా మనం మన ఆవేశాల్ని లోబరుచు కోవాలి. వీళ్లు నన్నిక్కడి నుంచెక్కడికైనా దూరంగా పంపించేస్తే బావుండును – ఏ యూరల్ పర్వతాలకో. ఏ సైబీరియాకో. అప్పుడీ సమస్యలన్నీ వుండవు; అంత మట్టుకు ఖాయం. ఇదీ ఒక బలహీనతే. ఇక్కడేవుండనీ, నన్ను నేను తమాయించుకుంటాను. ఇదీ ఒకరకం పరీక్ష – న్ను నేను కంట్రోలు చేసుకోగలనా, లేదా అని. తప్పకుండా కంట్రోలు చేసుకోగలను. ఐనా యిదంతా యెంత బాధగావుందని.'

ఇంటిదాకా వచ్చి సాగనంపుతాలే అన్నాడు ఒలోద్యా, తానెచ్కాతో. తానెచ్కాయిల్లు బాగాదూరం, చివరిబస్సుగూడా వెళ్లిపోయింది. ఏదైనా టాక్సీ మాట్లాడుకుందాం అన్నాడు ఒలోద్యా; తానెచ్క వొప్పుకోలేదు; షాంపేన్ తాగడంవల్ల తల భారంగా వున్నదనీ, కాస్త చల్లగాలి తగిల్తే మంచిది కాబట్టి నడిచే వెళ్దామన్నది. ఒలోద్యాకి చిరాకేసింది – బాగానేవుంది, ఒకవైపున అదేపనిగా మంచుకురుస్తూంటే, నడిచెళ్లాలట! వసపోసిన పిట్టలాగా మాట్లాడ్డం ప్రారంభించింది: ఒలోద్యా తండ్రంటే ఆవిడకి చాలా యిష్టం, జాలిగుండె మనిషి; అందగాడు గూడాను. నిజంగానే చాలా అందగాడు – ఊరికే పైపైన అనడంగాదు, నిజంగానే అంద గాడు – నలుగురికీ తెలిసినవాడు, ప్రముఖవ్యక్తి. సబురోవ్ చెప్పిన ముక్క వొక్కటీ అర్థంకాలేదుగాని, సబురోవ్ గూడా మంచివాడే. అంతెక్కువగా తాగకుండా వుండాల్సింది, తాగినప్పుడు బాగానే వుంటుంది కాని, తర్వాత్తర్వాత అదేమిటో విచారమూ, దుఃఖమూ ముంచుకొస్తుంది. తనకేమీ బాగాలేదు; కళ్లకట్టినట్లు కన్పిస్తూనే వుందిగా, యింకా బాగాలేదని చెప్పడం నెందుకు. ఐనా అగోడవలన్నీ యిప్పుడెందుకులే, వాటన్నిటితోనూ తలపగలగొట్టుకున్న లాభం లేదు.

ఉంటానికి తానొచ్చాక్కి ముప్పై రెండేళ్లుంటాయి; ఐనాసరే, యిప్పటికీ చిన్నపిల్లలా సూటిగా మాట్లాడుతుంది. నిక్కచ్చిగానూ, సూటిగానూ మాట్లాడ్డమంటేనే తెలియని జనంలో, రాష్ట్ర నాటక రంగాల్లో తొమ్మిదేళ్ళకి పైనుంచీ పనిచేస్తోంది; ఐనా మనిషి మారలేదు. చాలా చైతన్యంతో పనిచేస్తుంది. ప్రతిభగలదని గూడా అంటారు, మొత్తంమీద నెమ్మదిగా పైకొచ్చింది. ఇప్పుడు సాధారణంగా ముఖ్యపాత్రలే వేస్తూంటుంది. ఐనా, హృదయాంతరాళాల్లో యెప్పుడూ విచారంగానే వున్నట్లుంటుంది.

నటనంటే అదొక కష్టాలపాన్పనీ, ఆదర్శజీవితమనీ అనుకునేది చిన్నప్పుడు. కాని, తర్వాత ఆ అభిప్రాయం మారక తప్పలేదు. తనకు పెద్ద ప్రతిభేమీ లేదనీ, యితరుల్లో గూడా అది తరచుకన్పించే వస్తువు కాదనీ గూడా అనుభవం చెప్పింది; కొంతమంది నేర్పరితనాన్ని చూచి, ప్రతిభేనని అనుకుని సంతృప్తిపడతారు. కుట్రలూ, కావేషాలూ, కొట్లాటలూ, నటనంటే యేమిటో తెలియని నటకులూ, మురికి హోటళ్ళలో చిన్నచిన్న చీకటి గదులూ, నిమిషంలో ముద్దాడి నెమకు గూడా వేసుకోని ఘటనలూ, సంఘటనలూ, బాధల బరువూ - అన్నీ చవి చూచింది. తానొచ్చాక తలనిండా విచారాల వేదనల బరువే, ముఖంమీద చిన్నచిన్న గీతలు గూడా పడ్డాయి. (ఇదంతా కోటా వేసుకున్న ఫలితం అనుకుని తనని తానే ఓదార్చుకుంది); పైకి అంతా బాగానే వున్నట్లూ, తనకేంకేమీ కోరికలు లేనట్లూ కన్పించే, కాని ఆవిడ మనసులో యెక్కడో ఒక స్వప్నం దాక్కుని వుంది: ఇంతకంటే మంచి బ్రతుకు, చక్కని జీవితం తప్పకుండా యెక్కడో వొకచోట వుంటుంది, వుండాలి, తానెక్కడో దానితప్పింది.

చాలా కాలం క్రిందటొకసారి; ఏడు సంవత్సరాలౌతుంది- నటుడు గోర్కోవ్ వచ్చి "ఇకనీకూ నాకూ పడదు, మనం వేరు పడడం మంచిది" అన్నప్పుడు విషంపుచ్చుకుని చచ్చిపోదామని నిశ్చయించుకుంది. ఆ గోర్కోవ్ అంటే పంచప్రాణాలుగా చూచు

కునేది. అతనే ఆ మాటన్న తర్వాత యింకా బ్రదికేందుకు ? మొట్టమొదట, నిజంగా, హృదయపూర్వకంగా ప్రేమించిందతన్నే. పెళ్లాడిన భర్తలాగా చూసుకునేదతన్ని. తర్వాత చాలామంది తటస్థపడ్డారు-కొలెస్నికోవ్, బోరోడిన్, పేట్యా. పెద్ద ఆశలేమీ పెట్టుకోకుండా వశమయ్యేది; పెద్దవిచారమేమీ లేకుండా విడిపోయ్యేది. ఒంటరిగా వున్నది కాబట్టి ఒలోద్యానీ స్వీకరించింది; అతనంటే ప్రేమ వున్నదా లేదా అని తనని తాను కనీసం ప్రశ్నించుకోనుగూడా లేదు. అదీగాక ఒలోద్యా ఒకేపట్టాన వొదిలిపెట్టలేదు, వాదించాడు, ప్రార్థించాడు.

ఆ విడంటే ఒలోద్యా బాగానే వుంటున్నాడు, ఎప్పుడైనా వుడికించినా మోతాదు మించనీయడు, అప్పుడప్పుడూ హుషారు చేసేవాడు - అంత హుషారుగా వుండం తనకు చేతకాదు. తనకి ప్రతిభ లేదనీ, మంచిపాత్రలసలు దొరకడంలేదనీ, యెటు చూచినా విసుగు విసుగ్గా వుంటోందనీ తానంటే, మాస్కోలో పేరుమోసిన నటీనటుల పేర్లుచెప్పి, వ్యక్తిగత జీవితాలుచెప్పి వాళ్ళని, వెక్కిరించి, వేళాకోళంచేసి మాటతప్పించేవాడు. ఒక్కొక్కసారి అతను జీవితాన్ని గురించి మాట్లాడుతూంటే కోపం వచ్చేది; ఐతేనేం ఒక్కొక్కసారి నవ్విస్తూనూ వుండేవాడు. అందరూ నూకలకాశపడే ఘటాలనీ, అందులో ఆశ్చర్యపడవలసిందిగూడా యేమీ లేదనీ అనేవాడు; కళకంటే నూకలే అవసరమని అనేవాడు, కాని నూకలకంత ప్రాముఖ్యం యివ్వాలని యెవ్వరూ అనుకోరు, నూకలు యింకా నాలుగు సహాద్దామని నాటకం యెవరు వ్రాశారు గనక, నూకలు కావాలంటే నాలుగునాట్లువేస్తేచాలు తర్వాత వేపుస్తూకొస్తాయి. సాధ్యమైనంత బాగానూ, వీలైనంత హాయిగానూ బ్రదకాలి. జీవితంలో మాత్రం కొన్నికొన్ని మంచి విషయాలు లేవూ - కిటికీలోనుంచి చూస్తే కనబడే ఆకాశం ముక్క, రాత్రిపూట నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వినవచ్చే రైలుకూత.

ఒకళ్ళకొకళ్ళు, వాళ్ళిద్దరూ, బాగా అలవాటుపడిపోయారు; ఒకరు లేకపోతే యింకొకరికి తోచదు. ఒల్గోడ్యా రాకపోతే తానెచ్కాకి పిచ్చెక్కినట్లుండేది; ఒల్గోడ్యాగూడా "తానెచ్కాలో యేమీ లేదే; ఐనా నాకు యిష్టంగానే వుందే" అని ఆశ్చర్యపోయి తనని తానే ప్రశ్నించుకునేవాడు.

చాలాదూరం వుంది; నడుస్తూనే వున్నారు. మంచు అదే పనిగా కురుస్తోంది. ఒల్గోడ్యాకదేపనిగా కోపం వస్తోంది; తానెచ్కా అదేపనిగా మాట్లాడుతూంది.

"సబురోవ్ గీసే చిత్రాలెలా వుంటాయి; చెప్పవూ!"

"వాకిళ్ళూ, రెండుచెట్లూ; లేకపోతే రెండిళ్ళూ, ఒక చెట్టూ. యికే బొమ్మలన్నా అతనికిష్టం వుండదు."

"ఎందుకని?"

"చిత్రాలంటే అలాగే వుండాలంటాడతను" "మరినువ్వూ?"

"అతనొట్టి తలతిక్కమనిషి. అతను గీసిన బొమ్మొక్కటిగూడా యెవ్వరూ కొన్న పాపాన పోలేదు."

"యెందుకూ అతనంటే మరీ అంత తేలిగ్గా మాట్లాడతావ్? నే చెప్పనా, నువ్వేసే బొమ్మలన్నీ నూకలకోసం, కడుపు కక్కుర్తి కోసం వేస్తావు కాబట్టి అతన్నలా అంటున్నావు. తలతిక్కమనిషి కానేకాదతను; అతనే నిజమైన చిత్రకారుడు; అతని ముఖం చూస్తే చాలు ఆ సంగతి తెలవడానికి. అతని బొమ్మలు చూడాలనిపిస్తోంది నాకు. ఊరికే నటించబోక మరి. తాగటంమూలాన యిట్లా అంటున్నాననుకుంటున్నావా. తాగితే తాగానేపో, తాగాను; ఐనా సరే. రేపడిగినా యీ మాటలే చెబుతా, ఒక్కమాటగూడా పొల్లుపోకుండా. నూకలకోసం, కడుపు కక్కుర్తికోసం బొమ్మలేసేదినువ్వు. యేంచేస్తావ్ సంపాదించిన డబ్బంతా? సబురోవ్ వున్నాడంటే..."

"సరేగాని, అతన్ని ప్రేమిస్తున్నావా?"

"ఇక చాల్లే వూరుకో. సబురోవ్ భార్యంటే మాత్రం నాకసూయే. భార్యనెంత ప్రేమిస్తాడని."

"అసలు సంగతది కాదు. అతనేమో ఆవిడ బొమ్మలు గీస్తాడు, ఆవిడేమో అతన్ని ప్రేమిస్తుంది. అంతే; ఉన్న పని ఇద్దరూ పంచుకున్నారు. యెవళ్ళో వొకళ్ళతన్ని పొగిడితేగాని అతనికి సంతృప్తి వుండదు. గ్లాషా ఆ పని కాస్తా చేసేస్తుంది, అతనేసిన బొమ్మల వంక చూచి 'బ్రహ్మాండంగా వుంది' అంటూ గీపెడుతుంది."

"నిజవే, గమ్మత్తే మరి. జాలి పుడ్తుంది గూడాను. గ్లాషా అనాకారంగానూ, కుంటిగానూ వుండడం గూడా వొకందుకు మంచిదే...నువ్వో, నువ్వు నన్ను చచ్చినా ప్రేమించలేవు..."

"ఆఁ అదీ ఇప్పుడొచ్చాం అసలు విషయానికి. మన స్త్రీ పరిశీలన, తెల్లవారు ఝామున మూడు గంటలకి టీకప్పుల్లో అదృష్టమూ అంతే యిట్లా వుండాలి. సరే, యీ మంచు తేయాకను కుందాం. ముసలితనం వచ్చి మీద పడుతూన్న, నూకలిస్తే మేకలుకాసే ప్రౌఢ్యాపకరేమో కథా నాయకుడు; జీవితంలో కాస్తా అటూ యిటూ దెబ్బలుతిన్న సిసలైన నటేమో కథా నాయకి. ఇంకేం, దివ్యంగా వుంటుంది.

నవుస్తూ, నడుస్తూవున్న తానెచ్కా నిలబడి, "చాల్లే యికీ నటన. ఈ నటన చూస్తేనే నాకు వళ్ళు మండుకొచ్చేది. మానవుడి లాగా మాట్లాడ్డం చేతగాకపోతే అసలు మాట్లాడ్డవేఁ మానెయ్యరాదూ; మాట్లాడమని యెవళ్ళేడ్చారు" అని కసురుకుంది.

ఇక యింటికెళ్ళేవరకూ యెవరూ మాట్లాడలేదు. ఒలోడ్యా గూడా యింట్లోకెళ్దామనుకున్నాడు. కాని తానెచ్కా వొప్పుకోలేదు. దభీమని తలుపేసుకుని గడియవేసేసుకుంది.

బట్టలు మార్చుకోకుండా, తలకు కట్టుకున్న జేబురుమాలు కూడా తియ్యకుండా బయట నుంచి వచ్చింది వచ్చినట్లే కూర్చుంది. నెత్తిమీద నిలచిన మంచు చినుకులు కరిగి, ముఖంమీది నుంచి క్రిందికి ధారగా కడుతూన్నయి కన్నీళ్ళతోబాటు. 'ఇదంతా షాంపేన్ ఫలితమనుకుంటా' అనుకున్నది తనలోతాను.' సబురోవ్ చాలా గొప్పవాడు. నేనంటే

అతనికి విలువవుండదు. నూకలకోసం, పొట్ట కక్కుర్తి కోసం బొమ్మలు గీస్తున్నానన్నా ఒలోడ్యాకో. నేను మాత్రం యేం చేస్తున్నాను? వొట్టి చొకబారుపనేగా. ఒలోడ్యాకేమైనా కారణాలున్నా యేమో. నాకేం వున్నయ్? సామాన్యపునటిని, యంత్రంలో బొట్టంటాగే అలాంటిదాన్ని. ఒలోడ్యా అంటేవేరు. అతన్నిగురించీ, అతని బొమ్మల్నిగురించీ విమర్శిస్తారు; వ్యాఖ్యానిస్తారు. అతనికేమీ తెలియదని యెవరికీ తెలియదు. ఓటికుండ; అతని హృదయం ఖాళీ అందుకనే ప్రతి విషయానికీ నవ్వుతాడు. బ్రతుకే నవ్వుతాలతనికి. వుంగరుండి యెప్పుడైనా వురిపోసేసుకున్నా ఆశ్చర్యపడాల్సిన పని లేదు. నేనుమాత్రం అతన్నెలా వుద్ధరించగలను—నేనూ ఓటికుండనే. న్లాషా సబురోవ్‌ని ప్రేమిస్తుంది, నేను ఒలోడ్యాని ప్రేమిస్తున్నానా? ఇది ప్రేమకాదు. ఒంటరిగా బ్రతకడం కష్టం కాబట్టి మా మా స్వార్థాలకోసం బేరమాడుకున్నాం. నేనంటే అతనికి ప్రేమ లేదు. బ్రతుకేమిటీ యిలా బూజిద పాలైంది? నాటకాల పర్యటల్లో వున్నప్పుడు రోష్టోట నడుస్తూ, అదిగో ఆ మూలలోనగ్గానే హాయి దొరికుతుందనుకునేదాన్ని...నిద్రపోయేవేళైంది...మళ్లీ రేపు పొద్దుల కాడే లేవాలి, రిహార్సలుంది. తాగితే నిద్రపడుతుందంటారు, నాకు పట్టదేం? ఐనా ప్రతిదాన్ని గురించీ ఆలోచిస్తూంటే నిద్రెలా పడుతుంది... వెయ్యినాకా లెక్కపెడితే... లక్ష చెప్పు. ఒకటి మాత్రం నిజం, కళనేదివుంది, సబురోవ్ చెప్పింది అక్షరాలా నిజమే'.

* * *

ఒలోడ్యా టాక్సీలో కూర్చున్నాడన్నమాటే గాని మనసు మనసులో లేదు. 'తాగినప్పుడు తానెచ్చాట్లో మాట్లాడ్తవే కష్టం. ఐనా ఆడమ్మాయంటే యిష్టమేనాకు, అంతవరకు వొప్పుకోవాలి. ఇవ్వాళ నేను వొంటరిగా వుండదలుచుకోలేదని కనిపెట్టిందనుకుంటా, అందుకనే గడియవేసేసుకుంది. సాయంకాలం అంతా యిలాగేవుంది ఘండాలంగా. కళని గురించి ఘండాలపు వాదనా అదీనూ. సబురోవ్

సరుకున్న వాడే. పిచ్చాడు కాకపోతే ఆ బొమ్మలుగీసి బీరువాలో దాచుకోవడం వెందుకు? యెవరికోసం గీస్తున్నాడా బొమ్మలు. ఆ కుంటిదానికోసమా? ప్రతివాడూ కళని గురించి ఊకదంపుడే! కొట్టేవాడే, పట్టించుకునే వాడొక్కడు లేడు, ఈ రోజులే అందు తానెచ్కాకి సబురోవ్ మాటలంటేనే యిష్టం, అసలు మనిషిగూడా అలాంటిదే కళ అంటే కళలా వుండాలనేగా తానెచ్కా వుద్దేశం మొదటినించీ. ఎవరో వొక గట్టిమనిషిని చూచి, ప్రేమించాల్సింది తానెచ్కా, బాగుండేది - శాస్త్రజ్ఞుణ్ణో, వ్యవసాయ శాస్త్ర నిపుణుణ్ణో ఐతే యింకా బాగుండేది; సుఖపడేది. నామీదట్లా విరుచుకు పడిందెందుకు? నూకలకోసం గీసేది నేనొక్కణ్ణేనా, అందరూ అందుకే గీసేది, ఆమాటంటే వాళ్లూ వొప్పుకోరు, అంతేతేడా. నేను బద్ధ్యంటే పడిచస్తాననుకుంటుంది తానెచ్కా. యెవరైతే మాత్రం, బ్రదకొద్దూ కాదనమను. మాస్కోనుంచి రాకముందు రోజులు అబ్బ, గెలువ కోకపోవడమే మంచిది...డబ్బుంటే సరి, అందరూ ఆహ్వానిస్తారు, విందులూ చేస్తారు; అప్పుడు మరి నీ, నా ముఖం గూడా చూచే వాళ్లు కాదెవళ్లూ. యెట్లా గోట్లా బ్రదికి బయటబడ్డాను అదృష్ట వంతుణ్ణి. అందుట్లో అంత ఘోరనేరమేంవుంది? నేనెవర్నయినా బాధించానా, పెట్టానా? నాచేతుల్లో వుంటే యీ పాటికి సబురోవ్‌ని పైకి తెచ్చేవాణ్ణి కాదూ; సబురోవ్ సరుకున్న మషే, కాని అసలు విషయం అది కాదుగా. న్యాయం అనేది లేదు, అతనికి మాత్రం బ్రదకాలని వుండదూ. వుంటుందని, కావాలంటే పందెం కూడా కాస్తా. వొతి తలతిక్క మనిషని అన్నానెందుకబ్బా, అందరి లాంటివాడేనే, కాకపోతే కాస్త భల్లూకప్పట్టు వుంది. సాన్ చెంకో రెండు గ్లాసులు ఛాంపేన్ తాగి సబురోవ్ మీద .. ప్పుడు చూడాలి గమ్మత్తు. సాన్ చెంకో వొతి కొయ్య బొమ్మ, సోన్యా కెందుకో అతనంటే అంత యిష్టం? అదేమీ తెలివిం తక్కువ దద్దమ్మగాదే. విప్లవాన్ని గురిచీ, రొమాంటిసిజమ్‌ని గురించీ నాన్న మాట్లాడా రంటే అవి వేరు ఆయన నలాంటి రోజుల్లో పుట్టి పెరిగాడు. ఈ ఎంజి

నీకు ముండాకొడుకు, తన గొడవేవిటో, తన మెషీన్ల గొడవేవిటో చూచుకోలేక, యీ తాత్విక తర్జనభర్జన లెందుకు? బుద్ధిలేకపోతే సరి. ప్రతివాడూ యే యెండకా గొడుగు పట్టేవాడే. చక్రం తిప్పే వాడే, అబద్ధాలాడేవాడే. కాకపోతే కొంతమం దా పని యింకా నైపుణ్యవనేర్పుగా చేస్తారు; అంతే భేదం. సావ్‌చెంకోకి నేనంటే ఈర్ష్యనుకుంటా - అతనిలాగా గడియారం ముల్లు ప్రకారం పని చెయ్యనుగాదూ, అందుకని. నా యిష్టంవచ్చినప్పుడు లేస్తా, నన్నే దెవరు? ఒక్క బొమ్మ అమ్మితే చాలు, అతనికి నాలుగునెల్లకొచ్చే జీతం కంటే యెక్కువే వస్తుంది నాకు. ఐనా నా కంటె అతనే సుఖంగావున్నట్టు కనిపిస్తాడు; అంతేమరి నాకంటే బుద్ధి తక్కువ వాడు కదూ. యేవిటోగాని వూరికే విసుగుపుడుతోంది. అన్నట్టు రేపుబాగా పెందలకాడే లేవాలి - ఇవాన్ బొమ్మ రేపటితో పూర్తి చెయ్యాలి. అదేం ముఖంవాడిది అట్లా వుంటుంది. ముడతలుపడ్డ ఆనపకాయలా. నా బొమ్మలో బాగానే వుంటాడులే - సోవియట్ పరిశ్రమలకి నాయకుడుగాదూ, తల నిక్కబొడిచీ ఉక్కులాంటి మనసున్న మనిషికిమల్లే చూస్తూ - బాగానే వుంటాడు. మాస్లోవ్ అన్నట్టు మ్యాజియమే గనక కొంటేనా; ఇరవై వేలు చేతుల్లో పడ్డాయన్నమాటే. కారు కొనేస్తే ఆ డబ్బుతో? యాక్సిలరేటరు నొక్కి రోడ్డుమీద పరుగెత్తిస్తే బలేగా వుంటుంది; చుట్టుపక్క లున్నవన్నీ వెనక్కి పరుగెత్తుతాయి; చూద్దామనుకునే లోపలే వెనక్కి జారుకుంటై. అంత డబ్బు కారుకి ఖర్చుపెట్టటం మంచిది కాదేమో. సగం అమ్మకిచ్చేస్తే మంచిది. డబ్బు కావాలనిఎప్పుడూ అడగదు. నాన్నేమో యెప్పుడూ దానికో దీనికో నీళ్ళలాగా ఖర్చు పెడ్తాడు. ఇవాన్ భార్య బాగా అందంగా వుంటుంది; టింటోరెట్టో గీసిన బొమ్మలాగా - నల్లటి కురులూ, పచ్చని రంగూ, నీలాల కళ్ళు. అసలు మనిషెల్లాంటిదో. మాస్కోట్టు కెళ్ళేటప్పుడు ఓ సుఖ గుణాల బేరం చేస్తుందేమో అందరిలాగానే, 'వాళ్ళ షాపుల్లో బలే చెప్పులొచ్చినై పారిస్‌నుంచి' అంటూ చెప్పులు కొనుక్కుంటుందేమో,

యెవరికి తెలుసు. సబురోవ్ వోడ్కా అంతా తాగేశాడు. ఛ. శాస్త్రమిగిత్తే నాకు అక్కరకొచ్చేది ఇప్పుడు. మాస్కోలో క్రికోవ్‌ని చెప్పాలి. మీటింగులో చిత్రకారుల్నందర్నీ పట్టుకు తిట్టాడు యెప్పుడూ చెడ్డనే చూస్తారని. 'మనం మంచిని చూడ్డం నేర్చుకోవాలి' అని బల్లగుద్ది మరీచెప్పాడు; తర్వాత తాగడం మొదలు పెట్టాడు. అందరం కలిసి హాస్పిటల్‌కి చేరెయ్యాల్చొచ్చిందతన్ని... యేమిటీ మంచు యిట్లా కురుస్తోంది? యిది చూస్తే చాలు, బ్రదకాలంటే యిష్టంలేకుండా పోవడానికి...'

♦ ♦ ♦

కళ్లుమూసుకుని యీజీచైర్‌లో పండుకొనున్నాడు పుఖోవ్. ఒలోడ్యా మాటలు గుర్తుకొచ్చినై, భయంవేసింది. 'రెండు నాల్కలు! యువకుల కుపన్యాసాలిస్తాడు, కళలో ప్రాధాన్యం వుండాలిసిందే నంటాడు, కార్మికుల బొమ్మలు గీస్తాడు; రెండో వైపున అందరూ అబద్ధాలకోరు లంటాడు. వద్దు, వద్దు, ఆ ఆలోచనలనవసరం. నిక్కచ్చి మనిషంటే సోన్యానే చెప్పాలి. సావ్‌చెంకోని నేనింకా బాగా అర్థంచేసుకో గలనన్నమాట నిజవేఁ గాని...సోన్యా నిక్కచ్చైన మనిషి, కావలసిందదీ. అందరూ ఒకేలాగా వుండాలనుకో గూడదు - సావ్‌చెంకోలాగా సోన్యా వుండాలిసిన అవసరమేఁవుంది? ఇద్దరూ ఒకేమాదిరిగావుంటే బాగా వుంటుందని అఁపిస్తుందిగాని అప్పుడప్పుడూ, అలా అనుకోగూడదు, పడుచువాళ్ళని చూచి గొణుక్కోగూడదు. నా మనసు బాగుండలా. చిన్నప్పుడైతే, పుట్టినరోజులు జరుపుకుంటే, ఆనందంగా వుంటుంది; ఇప్పుడంటే భయఁవేస్తుంది. దానికితో డీ గుండెద డొకటొచ్చి పడింది ...'

చాలా హుషారుగా వుందనీ, పుట్టినరోజు జరపాలని ఆవిడ అనుకోవడం నిజంగా బలే పసందైన ఐడియా అనీ, విందుగూడా దివ్యంగా జరిగిందనీ చెప్పాడు భార్యతో......ఇక పడుకోవడం మంచిది.

ఈ మధ్య, చీకటి పడుతూందంటేచాలు భయంవేస్తోందాయనకి ఏదో దూరదేశానికి, ముక్కూ మొఖం తెలియని దేశానికి ప్రయాణం కాబోయినట్టు. పడుకుంటే మరీ గొడవగా వుంది — ఒకటే గుండెదడ, యెడం చెయ్యంతా పీక్కుపోతుంది. తలంతా దిమ్మెత్తి పోతుంది. పక్కకితిరిగి పడుకుందామన్నా భయమే అలికిడికి భార్య యెక్కడ లేస్తుందోనని.

ఈ బాధ భరించడానికేనా బ్రదుకుతూంది అని వాపోయాడు. 'చావంటే భయం వేవీఁ లేదు ఈ బాధే. మరుపెక్కువై పోయింది. యేదో ఒకటి చెయ్యాలనిపిస్తుంది. యేవీఁ చెయ్యలేను' ఈ మధ్య మరీ నిరుత్సాహం యెక్కువైంది, దానిక్కారణం మనసుకాదు; శరీరవేఁ కారణం. బిగ్గరగా ఆవులిద్దామనీ, యింటి కప్పెగిరిపోయేట్టు గల్లంతుచేద్దామనీ, రోదించాలనీ అనిపిస్తుంది. నాదెజా నిద్ర పోతూంది; ఆ శ్వాస పీల్చడంగూడా భయంగానేవుంది. "ఇక నేను చచ్చిపోతున్నా, నాదెజా నిద్రపోతూంది, గలభా చెయ్యగూడదు' అనుకున్నాడు గూడాను ఒక్క క్షణంపాటు.

తేలిక సంగతులూ, సామాన్యవిషయాలూ ఆలోచిద్దామని తట్టబలవంతాన ఆలోచించడం మొదలుపెట్టాడు. రేపెల్లి సెరోజా పల్లిని చూడాలి. పాపం కష్టాల్లోవుంది; టైపిస్ట్ పనిచేస్తే నెలకి ఆరువందల రూబుల్లుగూడా రావాయె. సెరోజా లెక్కల్లోమట్టుకు వుద్దండపిండం అని చెప్పొచ్చు; అతన్ని స్కూల్లోనుంచి పంపెయ్యగూడదు. నాదెజాతో మాట్లాడాడుగూడాను. ఆ కుటుంబానికి యెంతో కొంత సాయం చెయ్యాలి.

కారణం తెలియకుండానే, నాదెజా చిన్ననాటిరూపం అతని కళ్ళముందు కదుల్లాడింది. ఆవిడ జుట్టు అచ్చంగా సెరోజా జుట్టు లాగానే వుండేది. ఆ రోజుల్లో సైనిక లకోటుగూడా వేసేది. 'నాదెజా యేనా, నాదెజా చాలా ధైర్యస్థురాలు. రాస్టావ్ నగరాన్ని శత్రువులు చుట్టుముట్టినప్పుడొచ్చి, తనకీ రైఫిల్ కావాల నడిగింది. ఎంత కాలమైంది; బ్రదు కింత బారుగా వుండగూడదు; వెనక్కి తిరిగి

చూస్తే మనకే నమ్మకం కుదరదయ్యో. అదీగాక మనలో మార్పొచ్చి నట్టే వుండదు, వయసు ముదిరినట్టే అనిపించదు. నాదెజా యిప్పటికీ ధైర్యంగానే వుంటుంది. నాకోసం అంత భయపడ్డం దెందుకు? నేనూ అంతే. నాదెజా కోసమని యింత భయపడతా నెందుకు? నేను చనిపోతే నాదెజా కెట్లా? బ్రతికినంతకాలమూ యిద్దరం కలిసి వున్నాంగదా, యిక ఒంటరిగా బ్రదగ్గలదూ?

ఇప్పుడు నాదెజా శ్వాసని వింటూంటే, చల్లని, చెప్పలేని వాత్సల్యం పుట్టుకొచ్చిందతనిలో. జబ్బుగా వున్నా సరే, బలహీనంగా వున్నా సరే యింకా నాలుగురోజులు బ్రదకడమే మంచిదనిపించింది; బ్రదకడమంటే తనకిష్టమే ననిపించింది. గుండెదడ తగ్గింది, యిప్పటి బాధ భరించలేనంతగా యేమీ లేదు, అలవాటైపోయిన బాధలాగానే వుంది. ఇక తొందరగానే నిద్రపట్టు దేమోనని ఆశ్వాసన చిక్కింది. ప్రపంచం బాగానే వుందనిపించింది అకస్మాత్తుగా: 'ఇకీరాత్రి ఫర్వా లేదు; అందరూ యింతే ననుకుంటూ, చిట్టచివరి నిమిషందాకా బ్రదకాలనే అనిపిస్తుంది' అనుకున్నాడు.

# 4

ఎలీనాకు తెల్లవారేవరకూ నిద్రపట్టలేదు; అందుకని నిద్ర లేచేప్పటికి బాగా ప్రొద్దెక్కింది; ఆదివారం. 'ఇవ్వాళ ఇవాన్‌తో అంతా చెప్పెయ్యాలిసిందే, దాచుకుంటే లాభంలేదు, మోసంచేసి నట్లౌతుంది' అనుకుంది లేచీలేవడంతోనే.

లేచి బయటి గదిలోకి వెళ్ళింది; అప్పటికే ఒలోద్యా వచ్చే శాడు, ఇవాన్ బొమ్మ పూర్తి చేసేస్తున్నాడు. చూస్తేనేగానీ కదల టానికి వీల్లేదన్నాడు ఇవాన్.

"పోలికలు బాగా కుదిరినై. ముఖం వ్యక్తీకరించే భావం మాత్రం చాలా చక్కగా సరిపోయింది, అందుకేమీ సందేహం లేదు."

ఒలోద్యా నవ్వాడు నిజమేనని వొప్పేసుకున్నట్టు:

"మీవారి బొమ్మ గియ్యడం చాలాకష్టం; ముక్కూ, మొఖమూ తీర్చిదిద్దినట్టుండవు గాదూ, అందుకని. కాని అంతర్వస్తు వుని వ్యక్తీకరించాలని ప్రయత్నంచేశాను మరి."

ఎలీనా మాట్లాడకుండా గదిలోనుంచి వెళ్ళిపోయింది. 'అంతర్వస్తు వంటాడేమిటి అలా నవ్వుతూ?...' అని ఆశ్చర్యపోయింది; పుఖోవ్ మాష్టారి కిటువంటి కొడుకుండడం వింతే ననుకుంటూ. ఈ ప్రపంచంలో అదేపనిగా, గుక్కతిప్పుకోకుండా, ధారాళంగా అబద్ధాలాడేసేవాళ్ళు నిజంగానే చాలా మందుంటారా? నాలాగా ...

'బజారుకెళ్ళి తేనె పట్టుకురావాలి, షూరాకి తేనంటే యెంతో యిష్టం. కాస్త గాలిలోకూడా తిరగడం మంచిది. తల మరీ బరువుగా వుంది, ఏపనీచెయ్య బుద్ధిపుట్టడంలేదు. రాత్రంతా అదోరకం గొడవ, ఇప్పుడు బాగానేవుంది, గమ్మత్తే. నే నొచ్చేప్పటికి

ఒలోద్యాగూడా వెళ్ళిపోతాడు ... "మీకంతా చెప్పేసెయ్యా లనుకున్నాను; యిక లాభంలేదు" అంటాను తిరిగిరాగానే.'

బయట బాగానేవుంది, మంచులేదు; మసకమసకగా వుంది; లేత యెరుపురంగుగా వుంది సూర్యబింబం యేదో బొమ్మలపుస్తకంలో వున్నట్లు; ఐనా కళ్లు చిరతలారిపోతున్నాయి. ఒకప్పుడైతే హాయిగా వుండేది; ఇవ్వాళ వాతావరణంఅంతా చక్కగావున్నా, మనసు బాగులేదు. రాత్రి కురిసినమంచు గడ్డకట్టుకునుంది బజారుల్లో. 'వసంత కాలం యింకెన్నిరోజులకొస్తుందో, అనుకుంది; 'రోజులిక గడవ్వు! వసంతం వచ్చేప్పటికి నేనేమౌతానో.'

తిరిగి ఇంటికొచ్చింది; ఇవాన్ వొంటరిగా లేడు, కిట్రోవ్ వచ్చి కూచున్నాడు. ఆలస్యం ఐనాసరే, యివ్వాళ వేటకి బయల్దేరు తున్నామని చెప్పారు యిద్దరూ. "వచ్చేప్పుడు యే కుందేలునో కొట్టుకొస్తాంలే కూరకి" అన్నాడు ఇవాన్ బుసకొడుతున్నట్లు. బరువు దించినట్లుంది ఎలీనాకి; 'ఫర్వాలేదు, ప్రొద్దుపోయొస్తాడు, రేపటి దాకా ఆగకతప్పదు...యింతికీ యేంచెయ్యాలో నిర్ణయించుకోనే లేదు, యేంచెప్పాలో బోధపడ్డంలేదు...'

మర్నాడు యేదో కమిటీ మీటింగు ప్రొద్దుగూకులూ జరుగు తూనేవుంది; రేపు చెప్పొచ్చునులెమ్మని ఆవేళా వూరుకుంది.

ప్రతిరోజూ ప్రొద్దున్నే లేవగానే, అవతలి గదిలో భర్త సకిలింపు వినపడ్డప్పుడు మళ్ళీ అంతా గుర్తుకొచ్చేది, 'యేదో వొక టనుకోవడం మంచిది, యిట్లా యెన్నిరోజులు బ్రతుకుతాను' అను కునేది. తర్వాత స్కూలుకెళ్ళేది, పిల్లల్తో పాఠాలు చదవమని చెప్పేది, విద్యాధికారితో వాదం వేసుకునేది. నెక్రాసోవ్ కవి కవిత్వం పిల్లలకి చదివి వినిపిస్తూ ఆ కవిత్వంలో మాటల్లో పొదిగిన విచారాన్ని ప్రబోధించాలని ప్రయత్నించి అందులో పడి తానే కొట్టుకుపోయేది. స్కూలైపోయింతర్వాత సామాన్యంగా పిల్లల తల్లిదండ్రుల సభ అనో, మార్క్సిజం - లెనినిజం వుపన్యాసాలనో,

స్కూలు నాటక సమాజం సమావేశం అనో యేదో వొకటుండేది. అలాగే రోజులు గడచిపోయినై.

ఇదంతా చూస్తూంటే ఇవాన్‌కి బాగున్నట్లు లేదు: 'ఎలీనాకి మరీ మంచీచెడ్డా తెలియకుండాపోతూంది. నెత్తికిమించిన బరువేసుకుంటే యెట్లాయిలా? ఉదయం కాఫీతీసుకునేప్పుడూ, సాయంత్రం పూటా ఆవిడ మనసు మార్చాలని చూచేవాడు—' "బ్రెయ్నిన్ అసలే మతిమరుపు మనిషి. పైనా, యివ్వాళ భార్య వేసుకునే స్వెటర్ (చలిబనీను) వేసుకుని వచ్చాడు ఆఫీసుకి, వదులొదులుగా వుండేమో మరీ గాభరాపడ్డాడు చిక్కిపోయాననుకుని; యింతలోకే అతని భార్యవచ్చింది; నవ్వలేక చచ్చిపోయారనుకో అందరూ..." అంటూ పగలబడి నవ్వాడు, అంత నవ్వినా ఆ నవ్వులో హాస్యం కన్పించలేదు. ఎలీనాగూడా నవ్వాలని ప్రయత్నించింది.

ఒకనాడు, స్కూలునుంచి యింటికి తిరిగివస్తూ 'నే నతన్ని మోసంచేస్తున్నా ననుకుంటూ. అతన్ని ప్రేమించడం మానేసిం తర్వాత, అతనంటే గౌరవంకూడా లేకుండాపోయింతర్వాత, యింకా అతనితో కలిసి మెలిసి యెలా బ్రదగ్గలను? ఇదివరకే చెప్పేస్తే పోయేది. షూరాని వదిలిపెట్టడానికి వొప్పుకోడు; అదొక పెద్ద పోట్లాటౌతుంది. బిడ్డ కష్టపడుతుంది. దాని జీవితాన్ని పాడుచేసే హక్కు నాకు లేదు, ఐతే, యిక నే నేం చెయ్యాలి?' అని ఆలోచించుకుని, ప్రశ్నించుకుంది తనను తాను.

జనవరి వచ్చింది, మంచుతుపాను లెక్కువైనై. 'ఇక నే నీ భారం భరించలేను, యింకొక్కరోజంటే గుండెపగిలి చస్తాను' అనుకుంది మంచులో తడుస్తూ.

ఇంటికి రాగానే షూరా వుండేగదిలో కెళ్ళేది. షూరా నిద్రపోతూగాని, తండ్రితో ఆడుకుంటూగాని వుంటే, యేమీ తోచక యిల్లంతా తిరిగేది పిచ్చిదానిలా. ఆ గదులన్నీ కొత్త కొత్తగా వున్నట్లనిపించేవి తా దివరకెప్పుడూ చూచియెరగనట్లు. తనచేతుల్తో కష్టపడి, స్వయంగా కట్టిన తలుపుల తెరలవంకా, పోగుచేసిన చిన్న

చిన్న వస్తువులవంకా, లాంప్ కిందున్న యీజీఛైర్ వంక చూస్తూ నిలబడిపోయేది విస్తుపోతూ. ఈ సౌఖ్యాన్నీ, విరామాన్నీ, విశ్రాంతినీ యీ యింట్లో పాదుకొల్పింది తాను; ఇవ్వాళవన్నీ తన కెదురు తిరిగినై; తనమీద కత్తిగట్టినై!

దీనికీ, డిమిత్రీకి సంబంధం యేమీ లేదని తనకు తానే నచ్చ జెప్పుకుంది. తానిప్పు డతన్ని గురించి కాదు ఆలోచిస్తున్నది; ఈమధ్య ఒకళ్ళ కొకళ్ళు తారసిల పడడం గూడా లేదు— ఐతేమాత్రమేం? యెప్పుడూ అతన్ని గురించేనాయె ఆలోచనలన్నీ. 'బ్రెస్లావ్‌లో జరిగిన యుద్ధాన్ని గురించి చెప్పేప్పుడు ఆ కుర్చీలోనే డిమిత్రీ కూర్చున్నది. ఒక భవనంలో జర్మన్లు కింది అంతస్థులో వున్నప్పుడు డిమిత్రీ వాళ్ళూ పై అంతస్థు నాక్రమించుకున్నారు; అప్పుడే లెఫ్టినెంట్ బెబూష్కిన్ చనిపోయింది, బెబూష్కిన్ పియానో చక్కగా వాయించేవాడు, అంత యుద్ధమూ జరుగుతూండగా, కింది అంతస్థులో శత్రువులున్నా లెక్కచెయ్యకుండా, డిమిత్రీ, బెబూష్కినూ సంగీతాన్ని గురించి మాటాడుకున్నారు...ఆ సంగతి చెబుతూ తటాలున లేచాడు డిమిత్రీ; లేచి, "ఎలీనా, నువ్వింకా చాలా చిన్న దానివి. ఎలీనా నీ కర్థం కావడం కష్టం...ఒక్కోసారి హృదయమంతా గడ్డకట్టుకుంటుంది, ఉన్నట్టుండి, ఒక్కసారిగా, యెక్కడో, యేదో స్పందిస్తుంది..." అన్నాడు చెవిలో వూదినట్టు.'

'అలాంటిదీ ఆ స్నేహం. అలాంటి స్నేహం యిలా, ఇంత ఘోరంగా అంతమైందేమిటి? దీనికంతా కారణం తనదే, తప్పు తనదే. ఆ స్నేహం చెడగొట్టుకున్నది, మళ్ళీ కలియకుండా చెడగొట్టుకున్నది తానే. సరిగ్గా సమయం వచ్చేప్పటికి తన నాపివేశాడతను. ఇక తను తన కెప్పుడూ కనిపించడు. ఒక్కసారంటే ఒక్కసారి, ఒక్క అరగంటసేపు వస్తే చాలు - వచ్చి పెద్దగా యేమీ మాట్లాడాల్సిన అవసరం లేదు. ఏదో వొకటి, - బయట చల్లగావుందనో, కొత్త నవలేమీ రావడం లేదనో, యేదో వొకటి, - కాస్సేపు మాట్లాడితే చాలు. అతను తనముందలా కూర్చుంటే చాలు, బ్రతికి

పోతుంది...ఛ, అలా ఆలోచించగూడదు, వారి తెలివితక్కువ ఆలోచనలొస్తున్నయ్యేం మరీ మంచీ, చెడ్డా లేకుండా? పాతకాలపు నవలల్లో కథానాయికల కొచ్చేవి యిలాంటి ఆలోచన్లు. తా నొక సోవియట్ మహిళ, తన శక్తి సామర్థ్యాలు తెలిసిన, డిగ్నిటీవున్న మహిళ. యెవరినీ దేహీ అనగూడని మహిళ. అసలు సమస్య డిమిత్రీ కానే కాదు. ఎప్పుడైనా, యెక్కడైనా బజారులోనో, క్లబ్బులోనో యెదురుపడితే, ఒక చిన్న చిరునవ్వు నవ్వి, స్నేహంగా వొకటి రెండు మాటలాడితే సరిపోతుంది తన కేమీ కోపం లేదని చూపించడానికి. అసలు సమస్య తన భర్త

వైవాహిక జీవితాన్ని గురించి తా నాలోచిస్తున్న ఆలోచన లకీ, డిమిత్రీ అంటే తన మనసులో రేగిన భావాలకీ వున్న సంబంధాన్ని గురించి ఆలోచించదలకుకోలే దావిడ. ఇవాన్‌ని ప్రేమించడం మానేసింతర్వాత యెంతో కాలానికిగదా తాను డిమిత్రీని కలుసుకున్నది? ఆ వేళ సాయంత్రం క్లబ్బులో, తాను డిమిత్రీని ప్రేమిస్తున్నట్లు కనుక్కున్న దగ్గరినుంచే, తెలుసుకున్న దగ్గరనుంచే అస లావిడకి ఇవాన్ ప్రక్కన నిలబడడంకూడా కష్టమైపోయింది. క్రిందటి వేసవిలో డిమిత్రీ అంటే స్నేహితుడిగామాత్రమే చూచుకునేది, ఇప్పుడలాంటి స్నేహితు లెవరూ తనకు లేరని అనుకుంటూంది. ఇప్పుడు భర్తని వదిలేస్తే తనని అర్థంచేసుకునేవారుగాని, సాంత్వన నిచ్చేవారుగాని యెవరూ వుండరనిగూడా ఆవిడకి తెలుసు. ఐనప్పటికీ, వెంటనే భర్తతో తెగతెంపులు చేసుకోవాలని అదేపనిగా అనుకుంటూంది; ఎందుకనంటే డిమిత్రీ యెలాగూ తనవాడు కాకుండాపోయాడు, ఇవాన్‌తోనైనా తన హృదయంలో ఉన్నదంతా చెప్పేయడం మంచిది; అప్పుడు కల్మషాన్నీ, కశ్మలాన్నీ కడిగేసుకున్నట్లౌతుంది. అంతవరకూ ఆలోచించేప్పటికి షూరా గుర్తుకొచ్చేది; మళ్ళీ వాయిదా. ఈ విషయాలన్నీ చెప్పుకునేందుకు యెవరైనా దొరికితే ఎంతబాగుండును!

తనని చూస్తే తనకే నవ్వొచ్చేది; కోపం వచ్చేది. నెత్తిమీదికి ముప్పయ్యేళ్ళొచ్చినై, తన సంగతి తా నాలోచించుకోలేదూ? ఇంకెవరో కావాలీ తా నేం చెయ్యాలో చెప్పడానికి? 'సిగ్గుచేటు. కామ్సొమాల్‌లో చేరినప్పుడు యెవరైనా వచ్చి, యిదిగో నువ్విలా కాబోతున్నావంటే "ఐతే యింకెందుకు, వెంటనే బైటికి గెంటెయ్యండి మెడబట్టి" అని అందరికంటే ముందు నేనే చెప్పేదాన్ని'. ఇవన్నీ అనుకుంటూనే వుంది; యీ రహస్యాలన్నీ చెప్పుకోడానికెవరైనా దొరికితే యెంతబావుండును అనీ, పూరా భవిష్యత్తుని లెక్కపెట్టకుండా తన చేతులు తాను కడిగేసుకోవడం మంచిదో కాదోనని అడిగి తెలుసుకునేందుకైనా ఎవరో వొకరు దొరికితే యెంతబావుండును, అనీ ఆలోచిస్తూనూ వుంది.

ఇదంతా వాళ్ళమ్మకు వ్రాస్తే బాగుంటుందేమో ననే ఆలోచన ఎలీనాకి తట్టకపోలేదు; తట్టింది. కాని, వద్దనుకుంది. తల్లిని చూచేందుకని ఆ వూరు వెళ్ళినప్పుడుగూడా చెప్పడం మంచిది కాదని నిర్ణయంచేసేసుకుంది. 'అమ్మకి నాకంటే యెక్కువ తెలివితేటలున్నై; నిజవేఁ; మనుషుల్నిగూడా నాకంటే బాగా అర్థం చేసుకుంటుంది. నిజవేఁ; కాని యిలాంటి విషయా లమ్మకి చచ్చినా అర్థం కావు. ఇలాంటి కూతురు నా కడుపున యెందుకు పడిందా అని విచారిస్తుంది; నా కడుపున చెడబుట్టిందే అపని కోపగించుకుంటుంది. చెప్పగూడదు.'

♦ ♦ ♦

ఎలీనా తల్లిపేరు పావ్‌లోవ్నా, 'రెడ్ వే' సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అధ్యక్షిణి, తెలివితేటలుగలది, మగవాడిలా అన్ని పనులూ నిభాయించుకోగల శక్తి సామర్థ్యా లున్నాయి. పెళ్ళెప్పుడో చిన్నప్పుడే ఐపోయింది; భర్త మంచివాడు, సామాన్యుడు, పిల్లలికి హుళ్ళళ్ళాయి పాడడమన్నా, బొమ్మలూ గిమ్మలూ చేసిపెట్టడమన్నా సరదా. "యేవిఁటో చేసేది, పందేనా?" అనడిగేది పావ్‌లోవ్నా. తలకాయొంచుకుని, సిగ్గుపడుతూ, "కాదు యేనుగ, ఎలీనాకోసం..."

అనేవాడు. ఎప్పుడూ తాను చేసే పనికేదో ఒక కారణం చెప్తూనే వుండేవాడు క్షమాపణ కోరుకుంటున్నట్టు— బొమ్మలు చేసేది పిల్లల కోసమే. తర్వాత, ఎలీనా ఎలీనా, తమ్ముడు సెరియోజా—ఇద్దరూ— పెద్దవాళ్లైంతర్వాత, చుట్టుప్రక్కల పిల్లల్ని పోగుచేసి, వాళ్ళకి చే. పెట్టేవాడు బొమ్మలు. తండ్రంటే ఎలీనా కెప్పుడూ భయంలేదు, గల్లంతుచేసి విసిగించుకుతినేది; మరీ భరించలేనప్పుడు, "ఇక గో వూరుకోమ్మా, లేకపోతే అమ్మతో చెబుతా" అనేవాడు తండ్రి. ఆ కుటుంబానికి అసలైన పెద్ద తల్లేనని చిన్నప్పటినుంచీ తెలుసు ఎలీనాకి. తల్లంటే అపరిమితమైన ప్రేమ ఎలీనాకి, ఆ ప్రేమలో కొంత అసూయగూడా వుంది— సెరియోజా అంటే తల్లికింకా స్త యెక్కువ యిష్టమని ఎలీనా వుద్దేశం—దీనికి తోడు కాస్త జడుపుగూడా వుంది.

పాఠాలు చాలా తొందరగా వచ్చేసేవి ఎలీనాకి; లెర్మొంటోవ్ వ్రాసిన 'రాక్షసి' గుక్క విడవకుండా అప్పచెప్పేసేది తండ్రికి; అప్పజెప్పి, "పెద్దదాన్నైంతర్వాత నేనూ పుస్తకాలు రాస్తా నాన్నా" అనేది. ఎలీనా మేనమామకి పట్టణంలో వుద్యోగం; అందుకని వూళ్ళో చదువు పూర్తికాగానే ఆయనదగ్గర కెళ్లి పోయింది ఎలీనా చదువుకునేందుకు.

ఇదంతా యుద్ధానికి ముందుమాట. యుద్ధంవచ్చింది; తండ్రిని సైన్యంలోకి పిలిచారు. నలభై రెండులో సెరియోజాగూడా వెళ్లాడు. పావ్లోవ్నా వొక్కతే మిగిలిందిక యింటిదగ్గర. సమిష్టిక్షేత్రానికి అధ్యక్షురాలుగా ఎన్నుకున్నారు. గడ్డురోజులు - ఎక్కడచూచినా ఆడవాళ్లు; ముసలివాళ్లు. బంగాళాదుంపల కరువొచ్చింది - పంట పాడైపోయింది, వేసినపంట పండలేదు, మంచు తినిపోయింది; కొన్ని చోట్లసలు పండించేవాళ్ళే లేరు. పావ్లోవ్నాలోవున్న మంచి గుణాలన్నీ బయటపడినై - మానేజ్‌మెంట్ చెయ్యడంలో, పథకాలు వెయ్యడంలో, ఇతరుల్ని ప్రోత్సహించడంలో, అవసరమైతే నాలుగని పనిచేయించుకోవడంలో ఆవిడ కావిడే సాటి. సమిష్టి వ్యవసాయక్షేత్రంలో తేనెటీగల పెంపకంగూడా ప్రవేశపెట్టింది;

లిథూనియానుంచి వచ్చిన ఒక కాందిశీకుని సలహాతో తరిరాక ముందే కూరగాయలుపెంచి పట్టణానికి సప్లైచెయ్యడం ప్రారంభించింది, పత్రిక లీకూరగాయ లవసరమని వ్యాసాలు ప్రకటించడం ప్రారంభించకముందే. 'రెడ్ వే'కి అంతకుపూర్వంఉన్న అప్పులన్నీ తీరిపోయినై, ఆ జిల్లాలోకల్లా అదే గొప్ప సమిష్టి వ్యవసాయ క్షేత్ర మని అందరూ ప్రశంసించారు. పావ్‌లోవ్నా పేరు పత్రికల్లోగూడా మారుమోగిపోయింది. ఆవిడకి కీర్తిదాహం లేదు; "ఇందులో గొప్పేంవుంది? ... రాత్రింబగళ్లు తుపాకులు పట్టుకుని పోట్లాడే వాళ్ళని గురించి రాయాలిగాని, యిదేంవుంది" అనేది, పత్రికల్లో తననిగురించివ్రాసిన వ్యాసాలు చూచి.

ఎన్నో కష్టాలనుభవించి కరకుదేరిం దావిడ. '42 వేసవిలో, మిన్‌స్క్ పట్టణందగ్గర యుద్ధం చేస్తూచేస్తూ చనిపోయాడు సెరియోజా. గుండుదెబ్బ తగిలి అంగవైకల్యంతో తిరిగొచ్చాడు భర్త; చేతులూ, తలా వణుకుతూ. "యేపనికీ పనికిరాను, నన్నిదివరకటి లాగానే చూచుకోగలవా పావ్" అనడిగాడు భర్త; రెండు చేతుల తోనూ భర్తని కౌగలించుకుని వెక్కివెక్కి యేడ్చింది పావ్‌లోవ్నా.

ఇక పావ్‌లోవ్నాకు మిగిలిన సంతోషమల్లా ఒక్క ఎలీనాయే; కూతుర్ని చూచి గర్వించేది. ఎలీనా హైస్కూలు పాసయిందనీ, చాలా మంచి మార్కులు తెచ్చుకున్నదనీ, యిప్పుడు కాలేజీలో చేరిందనీ తెలియనివాళ్ళు ఆ చుట్టుప్రక్కల యెవళ్లూలేరు. ఎలీనా సెలవుమీద వచ్చిందంటే చాలు, పావ్‌లోవ్నా కొత్త కొత్త రుండి వంటలన్నీ చేసేది; యిరుగుపొరుగు వాళ్ళనందర్నీ పిలిచి, కూర్చో బెట్టి ఎలీనాతో అదేపనిగా కబుర్లు చెప్పించేది చదువుని గురించీ, పట్టణంలో స్నేహితుల్ని గురించీ, చూచిన నాటకాల్ని గురించీ. ఎలీనా నవ్వుతూ, పేలుతూ కబుర్లు చెప్పేది. ఐనా తల్లంటే యెందుకోగాని భయపడుతూనే వుండేది అస్పష్టంగా.

డిగ్రీ పుచ్చుకొని యింటికి వచ్చినప్పుడు, ఇవాన్‌ని గురించి తల్లిదండ్రులతో చెప్పాలనుకుంది ఎలీనా, వచ్చింతర్వాత రెండురోజులాగింది చెప్పకుండా భయంవేసి—'అమ్మ కోప్పడుతుందేమో'; చివరకి తండ్రితో చెప్పేసింది. తల్లి చాలా సంతోషించింది. "మంచి పని చేశావే తల్లీ, యిక మనవళ్ళనెత్తిస్తావన్నమాట, నా కెందుకనమ్మా చెప్పలేదు?" అంటూ ఆనందపడిపోయింది పావ్‌లోవ్నా. వచ్చే శీతాకాలంలో వెళ్ళి అల్లుడితోనూ, కూతురితోనూ నాలుగు రోజులుండి రావాలని నిర్ణయం చేసేసింది.

పావ్‌లోవ్నాకి అల్లుడేమంత నచ్చలేదు. పైకి పల్లెత్తుమాట గూడా అనలేదు కాని తల్లి పెదవివిరుపుల్లో రకాలూ, వాటి అర్థాలూ తెలుసు కాబట్టి ఎలీనాకి తెలిసిపోయింది. ఇవాన్‌కిమాత్రం అత్తగారంటే గురి బాగా కుదిరింది: "మీ అమ్మ సామాన్యురాలు కాదు; పెద్ద రాజకీయవేత్తకుండే బుర్ర మీయమ్మది. అందులో సందేహమేమీ లేదు" అన్నాడు ఎలీనాతో. వెళ్ళిపొయ్యేప్పుడుగూడా ఇవాన్‌తో బాగానే మాట్లాడి వెళ్ళింది పావ్‌లోవ్నా; ఐనా, అల్లుణ్ణి చూచి తల్లి సంతోషించలేదని పసికట్టింది ఎలీనా.

ఎలీనా అనుకున్నది నిజమే. షూరా పుటకలకిగూడా కూతురిగారి యింటికి రాలేదు పావ్‌లోవ్నా. షూరా పుట్టింతర్వాత రెండేళ్ళకి పుట్టింటికి వెళ్ళింది ఏలీనా షూరాని చంకనెత్తుకుని; అప్పటికే భర్తంటే యిదివరకున్న అభిప్రాయాలొక్కొక్కటీ మారడం ప్రారంభించాయి. ఆ విషయమే తల్లితో చెప్పింది ఎలీనా: "నేననుకున్న మనిషికాదమ్మా ఆయన; అసలు నా గుణమేం అంతేవో, దూరపుకొండలు నునుపనీ". పావ్‌లోవ్నా కసురుకుంది: "ఇలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలన్నీ మాను. ఏం, నీకేం వొచ్చింది? చక్కని వుద్యోగం వుండే, బంగారబ్బొంతిలాంటి కూతుకుండె. ఇంకేం కావాలి?" ఎలీనాకి తనమీద తనకే కోపంవచ్చింది; అసలు తల్లితో చెప్పకుండా వుంటేనే బాగుండేది. అమ్మ చాలా గొప్పది; అలాంటివాళ్ళెంత ఎక్కువమందుంటే కమ్యూనిజం. అంత త్వరగా

వస్తుంది. కాని, యితరుల అనుభూతు ల్నావిడ అర్థం చేసుకోనూలేదు; చేసుకోవాలని ప్రయత్నించనూ ప్రయత్నించదు. అమ్మ చెప్పేది నిజమేనేమో - ఇదికా దలాంటివా టన్నిటికీ సమయం ...

♦ ♦ ♦

ఎలీనా మళ్లీ వర్తమానంలోకి వచ్చింది: 'రహస్యాలన్నీ చెప్పించుకుని వినే తల్లివుంటే యెంతబాగుండేది. సోన్యా వాళ్ళమ్మకి రహస్యాలన్నీ చెప్పుకుంటూంటుం దనుకొంటా. విడాకులు తీసుకోవా లనుకుంటున్నానని అమ్మ కెలా వుత్తరం వ్రాసేది? నాలుగు కాలాల పాటు ఆదర్శంగా కాపురం చేస్తావనుకున్నాగాని, యిలా సీతాకోక చిలక వౌతావనుకోలేదని అంటుంది అమ్మ. డిమిట్రీగురించి అమ్మకి చెప్పడంకంటే చావడమే తేలిక.'

చివరి కొకనాడు సాయంత్రం, యివాళిక ఇవాన్‌తో చెప్పేద్దామనుకుంది. ఆవాళ మరీ బాధగావుంది యీ రెండు బ్రదుకుల్నీ తలుచుకుంటే. 'ఇదుగోనండీ, కాస్త శాంతంగా వినండీ, నే నొకమాట చెప్పదలచుకొన్నాను' అని ప్రారంభించాలనిగూడా రిహార్సల్ వేసుకుంది. తీరా ఇవాన్ గదిలో కెళ్ళేప్పటికి చెప్పలేక పోయింది: ఇవాన్ బల్లనిండా ఫైళ్లున్నాయి, ఫైళ్ళల్లో తలబెట్టి పని చేసుకుంటున్నాడు. ఎలీనాని చూచి, ఆ ఫైళ్ళటూ యిటూ సర్ది అందులో వొకదాని అడుగునించి, చిత్తుకాగితంవంటి దొకటి తీసి, "మాశావా షూరా యేంచేసిందో, పిల్లి బొమ్మేసింది; బాగావుంది గదూ" అనడిగాడు ఇవాన్. గబగబా గదిలోనుంచి బయటి కొచ్చేసింది ఎలీనా; అక్కడే వుంటే నిలుచున్నది నిలుచున్నట్టు కళ్ళనీరు కార్చాలిసొచ్చేది.

ఇంట్లో కూర్చోవాలంటేనే కంపరమెత్తుతోంది. డాక్టర్ వీరా యింటి కెళ్తే బాగుంటుందేమో ననుకుంది. తన భావాలన్నీ వీరాకి చెప్పుకోవచ్చును; వీరా యిలాంటివన్నీ అనుభవించింది కాబట్టి, తప్పక దారి చూపగలుగుతుంది.

## 5

సామాన్యంగా డాక్టర్ వీరా యింటి కెవ్వరూ రారు. అప్పు డప్పుడూ ఛీఫ్ డిజైనర్ సొకొలొవస్కీ వస్తూంటాడు. వచ్చి కూర్చుం టాడు; పది నిముషాల కొక మాట మాట్లాడుతాడు. ఆ కూర్చోవడం గూడా, యేదో సిగ్గుపడుతూన్నట్లు, ముడుచుకొక్కూర్చుంటాడు. వచ్చినప్పుడల్లా అల్పాహారమూ, టీ యిస్తూవుంటుంది వీరా. ఇంత లోకే, యెవరో రోగి పిలుస్తున్నారని కబురొచ్చేది వీరాకి; వీరా వెళ్ళిపోయేది. లేకపోతే, "క్షమించండి, మిమ్మల్ని అనవసరంగా శ్రమ పెట్టానుకుంటా..." అంటూ అతనే లేచి వెళ్ళిపోయేవాడు. ప్రతి సారీ, అతనొచ్చి వెళ్ళిం తర్వాత, "యెందుకబ్బా యీయ నిలా వస్తాడు?' అనుకునేది వీరా. అత నొచ్చి కూర్చుంటే ఆవిడకీ బాగానే వుండేది. అతను చాలా నిక్కచ్చిమనిషనీ మంచివాడనీయే ఆవిడ అభిప్రాయం; ఒక్కోసారి 'అరే, అతనూ, నేనూ ఒకేరకంగా ఆలో చిస్తావే' అనుకుంటూ ఆశ్చర్యపోయేది. లేకపోతే నే నెవరికోనూ కలిసిమెలిసి తిరగనని తెలిసి, కారణం యేమిటో తెలుసుకుందా మని కాబోలు ఇత నొస్తూన్నది అనుకుని కష్టపడేది: 'నన్ను ముట్టొద్దనే నామాలకాకి' అనేవాడు ఎగొరోవ్ ఆవిణ్ణి. ఒకవేళ తా నొంటరిగా వుంటున్నదని తెలిసి, జాలిపడి వస్తున్నాడేమో? ఛ, అదేమీ కాదు, తా నేమన్నా చిన్నపిల్లా. ఇంటిదగ్గర తోచక యిట్లా వస్తున్నాడా? ఆవిడ కేమీ అర్థమయ్యేదికాదు. ఇత నిట్లా రావడం ప్రారంభించి మూడు సంవత్సరాలౌతుంది. ఇరుగు పొరుగు నర్సులు 'ఆయ నావిణ్ణి పెళ్ళి చేసుకుంటాడు' అని చెప్పుకునేవారు అతని ప్రసక్తొచ్చినప్పుడల్లా. ఇంత జరుగుతూన్నా, ఒకవేళ తన నతను ప్రేమిస్తున్నాడేమో నని యెప్పుడూ అనుకోనైనా అనుకోలేదు వీరా......

ఆవిడ కిప్పుడు నలభై యేళ్లు. అక్కడక్కడా తల బాగా నెరసిందిగూడాను. ఐనా ఆకర్షణీయంగానే వుంటుంది. ఒక్క సొకొలొవస్కీయే గాదు; ఆవిణ్ణి చూచిన వాళ్ళందరూ అలాగే అనుకుంటారు. కనిపించని బాధలు, సామాన్యంగా, ప్రతి స్త్రీకీ, వయసు మళ్ళింతర్వాతగూడా అదో విధమైన అందాన్నిస్తాయి; బాగా పరీక్షిస్తేనేగాని కనిపించని చిరునవ్వు తేట, ఆవిడ ముఖాని కదో కళగా వుంటుంది.

వీరా మంచి డాక్టరనే ప్రతీతి. ఏ రోగి కెలా ఆశ్వాసన నివ్వాలో, యే రోగి కెలా ధైర్యం చెప్పాలో బాగా తెలుసావిడకి. క్రిందటేడు శీతాకాలంలో హాస్పిటలంతా పీకి పందిరేశాకు యిద్దరు రోగులు డాక్టర్లని నమ్మగూడదనీ, అందులో వీరాలాంటివాళ్ళ నసలు నమ్మనేగూడదనీ కేకలేస్తూ. ఎంజినీర్, ఎగొరొవ్ వచ్చి, "యేం పర్వాలేదు, వాళ్ళమాట లేవీ లెక్కచేసుకోకండి, మీరంటే అందరికీ యిష్టవే" అంటూ పదే పదే చెప్పాడు. ఆ రోజుల్లోనే ఫాక్టరీలో కార్మికు లందరూ కలిసి ఆవిడ సేవ నభినందిస్తూ పూల గుత్తులు పంపారు.

హాస్పిటల్ కొచ్చి యేడేళ్ళౌతుంది. ఫాక్టరీలో వాళ్ళందరికీ ఆవిడంటే అపరిమితమైన గౌరవం. ఐనా, యింతవరకూ స్నేహితులంటూ ఎవరూ లే రావిడకి; అప్పుడప్పుడూ సొకొలొవస్కీ వస్తూంటాడు. తప్పితే ఎలీనా; అంతే.

హృదయపూర్వకంగా ప్రేమించిన వ్యక్తిని పోగొట్టుకోవడం మూలాన్నేమో, వీరా యిలా నలుగురితోనూ కలిసి మెలిసి వుండకుండా, దూరందూరంగా వుండడం అనుకునేది ఎలీనా. కొంతవరకది నిజంగూడాను; యుద్ధానికి పూర్వం వీరా సామాన్యంగా, యెప్పుడూ, నలుగురితోనూ కలిసి మెలిసే వుంటూండేది. దీనిక్కారణం చాలావరకు ఆవిడ భర్త అలవాటైతే ఐ వుండవచ్చుగాక; ఆవి డప్పుడు భర్త యిష్టమే తన యిష్టమని అనుకునేది. ఐనా, అతనుగూడా అప్పుడప్పుడూ, ఆశ్చర్యంగా అడుగుతుండే

వాడు "ఏమిటి వీరా, ఎప్పుడూ అలా, ముంగిలా, మాట్లాడకుండా కూచ్చుంటావే?" అని. "ఏమో మరి, యిట్లా వుండగూడదనే అనుకుంటూంటా. ఒక్కొక్కసారి నే నసలు మనిషిని కాదేమో నని పిస్తుంది; నా దొక వింతజంతువు పుటకేమో ననిపిస్తుంది" అనేది యేం చెప్పాలో తోచక. "ఛ, అవేం మాటలు. నీయిష్టం వొచ్చి నట్లుండు; మాట్లాడకపోయినా పర్వాలేదు" అని నవ్వి, దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకునేవాడు లాలిస్తూ.

చిన్నప్పట్నించీ యింతే; వీరా కలుపుగోలు మనిషి కాదు. ఏదో చిన్నపట్టణంలో పుట్టింది. తండ్రి యెప్పుడూ కల కంటూ కూచ్చునే రకం; ఏదో వూహాప్రేయసిని గురించి పాటలు పాడుతూ కూచ్చునేవాడు. మా అమ్మాయి వీరా నోటినే అప్సరసో గాని వచ్చి, మైకంలో మూసేసెళ్ళిపోయిందనేవాడు, కూతుర్ని గురించి చెబుతూ. నలుగురితోనూ కలుపుగోలుగా వుండకపోవడం మూలాన వీరా కప్పుడప్పుడూ యిబ్బందిగానే వుండేది; ఎవరితోనో, ఒకరితో స్నేహం చెయ్యక తప్పదని అనుకునేది. అలాంటప్పుడల్లా, అనుకుని, వున్నవాళ్ళల్లోకల్లా మంచివాళ్ళుగదా అని యే కాత్యాయనితోనో, ఫెన్యాతోనో స్నేహంచేసేది. తీరా చూస్తే అందరిలాగానే వాళ్ళూ చిన్నపిల్లలే ననిపించేది. వెంటనే యింటికెళ్ళి డైరీలో యెక్కించేసేది 'అందరూ అబద్ధాలకోరులే, ప్రపంచం అంతా యింతేననుకుంటా. లేకపోతే అసలు నేనే మంచిదాన్ని కాదేమో. తప్పంతా నాదే, బ్రదకడానికి నాకేమీ హక్కులేదు' అని.

హైస్కూల్లో జేరడానికి ఆ చిన్నపట్టణం వదిలెళ్ళాలి సొచ్చింది. ఆరోజులే వేరు: యేదో పరివర్తన. యేదో ఆత్మ పరిశీలన. అవ్యక్తవేదన. స్వర్గానికి నిచ్చెనలొకసారీ, జారి జారి పాతాళంలోకి పడిపోవడం వొకసారీ. తన యీడువాళ్ళంతా తన కంటే ముందే పెద్దమనుషులయ్యారు, పెళ్ళిచేసుకున్నారు, విడాకులు గూడా అంత తేలిగ్గానూ యిచ్చేసుకున్నారు. వీరాని 'నన్ను ముట్టుకు నామాల కాకి' అంటూ గేలిచేసేవారు. ఉన్నత ప్రేమని

గురించి కలలు కనేది వీరా. అప్పటికే, ఆవిడ ముఖంలో, ఏదో అర్థంకాని బాధ, అయిష్టం కన్పించేది; అప్పుడప్పుడూ ఆ నల్లటి కళ్లు ఎర్రటి చీకలు కట్టుకునేది కోపంతో.

వాస్యా అనే కుర్రవాడుండే వాడప్పుడు వీరా క్లాసులోనే, (వీరా వొక్కతే అతన్ని వాస్యా అని పిలిచేది; మిగతా వాళ్ళం దరూ 'ముసలి వాస్యా' అనే వారు). వాస్యా ముఖం గుండ్రంగా వుండేది, శీతాకాలంలో గూడా ఆ ముఖంమీద ముడతలు పోయ్యేవి కాదు; యెప్పుడూ హుషారుగా, గంటకొట్టినట్టు మాట్లాడుతూండే వాడు. రోజూ స్కూలుకెళ్ళేటప్పుడు వీరా కోసమని స్కూలు గేటు దగ్గర నిలబడుండేవాడు, అప్పుడప్పుడూ హాస్టలుకు గూడా వచ్చేవాడు వీరాని చూచేందుకని. అతని మెత్తమెత్తటి మాటలు వింటూంటే అంతా తనదే తప్పని అంటున్నాడేమో ననుకునేది వీరా. 'నేనసలు మనిషినికాదనుకుంటా. ఊరందరిదీ వొక దారినీ, వులిపికట్టె దొక దారీనూ. నేనేమైనా వులిపికట్టెనా? నేనూ అందరికి మల్లేనే వుంటా' అనుకున్న దొకనాడు. ఒకనాడతనికి లొంగి పోయింది; ప్రేమించి కాదు, అందరిలాగానే వుండాలని నిశ్చయం చేసుకుని. అలాగే కొంతకాలం గడిస్తే, పోనుపోను వొకరంటే వొకరికి ఆపేక్ష పెరిగేదేనేమో. కాని వాస్యాది మరీ కుర్రతనం, అనుభవం వున్నవాడు కాదు; పెద్దగా తెలియదు. తాను చేసిన పని మంచిదేనని అనుకునే సాహసం లేక, తలగడలో తలదూర్చి, వీరా ఆలోచించుకునే సమయంలో మరీ కుర్రాడిలా మాట్లాడాడు వాస్యా; అంతా చెడగొట్టేశాడు అద్దంముందు నుంచుని, పాపట తీసుకుంటూ, "ఇక పద, వెళ్లి ఐస్‌క్రీం కొనుక్కు తిందాం, రా" అన్నాడు. తర్వాత నెలల తరబడి బాధపడింది వీరా; ఇకెప్పుడూ యెవరికీ తన శరీరం అప్పగించగూడదని గట్టిగా నిర్ణయించుకుంది.

నాలుగేళ్ళవరకు ఆ నిర్ణయానికే కట్టుబడివుంది; తర్వాత ఆ నిర్ణయం భగ్నమై పోయింది. ఇరవయ్యేడోయేట యెస్త్రిబ్జోవ్ అనే జంతుశాస్త్రజ్ఞుణ్ణి ప్రేమించింది. ఆ విడకీ, అతనికీ పోలికే లేదు;

అసలు వాళ్ళిద్దరూ కలిసెలా వుండేవారో వూహించు కోవడమే కష్టం. అతనా పొట్టి గల్లంతు మనిషి, వసపోసినట్టులా వాగేవాడు, కోపం వచ్చినా దుఃఖం వచ్చినా సంతోషం వచ్చినా ఆపుకోలేని రకం, ఎప్పుడూ పదిమందిని వెంటబెట్టు కొచ్చేవాడు, అర్థరాత్రి దాకా వాళ్ళతో సోదేసుకూర్చునేవాడు. అతనేం చేసినా వింత గానే వుండేది వీరాకి. అతనేం చేసినా ఆనందంగానే వుండేది. "జీవితంలో యింత సుఖం వుంటుందని కల్లోగూడా అనుకోలేదు నేను" అనే దతనితో.

యుద్ధంవచ్చింది, యిద్దరూ విడిపోయారు. నాలుగోనాడే అతను కీవ్ పట్టణాని కెళ్లవలసొచ్చింది. మాస్కోలోనే, కాందిశీకుల హాస్పిటల్లో పనిచేస్తూ వుండిపోయింది వీరా. తర్వాత యుద్ధరంగానికి చాలా దూరంగా, క్రాస్నోదారా పట్టణం వెళ్లింది వీరా. యుద్ధం అక్కడికీ వచ్చేసింది. సైనిక వైద్య దళంలో చేరింది వీరా. అక్కడ తటస్థపడ్డ ఆఫీసరొకడు యెసైర్జోవ్‌ని బైలోరష్యన్ రంగంలో చూచానని చెప్పాడు వీరాకి. ఆర్నెల్ల తర్వాత, దార్నిత్జా ప్రాంతంలో చనిపోయాడని తెలిసింది, ఆ వార్త నిజంకాదులే అని ఆశిస్తూ కాలం గడిపింది. యుద్ధం ఐపోయిం తర్వాత, అందరితోనూ కలిసి విజయోత్సవాలు చేసుకుంటున్నప్పుడుగాని తెలిసిరాలేదు వీరాకి - యిక తామిద్దరం కలిసికోవడం అసంభవమని. నీలాకాశం నిప్పులు గక్కింది. ఆవిడకళ్ళల్లో కన్నీరులేదు; కత్తితో కోసినా ముఖాన నెత్తురుచుక్క లేదు; ప్రక్కనే వున్న డాక్టరదిచూచి, "వెళ్ళిపండుకో నిద్రమాత్రలిస్తా"నన్నాడు. తనబాధ నెవరితోనూ వెళ్ళబోసుకోలేదు వీరా. ఓర్లా ప్రాంతంలో తన తల్లినీ, చెల్లెల్నీ జర్మన్లు చిత్రవధ చేశారని గూడా వీరా యెవరికీ చెప్పుకోలేదు. కిమ్మనకుండా తనపని తనుచేసుకోవడం ప్రారంభించింది. 'నేను బ్రతికేందుకు ?' అని, ఒంటరిగా వున్నప్పుడల్లా, డాక్టర్ వీరా తనని తానే ప్రశ్నించుకుంటూ వుంటుందని నరమానవులకెవ్వరికీ తెలియను గూడా తెలియదు.

కాని, ఈ బాధల మూలంగా, ఆవిడలో క్రౌర్యం యెక్కువ కాలేదు. బాధపడుతున్న రోగి బాధనెలా తీసెయ్యడమని, యెప్పుడో, విద్యార్థిగా వుంటూండగానే, అడిగింది పెద్ద సర్జన్ని; మందంటే మంత్రం కాదనీ, గుండెగట్టి చేసుకోకపోతే నువ్వసలు డాక్టర్‌వే కాలేవనీ జవాబు చెప్పాడా సర్జన్. తర్వాత చాలా యేళ్ళు గడచినై; వీరా తనని తాను సంబాళించుకోవడం నేర్చుకుంది. సైనికుల హాస్పిటలే వొక పెద్ద పాఠశాల; పీనుగైపోయిన శరీరాలు, కాలిపోయిన ముఖాలు, గుడ్డివాళ్లు, పిచ్చివాళ్లైపోయినవాళ్ళు - అందర్నీ చూచింది. రోజూ తన చేతులమీదే చచ్చిపొయ్యేవారు యెంతోమంది. ఇప్పటికీ, వాళ్ళకేమీ సహాయం చెయ్యలేక పోతున్నానే అనే బాధ ఆవిణ్ణి పట్టుకు పీడిస్తూనేవుంది: ఎగొరోవ్ భార్యంత మంచిదీ, హుషారైనదీ లేదు; ఆ విడకూడా బాధ తప్పటంలేదు, తానా బాధని తగ్గించలేదు. కుద్ర్యావ్ జైవ్ గారబ్బాయి బ్రదకడని తనకి తెలుసు, అతన్ని బ్రతికించుకోలేదు. పుఖోవ్ చనిపోతాడని తెలుసు; బ్రదికించడం సాధ్యంకాదు. ఇలాగే—యితరుల బాధల్ని చూస్తున్నప్పుడూ, తలచుకున్నప్పుడూ క్రుంగి, సగమై పోతుంది వీరా.

వెళ్ళి, విషయాలన్నీ వీరాకి చెప్పెయ్యాలని ఎలీనా నిశ్చయించుకున్ననాడు, అప్పుడే గుమాస్తా ఫెదొసాయేవ్ చనిపోవడం చూచి, హాస్పిటల్ నుంచి వచ్చింది వీరా. అతనికి న్యూమోనియా వచ్చింది, పెన్సిలిన్ యిచ్చారు; గండం గడిచిందనుకున్నారు; ఇంకో వారంలో యింటికొచ్చేస్తానని వుత్తరం గూడా వ్రాశాడతను భార్యకి. అనుకోకుండా జబ్బు తిరగబెట్టింది; చనిపోయాడు.

వీరా, యేమీ తోచక, గదిలో వూరికే అటూ యిటూ తిరుగుతోంది; తలుపు తట్టిన చప్పుడైంది. సొకొలొవస్కీయే నను కుంది వీరా. ఇదివరకెప్పుడూ ఐతే సొకొలొవస్కీ వచ్చాడంటే సంతోషంగానూ వుండేది; విసుగ్గానూ వుండేది. వచ్చొచ్చి ఇవ్వాళే రావాలీ" అనుకుంటూ తలుపు తీసింది.

ఎలీనా లోపలి కొచ్చింది.

"యెంతకాలమైంది ఎలీనా నిన్ను చూచి. రా, లోపలికిరా, యేవిటీ విశేషాలు" అంటూ లోపలికాహ్వానించింది: ఎలీనా వూరికే, చిన్న పిల్లలా, బాధపడుతుందని తెలుసు వీరాకి.

హెడ్మాస్టర్‌కి బుద్ధిలేదనీ, పిల్లల పుస్తకాలకొక స్థాయంటూ లేకపోయింతర్వాత లాభమేమిటనీ, చాలా పాఠాలు పిల్లలకి చెప్పినా అందడంలేదనీ, యేడో తరగతి మరీ అధ్వాన్నంగా వుందనీ, పిల్లల్లో గాలి పిల్లలున్నా ఆదారివేరనీ, పుఖోవంటే వేరు. ప్రతి విద్యార్థం తనూ వ్యక్తిగతంగా శ్రద్ధతీసుకుటాడనీ, తానలా చెయ్యలేదనీ, హెడ్మాస్టర్‌దంతా గజిబిజ్జికోలతేసనీ - గబగబా, యేదోపాఠం వప్పచెప్పుతూన్నట్టు, చెప్పిచెప్పి, అకస్మాత్తుగా మాట్లాడ్డం మానేసి వూరుకుంది ఎలీనా.

ఎలీనాని చూస్తుంటే వీరాకి భయం వేసింది - జబ్బుచేసి నట్టుంది మనిషి; ఎలీనా కళ్లు మెరుస్తున్నై, ముఖం అంతా జేవురించింది.

"నీకేవన్నా చలిచలిగా వుందా ఎలీనా ?" ఇన్‌ఫ్లుయెంజా మరీ యెక్కువై పోయింది యెక్కడ చూచినా."

ఎలీనా లేచి, గబగబా తలుపుదగ్గర కెళ్లింది. "యేవీ లేదు, ఛ, నాకేం జబ్బా. యేవీ అనుకోబోక. మాకొక మీటింగుం దిప్పుడు. మరిచిపోయా...ఇదే యెప్పటిలాగానే ఏడో తరగతిని గురించి, ఏవీ అనుకోబోకా, కోపం వచ్చిందా. మరినాకు మతి పోతోందనుకుంటూ...వస్తా"

అంటూ, అప్పుడే దిగి క్రింద కెళ్ళిపోయింది ఎలీనా.

"ఎలీనా, ఆగు, నేనూ వస్తున్నా" అంటూ కేక వేసింది వీరా.

కిందవున్న నర్సు "వెళ్లిపోయారమ్మా అప్పుడే" అంటూ జవాబిచ్చింది.

వీరా తనని తాను తిట్టుకుంది: 'అట్లా వెళ్లిపోనిచ్చానేమిటి. ఈ మధ్యసలు ఎలీనా యెందుకనో బావుండడంలేదు. భర్తతో పోట్లాడుకో లేదుగదా ? మనిషిగూడా మంచిది, వూరికే బాధపడి పోతుంది. వాళ్ళమ్మాయి జబ్బొచ్చినప్పుడు, నేను వాళ్ళింటికెళ్ళి నప్పుడూఅంతే, యిక ఇవాన్ సంగతి చెప్పే అవసరమేలేదు, పెత్తనం చెలాయించేరకం, ఎలీనా యెప్పుడూ అతన్ని గురించి మాట్లాడనే మాట్లాడను; ఐనా అదీ తేలిగ్గాదు. లేకపోతే ఒకవేళ స్కూల్లో యేమన్నా ఇబ్బంది పడుతూందేమో. ఆ హెడ్మాస్టరంటే యెందు కనో నాకూ పెద్ద సదభిప్రాయం కలగలా. చెఖోవ్ కథల్లోలాంటి మనిషి-గాజు పెట్టెలో మనిషి - గాజుపెట్టెలో మనిషి. పాపం, దురదృష్టవంతురాలు ..అదుగో మళ్ళీ నేనూ, నా విమర్శా తయారు; నాకొక దిక్కులేదుగాని - మరీ రాయినై పోతున్నా ననుకుంటా. ఎలీనాతో ఒక్క మాటగూడా మాట్లాడకపోతిని, పాపిష్టిదాన్ని. అలావున్న మనిషిని వెళ్ళిపోనీయవలసింది కాదు.'

పక్కనే పడున్న 'వైద్యపత్రిక' తీసి, ఒక పేజీ చదివిందివీరా. అందులో ఒక్కమాట గూడా అర్థంగా లేదు. అసలారోజే అలాంటిది, మంచిది కాదు.

అసలే ఆవిడది తెల్లగా పాలిపోయిన ముఖం, వొత్తుగా పెరిగిన కనుబొమల క్రింద యెక్కడో లోతుగా వుండేవి కళ్ళు నల్లగా; ఇప్పుడు మరింత నలుపెక్కినై. ఆ చక్కని నోటి కటూ యిటూ గీతలల్లేవున్న చారలు ఆ ముఖాని కదో యోగిని కళనిచ్చేవి; ఇప్పుడా చారలు మరీ ప్రస్ఫుటమైనై.

మళ్ళీ తలుపుతట్టిన చప్పుడు; ఈసారి వచ్చింది సొకొలొవస్కీ.

# 6

ఫాక్టరీ డైరెక్టరుగా ఇవాన్ రాగానే, అంతకు పూర్వం డైరెక్టర్‌గావున్న తరాస్సెవిచ్ ఫాక్టరీలో వాళ్ళ కర్మి గురించీ చెబుతూ, సొకొలొవస్కీ విషయం వచ్చినప్పు డిలా అన్నాడు: “సొకొలొవస్కీ బుర్రవున్న మనిషి; చాలా చక్కగా చేస్తాడు పని. నోరు కాస్త మంచిదికాదన్న మాటేగాని అయినా ఫర్వాలేదు. సొంతంగా ఆలోచించగల మనిషి”. ఇవాన్ యీ మాటలు మరచి పోలేదు. సొకొలొవస్కీలో అంత గొప్ప వున్నట్టేమీ కన్పించ లేదతనికి – వొఠి తలబిరుసు మనిషిని మాత్రం ఆ రోజుకారోజు రుజు వవుతోంది. ఒకనాడు ఎలీనాతో పితూరీ గూడా చేశాడు ఇవాన్: “క్రపీవ్‌ని పనిలోంచి తొలగించొద్దని చెబుతాడు సొకొలొవస్కీ వచ్చి, యెట్లా? భార్య కేదో జబ్బుగా వుందనీ, అందుకనే క్రపీవ్ ఆలస్యంగా వచ్చాడనీ అంటాడు. ఇప్పటికే క్రపీవ్ నాలుగుసార్లా లస్యంగా, వచ్చాడనీ, యెంత చెప్పినా యిక లాభమేమీ లేదనీ, డాన్‌క్వొక్సొ‌ట్‌లాగా ప్రవర్తించి ప్రయోజనం లేదనీ చెప్పాన్నేను. సొకొలొవస్కీ యేంవన్నాడో తెలుసా? ‘మీరు డాన్‌క్వొక్సొటెప్పు డైనా చదివారా? నేను చచ్చినా నమ్మేవాణ్ణి కాదు’ అన్నాడు అందరి ముందూ పట్టుకుని. మహా తలబిరుసు మనిషి; అందులో సందేహ మేమీ లేదు.” వీలైతే సొకొలొవస్కీ మీద యెప్పుడో వొది లించుకునేవాడు ఇవాన్. మంత్రివర్గంలో సొకొలొవస్కీ అంటే మంచి పనివాడని పేరుంది – యెవళ్ళో వొకళ్ళతని పక్షం వహిస్తే? ఇవాన్ కలాంటి చిక్కుల్లో చిక్కుకోవడం అంటే యిష్టంలేదు.

ఇదివరకటి డైరెక్టర్‌లాగానే, సొకొలొవస్కీ స్నేహితులు గూడా అతను తిక్కశంకరయ్యనే అనుకొనేవారు. అతనిచూపు గూడా అలాగే అదొక గమత్తుగా వుండేది. మరీ తాడిచెట్టంత్మ

పొడుగున్నట్లుంటాడు. అంటకత్తెరేసిన తెల్లజుట్టు. రాగిరంగు ముఖంలో నీలిరంగు కళ్లు; శీతకాలంలో గూడా, అప్పుడే దక్షిణ ప్రాంతంనుంచి వచ్చినవాడి ముఖంలా వుంటుంది. ఒక బుగ్గకు నిలువునా పెద్దచార. ఎప్పుడూ చిన్న పైపొకటి నోట్లో నానుతూనే వుంటుంది, పెద్దగా పొగతాగే మనిషికాకపోయినా. ఇంట్లో వున్నప్పటు మాత్రం పీలుస్తుంటాడా పైప్. పై చివర కొరికేసినట్లుంటుంది. పనిచేసుకునేప్పుడు ఎప్పుడూ యేమీ మాట్లాడడు. అమెరికన్లు చర్చిల్‌ని దువ్వి సరిచెయ్యగలరా లేదా అని బ్రెయ్నిన్ ఎగొరోవ్‌తో వాదనేసుకూర్చున్నా, సొకొలొవస్కీ యేమీ మాట్లాడే వాడుకాదు. వోడ్కా తాగుతూండేవాడు కూర్చుని, వాళ్లవాదనవింటూ వోడ్కా తాగడమేపని; మాట్లాడ్డంలేదు. అతన్నిగూడా సంభాషణలోకి లాగాలని యెవ్వరూ పెద్దప్రయత్నమేమీ చేసేవారు గూడాకాదు — అదొక తిక్కతరహా మనిషని తెలుసుకాబట్టి.

అతనితోపాటు చాలకాలంనుంచి పని చేస్తున్న వాళ్లకిగూడా అతని పూర్వ చరిత్రేమీ తెలియదు. ఉత్తరదేశంనుంచి వచ్చాడనీ, తండ్రేదో జాలరిపని చేసేవాడనీ, ఆ బుగ్గమీద చార అంతర్యుద్ధం రోజుల నాటిదనీ మాత్రం అనుకునేవారు. సంగీతమన్నా, జ్యోతిషమన్నా అతనికి చాలా యిష్టంలా కన్పించేది. పెళ్ళి చేసుకున్నాడుగాని, అతనితో సరిపడక భార్యలేచి పోయింది, అతనింట్లో ఒక చిన్న కుక్క వుంటుంది మెదిత్తే, కదిత్తే కరవొస్తూ. ఆతనేదో కొత్త విషయం కనిపెట్టాడు, బహుమతి రావలసిందేకాని, యెవరో ఆ కనిపెట్టింది కాస్తా కొట్టేశారు. ఒక్క విషయం మాత్రం అందరికీ రూఢిగా తెలుసు — అతనింతకు పూర్వం యూరల్ పర్వత ప్రాంతాల్లోవున్న ఫ్యాక్టరీలో పనిజేశాడు; అక్కడి మానేజర్‌తో పోట్లాడాడు, మానేజరతని పేరును మసిపూశాడు. 'ఈ కల్లేనిడేగ' అనే శీర్షికతో ఒక పత్రిక సొకొలొవస్కీని గురించి ఒక వ్యాసం గూడా వ్రాసింది (రష్యన్ భాషలో, సొకొల్ అంటే డేగ అని

అర్థం; ఆ పేరుకు తగినవాడు కాదని ధ్వనిస్తూ శీర్షిక పెట్టారన్న మాట) అసలు సరుకు లేకపోయినా, అంతా తెలిసినవాడిలా ప్రవర్తిస్తాడంటూ. ఈ విషయం మాస్కో వరకూ వెళ్ళింది, అక్కడొక కొలికికి చేరుకునేప్పటికి చాలా ఆలస్యమైంది, చివరి కిక్కడికి బదిలీ చేశారు.

సొకొలొవస్కీ తిక్కల్లోకల్లా - చాలా తిక్కలున్నాయి - అప్పుడప్పుడూ ఒలోడ్యాతో కూర్చుని వోడ్కా త్రాగడాని కంగీకరించడం; అది చాలదా అన్నట్టు ఒలోడ్యాతో పోది వేసుకునేందుకు గూడా సిద్ధ డటం. సొకొలొవస్కీతో కూర్చుని మాట్లాడేందుకు ఒలోడ్యాక్కూడా బాగా సరదాయే; అందులో వింతేమీ లేదు: మాస్కో వదిలిపెట్టి వచ్చింతర్వాత యేదో అడివిలోకొచ్చి పడినట్లుందతనికి; ఇక్కడెవరూ పెద్దగా తెలిసినవాళ్లు లేరని అతని అభిప్రాయం. వాళ్ళనీ వీళ్ళనీ హేళన చేస్తూ సొకొలొవస్కీ మాట్లాడుతూంటే వినబుద్ధయ్యేది; తనలాగానే సొకొలొవస్కీ గూడా యిక్కడున్న వాళ్ళంటే అసహ్యించుకుంటున్నాడని అనుకునేవాడు. కాని అది నిజం కాదు; చుట్టూవున్న చెడ్డతోపాటు, మంచిని గూడా చూడగల శక్తి వుంది సొకొలొవస్కీకి; మంచిని చూచినప్పుడల్లా గౌరవించేవాడు, చక్కని నీలికళ్ళదే పనిగా ఆర్పుతూ, పైప్‌ని వెలిగించలేదనే మాట గూడా మరచిపోయి అదేపనిగా పొగ పీలుస్తున్నట్లు పీల్చేవాడు పైప్‌ని. కాని ఆ మంచిని గురించి ఒక్క మాట గూడా అనేవాడుకాదు పైకి. మంచంటే అందరికీ కనబడుతుందనీ, అందరూ చూస్తారనీ; చెడ్డనెవ్వరూ చూడరనీ, చూచినా గుడ్డివాళ్ళలా నటిస్తారనీ అతని కెందుకో అభిప్రాయం పడిపోయింది. అబ్బబ్బ! చుట్టూవున్న కళ్మలం యింతా అంతాగాదు! అందుకనే ఒలోడ్యా కతనంటే అంత యిష్టం. అంత వరకు బాగానే వుంది. కాని ఒలోడ్యా అంటే సొకొలొవస్కీకి అంత ఇష్టం యెందుకు? చివరికి తానెక్కా గూడా కనిపెట్టేసిందే అతని లోతుపాతులు?

సొకొలొవస్కీ ముందు కూర్చున్నప్పుడు, ఒలోడ్యా మనిషే మారిపొయ్యేవాడు. తండ్రితో మాట్లాడుతూంటే, ఆదర్శాన్ని తిరస్కరించేవాడు; తానెచ్కా దగ్గర ప్రేమని అపహాస్యం చేసేవాడు; సబురోవ్‌తో మాట్లాడేప్పుడు కళని గేలి చేసేవాడు. కాని సొకొలొవస్కీ ముందు కూర్చున్నప్పుడు మాత్రం యెంతో ముంగిలా బిడియపడుతూ కూర్చునేవాడు. ఒలోడ్యా యింత ముంగిలా కూర్చుంటాడనీ, బిడియపడతాడనీ తండ్రికిగాని, తానెచ్కాకి గాని మాస్కోలో అతని స్నేహితులగ్గాని, మరెవ్వరికిగాని తెలియదు, ఒక్క సొకొలొవస్కీకి తప్పితే; ఒలోడ్యాలో కదిలే అసంతృప్తినీ, పారంలేని ఆలోచనల్ని, చూచి సొకొలొవస్కీ బాధపడేవాడు, నువ్వు వ్రాసిన బొమ్మలు చూపించమని సొకొలొవస్కీ అడిగితే, "అవిప్పుడు మీకు చూపించనులెండి – యెందుకూ పనికిరాని చవక బారు వవి; ఎప్పుడో ఒకప్పుడు ఒక మంచి చిత్రాన్ని, చిత్రమని చెప్పుకోదగ్గదాన్ని, గీయగలననే నా నమ్మకం; అది చూపిస్తా మీకు" అనేవాడు తడబడుతూ.

ఎప్పుడో ఒక్కసారిమాత్రం సొకొలొవస్కీ, ఒలోడ్యాని బాగా కోప్పడ్డాడు: "బ్రెయ్మిన్ కంటేనూ, ఎగొరొవ్ కంటేనూ చెడ్డవాడా ఇవాన్?" అని అడిగా డొకసారి ఒలోడ్యా. సొకొలొవస్కీ కూకలేశాడు, "నీ కింకా యిరవయ్యేళ్ళుగూడా రాలేదు, అప్పుడే పురోభాగ (యెప్పుడూ తప్పులేమూచే మనిషి)వి కాదలుచుకున్నావా? అంతకంటే వెధవపనిలేదు. పూర్వకాలంలో ప్రాపంచిక వస్తువుల్ని నమ్మగూడదంటూ, దేశదిమ్మరులై పోయి, చేదేసే సత్యాలు చెప్పేవాళ్లు యీ పురోభాగులు. నువ్వు ద్వేషించేది ఆ ప్రాపంచిక వస్తువులుగాదు. అలాంటి వస్తువుల్లో దిలిపెట్టేసి బ్రదకాలనేవాళ్ళంటేనే నీకు ద్వేషం" అంటూ, ఒలోడ్యా సిగ్గుపడ్డాడు, కాస్సేపాలోచించి, నిజంగానే తానొక్కొక్కసారి అర్థంలేని మాటలు మాట్లాడతాననీ, అలా మాట్లాడి తన తెలివి తేటల్ని ప్రదర్శించాలని చూస్తాననీ – వాస్తవానికి బ్రెయ్మినూ,

ఎగోరోవ్ మంచి నిక్కచ్చి మనుషులేననీ వొప్పుకున్నాడు. సొకొలోవస్కీ నవ్వాడు సంతృప్తిపడ్డట్లు: "సరేలే, యిక ఆ వోడ్కా తాగు" అన్నాడు.

సొకొలోవస్కీకున్న తిక్కలన్నీ తెలుసుకునే అవకాశాలు ఒలోడ్యాకి చాలాసార్లు దొరికాయి. సొకొలోవస్కీ యింట్లో వుండే కుక్క – ఆ కుక్కపేరు ఫోమ్కా – నిజంగానే మంచిది కాదు. ఒకసారి ఒలోడ్యా వేసుకున్న కొత్త పంట్లాం పట్టుకుని పీకేసింది; అంతటితో వూరుకోకుండా కాలుగూడాపట్టుకుని గట్టిగా పీకింది, తర్వాతొక వారంరోజులదాకా కుంటుతూనే వున్నాడు ఒలోడ్యా. నన్నూ అలాగే చేసింది రెండుసార్లు" అంటూ నవ్వాడు సొకొలోవస్కీ. "మీ కుక్క బలే గమ్మత్తైందే, సామాన్యంగా యీ కుక్కలు యజమానులమీద తిరగబడవే" అన్నాడు ఒలోడ్యా సాహసించి. ఎక్కడో బజార్లో కనబడితే, ఫోమ్కాని పట్టుకొచ్చాననీ, అంతకుపూర్వం అదెక్కడుండేదో; యెలావుండేదో తెలియదనీ చెప్పాడు సొకొలోవస్కీ: 'మరీ యింత తెలివితక్కువగా తయారయ్యిందంటే అంతకుపూర్వం యెంత అధ్వానంగా వుండేదో యేమో. అసలు మంచిదే, నేనంటే పడిచస్తుంది. కాపలాగూడా చాలా బాగా కాస్తుంది. మరెందుకనోగాని; అప్పుడప్పుడూ మతి చెడిపోతుందనుకుంటా యెవర్ని రక్షిస్తోందో, యెవరినుంచి రక్షిస్తోందో తెలియకుండాపోతుంది దానికి. మనుషులూ అంతే–తరచు. సహాయం చెయ్యాలనుకుంటారు, వాళ్ళకే యెదురు తిరుగుతారు.'

సొకొలోవస్కీ సంగీతం అంటే చెవి కోసుకుంటాడనే మాట గూడ నిజమే. ఒకనాటి సాయంత్రం ఒలోడ్యా వెళ్ళేప్పటికి రేడియో పెట్టుకు కూర్చున్నాడు, ఒలోడ్యా వచ్చింది గూడా చూడలేదు; 'షెస్తాకోవిచ్ ఏడవ సింఫనీ' వింటున్నాడు. ప్రసారం పూర్తయింతర్వాత గూడా మాట్లాడకుండా కూర్చున్నాడు. చివరికి, "చాలా బావుంది – లెక్కప్రకారం..."అపారం అన్నాడు. అంతే; మళ్ళీ పెదవులు కదిలించలేదు ఆ సాయంత్రమల్లా.

సొకొలొవస్కీ గదిలో వుంటాయనుకోని పుస్తకాలన్నీ వుండేవి - ఒక లావాటి జ్యోతిశ్శాస్త్రం బొమ్మల పుస్తకం, భారత దేశం చరిత్ర, స్ఫటిక శాస్త్ర సమస్యలు, కవిత్వం సంపుటాలూ. 'ఇవన్నీ ఎప్పుడు చదువుతాడు?' అనుకునేవాడు ఒలోడ్యా ఆ పుస్తకాలు చూచి: 'అసలు చదవాల్సిన అవసరంమాత్రం యేం వుంది? బహుశా నాలాగానే విసుగుబుట్టి, ఏమీ తోచనప్పుడు'... అనుకునేవాడు. సొకొలొవస్కీ యింగ్లీషు నేర్చుకుంటున్నాడని విన్నప్పుడు మరీ ఆశ్చర్యం వేసింది ఒలోడ్యాకి: "మా స్కూల్లో విదేశీభాష జర్మనీ. అసలు మూలంలోనే చదువుదామని..."

గ్రెయ్నిన్ ఒకనాడు సొకొలొవస్కీ దగ్గరకొచ్చి కూర్చున్నాడు క్లబ్బులో, అంతర్జాతీయ విషయాల్ని గురించి చర్చించేందుకు (అంతర్జాతీయ వ్యవహారాలమీద యెక్కడే వ్యాసం పడినా సరే చదివేశేవాడు గ్రెయ్నిన్; రాజకీయపు కొత్తుల్ని గురించి వాదన వేసుకోవడమంటే సరదా అతనికి). ఆ వేళ క్లబ్బులో యింకెవరూ కన్పించలేదతనికి ఆ విషయాలు మాట్లాడ్డానికి, సొకొలొవస్కీ తప్ప. వచ్చి కూర్చుని, "అసలీ అమెరికా ఫ్రాన్సుల తగాదాకి పునాదులంటూ యేమైనా వున్నాయంటారా?" అని అడిగాడు. సొకొలొవస్కీ వొక చిన్న చిరునవ్వు నవ్వాడు: "అంతర్జాతీయ వ్యవహారాల్ని కాచి, వడపోసేది మీరు; మీకే తెలియాలి. ఫ్రెంచిభాషలో లోకోక్తి వుంది, 'యౌవనానికే తెలిస్తేనా? వృద్ధాప్యమే చెయ్యగలిగితేనా?' అని. అమెరికన్లు చెయ్యగలరు, కాని చెయ్యాలనుకోరు; ఫ్రెంచివారికి చెయ్యాలనుంటుంది, చెయ్యలేరు. అసలు కూడా అదనుకుంటా". గ్రెయ్నిన్‌కేమీ అర్థంకాలేదు, ఎందుకైనా మంచిదని నవ్వేశాడు.

పనిసరిగ్గా జరగనప్పుడూ, అంతా అస్తవ్యస్తంగా, అపసవ్యంగా వున్నప్పుడూ, వ్యక్తులంటే జాలిలేకుండా ప్రవర్తించడం చూచినప్పుడూ, ఎవ్వరూ పలకరించకుండానే కేకలెయ్యడం ప్రారంభించేవాడు సొకొలొవస్కీ; యెవరు వున్నా, యెవరు విన్నా-

బ్రెయ్నన్ ఐనాసరే, పుఖోవ్, వొలోడ్యా, ఇవాన్, కార్మికు లైనాసరే – ఖాతరుచేసేవాడుకాదు, కాంటీనంతా అంత ఛండా లంగావుందే అసలా సంగతే పట్టించుకోడేమని, యూనియన్ ఆర్గనైజర్ని తిట్టేవాడు. క్లబ్బులో ఒక్కనాడూ వొకమంచి వుప న్యాసంగాని, ఒక చక్కని నృత్యంగాని, వినసొంపైన కచ్చేరీగాని పెట్టించిన పుణ్యాన పోయాడా అని క్లబ్ మానేజర్ని తిట్టేవాడు; క్లబ్బులో కెప్పుడెళ్ళినా బ్రెయ్నినే యేదో గొడవ వూకదంపు దంచు తూంటాడనీ, అక్కడున్న యిద్దరు ముగ్గురూ గురకలు కొడు తూంటారనీ, ఎప్పుడో యిక్ష్వాకులనాటి రికార్డు సంగీతం తప్పితే యేమీ వుండదనీ – ఇలాగే దుమ్మెత్తిపోసేవాడు. లోపూష్కిన్ తయారుచేసేవన్నీ పట్టినాపిరకం సరుకనీ, అవిచూస్తేవాలు తలతీసి కెళ్ళి యెక్కడో పెట్టుకోవలసి వస్తుందనీ అదేమంటే డిజైనర్ మీద పడియేడుస్తారనీ కేకలేసేవాడు. ఫాక్టరీ అంతా బాగానేవుందనీ యిదొక భూలోక స్వర్గమనీ వ్రాయడం తప్పితే వీళ్ళకిక పనేమీ లేదాఅని పత్రికేయులమీద విరుచుకుపడేవాడు; ఇంకేముంది? యిట్లా వ్రాస్తే ఆ ఇనానింకా భూమ్మీద నడుస్తాడా? అనే వాడు. అందుకనే అతన్ని చూస్తే జనానికంత భయం.

ఈ మధ్య సొకొలొవస్కీ దూకుడు కాస్త తగ్గింది, అది చూచి ఇవాన్‌గూడా కాస్త సంతోషించాడు; 'యేళ్ళు పైనబడు తున్నాయా, మనిషి చల్లబడి పోతున్నాడులే' అనుకున్నాడు. పత్రిక చదువుతూంటే "ఊఁ అది నిజమే" అంటూన్నాడిప్పుడు సొకొలొవస్కీ తరచు. ఈ మధ్యనే వొకసారి ఎగొరోవ్ వచ్చి డైరెక్టర్ని గురించి పితూరీ చేశాడు సొకొలొవస్కీకి: "వాసి లియెవ్ లేకపోతే పనిజరగదనీ, నాముల్యాన్‌ని తీసెయ్యడానికి వీల్లే దనీ చెప్పాను. ఇప్పుడింకో కొత్తరకం బెల్టులు తయారుచేస్తున్నాం గదా, అందుకని యింకొక దళం కార్మికులు కావలసి వస్తారు. ఆ విషయం ఇవాన్‌కీ తెలుసు; ఐనా వొప్పుకోడు. అసలే వున్న వాళ్ళని తగ్గించి ఖర్చు తగ్గించాలని చూస్తూంటే, యింకా స్టాఫ్‌ని

పెంచాలంటూ వేమిటని నామీద యెగిరిపడ్డాడు. ఇకలాంటి వాడితో యెలా కుదుకుతుంది?" చిరునవ్వునవ్వి, "అతని వుద్యోగమూ త్వరలోనే వూడుతుందను కుంటాలే" అన్నాడు సొకొలొవస్కీ. "నేనొకమాట చెప్పనా, మీరు విన్నారా" అంటూ ముందుకు దేకాడు ఎగొరోవ్. వినలేదంటూ తల అడ్డంగా వూపాడు సొకొలొవస్కీ. "నేనేమీ వినలేదుగాని అంతపనీ జరుగుతుందనే నా వుద్దేశం. మంత్రివర్గంచేసిన రెండు తీర్మానాలూ చదివాను - కార్మికుల కక్కావలసిన చెప్పుల్ని గురించీ, తదితర సౌకర్యాల్ని గురించీ ఆ తీర్మానాల్లో వున్నది నిజం. ప్రజలు సుఖపడాలనేదే వాటి సారాంశమూ, ఆశయమూనూ" అన్నాడు, సొకొలొవస్కీ. ఎగొరోవ్‌కి అర్థంకాలేదు. "దానికీ దీనికీ సంబంధం యేమిటీ?" అనడిగాడు. "దాన్నిబట్టిదీ, దీన్నిబట్టదీ" అని అన్నాడే గాని, అంతకంటే యెక్కువ సమాధానమేమీ చెప్పలేదు సొకొలొక్కవస్కీ.

సొకొలొవస్కీ గదిలో, గోడమీద, ఒక చక్కని అమ్మాయి ఫోటో వుంది. ఒలోడ్యా చూశాడుగాని యెవరిదని అడగడానికి సాహసించలేక పోయాడు. ఆ గది తుడిచే క్లావాకి మాత్రం చెప్పాడు సొకొలొవస్కీ ఆ ఫోటోను గురించి, అది మా అమ్మాయి [illegible] యిరవై రెండేళ్ళయ్యింది దాన్ని చూచి అని.

సొకొలొవస్కీ 1928 లో పెళ్లి చేసుకున్నాడు భార్యపేరు [illegible]ాయా; బాగా అందంగా వుండేది; అప్పుడు సాహిత్య పాఠశాలలో [illegible]దువుకుంటూండేది. ఆవిడ చూపుల్లోవుండే దైన్యాన్ని చూచీ, కని[illegible]ంచే నునులజ్జ వెనక దోబూచులాడే ఆలోచనల్నిచూచీ ఆకర్షితు[illegible]య్యాడతను. నిజంగా ఆవిడతనికి కనిపించినలాంటి మనిషేనా, [illegible]క తన వూహా ప్రపంచంలో ఆవిణ్ణలా సృష్టించుకున్నాడా అతను? అతను మాస్కో ఫాక్టరీలో పనిచేస్తుండేవాడు, గడ్డు రోజులు, తీరి కుండేదికాదు. అంతకుపూర్వం కలలుకంటూ ఒకళ్ళజోలి పట్టించు కోకుండా కూర్చునే మాయా, నెమ్మది నెమ్మదిగా తన గొప్పలు చెప్పుకునే రకంగానూ, కీచుగొంతుతో కేకలువేసే వ్యవహారం

గానూ మారిపోయిందని గుర్తించలేకపోయాడు. "మరీ కూర్చుని కూర్చుని విసుగెత్తిపోతూందా?" అనడిగేవాడు ఆశ్చర్యపోతూ. "నీ పని నువ్వుచేసుకో. నాగోడ వెందుకులే" అని వెక్కెక్కి యేడ్చేది. తర్వాత మాషా పుట్టింది. ఇక పర్వాలేదు, అంతా సరౌతుందనుకున్నాడు; కాని మాయా మారలేదు. ప్రతిరోజూ, రాత్రిపూట యింటికిరాగానే వొకటే గొడవ – అతని స్నేహితులందరూ వొకటేరకం, వొకళ్ళకంటే వొకళ్లు విసుగు పుట్టించేవాళ్ళే గాని...యిక సొకలోవస్కీ సంగతి చెప్పే అవసరమేలేదు; అతనికంటే కొయ్యకర్రముక్క మెరుగు; అసలైన జీవితం చూచిందొక్కసారే, ఓక్స్ (విదేశాలతో సాంస్కృతిక సంబంధాల నేర్పాటుచేసే రష్యన్‌సంస్థ) హాల్లో అమెరికన్ సినిమా చూచినప్పుడు; పిల్లని అమ్మమ్మ దగ్గరొదిలిపెట్టి దక్షిణ దేశానికిపోవడం మంచిది, లేకపోతే దమ్మిడీకూడా పనికి రాకుండా పోతావని చెప్పాడు డాక్టర్. అలాగే దక్షిణ దేశాని కెళ్లొచ్చింది మాయా, వచ్చింతర్వాత ముఖ్యంగా మూడు సంగతులు చెప్పింది. అక్కడికి కెళ్ళినందువల్ల మాయా ఆరోగ్యం బాగుపడలేదు, ఒంట్రుమట్టితో స్నానాలుచేసినా లాభం లేక పోయింది; ఇది మొదటి సంగతి. రెండోది; వెంటనే యిద్దరు విడాకులిచ్చేసుకోవాలి, లేకుంటే తాను బ్రదకదు, పిచ్చిదై పోతుం ఇక మూడో సంగతి: చాలా చక్కని యువకుడొకడు తటస్థపడ్డా తనకి, ప్రస్తుతం అతను వ్యాపారం చేస్తున్నాడు, తోళ్ళ వ్యాపార కాని, కాలేజ్‌లో చదువుకున్న మనిషే, లాయరు; కమ్యూని కాదనుకోండి, ఐనా పార్టీకి మంచి సానుభూతిపరుడే; అతనికి ఛన్ పాస్‌పోర్టు (ప్రయాణానుమతి పత్రం) వుంది, బ్రస్సెల్స్‌లో వుంటాడు, అవడానికి రష్యనే; అతనన్నీ విచారించి తెలుసు కున్నాడు, తనకూడా ప్రయాణానుమతి యిస్తారు, ఇంకో వారం రోజుల్లో ప్రయాణం కావాలి; మాషాను గూడా తమతోపాటే తీసుకెళ్లాలి, పిల్లలంటే అతనికి మహా యిష్టం, పడి చస్తాడు! అదీ

గాక పిల్లకి మంచి చదువుగూడా చెప్పించొచ్చు! ఇంతెందుకు అందరికీ అనువైన విషయం—మాయాకీ, మాషాకీ, సొకొలొవస్కీకీ గూడా. మాషాని గురించి మాత్రం తెలియజేస్తూ వుండమని అడిగాడు సొకొలొవస్కీ. భార్యకా కోరిక చూస్తే మనసు కరిగింది, దగ్గరకు లాక్కుని భర్తని ముద్దుపెట్టుకుంది. పెదవుల రంగు చారలు రెండు మిగిలాయి సొకొలొవస్కీ మూసిన గడ్డంమీద.

మాయా వెళ్ళిపోయిం తర్వాత తెలిసొచ్చింది సొకొలొవస్కీకి తానెప్పుడూ అవిణ్ణి ప్రేమించలేదని. ఆవిణ్ణి తలచుకోవడం మానివేశాడుగాని, మాషాని గురించి తరచు ఆలోచిస్తూనే వుండేవాడు. మొదటిరోజుల్లో పెద్ద పెద్ద భవనాల బొమ్మలూ, క్రైస్తవ మతాల బొమ్మలూ వున్న పోస్టుకార్డులు పంపుతూండేది మాయా. కూతురు బాగానే వుందని వ్రాస్తుండేది. చిట్టచివరి పోస్టుకార్డు యుద్ధానికి ముందొచ్చింది. మారుటి తండ్రంటే మాషాకి బాగా ఇష్టమనీ, రష్యన్ భాష యింకా మాషాకి గుర్తున్నదనీ, ఇప్పుడమ్మాయి పేరు మార్చి మేరీ అని పిలుస్తున్నామనీ, స్కూలుకి శ్రద్ధగా వెళ్తున్నదనీ, యీ వుత్తరంలోనే చివర, నాలుగు పంక్తులు వ్రాసేదేగాని పంతులమ్మతో కలిసి సినీమాకి వెళ్ళడంవల్ల అందుకు వీల్లేకపోయిందనీ వ్రాసింది మాయా ఆ వుత్తరంలో. "మేరీ" అని బిగ్గరగా పిలిచాడు సొకొలొవస్కీ ఆ వుత్తరం చదివింతర్వాత; తన కంఠంలోవున్న దైన్యాన్ని విని తానే వులిక్కిపడ్డాడు.

తర్వాత, చాలాకాలంవరకూ అక్కడినించి వుత్తరాలుగాని, వార్తలుగాని యేమీ రాలేదు; భార్యా కూతురూ బ్రదికున్నారో లేదోగూడా తెలియదు, మూడు సంవత్సరాల క్రితం యేదో వాళ ప్రతినిధి వర్గంతో కలిసి బెల్జియం వెళ్ళిన ఎంజినీరొకతను వొక వుత్తరం తీసుకొచ్చాడు; మేరీ వ్రాసిన వుత్తరమది. యుద్ధం పూర్తికాక పూర్వమే తల్లి చనిపోయినదనీ, యుద్ధకాలంలో బెల్జియం పడ్డపాట్లు యిన్నన్ని కాదనీ, రష్యన్లొచ్చింతర్వాత స్థిమితం యేర్పడిందనీ, రష్యన్‌గా పుట్టినందుకు గర్విస్తున్నాననీ వ్రాసింది మేరీ: యూనివర్సి

టీలో ప్రవేశించి, స్లాప్టింగ్ డాన్సింగ్ కోసమని ఆ చదువొదిలి పెట్టేసింది. ఈ రకం డాన్స్ చాలా మంచిదనీ ఆధునిక తాళాలకీ, లయకీ ప్రాచీన గ్రీసు సౌందర్యానికీ అన్వయంబాగా కుదురుతుందనీ, అదీగాక తనకి ఉపజ్ఞ వున్నదనీ అన్నారు అందరూ. అద్యతన భావిలోనే రష్యావచ్చి, తన నృత్య కౌశల్యం అంతా చూపించాలని వువ్విళ్లూరుతోంది తాను; ఇకముందు భవిష్యత్తంతా రష్యాదే. రష్యానుంచి వచ్చిన సినీమా అంటే ప్రాణం లేచివచ్చినట్లుంటుంది తనకి; రష్యామీద యెక్కడే వ్యాసంపడినాసరే, చదవకుండా వదిలి పెట్టడంలేదు తను...ఉత్తరంతో పాటు ఫోటోలు గూడా పంపింది మేరీ. అందులో వొకటి యూనివర్సిటీలో తీసింది; రెండోది గ్రీకు దుస్తులు వేసుకుని నృత్యం చేస్తూండగా తీయించుకున్నది. నర్తకి ఫోటోను తీసి డెస్కులో దాచేశాడు సొకొలొవస్కీ రెండో ఫోటో తీసి అప్యాయంగా పరీక్షచేసి చూశాడు; తర్వాత గోడకు తగిలించాడు ఫ్రేము కట్టించి; ఆ ఫోటో చూచినప్పుడల్లా విస్తుపోతూండేవాడు: ఆ అందమైన అమ్మాయి తన కూతురు కావడమూ, ఆ యమ్మాయిపేరు మేరీ కావడమూ. ఐనా యిద్దరి మధ్యా మన దనుకోదగ్గదేమీ లేకపోవడమూ - అంతా వింతే. జవాబు వ్రాశాడు; ఒక సంవత్సరం తర్వాత అదరాబాదరా రెండు పక్తులుగీసి పంపింది మేరీ పారిస్ వెళ్ళిపోతున్నాననీ, సమయంలేదనీ, అంతా దివ్యంగానే వున్నదనీనీ; అంతే యిక వుత్తర ప్రత్యుత్తరాలు జరగలేదు.

వివాహం కలిసిరాకపోయిం తర్వాత, సొకొలొవస్కీకి ఆత్మవిశ్వాసం లేకుండా పోయింది. ఎప్పుడైనా యే స్త్రీనైనా చూచినప్పుడు, ఆకర్షింపబడుతున్నానేమోననే అనుమానం కలిగితే చాలు, యిక ఆ స్త్రీవైపు చూడటమే మానేశేవాడు. అలా కొంతకాలం జరిగేప్పటి- వొంటరితనం అలవాటైపోయింది; ప్రేమని గురించీ, స్నేహాన్నిగురించీ కలలు గనడంగూడా వదిలిపోయింది. యాభైయేళ్లు దాటేదాకా అలాగే గడిచిపోయింది. ఒకనాడు

సాయంత్రం, ఫాక్టరీ క్లబ్బులో వొక స్త్రీని కలుసుకున్నాడు; ఆవిడతని మనసుని కలచివేసింది. తానూ, వీరా ఆ ప్రథమ సమాగమంలో యేం మాట్లాడుకున్నారో గూడా తర్వాత తనికి గుర్తులేదు. సంగీతాన్ని గురించి - బాచ్ సంగీతాన్ని గురించి మాట్లాడుకున్నారేమో బహుశ. కొద్ది కాలమైన తర్వాత, బజార్లో మళ్లీ యిద్దరూ తటస్థపడినప్పుడడిగాడు మీ యింటికి రావచ్చునా అని. ఇకప్పటినుంచీ వీరా యింటికి వెళ్లడం ప్రారంభించాడు, వెళ్లి కూర్చుని ఆ యోగిని ముఖాన్ని తీర్చిదిద్దే మందహాసాన్ని చూచేవరకూ, ఆవిడ మృదుస్వరాన్ని వినేవరకూ, ఆవిడ సాన్నిధ్యంలో వున్నాననే సంతృప్తి కలిగేవరకూ వూరటపడే వాడు కాదతను.

నిద్ర సరిగ్గా పట్టేది కాదతనికి - పండుకుంటే వెంటనే పండుకునేవాడు, మళ్లీ మెలకువ వచ్చేసేది, యిక చచ్చినా నిద్రపట్టేది కాదు, అలా అని లేచి తిరుగుదామంటే అందుకూ మన సొప్పేది కాదు. అలాంటప్పుడు వీరా గుర్తుకొచ్చేది; వీరా నెప్పుడు కలుసుకున్నాడో నెమరువేసుకునేవాడు - ఒక్కోసారి తమ యిద్దరి అభిరుచులూ, వుద్దేశాలూ, అభిప్రాయాలూ ఒకటే కావడం జూచి యిద్దరూ ఆశ్చర్యపోయేవారు, ఆశ్చర్యపోయి సంతోషించేవారు, సంతోషించి వొకరివంకొకరు కృతజ్ఞతతో చూచుకునేవారు; ఒకరి నొకరు పొరపాటుగా అర్థంచేసుకున్నప్పుడు కుచించుకు పోయినట్లయ్యేది వీరా, మూతి ముడుచుకున్నట్లు కూర్చునేది, కనుబొమలు ముడిపడినా, కన్నులుమాత్రం ప్రశాంతంగా, ప్రేమగా, వేసవి చివరిరోజుల్లో రాత్రిపూట వచ్చే తుపానులా, వుండేవి - ఇవన్నీ ఒకదాని వెనకొకటి కళ్లకు కట్టినట్లు కన్పించేవి. ఆవిడంటే తన నరనరంలోనూ యెంత ఆకర్షణ ప్రక్షిప్తమైవుందో చాలా కాలం ఐన తర్వాతగాని గుర్తించలేకపొయ్యాడతను. ఎప్పటిలాగానే, వేకువకి ముందు మెలకువ వచ్చినప్పుడు, ఆవిడే నాసర్వస్వం, నాసర్వస్వమూ ఆవిడే, యెంతోకాలం గడచింది నాకావిడ దొరికేప్పటికి. నాజీవితం అంతా ఆవిడకోసమే కలలుగన్నాను; ఆవిడకోసమే యెదురుచూస్తూ

కూర్చున్నాను. ఐనా యీ విషయం ఆవిడకు చెప్పను. ఆవిణ్ణోళ్లి కలుసుకోవాలి-రేపో, మాపో, యింకో వారం పోయింతర్వాతనో-వెళ్లి కూర్చుంటాను మాట్లాడకుండా, లేకపోతే యేదో వొక పిచ్చాపాటీ - ఇవాన్‌ని గురించో, నక్షత్రాల్లో వుండే మనుష్యుల్ని గురించో, చర్చిల్‌ని గురించో - మాట్లాడతాను, కావాలంటే దెయ్యాల్ని గురించీ భూతాల్ని గురించీ మాట్లాడమన్నా మాట్లాడతాను గాని ఆవిషయం మాత్రం చచ్చినా చెప్పను. ఓ వీరా, నా సర్వస్వమా, నా సంతోషమా, నా పెన్నిధీ, నా సంధ్యాప్రేమ వని పిలుచుకుంటాను నిన్ను నాలో నేను, నిన్ను కలుసుకునేందుకే, నిన్ను తెలుసుకునేందుకే, యింతకాలమూ బతికున్నానని అనుకుంటూ యెంత సంతోషిస్తున్నానని, యెంత వుబ్బిపోతున్నానని.

ఎప్పే యెప్పుడూ ఆవిణ్ణి చూస్తూవుండాలనే అనిపించినా, వెళ్ళేవాడు కాదు; తనను తానే మందలించుకునేవాడు వెళ్ళకూడదని, వెళ్తే విసుగు కలిగిస్తానేమో ఆవిడకి అనుకునేవాడు. ఒకవైపున సంతోషమూ, మరోవైపున ఆవేదనా పట్టుకుని వుక్కిరిబిక్కిరి చేసేయి వెళ్లినప్పుడల్లా; అందుకు సిద్ధపడే వెళ్ళేవాడు. పెదవులు దాటని మాటలకంటే యింకా బరువైందేముంటుంది? వెళ్ళి కూర్చునేవాడు యెవరో వచ్చి, రోగిని చూడాలి రమ్మని డాక్టర్ వీరాని వెంటబెట్టుకెళ్ళి పొయ్యేవాళ్లు; అలా యెవ్వరూ రాకపోయినా అతనక్కడ కూర్చునేవాడుగాదు - లేచి వెళ్ళిపోవడమే మంచిది, మళ్లీ యిదివరకటిలాగానే ఆవేదన, ఆమర్దా, వేచి చూడడం.

ఇప్పుడు వీరాని చూడగానే తెలిసింది వచ్చిన సమయం మంచిదికాదని: వీరా విచారంగా వున్నది, అందుకాకారణమేమిటో తెలిసే అవకాశం లేదు తనకి, ఆవిడకాశ్వాసన నీయగలశక్తి అసలే లేదు.

ఫెదొసొమెవ్ చనిపోయాడనీ, కుద్ర్యావ్ త్సెవ్ కొడుకు కొత్త కోలుకున్నట్లున్నాడనీ, అది చూచి తల్లి సంతోషిస్తూంది కాని

ఆ బిడ్డ బ్రదకడం కష్టమేననీ చెప్పుకొచ్చింది; నిజమే యీమధ్య చాలా కొత్త మందులు కనిపెట్టిన మాట నిజమే....ప్రజలకూడా మందులంటే నమ్మకం కుదిరింది, డాక్టర్ల వంక ఆశతో చూస్తారు మమ్మల్నెలాగైనా రక్షించాలనీ, రక్షించగలరనీనీ; యేం లాభం, యీ నిస్సహాయతని చూస్తేనే భయంకరంగా వుంది!

ఇప్పుడిప్పుడే ఆలోచించడం నేర్చుకుంటున్నారు, మనుషులు అన్నాడు సొకొలొవ్‌స్కీ: అణు విదారణమంటే అదేదో అందరికీ సాధ్యంకానిదీ, అలౌకికమూ ఐనట్లు కన్పిస్తోంది యిప్పుడు మనకి. కాని కొంతకాలంపోతే యిప్పుడు చెకుముకి నిప్పూ, బండి చక్రమూ అంటే యెంత తేలిగ్గానూ సర్వసాధ్యంగానూ, సర్వసామాన్యంగానూ చూస్తామో-అదీ అంతే ఔతుంది. పురోగమనం అనేది యెప్పుడూ జరుగుతూనే వుంటుంది, అంచేత అంత నిస్సహాయతంటూ యేమీ వుండదు; తప్పక మార్గం కన్పిస్తుంది, ఆశ సఫలమౌతుంది.

"అది నిజమే కాని మీరు చెప్పేదంతా మెట్టవేదాంతం. నా పనంతా బ్రతికున్న వాళ్ళతో. నేను కాపాడాలనుకునేదీ, కాపాడలేక పోతూన్నదీ యీమనుషుల్నే, క్రిందటి సారొచ్చినప్పుడు ఖగోళశాస్త్రం అంటే మీకు బాగా యిష్టమని చెప్పారు. తర్వాతాలోచిస్తే జ్యోతిషం మనస్సుకి ఆశ్వాసన నిస్తుందేమో ననిపించింది నాకు. మీరేదో వొక శుభోదయాన యే నక్షత్రలోకంలోనో, వీనస్ మీద నిలబడో మా వంక చూస్తారేమో" అంటూ నవ్వింది వీరా; నవ్వి, "దాంతో మీకు మనశ్శాంతి గలుగుతుందిగా! అన్నది వీరా.

"ఎలా? పూర్తిగా వ్యతిరేకం జరుగుతుంది. అనంతాన్ని గురించి ఆలోచిస్తారనుకోండి మీరు - లేదూ మనకి స్కూళ్ళలో చెప్పినట్లు ఒక మహాశయాన్ని గురించి ఆలోచిస్తారనుకోండి - అత మాత్రానప్రస్తుత క్షణాన్ని మావేసినట్టూ, లక్ష్యం చెయ్యనట్టూ

కాదు గదా? అనంతంగా ప్రాముఖ్యం గున్నదమంటే నామట్టుకు నాకు - ఆ అనంతం వర్తమానంలో అంటే ఈ నిమిషంలో కూడా వుంటుంది కాకపోతే యేమిటంటే యీ అనంతమనేది యీ వర్తమానాన్ని గూడా, యీ నిమిషాన్నిగూడా దాటేంతర్వాత ఇలాంటి నిమిషాలూ, తరాలూ, ప్రపంచాలూ, జీవితాలూ ఇంకా అనేకం, అనంతంగా వుంటాయన్న మాట" అన్నాడు సొకొలొవస్కీ.

సొకొలొవస్కీ చెప్పే మాటలు వింటూనే వున్నా, వీరా మనసక్కడలేదు, ఎలీనా కళ్లల్లో కప్పిన ఆవేదన గుర్తొచ్చింది వీరాకి; 'ఎంత పొరపాటుచేశాను. ఎలీనా వెళ్లిపోతుంటే చూస్తూ వూరుకున్నానే పాపిష్టిదాన్ని. ఇంకో వ్యక్తిని అర్థం చేసుకోవటమంటే మాటలుగాదు; దూరంగావున్న గ్రహంలో వుండే సముద్రాన్నయినా చూడగలమేమో కాని, యింకో వ్యక్తిని అర్థం చేసుకోలేం. నన్నేదో ఓదార్చాలని అనుకుంటాడీయన - సొకొలొవస్కీ. నేనక్కడికీ ఎలీనానైనట్టు...ఊరికే నిరుత్సాహం; శుద్ధ దండగ'.

"ఛీ, వొట్టిపాడుమంచు!" అన్నదిపైకి. కారణం లేకుండానే.

అతను తల వూపాడు.

"పత్రికల్లో వాతావరణ సూచనల ప్రకారం యీ రాత్రి 35 డిగ్రీలుంటుందట"

అంతే ఇక ఇద్దర్లో యెవరూ మాటాడలేదు. వీరావంకే చూస్తూ కూర్చున్నాడు. సొకొలొవస్కీ, దృష్టిమర్లించుకోలేక పోయాడు; యేదో చెప్పాలని తహతహ; చెప్పలేనని తెలుసు. అతనలా చూడడం యిబ్బందిగా వుంది వీరాకి, యేమీ పట్టనట్లు కూర్చుంది అలాగే.

వెళ్లిపోదామనుకుని, లేద్దామనుకుంటూనే, వున్నవాడున్నట్లు "నిన్న బొటానికల్ గార్డెన్స్‌లో వొక మొక్క చూశాను, యేదో

యెడారి మొక్క - మీకుచూసే వుంటారు, చాలామంది కిటికీల్లో పెట్టుకుంటారు గూడాను, మనక్లబ్బులో గూడా వుందొకటి. వైద్యానికూడా పనికొస్తుందని చదివాను యెక్కడ్నోగాని... సరే అదలా వుండనీండి; మొట్టమొదట ఆ మొక్క తీసుకొచ్చింది, యెవరో కుర్రవాడట...అతనికది మొట్టమొదట దొరికినప్పుడు, తీసుకెళ్ళి చిన్నకుండీలో పెట్టాట్ట, అదా మొక్కకి సరిపడింది గూడా కాదు. యికతనికదొక్కటి తప్ప పూలమొక్కలేమీ లేవు; అంచేత ఆ మొక్కనెలా పెంచాలో గూడా అతనికి తెలియలేదు అందుకని వొక పుస్తకం కొనుక్కొచ్చాట్ట. ఆ మొక్క యెడారుల్లోనే కాని పెరగదనీ, అంచేత దానికి సారవంతమైనమట్టి వెయ్యగూడదనీ, నీళ్లు ఆట్టే పొయ్యగూడదనీ వుందట ఆ పుస్తకంలో తనదగ్గరా యింకేమీ మొక్కలులేవు; ఆ మొక్కని పెంచుకోవాలనేమో మహా యిష్టంగావుంది. ఆ పుస్తకంలో వున్నమాటలు చదివితే అతనికేమీ నచ్చలేదు; పుస్తకంతీసి దూరంగా పారేశాడు. మొక్కకి బాగా యెరువేశాడు; చక్కగా నీళ్లు పోశాడు; మల్లె మొక్కని పెంచినట్టు పెంచాడు. యేమయ్యిందనుకున్నారు? నవనవలాడుతూ పెరిగిందా మొక్క, యిక యింట్లో వుంచటానికూడా వీల్లేనంతగా పెద్దదైంది, తీసుకెళ్ళి తోటలో పెట్టాడు. ఇప్పుడది నాకెందుకు గుర్తుకొచ్చిందో చెప్పలేను కాని... సరే మిమ్మల్ని అనవసరంగా విసిగించాననుకుంటూ......మిమ్మల్ని చూద్దామని అనిపించి..." అంటూ తడబడ్డాడు సోకాలొవస్కీ.

అంతవరకూ కూర్చునివున్నదల్లా లేచి, వెనక్కి తిరిగి, "నాకేమీ నమ్మకంలేదు...అదే, ఆ మొక్కనిగురించి, చెబుతోన్నా. యెడారికి అలవాటుపడ్డ మొక్కలకి అలా యెరువూ, నీళ్లూవేస్తే, అది చచ్చిపోవాలనుకుంటుంది. వృక్షశాస్త్రం నాకేమీ తెలవదనుకోండి...క్షమించండి, అలసిపోయాననుకుంటా, తలనొప్పిగాగూడా వుంది." అన్నది వీరా, ప్రాణంలేనట్టు, నెమ్మదిగా.

గబగబా బయటికి వెళ్ళిపోయాడు సొకొలొవస్కీ. బయట చలిచలిగా వున్నది వెన్నెల: ఊపిరి బయటికి వస్తే చాలు, మంచు ఐపొయ్యేట్లుంది; ఎగిరే ఎగిరే పక్షులు చలికి గడ్డకట్టుకుపోయి, రాళ్ళలా క్రిందికి తపతపా పడేట్లుంది. ఉపయోగంలేని వెలుతుర్లో, బజారునపడి, అడుగులేశాడు సొకొలొవస్కీ విచారంలో మునుగుతూనూ. తేలుతూను. అతని పెదవులు కదలుతున్నై; కదలినప్పుడల్లా ఆవి రిమేఘాలొస్తున్నాయి బయటికి. తనలో తాను మాటాడుకుంటున్నాడో, లేక విచారంగా, కలలో, మాటలూ లేకుండా పెదవులు వుట్టినే కదుపుతున్నాడో; యేమో?

# 7

క్లాసులో పాఠాల పని ముగించుకుని ఎలీనా బయటికి వచ్చిందో లేదో, యింతలోనే పుఖోవ్ కన్పించాడు. ఆవిడంత సంతోషపడటానికి ఆ నెలలో అదే ప్రథమం. పుఖోవ్ కన్పించీ కనబడడంతోనే ప్రారంభించింది తన బాధలన్నీ యేకరువు బెట్టడం: యేడో క్లాసు పిల్లలెప్పుడూ వెనకబడే వుంటున్నారు; బురోకోవ్, చిజికోవ్‌ల సంగతి చెప్పేపనేలేదు, చిజికోవ్ మరీనీ - స్కూలు యెగ్గొడుతున్నాడు, పొగ పీలుస్తాడు. గల్లంతు మూకలో చేరి పోయాడు.

పుఖోవ్ ఎలీనాకి ధైర్యం చెప్పాడు, వెళ్లి మీషా తల్లిని కలుసుకోవడం మంచిదన్నాడు, చిజికోవ్‌తో "నేను వాణ్ణి మూడో తరగతినించీ యెరుగుదును; వూరికే రెట్టిస్తాడు, అంతే, చెడ్డవాడేం గాదు."

కలిసి యింటిదాకా వచ్చి సాగనంపుతానంది ఎలీనా, పుఖోవ్‌తో; యింటికి తొందరగా వెళ్లాల్సిన పనేమీలేదని. ఇవాన్ భోజనం అయ్యేవరకూ యింటికెళ్లకుండా వుండాలనే ఆవిడ ప్రయత్నం, యీ మధ్య ప్రతిరోజూనూ.

భర్తని వొదిలిపెట్టక తప్పదని ఆవిడ గుర్తించి చాలా రోజులైంది, ఐనా ఆవిడ జీవితంలో యింతవరకూ మార్పేమీ రాలేదు, దేన్ని గురించీ ఒక నిర్ణయానికి రాలేకపోతూంది. ఒక్కోసారి నిస్పృహతో తననితానే తిట్టుకుంటుంది, యెందుకూ పనికిమాలినదానై పోతున్నానే అని. 'యిక నా బ్రతుకే యింత. పెరిగి పెద్దదైనంతర్వాత నన్ను చచ్చేట్లసహ్యించుకుంటుంది షూరా, తప్పదు'.

పుఖోవ్ మాట్లాడుతూనే వున్నాడు:

"నీకొక బలే సంగతి చెప్పాలి ఎలీనా. కోస్త్యాని యెరుగుదువుగా నువ్వు, నీ దగ్గిరే చదువుకుంటున్నాడు గూడాను, మొన్న వేసవికాలంలోనే యీ స్కూల్లో నుంచతను వెళ్ళిపోయింది - కాదు కాదు. ప్ర్యాగిన్ కాదు. యింకో కోస్త్యా, చెర్నిషెవ్ కోస్త్యా, ఎర్రటి జుట్టుండేదే, అతను. చాలా మంచివాడు, తెలివితేటలున్నవాడు, బాగా చదువుతాడు ఆలోచిస్తాడు. అతని వెనక చరిత్ర భయంకరంలే - తండ్రేమో యుద్ధంలో చనిపోయాడు. తల్లేమో తాగుబోతుని పెళ్ళిచేసుకుంది. ఇన్‌స్టిట్యూట్‌లో చేరేందుకని అప్లికేషన్ పెట్టాడు కోస్త్యా, చేర్చుకోడానికేమీ అభ్యంతరం గూడా లేదు, మెడల్స్‌గూడా వున్నాయతనికి. యింతకీ వాళ్ళత్తెక్క చేర్చుకోం పొమ్మన్నారు విన్నావా! ఇదీ గమ్మత్తు ఖాళీల్లేవన్నారు, ఈసారి పరీక్షలయ్యేదాకా ఆగాలన్నారు. కుర్రాడేమో గాభరా పడిపోయ్యాడు, ఆ తాగుబోతు వెధవ అదే సమయానికి యింట్లో నుంచి గూడా వెళ్ళగొట్టేశాడు. ఒకటే గొడవ. యేం ఫర్వాలేదు వాళ్ళు చేర్చుకున్నారే అనుకుని నీపని నువ్వు చేసుకో అని చెప్పా కోస్త్యాకి. చెప్పి నేను డైరెక్టర్ దగ్గరికెళ్ళా - ఆ డైరెక్టర్ సంగతి నీకూ తెలుసుగా, చెబుతూంటే, ప్రతిదానికీ వూఁగొడుతూనే వుంటాడు, చివరికేమీ చెయ్యడు. పట్టణ కమిటీ దగ్గరికి పరుగెత్తితే, పరీక్షలయ్యేదాకా ఆగవలసిందే, మధ్యలో మేమాత్రం యేంచెయ్యగలం! అన్నారు. ఏం? యెందుకు చెయ్యలేరని అడిగా. కోస్త్యా పోస్టల్ కరస్పాండెన్స్‌లో చదువుతూనే వున్నాడు, వెనకేమీ బడిపోన్నా. ఇలాంటి అసామాన్య పరిస్థితుల్లో మంత్రివర్గమే యేమన్నా చెయ్యాలిగాని మావల్ల కాదన్నారు వాళ్ళు, మంత్రివర్గానికి రాశా. చేర్చుకోడానికేమీ అభ్యంతరం లేదుగాని, అంతిమ నిర్ణయం డైరెక్టర్‌దేనని జవాబొచ్చింది, అక్కణ్ణించి మళ్ళీ డైరెక్టర్ దగ్గిరికెళ్ళా, మంత్రివర్గం రాసిన జవాబు చూశాడు, తలూపాడు; నిజమే, బంగారంలాంటి కుర్రాడికి అవకాశం యివ్వకపోవడమంత సిగ్గుమాలినపని లేదన్నాడు, ఐనా

ఫలాని పని చెయ్యాలని మంత్రివర్గం యేమీ నిశరంగా తేల్చలేదు కాబట్టి తానేమీ చెయ్యలేనన్నాడు...సరేనమ్మా! యిక రంగంలోకి దిగాననుకో నడుం బిగించి. అదేమిటదేమిటని సరాసరి నేరుగా మంత్రికే రాశాను వుత్తరం, ఆకుర్రాడికి నేనే చదువు చెప్పాననీ, మంచి తెలివితేటలున్నవాడనీ, అతన్ని చేర్చుకోకపోవడం అన్యాయమనీ అతని వెనక చరిత్ర ఫలానా ఫలానా అనీ... ఇదంతా జరిగింది క్రిందటేడు. ఇక, యిప్పుడు, యివ్వాళ, ఒక వుత్తరం తెచ్చిచ్చింది మా యింట్లోది – కోస్త్యాని చేర్చుకునేందుకు ఉత్తరువులు పంపామని ఉపమంత్రి రాశాడా వుత్తరం. చూశావా, ఎలీనా, యెంత గొప్ప పని సాధించావో!"

పుఖోవ్ వంక చూచి చిరునవ్వునవ్వింది ఎలీనా: అతన్ని చూస్తేనే ఆశ్చర్యం వేస్తుంది. పుఖోవ్ జబ్బుగా వున్నాడని తెలుసు; యికే జేసినా లాభంలేదనీ, యే గొడవా పెట్టుకోకుండా, వున్న చోట వుంటే యింకో యేడాది బ్రతుకుతాడేమోననీ చెప్పింది వీరా – యే గొడవా పెట్టుకోకుండా వొక్క క్షణంగూడా వుండలేడు, ఆ జబ్బున్నవాళ్లకి బాగా నొప్పులొస్తాయనిగూడా చెప్పింది వీరా. నొప్పిగా వున్నదని అంనే అన డీ మనిషి, తన జబ్బునిగురించి యితరులకి తెలియనీగూడదనుకుంటాడు. కోస్త్యాకి ఇన్‌స్టిట్యూట్‌లో చేరేందుకవకాశం వచ్చిందని తెలిసి పట్టపగ్గాల్లేకుండా సంతోషపడిపోతున్నాడు. 'ఇప్పుడర్థం ఔతోంది విప్లవం తెచ్చిన మనుషులెలాంటివాళ్లో. వీళ్లని చూచైనా బాగుపడగలనా? ఈయనప్రక్కన నడిస్తేనేచాలు, మంచివాళ్లం ఐపోయ్యామనిపిస్తుంది.' అనుకుంది ఎలీనా.

"వెళ్తానమ్మా, వెళ్ళి యీ శుభవార్త కోస్త్యాకి చెప్తాను. అతనూ, అతని స్నేహితుడు, సాన్నికోవ్, యికో గది తీసుకుని వుంటున్నారు. సాన్నికోవ్ గూడా నా దగ్గర చదువుకున్నవాడేలే, మంచివాడు, కోస్త్యాని తన గదిలోనే వుంచిపోమ్మన్నాను. వాళ్ళ గది లెనిన్ వీధిలో వుంది. వెళ్లొస్తానమ్మా" అన్నాడు పుఖోవ్.

"లెనిన్ వీధంటే చాలా దూరంగద, మీరంతదూరం నడవ గలరా? యెందుకు, పోనీ నే వెళ్ళి అతన్నిక్కడికి తీసుకొస్తాను" అన్నది ఎలీనా.

"నువ్వెందుకమ్మా? నేనే వెళ్తాలే, సాన్నికోవ్‌నిగూడా చూచొచ్చినట్లుంటుంది. మరీ పనికిరాకుండా పోయాననుకుంటున్నావా నేను? లేదమ్మా, ఇలాగే యీడ్చుకొస్తుంటా, చూస్తుండు. నిజంగా, యివ్వాళా వుత్తరం చూస్తే పద్దెన్లు పడుమదనం వచ్చినట్లయిందమ్మా నమ్ముతావో లేదోగాని. నిజం చెప్పనా, రాసిన వుత్తరం తిప్పి మళ్ళీ ఆ ఇన్‌స్టిట్యూట్‌కే పంపుతారనుకున్నా; సామాన్యంగా అట్లాగే జరుగుతూంటుంది; మొత్తంమీద తెలుసుకున్నారన్నమాట, అదీ విషయం; మొత్తంమీద సాధించావన్నమాట!"

చూపు బాగానే ఆనుతున్నా, కాళ్ళతో తడుముకుంటూన్నట్లు అతి జాగ్రత్తగా నడవడం ప్రారంభించాడు పుఖోవ్. పదడుగులు వేసి, ప్రక్క షాపుల్లో వస్తువుల్ని చూస్తున్నట్లో, గోడ కంటించిన పాత పోష్టర్లు చదువుతున్నట్లో నిలబడడం. 'నడవలేకపోతున్నాడనుకుంటూ' అనుకుంది ఎలీనా భయంభయంగా. పుఖోవ్ చెయ్యి అందుకుంది ఆధారం యిద్దామని.

పుఖోవ్ నవ్వాడు: "మళ్ళీ నవయవ్వనం వొచ్చిందమ్మా నాకు—ఫాస్ట్‌లాగా, వయస్సులోవున్న స్త్రీ చెయ్యిపట్టుకొని నడవడంతో" అన్నాడు.

చాలా హుషారుగావున్నాడు, నవ్వుతూనూ, హాస్యమాడుతూనూ, ముఖం చూచినా అలాగే వుంది పడుచువాడి ముఖంలా.

పుఖోవ్‌ని వదలిపెట్టి, యింటికి వెళ్తూగూడా, అతన్ని గురించే ఆలోచించింది ఎలీనా. ఇదివరకెప్పుడూ, యింటిదగ్గర కొచ్చేప్పటికి, చేతిగడియారం చూచుకుని, భోజనం చేసి ఇవాన్ బయటికెళ్లాడా లేదా అనుకుంటూ తారట్లాడడం ప్రారంభించేది ఎలీనా, ఇవ్వాళసంగతేమరచిపోయింది: రోజూళంటే పెందలకాడే యింటికొస్తున్నా

వనీ, ఇవాన్ యింకా యింట్లోనే వుంటాడనీగూడా తోచలే దావిడకి.

ఈజీచైర్‌లో కూర్చునున్నాడు ఇవాన్, పత్రిక చదువు కుంటూ. "మంచిదే, వచ్చావన్నమాట, యివ్వాళగూడా వొంటరి గానే భోంచెయ్యవలసొస్తుందేమో ననుకుంటున్నా" అన్నాడు ఎలీనాని చూచి.

ఎలీనా అలాగే నిలబడిపోయింది శిలాప్రతిమలా, ఇవాన్‌కి జవాబూ చెప్పలేదు; వంటింట్లోకీ వెళ్ళలేదు. ఇవాన్ ఆశ్చర్య పొయ్యాడు.

"ఏవిఁటీ కథ?" అన్నాడు.

అతని కెదురుగుండా, కుర్చీలో కూర్చుని, "యేమీ లేదు ... మీతో మాట్లాడాలని. ఎక్కడికీ వెళ్ళకుండా యింట్లోనే వున్నారు, బ్రదికించారు. చాలారోజుల్నుంచి చెబుదామనుకుంటున్నాను; ఏరోజు కారోజు రేపు రేపనుకుంటూ వస్తున్నా. ... మన మిక కలిసి వుండలేం. కోప్పడకండి ... మీరూ అలాగే అనుకుంటున్నారు, అందులో సందేహం లేదు. చాలా రోజుల్నుంచి సందేహిస్తున్నా నేను - షూరాని చూచి - ఇక సందేహించి లాభం లేదనుకున్నా." అన్నది ఎలీనా తొణక్కుండా, బెణక్కుండా. గొంతు గద్గదమైంది యింతవరకూ మాట్లాడేంతర్వాత; మళ్ళీ నిభాయించుకుని, "ఇదంతా మొంత బాధాకరమో నాకూ తెలుసు, నేనూ బాధపడ్డాను; కాని యేం జేస్తాం, తప్పదు. ఇక నావల్లకాదు మీతో కలిసివుండడం. ఒకవేళున్నా, అది ఋజుప్రవర్తన కాదు; మోసం అన్నది.

ఎలీనా వూరికే అలా అంటూం దనుకున్నాడు ఇవాన్. మనిషి కాస్త బాలెన్స్ తప్పిందనీ, కోపంవచ్చినప్పుడు ఒళ్ళు తెలియ కుండా మాట్లాడుతుందనీ అనుకునేవాడు అప్పుడప్పుడూ. తాను గూడా కేకలేస్తే తగ్గుతుందనుకున్నాడు. అనవసరంగా నలుగురికీ తెలిసేట్లు పోట్లాడుకోడం మంచిదికాదని చెప్పింది ఎలీనా; ఒకళ్ళ నొకళ్ళు అర్థంచేసుకుని, స్నేహితుల్లా విడిపోవడం మంచిదన్నది.

ఇద్దరూ లేచి భోంచేశాక, మాట్లాడకుండా; ఆఫీసు కివ్వాళ వెళ్ళననీ, యింట్లోనే కూర్చుని బ్రెయిన్ పథకాన్ని గురించి ఆలోచిస్తాననీ అన్నాడు ఇవాన్. ఎలీనా వెళ్ళిపోయింది. కూర్చుని జరిగిందాన్నిగురించి ఆలోచించాడు. బహుశా ఎలీనా యింకెవరినో ప్రేమిస్తోంది, లేకుంటే యిలా మాట్లాడ దనుకున్నాడు. ఈ మధ్య కొన్ని వారాల్నుంచీ సరిగ్గా యింటికి రావడం లేదు; వుండడంలేదు. 'ఒలోడ్యా కాదుగదా? ఎలీనాతో బాగా స్వతంత్రంగా కూడా వుంటాడు. మాస్కోలో యెందరో కొందరు ఆడవాళ్లుండి వుంటారు లాంటి వాడికి కనీసం, అందుకు సందేహం లేదు. నేను చాలా మంచి వాణ్ణి, అదన్నీ నమ్ముతాను, అసలు చిక్కదీ. తనలో తానవ్వేపనిగా నవ్వుకుంటుందనుకుంటూ ఎలీనా నన్ను చూచి.'

ఎలీనా ఆలస్యంగా వచ్చింది యింటికి. వచ్చేవరకూ కాచుకూర్చున్నాడు ఇవాన్, రాగానే శల్యపరీక్ష చేస్తున్నట్లు చూశాడు ఆవిడవంక; ఆచూపు తప్పించుకుంది ఎలీనా. 'సరాసరి వాడిదగ్గర్నుంచే వస్తోందేమో' అనుకున్నాడు ఇవాన్. పాడుకోట్లు కడతావని అనిపించిందిగాని, తమాయించుకున్నాడు. ఆవిడ చెప్పినమాట నిజమే, నలుగుర్కీ తెలిసేట్టు తగాదా పెట్టుకుని ప్రయోజనం లేదు.

"ఇంకెవరైనా ప్రేమిస్తున్నావా నువ్వు ఎలీనా?" అనడిగాడు, నెమ్మదిగానే, గోము చేస్తున్నట్లు.

తోక తొక్కిన తాచులా లేచిందావిడ.

"అదంతా మీ కెందుకు? అసలా ప్రసక్తెందుకూ యిప్పుడు ...మీతో కాపురం చెయ్యలేనని వున్నమాట చెప్పాను. చెయ్యాలనే ప్రయత్నంచేశాను, నావల్ల కాలేదు...యిదంతా యెవరి మూలానో అని అనుకోడం పొరపాటు...నేను కాపురం చెయ్యలేనిక నీతో; అంతే, అర్థమైందా?"

"ఎందు కనవసరంగా అలా రెచ్చిపోతావ్? ఇదేమీ ఆషామాషీ వ్యవహారం కాదుగా, రేపు మాట్లాడుకుందాంలే

యివ్వాళ్టికి కట్టిపెట్టు, చాలు. ఇద్దరమూ గొంతు చించుకుంటే ప్రయోజనం యేంవుంటుందిగనక."

మళ్లీ టేబుల్ మీద కాగితాలు పరచి, వాటిమీదికి వంగి, భవిష్యత్కర్తవ్యం యేమిటో ఆలోచించడం ప్రారంభించాడు. ఎలీనా కెవడో ప్రియుడున్నాడనే విషయాన్ని గురించి యికతని కేమీ సందేహం లేదు. 'పచ్చి భోగందానిలాగా తయారైంది. అందులో సందేహమేమీ లేదు. ఇంతకీ కావాలని పెళ్ళిచేసుకున్నది నేను, యెవర్నో అని యేమిటీ లాభం? అసలు లోకమే అలావుంది - పిల్లల పెంపకమే యింతబాగా యేడ్చింది, ఒక నీతీ, నియమమూ అంటూ లేకుండాపోయింది. వాళ్ళకి యేమీ తోచదు - పట్టణమేమో దూరం, అక్కడి కెళ్ళినా మనస్సుని ఆహ్లాదపరచేవేమీ వుండవు. ఖిత్రోవ్ భార్య బాగానే వుంటుందే మరి, యెప్పుడూ ఆ యిల్లూ, పిల్లలూ, తనూ - అంతే; యింకో గొడవే పట్టించుకోదు. అంటే వొకటుంది: ఖిత్రోవ్ భార్య బాధ్యత తెలిసిన మనిషి; వీళ్ళలాగా చౌకబారు సీతాకోకచిలుక గాదు. ఇంతకీ యిదంతా నా దురదృష్టం ... ఐనా విడాకు లివ్వగూడదు, తేలికైపోతాం. ఒక కూతురుగూడా వుంది; షూరాని తండ్రిలేనిదానిగా ఎట్లా చెయ్యను? నావల్లగాదు ...'

లేచి; షూరా పడుకుని నిద్రపోతున్న గదిలో కెళ్ళాడు. చాలాసేపు అలాగే ఆ నిద్రపోతున్న కూతురువంక చూస్తూ, మొఖాన పట్టి, దవడలమీదుగా కిందికి కారుతూన్న చెమటని తుడుచుకుంటూ నిలబడిపోయాడు; బిగ్గరగా ఊపిరి పీల్చాడు. 'చచ్చినా తీసుకుపోనివ్వను నా కూతుర్ని.'

తెల్లవార్లూ మేలుకునే వున్నాడు, కంటిమీద కునుకు లేదు. ప్రొద్దున్నే లేచి,

"ఎలీనా, నీయిష్టం వచ్చినట్టుండు, నా కేమీ అభ్యంతరం లేదు. విడాకులమాటమాత్రం యెత్తనద్దు; షూరాసంగతి మరిచిపోగూడదు మనం" అన్నాడు భార్యతో.

తానుగూడా యెప్పుడూ షూరాగురించే ఆలోచిస్తూ వుంటాననీ, ఇవాన్ యిష్టంవొచ్చినప్పుడల్లా షూరాని చూడచ్చు ననీ, కావాలంటే చెప్పినప్పుడల్లా తానే తీసుకువచ్చి, షూరాని చూపించివెళ్తాననీ, ఫాక్టరీ దగ్గరదాపుల్లోనే ఒక గది తీసుకు వుంటా ననీ, స్కూల్లో వుద్యోగం మాననసీ చెప్పింది ఎలీనా.

ఇవా నేమీ మాట్లాడ లేదు. కాని ఆవాళల్లా ఎలీనా మాటలు తప్పితే యింకొక విషయమే ఆలోచించ లేకపోయ్యాడు. 'అసలు యెలీనా బుర్రే చెడిపోయిందనుకుంటూ, వాణ్ణి వదలిపెట్టాలంటేనే గడ గడ వణకిపోతూంది. ఛ, ఎంత అపవా దెంత అపవాదు! ఇంకా తలెత్తుకు తిరగ్గలనా. డైరెక్టర్ భార్య ప్రేమికుడి గదిలో నివాసమా? పట్టణంవంతా హేకిలి చెయ్యదూ, మాస్కూలోవాళ్ళ కిలాంటివంటే అసలు పొడగూడా గిట్టదు.'

మంచీ చెడ్డా ఆవిడకి తెలియజెప్పాలని చూశాడు ;" యిదిగో నా చిన్నప్పుడంటే అది వేరు. వయస్సులో వున్నవాళ్లు పోస్టాఫీసు కెళ్ళొచ్చినట్లెళ్ళొచ్చేవాళ్ళు పెళ్ళిళ్ళ రెజిస్ట్రేషన్ ఆఫీసుకి—ఇవ్వాళ పెళ్ళి, రేపు విడాకులూ అన్నట్లుండేది. ఇప్పుడలా కాదుగా. శాస నాలు మారాయి. అప్పటిలాగానే యిప్పుడూ చెయ్యాలంటే కుదరదు. జనంగూడా వొప్పుకోరు ; యిలాంటమ్మాయి స్కూల్ టీచర్‌గా యెలా పనికొస్తుందంటారు. సరే యిక నాకొచ్చే కష్ట నష్టాల సంగతి చెప్పనే అక్కరలేదు—పార్టీ సభ్యుణ్ణి, ఒక పెద్ద సంస్థకి డైరెక్టర్ని. ప్రేమసంగ తెలావున్నా, యీవిషయాలన్నీ ఆలో చించాలి నువ్వుగూడా."

ఎలీనా మాట్లాడ లేదు.

మర్నాడుగూడా ఆ విషయం యెత్తలేదు ఎలీనా. ఒక వారం రోజులు గడిచాయి. ఇవాన్ కాస్త స్థిమితపడ్డాడు : 'తానుగూడా సబబూ బేసబబూ ఆలోచించినట్లుంది; యేవో నియమాలూ, సరిహద్దులూ వుండాలనే అనుకున్నట్లుంది...' ఆవిడంటే కాస్త జాగ్రత్తగా మసలుకున్నాడు, ప్రశ్న లడగడం మానేశాడు, సాధ్యమైనంతవరకు

ఆవిడకు విసుగు కలిగించకుండా దూరం దూరంగా వున్నాడు. 'ఏమో, యిద్దరవూఁ యిలాగే కాలం వెళ్ళబుచ్చగలమేమో. పెద్ద ప్రమాదంమాత్రంవేఁ జరిగింది. నా వుద్యోగం నాకుండనే వుంది, నేనంటే అందరికీ నమ్మకవూఁ వుంది; అందులో సందేహం లేదు. మొత్తంమీద నాకీ ప్రేమవ్యవహారాలంటే అంత గిట్టదు. షూరా అంటేమట్టుకు అపరిమితమైన యిష్టంవుంది నాకు; అమ్మాయిగూడా నేనంటే అట్లాగే వుంటుంది. ఎలాగైతేనేఁ అపవాదులు పుట్టకుండా వుంటే, అంతే చాలు. ఎన్ని కటుంబాల్లో జరగడంలేదు యిలాంటి ఖండాలప్పనులు, వాళ్ళంతా వీనిబిబడుతున్నారుగనుకనా. ఈ నవలా రచయితల్ని బలేబాగా విమర్శించాడు డిమిట్రీ; అట్లాగే విమ ర్శించాలి-మనం యిప్పుడు చరిత్రాత్మకకాలంలో వున్నాం, యిలాంటి తప్పుడుపనుల్లో వేలుపెట్టరు మంచివాళ్లు ... మంచిపనిచేశాడు డిమిట్రీ; బ్రహ్మచారిగానే వుండిపోయాడు. ఇలాంటి చీకూ చింతా యేమీవుండ వతనికి. అసలు డిమిట్రీ చాలా మంచివాడు, బ్రెయ్నిన్ పథకాన్ని గురించి అతను చెప్పిందంతా కరెక్టే - ఎట్లాగైనా దీనికంతకీ మాస్కో ఒప్పుకోవాలి - ఐనా అదంతా వాళ్ళయిష్టం; యిష్టంవచ్చి నట్టు చేసుకుంటారు ...'

ఇవాన్‌కి మనఃస్థిమితం యేర్పడిందో లేదో, ఎలీనా వచ్చి, "ఒక గది చూచుకున్నాను - తాత్కాలికంగానే, వేసవికాలం దాకా, - ఫెడొరెంకో గదే తీసుకున్నా; అతను బెయిజింగ్ కెళ్ళి పోతున్నాడు. ఆదివారంనాడు, అంతా సర్దుకుని వెళ్ళిపోతా" అన్నది.

ఇకేం చెప్పినా వినదని తేలిపోయింది ఇవాన్‌కి: పోట్లాడ్డఁ వెందుకు? అనవసరంగా తేలిక పడడం తప్పితే, పోట్లాట ప్లేకపోతేనే యిలావుంది; యింకా యెందుకు కొత్త తద్దిగాలు కొనుక్కు తెచ్చు కోవడం...

"నీయిష్టంవొచ్చినట్టే కానీ" అన్నాడు నెమ్మదిగా.

ఆవేళ సాయంత్రమే ఖాళీచేసింది ఎలీనా. సాయంత్రం ఇవాన్ యింటికొచ్చేప్పటికి యిల్లంతా బావురుమంటోంది, యిదివరకటి

లాగానే యెక్కడి వస్తు వక్కడే వున్నప్పటికీ ఆ గదిలోనుంచి యీ గదిలోకీ, యీ గదిలోనుంచి ఆ గదిలోకీ కాలుగాలిన పిల్లిలా తిరిగాడు అటూ యిటూ వున్న వస్తువులు చూస్తూ. 'గమ్మత్తుగా వుందే, యేమీ పట్టుకెళ్ళలేదెందుకని? ఆ కొయ్యపెట్టె అంటే చాలా యిష్టంగూడాను, మాస్కోనుంచి పట్టుకొచ్చాను. తనకోసం వని, అదీ పట్టుకెళ్ళలేదే...' భోజనాల గదిలో షూరా ఆటబొమ్మొకటి పడుంది విరిగిపోయి. పట్టుకెళ్ళడం మరచిపోయ్యారా? లేక, ఎలీనా యిలా గిరాటేసి వెళ్ళిపోయిందా?'

వంగుని, బొమ్మ తీసుకున్నాడు. యికిది భరించలేననిపించిందతనికి. ఇంకా స్సేపుంటే యేడుపు పొర్లుకొచ్చేట్లుంది. 'ఛీ, యిదేం బాగాలేదు. యిలా జరక్కుండా వుండాల్సింది. ఎలీనాకి ప్రేమనుకున్నాను నేనంటే, మొన్నటి సంవత్సరాదినాడేగా ప్రెఖ్నిన్‌తో అన్నాను: "ఎలీనాఅంతటి భార్య దొరకడం నా అదృష్టం" అని. ఇకొకళ్ళ హృదయం తెలుసుకోవడం వంటే మాటలుగాదు; అందులో సందేహమేమీ లేదు. ఇల్లంతా బావురుమంటోంది. షూరా లేదు. ఎక్కడికన్నా వెళ్ళి ఓడ్కా తాగితే బావుండును?

పనిమనిషి, గ్రూషా, ట్రే పట్టుకొచ్చింది టీ, రొట్టె పెట్టుకుని. వెంటనే చేతిలో వున్న బొమ్మ దాచేశాడు, ఇవాన్. 'తమాయించుకోవాలి, లేకపోతే లాభం లేదు. యింతకంటే కష్టాలుపడ్డవాళ్ళు లేరూ. ఎగొరోవ్ భార్య కాలంచేసింది, ఐనా పనిలో నిమగ్నుడై బ్రతుకడంలా. నాకు ఫాక్టరీవుంది; అదే నా సర్వస్వం, సోకోలొవస్కీని యిష్టంవచ్చినట్టు వాక్కోమను, నాకేం ఫర్వాలేదు. మాస్కోకి నమ్మకం నేనంటేనే, అతనంటే యేంవుంది. ఎన్ని చెప్పినా అతని పలుకుబడే అలాంటిది, టార్పెడోలాగా... మొన్నమధ్య [illegible]నన్నాడు మీకు మాస్కోకు ట్రాన్స్‌ఫరౌతుందని. అదీను చూడే. ఇక్కడుంటే ఒక్క ఫాక్టరీ పనే చూస్తున్నా; కేంద్రంలో కెళ్తే యీ నా అనుభవం యింకా అనేక ఫాక్టరీలకుపయోగిస్తుంది లేక, ప్రెస్టీజే యిదంతా

కల్పించాడా ? అతని కేమవసరం?... బ్రెయ్నిన్ పథకాన్ని గురిం చేవంటుందో మంత్రివర్గం ?'

ఆలోచనా ప్రవాహం ఆగిపోయింది; టేబుల్ బాగుచెయ్యనా అనడిగింది పనిమనిషి, "అవసరం లేదు, టీ యిక్కడే పెట్టు, యింకా చాలాసేపు పనిచేసుకోవాలి, దాహం వేస్తుందేమో" అన్నాడు ఇవాన్.

కొత్తగదిలో అన్నీ సర్దుకుంది ఎలీనా. పెందలకాడే నిద్ర పోయింది. ఐనా మర్నాడు లేచి, స్కూలు కెళ్లాలనుకునేప్పటికి, అప్పటికే బాగా ప్రొద్దెక్కిపోయింది. లేచి, గబగబా, గుడ్డలు మార్చుకుంటూ, రాత్రి పండుకునేప్పటికి పదకొండయ్యింది. యిప్పుడు చూస్తే, యెనిమిదయ్యింది; యింకా నిద్రబద్ధకం వదల్లే దేవిటి ? అనుకుంది. బాగా అలిసిపోయినట్లనిపించింది, క్రితం రోజంతా కట్టెలుకొట్టినట్లూ, ముప్పై మైళ్లు పైగా నడిచొచ్చి నట్లూనూ.

'యెలా జరిగిందో తలుచుకుంటే ఆశ్చర్యంగా వుంది. అర్థం కావడం లేదు. అన్నిరోజులట్లా యీడ్చీడ్చి, ఒక్కసారి బ్రద్దలయింది. ఫుఖోవ్‌తో స్కూలునించి బయల్దేరాను, ఆయన్తోకలిసి కొత్త గదికోసం వెదికాను, యింటికెళ్లాను; యేమీ అందామనిగూడా అనుకోలేదు... ఆశ్చర్యమే మరి.'

స్కూలు కాలస్యమౌతుందేమోనని గబగబా నడుస్తూ గబుక్కున నవ్వుకుంది: "నువ్వింకా చిన్నదానివి. నీ కర్థంగాదు" అన్నాడు డిమిత్రీ. తర్వాత, తానూ చాలా పెద్దదైంది. సుఖం పోగొట్టుకు దిగాలని మోకరించలేదు, లొంగలేదు; తన అంతరాత్మ చెప్పినట్లు నడచుకుంది. 'నన్నతను ప్రేమించడం లేదు. అసహ్యించు కుంటాడు గూడానేమో నా ప్రేమని తీసికెళ్ళి రుద్దబోయానని. అసహించుకోనీ. ఎన్ని చెప్పినా, నాకు సాయం జేసిందతను, నా బరువు దింపిందతను. అతన్ని గురించి ఆలోచిస్తేనే చాలు, హాయిగా ఉంటుంది.

"ఎలీనా!"

వీరా, స్కూలుబయట నుంచోని చూస్తోంది ఎలీనాకోసం.

"ఎలా వున్నావోనని గాభరాపడ్డాను. రెండుసార్లొచ్చా మీ యింటికి, రెండుసార్లూ యింట్లో లేవు. ఫర్వాలేదన్నమాట, నువ్వు నవ్వుతూ రావడం చూశాలే. ఫర్వాలేదన్నమాట."

"నా ఎడ్రస్ మారింది వీరా. ఫెడొరెంకో గదిలో వుంటున్నా యిప్పుడు, బ్లాక్ జి. లో. నువ్వెరుగుదువనుకుంటానే వాళ్ళని. అతని భార్య చెప్పింది నువ్వావిడకి వైద్యం చేశావని."

వెంటనే అంతా అర్థమైపోయింది వీరాకి, ఎంతో ఆప్యాయం చూపించి. పర్మనెంట్‌గా గది దొరికేవరకూ తనతోపాటే వుండమని బలవంతించేసింది ఎలీనాని.

"మాయింట్లోకొస్తేనే మంచిది నువ్వు. పెద్ద గదివుందిగా, మనం యిద్దరం పంచుకుందాం; స్కూలుకీగూడా దగ్గరగావుంటుంది. ఫెడొరెంకో భార్య మెరుగుమనిషిగా లేదు, షూరాని ఆవిడ కప్పగించడం మంచిదిగాదు; డబ్బుచూచి వొప్పుకుందేమో ఆవిడ. మాయింటి ప్రక్కనే ఒక మంచి ముసలమ్మున్నది, నాస్త్యా అంటారే ఆవిడ, డాక్టర్ గొరొంభోవ్‌కి అసిస్టెంట్‌గా పనిచేస్తుంది. ఆవిడ చూస్తూవుంటుందిలే షూరాని నువ్వు లేనప్పుడు. తప్పదు, నువ్వు రావాల్సిందే. ఇవ్వాళరాత్రికే మారుద్దాం గది."

ఫిబ్రవరి రోజులు, చలిచలిగా వుంది. ఐనా సూర్యుడు కన్పిస్తున్నాడు వెచ్చవెచ్చగా. క్లాస్‌రూమ్‌లో కెళ్ళింది ఎలీనా. క్లాసంతా గల్లంతుగల్లంతుగా వుంది కోళ్ళగుడిసెలా. నల్లబల్లమీద సీమసున్నం అక్షరాలు మెరుస్తున్నై యెండపడి; సూర్యకిరణాలు ఆటలాడుతున్నై నల్లబల్లమీద. 'ఇక వసంతం వచ్చేస్తుంది' అనుకుంది ఎలీనా.

# 8

ఆవా శాంతహుషాహూ పడిన తర్వాత, పుఖోవ్ మంచం పట్టవలసొచ్చింది. గుండెదడ ఆవాళ రాత్రే హెచ్చిందికాని, నాదెజాకి చెప్పకుండా దాచాడు; అలసిపోయాననీ, సొలి వచ్చిందనీ, అందుకని వొకటి రెండు రోజులు విశ్రాంతి తీసుకుంటాననీ మాత్రం చెప్పాడు. డాక్టర్ పీరానీ, తర్వాత దొరొఖోవ్‌నీ పిలిపించింది నాదెజా. ఆ హోమియోపతి డాక్టరిచ్చిన మాత్రలు మింగమని భర్తని బలవంతపెట్టింది, వంటెనిండా దుప్పట్లు కప్పింది, కాస్త వూపిరాడినప్పుడల్లా దీర్ఘ నిశ్వాసాలు వదిలింది; పుఖోవేమో తనని తానే తిట్టుకున్నాడు. యెలాగోలా ప్రయత్నించి లేచి తిరగలేక పోతున్నానే అని.

వస్తూ, వస్తూ ఒలోడ్యా పట్టుకొచ్చాడు వార్త: ఇవాన్ భార్య ఇవాన్‌ని వదలిపెట్టేసిందట; అదీ నవ్వుతూ చెరవేశాడు – గమ్మత్తుగా లేదూ మరి! పుఖోవ్ సంతోషించాడు; ఒలోడ్యా యేం వ్యాఖ్యానం చేశాడో గూడ వినలేదు ఆ సంతోషంలో.

తర్వాత భార్యతో అన్నాడు పుఖోవ్: "మంచిపనే చేసిందిలే ఎలీనా. అసలు తనతో యింతకాలం కాపురం యెట్లా చేస్తోందా అనుకున్నాన్నేను. నే నావిణ్ణి బాగా యెరుగుదును, రెండేళ్లు పని జేశాం యిద్దరం కలిసి, యేం చేసినా సరే మనస్ఫూర్తిగా జేస్తుంది, పిల్లలన్నా కూడా బాగా యిష్టం ఆవిడకి. "ఎలీనా మాస్టారు న్యాయం జేశారు నాకు" అని స్కూలు పిల్లలనడం చాలాసార్లు విన్నాన్నేను. ఇక ఇవానంటావ్ - వొట్టి అధికార దర్పమనుకో అంతేనంతా. అలాంటి మనుషుల మూలాన యెంతమంది బాధపడుతున్నారని, ఐనా వాళ్ళకేం లెక్క? ఎప్పుడైనా, యెవరి బ్రతుకన్నా బైటపడి ఉద్యోగం వూడినా, ఒకడికి పదిమంది తయారౌతారు అలాంటివాళ్లు,

వర్షం కురిసింతర్వాత లేచే పుట్టగొడుగుల్లా ... మొన్నే ఎలీనాని కలుసుకుంది నేను, ఆ కాస్ట్యా వుత్తరం వచ్చినప్పుడే, నాతో యేమీ చెప్పలేదు ఎలీనా ... మంచిపనే చేసిందిలే...యెంత సంతోషంగా వుందని."

సోన్యా గదిలోకి వెళ్ళాడు ఒలోద్యా. వెళ్ళి, "ఇవాన్ భార్యని యెరుగుదువా నువ్వు" అనడిగాడు.

"తెలియదే, అంటే నాన్నగారిని చూడ్డానికి చాలాసార్లు వస్తూనే వుండేదిగాని, నేనెప్పుడూ పెద్దగా మాట్లాడలా. నువ్వెరుగుదువా?"

"కొద్దిగా పరిచయం వుందిలే. ఇవాన్ బొమ్మ గ్రాశానుగా నేను. మాస్కోలో చాలామందిని చూశాను ఆవిడలాంటివాళ్ళని. అదేవిటో, నాన్న యెవర్ని చూచినా నెత్తినపెట్టుకుంటాడు. ఆడవాళ్ళందరూ విప్లవం రోజుల్లోలాగానే వున్నారనుకుంటా డనుకుంటా ఆయన; యీ రోజులే వేరు, సినీమా ప్రొడ్యూసర్లూ, జెనరల్సూ లేకపోతే యీ ఇవాన్‌లాంటి ఫాక్టరీ డైరెక్టర్లూ కనబడితే చాలు, ఆడవాళ్ళెగిరి గంతేసి పెళ్ళిచేసుకుంటారు. ఆవిడ ఇవాన్ని వలిపెట్టేసిందని సంతోషంగావుంది నాన్నకి."

"నువ్వెక్కడ సంపాదించావీవార్త?"

"అదిగూ చెప్పుకుంటున్నారు చెవులు చిల్లులుపడేట్టు. ఇద్దరూ వొకటే వాళ్లు వొకళ్ళ గొప్పలేదు, యింకొకళ్లు తక్కువా కాదు; కాదూ?"

"చెప్పాగా ఆవిణ్ణిగురించి నాకేమీ తెలియదని ఆయన్నీ యెరగను బాగా రకరకాలుగా చెప్పుకుంటూ రాయన్నిగురించి; అతనికి చోటు వలేదంటాడు సావ్ చెంకో. నాన్న చెప్పేదే నిజమనుకుంటా."

"ఐతే, నీకూ సంతోషమేనా నన్నమాట."

"వూరికే విసిగించబాకు నన్ను. వాళ్ళిద్దర్లో యెవ్వర్నీ యెరగనురా బాబూ అని మొత్తుకుంటిని, మళ్ళీ అడుగుతావెందుకు? ఆవిడ మంచిదని నాన్నంటున్నారంటే అది చాలునాకు. కాకపోతే

విడాకులంటే తలనొప్పేననుకో నాకు—అపవాదులు, చెవులు కొరికొట్టాలూ, పత్రికల్లో ప్రకటనలూ, కోర్టుల్లో కేసులూ. పూర్వం సహజ గానే వుండేదేమో కాని ఈ విడాకులంటే యిప్పుడు మాత్రం సిగ్గుచేటే, పెళ్ళిచేసుకున్న తర్వాతగూడా చిన్నపిల్లలు కాదుగా, పెళ్ళి చేసుకునేముందే జాగ్రత్తగా గంపెడన్ని సావకాశా లుండే యీ రోజుల్లో ఆలోచించుకోడానికి.''

"ఔనౌను, ఆలోచించుకోడానికీ, విమర్శించుకోడానికీ, మిత్రుల సలహా లడగడానికీ! ... కాదూ?" అంటూ పగలబడి నవ్వాడు ఒలోడ్యా.

"ఎందుకట్లా నవ్వుతావ్, యిందులో నవ్వాల్సిందేం వుందని? సరేగాని. నాన్నెలా వున్నారు?"

"బాగానే వున్నారనుకుంటా. ఇవాన్ భార్యగురించి చెప్పి నప్పుడు యెగిరి గంతేస్తే."

"అదే ఆయన్ని నాశన చేస్తోంది. ఎవరో స్కూలు పిల్లలు సమావేశం జరుపుకుంటున్నారట, అందుకని మూడురోజులు నడిచెళ్ళాడు లెనిన్ వీధికి, దగ్గరా దాపా అది, వాళ్ళందర్నీ కలుసుకుని మాట్లాడాలనట. అమ్మకి ధైర్యం చెప్పేదాన్ని నేను పర్వాలేదు లేమ్మా, అలా హుషారుగావుంటేనే మంచిదాయనకని. ఇప్పుడు తెలిసొస్తోంది ఆవిడన్నదే నిజమని. ఏమైనాసరే, యికాయన్నలా వదలిపెట్టడానికి వీల్లేదు".

నవ్వడం మానాడు ఒలోడ్యా.

"నువ్వుచెప్పిం దొప్పుకోను నేను. అందరి లాంటివాడుకాదు నాన్న, ఆయన యీ తరంవాడు కాదు. కాస్త పనెక్కువ చేస్తే చాలు, కన్నుమూసి తెరిచేప్పటికి మంచంపడతా రీరోజుల్లో. ఈ ముసలివాళ్ళు వేరు, వీళ్ళకింత బలం యెక్కడిదా అని ఆశ్చర్య పోతూంటాన్నేను అప్పుడప్పుడూ ... నిజమే, భయంకరమేననుకో, నాన్నని తలుచుకున్నప్పుడల్లా నాకు భయంవేస్తుంది; నవ్వుతూ వుంటాను కాబట్టి నాన్నగురించి నాకేమీ పట్టడం లేదనుకుంటా

వేమోగాని నువ్వు. మనం యేమీ చెయ్యలేం సోన్యా - ఆయనిష్టం వచ్చినట్టు బ్రతికాడు; అలాగే చనిపోతాడు.”

ఒలోద్యా బయటికెళ్లిపోయాడు. తల్లి నిద్రపోయింది (పాపం రాత్రి తెల్లవార్లూ విచారిస్తూ కూర్చుంది); వెళ్ళి, నాన్నేం చేస్తున్నారోనని చూచింది సోన్యా; చదువుకుంటున్నాడు. నాన్నతో మాట్లాడవలసిందేనని నిశ్చయించుకుంది సోన్యా.

చాలా రోజుల్నుంచి తయారౌతోంది యీ సంభాషణకని; తల్లంటే ప్రధానంగా ఆరోగ్యాన్ని గురించే మాట్లాడుతుంది కాబట్టి నచ్చజెప్పలేకపోతూం దానికి. ఆవిడ చెప్పిందంతా రెండుమూడు హాస్యపు మాటల్తో కొట్టేసి, మళ్లీ తనదారిని తాను వెళ్తాడు. వొట్టి కుర్రతనంగా వుంది ఆయన వ్యవహారమంతా. తన శక్తంతా ఒక డజనుమంది పిల్లలకోసమని ధారపోస్తున్నాడు. టీచర్‌గా తన అనుభవాన్ని వ్యాసరూపంలో వ్రాయమని రెండు మూడుసార్లడిగారు పైవాళ్ళు. ఇంట్లోనుంచి కదలకుండానే కూర్చుని వ్రాసేపని; అదీ కష్టమైతే కూర్చుని, తనకు చెబితే తానే వ్రాసిపెట్టేది. యేదో పదిమంది కుర్రవాళ్ళతో మాట్లాడేందుకని యిక్కడ్నించి లెనిన్ వీధి దాకా నడచివెళ్లి వచ్చేకంటే తేలికైనపనే యిది.

అదే చెప్పింది సోన్యా తండ్రికి వణకే కంఠంతో.

శ్రద్ధగా విన్నాడు పుఖోవ్; తాను చెప్పిందంతా అంగీకరిస్తున్నాడనిపించింది గూడాను సోన్యాకొక క్షణంపాటు; కాని ఆ మాటలు వింటూంటే నిలువెల్లా దహించుకుపోతున్నట్లనిపించింది పుఖోవ్‌కి; చివరిదాకా వినేందుక్కూడా అతిప్రయత్నం చెయ్యవలసి వచ్చింది నిజానికి.

‘యేమిటీ, మరీ యింత అపరిచితలాగా మాట్లాడుతుంది’ అనుకున్నాడు పుఖోవ్. ‘చెర్నిషెవ్, సాన్నికోవ్’ సావ్‌చెంకో— అందరూ అర్థం చేసుకుంటారు నన్ను. ఇంపేత వయసులో తారతమ్యంవల్లవచ్చిన చిక్కు కాదిది. ఇంటిదగ్గరే వుండమనీ, గడప దాటొద్దనీ నాదెజ్దాగూడా చెప్తుంది నాకు; కాని పిల్ల కుర్రాళ్ళని

కలుసుకోవద్దనీ, వాళ్ళతో మాట్లాడవద్దనీ చచ్చినా చెప్పదు; అలా వెళ్ళడమూ, మాట్లాడ్డమూ అవసరమని తెలుసుకాబట్టి. వాళ్ళందరూ నాదగ్గర చదువుకున్నవాళ్లు; అంతకాలం కలిసి మెలసి వున్నవాళ్లం. నాదెజా వాదించలేదు, వాదించడానికేమీ లేదుకాబట్టి; నేను బ్రతకనేమోనని భయం; అంతే. నాకూ భయమే నేను కాస్తా గుటుక్కుమంటే యీ ముసల్ది వొంటరిగా యెలా బ్రతుకుతుందా అని. ఈ సోన్యా అలా కాదు; నాదంతా కుర్రతనమనట వుద్దేశం; అదే అంది—"కుర్రతనం". నాకంటే పెద్దదైనట్టు మాట్లాడుతుంది. అలా యెందుకంటుందో అర్థంకాదు?'

అదే అన్నాడు చివరికి: నువ్వనేదేమిటో అర్థంకావడంలేదు సోన్యా, నాకు. దీనికంటే అది గొప్పదంటావు నువ్వు; యెలా కొలుస్తావా గొప్పని? నిజమే, ఆ వ్యాసాలు వ్రాయవలసిందే, చాలాసార్లనుకున్నాను గూడాను వ్రాద్దామని, నోట్సుగూడా తీసుకున్నాను. కాని, దానర్థం నా కుర్రాళ్ళతో వెళ్ళి మాట్లాడగూడదనెక్కడుంది? నువ్వే ఆలోచించు, వాళ్ళందరూ తండ్రుల్లేని పిల్లలు, చెర్నిషెవ్ కసలు తల్లిగూడా లేదు పాపం. ఇప్పుడంటే నీకాళ్ళమీద నువ్వు నిలదొక్కుకున్నావుగాని, గుర్తు తెచ్చుకో నా సలహాకోసం వచ్చి పరుగెత్తుకొచ్చేదానివి గదూ నువ్వు? నీకుమాత్రం తెలియదటమ్మా. బ్రతకవలసినవాళ్లు వాళ్లు; మనం యివ్వాళ ప్రారంభించింది రేపు పూర్తిచెయ్యవలసినవాళ్ళు వాళ్లు. వాళ్ళని వొదిలిపెట్టమంటావు నువు యెలాగమ్మా?" అని.

"అది గడ్డుసమస్యకాదని నేనూ అనడంలేదు నాన్నా. కాని వొంటరిగా మనం వొక్కళ్ళమూ ఏం జెయ్యగలం అంటున్నా; అంతే. ఈ సమస్యల్ని పరిష్కరించాలంటే ప్రభుత్వం పూనుకోవాలి. ఇవ్వాళ నువ్వు చెర్నిషెవ్‌కి సాయంజేస్తావనుకో, నువ్వు రేపు లేకపోతే యేం జేస్తాడు, రేప్రొద్దున్నే యింకో చెడ్డమనిషి మాటల్లో పడిపోగూడదూ? వ్యాసం అవసరం కాబట్టి ఆ సంగతెత్తాను. ఆడపిల్లలకీ, మగపిల్లలకీ ప్రత్యేకం ప్రత్యేకంగా స్కూళ్లు పెట్టడం మంచిది

కాదని చెప్పడానికి కొన్ని కారణా లున్నాయన్నావు నువ్వు. ఆ విషయాన్ని గురించే, 'లిట్ గెజెటా' పత్రికలో వాదోపవాదాలు జరుగుతున్నాయి. మీ అభిప్రాయాలుగూడా మీరు వ్రాస్తే, చెప్పుకోదగ్గ లాభం జరుగుతుంది దానివల్ల, యీ పన్నెండుమంది కుర్రాళ్ళాంటి వాళ్ళకే లక్షలమందికి లాభం కలుగుతుంది. దానికిబదులు సెరోజా తల్లితో మాట్లాడ్డానికీ, పదార్థ విజ్ఞానశాస్త్రాన్నిగురించి మీపాత్రో మాట్లాడ్డానికీ వెచ్చిస్తూంటేరి.మీ మిగిలిన శక్తిధారధ్యా లన్నిటినీ. నిజంగానే నాన్నగారూ, యిదంతా నిరర్థకం, మీరు చేసేదాని కర్థంలేదు."

"కాదమ్మా, వుంది; అర్థంవుంది. ఊరికే లెక్కలేసుకుంటే లాభంలేదు. మనం వుండేదీ, బ్రదుకుతూన్నదీ మనుష్యులమధ్య. పథకాలేసుకుని లాభంలేదు; అందరం పనిజెయ్యాలి, ప్రతి మనిషీనీ. ప్రతిదాన్నీ కమిటీ ఫార్ములాలాగా, 'దీని నంగీకరించాం, యిలా చెయ్యాలని నిర్ణయించాం' అంటూ కూర్చుంటే లాభంలేదు. నీ నడకమీదా, నువ్వు పనిచేసే విధానంమీదా, యితర వ్యక్తుల్తో నీకున్న సంబంధాలమీదా ఆధారపడుతుంది భవిష్యత్సంఘం. మన వొక్కళ్ళవల్ల యేమౌతుందని అలా యెత్తిపొడుస్తా వెందుకమ్మా? నువ్వలా యెందుకన్నావో అర్థంకావడంలేదు యిప్పటికీ నాకు. చాలాకాలంక్రిందట, యింకా ఆరేడు సంవత్సరాలకి విప్లవం వస్తుందనగా; నాకు బాగా గుర్తు; వొక స్నేహితుణ్ణి కలుసుకోడానికని వెళ్తూండేవాణ్ణి. మా స్నేహితులం యేడెనమండుగురం వుండేవాళ్లం. లెనిన్, ప్లెఖనోవ్ రచనలు అధ్యయనం చేసేవాళ్లం. మా నాన్నతో చెప్పాన్నేను. ఆయన వొక తరహామనిషి; తనపనేమో, తానేమో - యేదో ఆఫీసులో వుద్యోగం చేసేవాడనుకో, పై ఆఫీసర్ల పురమాయింపులూ, బెదిరింపులూ అలవాటాయకి - 'ఎంతమందిరా మీరు? ఎనమండుగురా? పిచ్చిగానేపో యెత్తిలేదుగదా మీరు! యేమౌతుందిరా మీవల్ల' అన్నాడాయన. ఆయనంటే ముసలివాడు, అలాఅన్నా ఆశ్చర్యపడాల్సింది లేదు; అదీగాక

ఆ రోజులే వేరు. నువ్వంటే యింకా చిన్నదానివి, కామ్సొమోల్‌లో వున్నావు. నీలో సాహసం వుండాలిగాని యిలాంటి సాచివేత పనికిరాదమ్మా. నీ హృదయం గొప్పదని నాకూ తెలుసు; యెందుకమ్మా దాన్నిలా గొలుసుల్తో కట్టేస్తావ్ ?"

అంటూనే సోన్యావంక చూశాడు పుఖోవ్. చూచి మాట్లాడే వాడల్లా ఆగిపోయాడు: సోన్యా కళ్ళేమిటో జ్వరం వచ్చినట్లు మెరుస్తున్నై; పెదవులు కదిలినై — జవాబు చెప్పాలనుకుంది గాని మాటలు పెగల్లేదు — మనిషంతా గందరగోళం పడుతున్నట్లు కన్పించేప్పటికి, చెప్పదలచిందాపివేసి, నెమ్మదిగా దగ్గరికి తీసుకున్నాడు పుఖోవ్ కూతుర్ని.

"నిజంగా, నువ్విలాంటిదానివి కాదు తల్లీ."

సోన్యా గబగబా వెళ్ళిపోయింది బాధతో; తా నా అమ్మాయికి నచ్చజెప్పలేక పొయ్యాడు; మరింత గందరగోళం చేశాడావిడ ఆలోచనల్ని; ఆయన మాటల్లో యేదో అవ్యక్తశక్తి వుందనిపించింది సోన్యాకి.

'బ్రదకడం అంటే మాటలుగాదు; నిజంగానే, బ్రదకడం అంటే చాలా కష్టం.'

యేదోవొక పుస్తకం తీసుకుంది చదవాలని. కాన్నేపటికి వెలుతురంతా పోయినట్లుంది, గదంతా మసక మసకగా వుంది; లేచి కిటికీదగ్గర కెళ్ళింది. ఊదావూదాగా వుంది బయటి మంచు. ఆలోచించడం ప్రారంభించింది:

'నేను చాలా గట్టి మనిషినని నాన్న అభిప్రాయం. "ఇప్పుడంటే నీ కాళ్ళమీదనువ్వు నిలదొక్కుకున్నావ్" అన్నారు. న్యాయానికి నాలో గట్టిదనంలేదు, వూరికే జారిపడుతుంటాను. నాకేమీ అర్థంకాదు. ఈ సంధ్యలాగానే, అటు రాత్రీకాదు, యిటు పగలూ కాదు, అంతా గందరగోళంగా వుంటుంది. దేన్ని చూచినా ఒలోద్యాలాగా నవ్వగలిగేస్తే బావుండును. ఒలోద్యాని చూచీ అసూయపడవలసిన పనిలేదు, వాడికాళ్ళక్రింది మట్టి కరిగి

పోయినట్లుంది ... ఇవాన్ భార్యముఖం చాలా ఆకర్షణీయంగా వుంటుంది. భర్తనెందుకు వదలేసిందో? పూర్వపురోజుల్లో అంటే అదివేరు: ఏదో విలుకోసమనీ, యిష్టంలేకపోయినా పెళ్ళిళ్లు చేసుకునేవారు కాబట్టి. ఇప్పుడంటే రోజులుమారాయి, ఆ పరిస్థితులూ, అలాంటి ఋబ్బందులూ లేవిప్పుడు; ఐనా విడాకు లిస్తూనే వున్నారు ... యింకోళ్ల మనసుని చదవలేకపోవడం నిజంగానే భయంకరం. చీకట్లో నడుస్తూవుంటాం, యింకో అడుగేస్తే సౌఖ్యాన్నందుకుంటామని అనుకుంటాం; తీరా అడుగేస్తే అక్కడ సౌఖ్యం వుండదు, గివ్‌ఖ్యం వుండదు; పెద్ద పాతాళగుహ నోరు తెరచుకునుంటుంది. భయంకరం కాదూ మరి! సావ్‌చెంకోకీ, నాకూ మల్లే ... నాన్నకి అదీ అర్థంగాదు; యెప్పుడూ సావ్‌చెంకో పక్షాన్నే మాట్లాడ్తారు. అదీ వొకవిధంగా సహజమేలే. ఇద్దరూ ఒకే తరహామనుషులు. ఉద్రేకంలో నాన్నేవిషయాన్నైనా వుత్ప్రేక్షిస్తే, ఆ దొరకరకమైన గౌరవం కలుగుతుందాయనంటే; చెప్పేవి వొట్టి గాలికబుర్లూ, లేతసొరకాయకోతలూ కాదని ఆయన జీవితమే రుజూచేసింది. అదేమాటలు సావ్‌చెంకో అంటే నవ్వొస్తుంది — జీవితాన్ని కాచివడపోసిందెక్కడ అతను. నాకుమాత్రం యేం అనుభవంవుంది, నాకూ యేమీ తెలియదు. నేను సావ్‌చెంకోని ప్రేమిస్తున్నాననే నాన్న నమ్మకం; మొన్న అన్నారుగూడాను "మీ రిద్దరూ ముందు గాడినపడండి" అని. నిజంగానే అతనంటే నాకుప్రేమే, యెంతదాచినా అది బయటపడుతూనే వుంటుందనుకుంటా. ఐనా మేం యిద్దరం గాడినపడడం జరగదు, నాకు నమ్మకమే. ఐనా యిదేవిటీ యెప్పుడూ అతన్ని గురించే ఆలోచిస్తాను, ఛీ, మరీ అర్థం లేకుండా పోతూంది."

స్విచ్ వేసుకుని, ప్రారంభించిన వ్యాసం చదివి పూర్తి చేసింది, స్విబిషేప్‌లో ఈ మధ్యనే పెట్టిన కొత్త జెనరేటర్లని (ఎలక్ట్రిసిటీ వుత్పత్తి చేసే యంత్రాలు) గురించిన వ్యాసమది. ఎవరో తలుపు తట్టారు. తలుపు దగ్గర గంట మోగింది. అమ్మ నిద్రపోతూం

దని గుర్తుకొచ్చి, వెళ్ళి తలుపుతీసింది. సావ్‌చెంకో. కలలోగూడా అనుకోలేదతనొస్తాడని. తండ్రి పుఖోవ్ పుట్టినరోజు జరిగింతర్వాత ఇంతవరకూ కలుసుకోలేదు వాళ్ళిద్దరూ. మొదట కొన్నిరోజులవరకూ పోన్యా వేచి కూచ్చుంది అతనికోసం; వచ్చితలుపు గంట మోగిస్తాడని. నిజంగానే మరీ మొరటుగా ప్రవర్తించాడారోజున, యీ స్నేహం యెలాగూ గట్టెక్కేదికాదు; ఐనా యిలా పోట్లాడుకుని చెడగొట్టుకోవడ మెందుకూ స్నేహం...కాని, సావ్‌చెంకో రాలేదు; తనేం జేస్తుంది.

అతనూ ఒక నెలరోజులు బిగదీసు కూర్చున్నాడు. అతనికీ బాధగానే వుంది అలా దూరంగావుండడం. ప్రతిరోజూ సాయంత్రం బయల్దేరుతూనే వుండేవాడు పుఖోవింటికి వెళ్దామని. సంధ్యమూల మందులషాపుదాకా వచ్చి, మళ్ళీ వెనక్కి తిరిగేవాడు. ఎందుకనో సరిగ్గా మందులషాపు దగ్గరకొచ్చేప్పటికి ప్రశ్నలు చుట్టుముట్టేవతన్ని: 'నేనక్కడికెందుకూ వెళ్ళడం? ఖచ్చితంగా చెప్పేసింది నేనంటే తనకేమీ శ్రద్ధలేదనీ. నాతో ఆ విషయాన్ని గురించి మాట్లాడదలచుకో గూడలేదనీనీ. కావాలన్నా, ఆ పైపై స్నేహం కుదుర్చుకోలేను నేను, వెళ్ళకపోవడమే మంచిది. వెళ్ళేం లాభం?...'

వెనక్కి తిరిగి, యింటికో, క్లబ్బుకో వెళ్ళిపోయేవాడు; లేకపోతే సొంతయింటి పక్కనేవున్న డిమిత్రీ యింటికెళ్ళేవాడు.

♦ ♦ ♦

ప్రథమంలో, సావ్‌చెంకో, ఇన్‌స్టిట్యూట్ నించి రాగానే, డిమిత్రీ అతన్ని తన శాఖలోకి తీసుకుని పనినేర్పడం ప్రారంభించాడు; ధైర్యంచెప్పాడు. "మొదట్లో యెప్పుడూ కాస్త కష్టంగానే వుంటుంది మరి. సిద్ధాంతాలు నేర్చుకోవడం వేరు; ఫాక్టరీలోకొచ్చి పనిచెయ్యడం వేరు." ఒకనాటి సాయంత్రం సావ్‌చెంకోని యింటికి రమ్మని ఆహ్వానించాడు డిమిత్రీ. "బ్రెయ్నిన్ పథకాన్ని ఈమధ్య కొద్దిగా మార్చాడు, దాన్నిగురించి కాస్సేపు ఆలోచిద్దాం". ఆపని

అయిపోయింతర్వాత తాను పనిచేస్తుకున్న లెనిన్‌గ్రాడ్ ఫాక్టరీని గురించి చెప్పాడు డిమిట్రీ, సావ్ చెంకోకి. ఇద్దరూ అలాగే కూర్చుని మాట్లాడుకున్నారు తెల్లవారేవరకూ. చివరికి సావ్ చెంకో వెళ్ళిపొయ్యేప్పుడు "మళ్ళీ యెప్పుడైనా వొకసారి వొచ్చెళ్ళు, నే నెప్పుడూ పెందలకాడ నిద్రపోను; యీసారి మెషీన్లని వొదిలి పెట్టి యింకేదైనా మాట్లాడుకుందాం" అన్నాడు డిమిట్రీ. సావ్ చెంకో వెళ్ళిపోయింతర్వాత, సంతృప్తిగా నవ్వుకున్నాడు డిమిట్రీ: "మంచికుర్రాడు, అతని వయసులో నేనింకా ముసలివాడిలాగా వుండేవాణ్ణి. దానికితోడు యుద్ధం వొకటి...యిప్పుడంటే వేరు. అతనింకా చెక్కుచెదర లేదు" అనుకున్నాడు.

తర్వాత సావ్ చెంకో వచ్చినప్పుడు, యుద్ధాన్ని గురించీ, డాన్ దగ్గర జరిగిన పోరాటాన్ని గురించీ చెప్పాడు: ఆ పోరాటంలో వొక కవి చనిపోయాడు — అతను చాలా చిన్నవాడు గూడాను, పేరు ప్రస్కిన్; 'నా వృద్ధాప్యంలో నీవు నాస్మృతి పథంలో మెర సేప్పాడు' అంటూ ప్రారంభమయ్యే గీతాలు చదువుతూండేవా డెప్పుడూ. యుద్ధంలో సర్వనాశనమైన ఒక జర్మనీ పట్టణాన్ని గురించి చెప్పాడు: ఆ పట్టణంలో ఒక మ్యూజియమ్ వుంది. వెళ్ళేప్పటికదంతా చిందరవందరగా వుంది; యెక్కడ చూచినా చచ్చిన పశువులూ, చిరిగిన నాజీ జెండాలూ... వాటి మధ్య పదహారో శతాబ్దంనాటి చిత్రకారుడెవడో వ్రాసిన ఒక చక్కని యువతి బొమ్మ వుంది.

తర్వాత, డిమిట్రీ యింటికి చాలాసార్లు వెళ్ళాడు సావ్ చెంకో. ఒక్కోసారి తనచిన్ననాటి ముచ్చట్లు చెప్పేవాడు డిమిట్రీ. ఒక్కోసారి ఆరోజు వార్తల్ని గురించి – మొస్సాదిక్ విచారణని గురించీ, ఫ్రాన్స్‌లో సమ్మెల్ని గురించీ మాట్లాడుకునే వారిద్దరూ; లేకంటే అప్పుడే అచ్చై బయటికొచ్చిన పుస్తకాన్ని గురించి చర్చించుకునేవారు. డిమిట్రీ మాట్లాడుతూంటే, తన ప్రేమని గురించీ, జోన్యా అన్నమాటలూ – అన్నీ మరచి పోయేవాడు సావ్ చెంకో. ఊరకే తన్మయుడై పోయేవాడు. నవ్వినప్పుడు తల

వెనక్కి వంచి పగలబడి నవ్వేవాడు హుషారుగా; బలిసిన ముఖంలో తెల్లనిపళ్ళు మెరసిపోయేవి; జిప్సీలాగా వుండేవాడు అలాంటప్పుడు; నవ్వుతూ "అమ్మమ్మ జిప్సీ మకాంకి వెళ్ళిందేమో; వొకచిలిపి మని షనేవాడు మాతాత" అనేవాడు.

నిన్నరాత్రి సాహిత్య చర్చచేశారు యిద్దరూ. "మొన్న క్లబ్బులో యెందుకలా జుబ్జోవ్‌ని విమర్శించారు ? అనడిగాడు అగస్మాత్తుగా. డిమిట్రీ నవ్వాడు, జవాబు చెప్పలేదు. తర్వాత, వొక పుస్తకం తీసుకుని "నీకు కవిత్వం అంటే యిష్టమేనా?" అనడి గాడు. "ఓ. అన్నిటికంటే అదంటేనే యిష్టం" అన్నాడు సావ్ చెంకో యెగిరి గంతేసినట్లు. డిమిట్రీ పుస్తకం తెరచి, బిగ్గరగా చదివాడు :

మూక శోకాల నెడదలో మూటగట్టి
పెట్టుకున్నట్టి విరహ గర్వితులు వారు;
ప్రేమ చివురించి ఫలించు టొక్క
కలలలో మాత్రమే కాంచగల్గినారు.

అంత నే తెంచె మిత్తి, ఆపై యదృచ్ఛ
తారసిల్లిరి; కాని ఆ తావు తీరు
ఏమిటో ఒకరి నొకరు గుర్తించలేక
ఎవరిదారినబడి వారు ఏగినారు. *

పద్యం వింటూంటే సావ్ చెంకోకి చాలా ఆనందంగా వుంది. వెలుగుతూన్న కొవ్వొత్తి ఆరిపోయినట్లైంది అకస్మాత్తుగా అతని ముఖం: సోన్యా గుర్తుకొచ్చిందతనికి. 'మేం యిద్దరం కలుసుకుంటాం మాట్లాడుకుంటాం, ఐనా పరాయి వాడిలాగానే చూస్తుంది ఇంకా నన్ను... పరాయి వాడిలాగానే చూస్తుంది. ఐనా అప్పుడు మేం షికారుకు వెళ్ళినప్పుడు నన్ను ప్రేమిస్తున్నదే అనుకున్నా; నన్ను ముద్దుపెట్టుకుంతర్వాత నావంక చూచిన చూపు గుర్తుకొస్తే చాలు,

* శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతతో — అనువాదకుడు.

వెంటనే పరుగెత్తుకెళ్ళి, "నేనే సోన్యా నన్నెరగవూ, నేనే: సావ్ చెంకోస" అని అనాలనిపిస్తుంది యిప్పటికీ.'

డిమిట్రీవంక చూచాడు తలలేపి కదలకుండా మెదలకుండా కూర్చున్నాడు డిమిట్రీ, పుస్తకం క్రింద పడుంది. చాలసేపు యిద్దరూ మాట్లాడలేదు. తర్వాత, నెమ్మదిగా ధైర్యంకూడ దెచ్చుకున్నాడు సావ్ చెంకో :

"ఒకస్త్రీని ప్రేమించుతున్నాం అనుకున్నప్పుడు, ఆసౌఖ్యాన్ని పొందడంకోసం బాధపడవలసిందే నా డిమిట్రీ? ఆత్మగౌరవం పోతుందనిపిస్తుంది..."

డిమిట్రీ చిరునవ్వు నవ్వాడు కనబడీ కనబడకుండా :

"బాధపడక తప్పదు, బాధపడాలి... ఒక్కొక్కసారి మంచు పొరని చీల్చుకుంటూ ముందుకెళ్ళాలిసిన అవసరంగూడ వస్తుంది. వెనుదియ్య గూడదు."

సావ్ చెంకో చిరునవ్వు నవ్వాడు మళ్ళీ.

అదీ కారణం సోన్యా దగ్గర కతను రావడానికి; అంతా చెప్పెయ్యాలనుకున్నాడు సోన్యాకి, ఆ సౌఖ్యాన్ని పొందేందుకు మంచు తెరల్ని చీల్చడానికిగూడా సిద్ధమై.

♦ ♦ ♦

"అలా వెళ్ళి నడిచొద్దాం, రా, సోన్యా, నీతో చాలా మాట్లాడదామని వొచ్చాను, నా కిక్కడీగదిలో వుండబుద్ధి కావడం లేదు."

"బయట బాగా చలిగావుండే, ఐనాపద. వెళ్దాం,వంటున్నావ్ గా"

బయట మంచు గడ్డకడుతోంది మళ్ళీ. ఉత్తరపుగాలి వీస్తోంది. సావ్ చెంకో, సోన్యాలు తప్ప జనం అంతా గబగబా నడచి వెళ్లిపోతున్నారు చలి కాగలేక; వీళ్లిద్దరూ యెక్కడికెళ్ళాలని బుద్ధిరాదు గనక. దూరంనుంచి చూస్తే, యిద్దరూ మహా ఆప్యాయంగా నడుస్తూన్న దంపతుల్లా వున్నారు కాని దారి పొడు

గూ తా వాదించుకుంటూనే వున్నారు. డిమిట్రీని గురించీ, ఆటో మాటిక్ మెషీన్లని గురించీ, బెర్లిన్ సమావేశాన్ని గురించీ ఇద్దరూ కలిసి క్లబ్బులో చూచిన సినీమాని గురించీ—ఒకటేమిటి, సావ్ చెంకో దేన్ని గురించి మాట్లాడినాసరే, యెడ్డెమంటే తెడ్డె మంటోంది సోన్యా. ఒక్క మెషీన్లని గురించి మాట్లాడినప్పుడు మాత్రం వాదించలేదు; అంతే.

"బలే సినీమాలే! ఆ చిన్న కుర్రాడికి తండ్రిమీద కోపం వచ్చిందే, అప్పుడు యేడుపొచ్చిందనుకో నాకు."

"ఆఁ, అదేఁవుంది; వొట్టి భావుకత; అంతే. పరిష్కారం చూపనేలేదు చివరికి. చివరి కానికుర్రోడ్యే గేమాతాడో చూపనే లేదాయె – కమ్యూనిస్టుల్లో కలుస్తాడా, లేకపోతే అలాగే రాజకీయ చైతన్యం కలక్కుండా వుండిపోతాడా? నాకేం అర్థం కాలా."

ఇంకో వంద గజాలు నడిచారు యిద్దరూ. ఫ్రాన్సుని గురించి వుత్సాహంగా మాట్లాడాడు సావ్ చెంకో:

"ధృవీకరణకి ఫ్రాన్స్ చచ్చినా వొప్పుకోదు."

"యెవర్ని గురించీ నువ్వనేది? కమ్యూనిస్టుల సంగతా, పార్లమెంటు సభ్యుల్ని గురించా? అసలధికారం యెవళ్ళ చేతుల్లో వుందో చూడాలి. నువ్వెప్పుడూ యింతే. వూరికే కొట్టుకుపోతావ్ ప్రవాహంలోపడి."

"నేనా, నిజమైన అధికారాన్ని గురించి మాట్లాడుతున్నా నేను. కొన్ని భావాలేగనక లక్షలకొద్దీ ప్రజల చైతన్యంలోకి చొచ్చుకుపోతే, అంతటి భౌతికశక్తి మరేదీ వుండదని నేన్చెప్పలా నువ్వు?"

"అదంతా భవిష్యత్తునుగురించి, యిప్పుడు మనం మాట్లాడేది యీనాడున్న పరిస్థితుల్ని గురించి."

మళ్లీ యింకొక వందగజాలు నడచారు యిద్దరూ

“ఇవ్వాళొక మెషీనాపరేటర్ మీద అనవసరంగా, వుట్టి పుణ్యానికి నోరుచేసుకున్నాడు ఇవాన్; నానాతిట్లూ తిట్టాడు, స్కాండ్రెల్.”

“నువ్వెప్పుడూ యింతే, గోరంతలు కొండంతలు చేస్తావ్, నాన్న చెప్పలా ఇవాన్ అందరిలాంటి వాడేననీ. కాకపోతే కాస్త అధికారగర్వం వుందనీనీ.”

“డిమిట్రీగూడా ఆమాటే అంటాడు. ఐనా, ఇవాన్ స్కాండ్రెలే లెద్దూ. భార్యగూడా వదిలిపెట్టేసిందా, మరీ బరితెగిపోతున్నాడు. అసలు విన్నావా నువ్వాసంగతి ?”

“విన్నానుగాని యీ గుసగుసలంటే గిట్టదునాకు. అతని వ్యక్తిగత జీవితంసంగతి మనకెందుకు ?”

“యేం, యెందుకొద్దు? అతన్నెలాంటి స్త్రీ ప్రేమిస్తుందో చూడాలనుంది నాకు. ఇవ్వాళడిగాను కూడాను డిమిట్రీని ఇవాన్ భార్యెలాంటిదని; జవాబు చెప్పలేదు, తొందరపనుందని వెళ్ళిపోయాడు. యేమైనా ఇవాన్‌కంటేమాత్రం మంచిదేనని నా అభిప్రాయం. మంచిపనే చేసిందిలే అతన్నొదిలిపెట్టి.”

“అందులో మంచేవిటో అర్థంకాలా నాకు.”

“అతను స్కాండ్రెలైనా సరేనా ?”

“అదంతా ముందే ఆలోచించుకో వలసింది.”

“ఇవాన్ బొమ్మ గీశాడుకదూ మీ అన్నయ్య ?”

“వేశాడనుకుంటా; నే చూడలా.”

“యెందుకేశాడు అలాంటి స్కాండ్రెల్ బొమ్మని ?”

“నాకు తెలియదు; కమిషన్ చేశారుకాబట్టి వేశాడేమో. అన్నయ్యనే అడుగు.”

“వొద్దులే, అడగన్లే. కళనిగురించి సబురోవ్ చెప్పింది నచ్చిందినాకు. మీ అన్నయ్యవన్నీ గమ్మత్తాభిప్రాయాలు. అతనుద్దేశంగూడా అదేనంటావా? లేకపోతే వూరికే పైకలా నటిస్తాడంటావా ?’

"నాకు తెలియదు. నీకు మల్లేనే. మీా రిద్దరూ వొకటే, యేదో అనుకుంటారు, అలాగే ప్రవర్తిస్తారు. కాకపోతే అతనంతా నలుపే చూస్తాడు, నువ్వేమో లేతయెరుపు చూస్తావ్."

"మరి నువ్వూ."

"నన్ను గురించికాదు నేననేది. నేనుచూచిందే అనుకుంటాను: అనుకున్నదే చేస్తాను."

ముందుకూ, వెనక్కీ నడుస్తూ, ఆ మూలనున్న మందులషాపనేకసార్లు దాటారు. ఈ మధ్యనే చదివిన వొక పుస్తకాన్ని గురించి మాట్లాడుతున్నాడు సావ్‌చెంకో యిప్పుడు. ఆ పుస్తకం నచ్చలేదతనికి.

"అది వాస్తవికం కానేకాదు; మనిషిని కొంచెపరుస్తుందది."

సోన్యాగూడా చదివిందా పుస్తకం, ఆ పుస్తకం ఆవిడకీ నచ్చలేదు. ఐనా, కోపం వచ్చింది.

"నేనలా అనుకోలేదు. పుస్తకం చదువబుద్ధేసింది; అవసరమైన అనేక సమస్యలుగూడా వున్నాయా పుస్తకంలో. ఐనా యిప్పుడీ సాహిత్య చర్చెందుకు చెప్పు? చలేస్తూంది. యేదో చెబుతానని తీసుకొచ్చావు? చెప్పకపోతే సరే, యింటికెళ్లి టీ తాగుదాం పద."

సావ్‌చెంకో మాట్లాడలేదు. ఇద్దరూ యెర్రిటుకల యింటి దగ్గరున్నారు. 'ఇప్పుడు చెప్పకపోతే యికెప్పుడూ చెప్పలేను. ఇదే విటి మాట్లాడలేకపోతున్నాను మాటలన్నీ మంచులోకలిసి అంతర్ధానం ఐనట్టు' అనుకున్నాడు సావ్‌చెంకో.

"చెబుతాను, సోన్యా...నవ్వబోక, నవ్వవుగదూ, అసలు విషయం యేమిటంటే నువ్వు లేకుండా నేను...మంచు తుపానొచ్చినాసరే, ప్రళయం వచ్చినాసరే, లెక్కజెయ్యను..." అనేశాడు పైకి.

సోన్యా మాట్లాడలేదు. నెమ్మదిగా చేయందుకుని, ఆవిడ నోటిమీద తన పెదవు లానించాడు. "లాభంలేదు ... మనిద్దరి

మధ్యా అఖాతంవుంది, ఆ అఖాతంలో నీ కళ్ళు తిరిగిపోతాయి" అంది సోన్యా విచారంగా, చెవిలో, అతినెమ్మదిగా గుసగుస లాడినట్లు.

ఇంకో సెకండ్‌లోపలే, యెప్పటిలాగా, మామూలు స్వరంతో "మనిద్దరి నైజాలూ వేరని యిదివరకే చెప్పాన్నీకు, సరే, యిక ఆ గొడవెందుకులే యిప్పుడు ... వెళ్లి టీ తాగుదాం వస్తావా? యేం? ఏవీం మాట్లాడవేం? రాదల్చుకోలేదా?"

సావ్ చెంకోకి కోపం వచ్చింది:

"ఏదీ, రెండూ రెండూ కలిపితే నాలుగౌతుందనీ, డబ్బు పట్టుకెళ్ళి సేవింగ్స్ బాంక్‌లో దాచుకోవాలనీ యింకా నేర్పలేదుగా నువ్వు" అన్నాడు.

◆ ◆ ◆

తర్వాత, సోన్యాతల్లి పిలిచిందావిణ్ణి:

"సోన్యా, వచ్చి భోంచెయ్యరాదూ. సావ్ చెంకో వచ్చా డని చెప్పారే మీనాన్న; అతన్నుండమని యెందుకనలా నువ్వు?"

"యేదో మీంగుందటమ్మా, కాస్తదూరం వెళ్ళివచ్చా నతన్తోపాటు. తలనొప్పిగా వుందమ్మా, యీపూట భోంచెయ్యన్లే".

గదిలో కెళ్లి, లోపల గడియవేసుకుంది సోన్యా. అంతా పిచ్చి పిచ్చిగావుంది— సౌఖ్యాన్ని కాలదన్నుకోలా మరి? అదే వెళ్ళి నాన్నకి చెబితే 'నువ్వొట్టి పిచ్చిదానివి, మీ యిద్దరికీ వొకరంటే వొకరికి ప్రేమేనాయె, యిలా వేధించుకోవడమెందుకు?' అంటాడు.

నాన్నకి నచ్చజెప్పడం నావల్లగాదుకాని, నేనూ, సావ్ చెంకో కలిసి బ్రదకలేంవనడంలో నాకేవీం సందేహం లేదు. ఇవ్వాల్టి పోట్లాటనేకాదు. ఛ, యెంతసహ్యంగా మాట్లాడాడు సేవింగ్స్ బాంక్‌ని గురించి; అదిచాలు అతన్నసహ్యించుకోడానికి. మరీ స్కూలు కుర్రాడు; అంత కోపమెందుకు తెచ్చుకున్నానా అని యీపాటికి విచారపడుతూనే వుండివుంటాడు. రేపో, మాపో కాళ

పోతే యింకో నెలకో, యివన్నీ మరిచిపోయి మళ్లీ కలుసుకోగలం, ఐనా లాభఁవేఁవుంది. యే విషయాన్ని గురించీ యేకీభవించని మనుషులు కలిసి బ్రదికేదెలా? నేను మరీ నేఁమీద బ్రదికేమనిషిననీ, కాసులు కూడబెట్టడంతప్పితే నాకికేమీ చేతగాదనీ అతని వుద్దేశం. అదంతా పచ్చి అబద్ధం; ఔను, నేలమీదే బ్రదుకుతాను. తప్పేఁవుంది? యెగర్డం చేతగాదు నాకు. ఐనా మాకిద్దరికీ వాకళ్ళంటే వాకళ్ళకింత యిష్టఁ వెందుకో అర్థంగాదునాకు. ఈసారి అతనుండలేకపోయాడు; అతనులేందే నేనూ వుండబట్టలేను. నన్నింత అవమానించాడా యింతకుముందే, ఐనా అతను మళ్ళీవస్తే, బయటికి గెంటగల ధైర్యంవుండా నాకు? యిదేవిఁటి? నన్నా గేటుబైట, అతను ముద్దెట్టుకున్నప్పుడు, యేడుపొచ్చేస్తుందనీ, లేకపోతే వెంటనే అతని నడుంచుట్టూ పెనవైచి కౌగలించుకుంటానని అనిపించింది. నా హృదయానికి సంకెళ్ళు వేసుకున్నానంటారు నాన్న. వెళ్ళి, నాన్నతో "నాన్నా, మీరు చెప్పింది నిజవేఁ నాన్నా, నేనలా మాట్లాడాల్సింది కాదు. నన్నుగురించి మీరన్నదిగూడా నిజవేఁ... నాగుండె కొట్టుకోకుండాగూడా చేస్తున్నా యీ సంకెళ్లు, సర్వనాశనమౌతున్నా నేను..." అని అనగలిగితే యెంత బాగుండును.'

# 9

ఈమధ్య ఒలోడ్యా కేమీ బాగుండడంలేదు. గత కొన్ని వారాలుగా పోకొలొవస్కీని గూడా కలుసుకోలేదు. బజారులో తానెచ్కా కనబడితే, "నీమూలాన బాధపడుతున్నా ననుకునేవ్, అదంతా వొట్టిది, యీమధ్య నాకేం బాగులేదు, యెవర్నీ చూడాలని అనిపించడంలేదు, చివరికి నిన్నుగూడా చూడాలనిపించడంలేదు" అన్నాడు కుండ పగలగొట్టినట్లు.

"నాదగ్గర కొచ్చినా బాగుపడేదికాదు నీ మనసు. నాకూ బాగుండడం లేదీమధ్య. ఈసారిగూడా మా మొదటి ప్రదర్శనం సున్నాచుట్టింది, ప్రొడ్యూసర్‌తో పోట్లాడాను, దానికితోడి పిప్పన్ను బాధ, క్లినిక్ కెళ్ళాలి. ఇంతకీ చెప్పొచ్చిం దేమిటంటే నేనూ హుషారుగా లేనన్నమాట, తెలిసిందా" అన్నది తానెచ్కా. ఒలోడ్యాదంతా 'నటనే' నేమోనని అనుమానం తానెచ్కాకి, కాని న్యాయానికి వెళ్ళి తానెచ్కాని చూడాలని చాలాసార్లను కున్నాడు ఒలోడ్యా, కాకపోతే యెప్పటికప్పుడు మళ్ళీ మనసు మార్చుకునేవాడు: తానెచ్కా చాలా నిస్పృహగా వున్నదనీ, వెళ్ళి ఆశ్వాసన నివ్వాలనీ అతనికీ తెలుసు; కాని తన మనసే బాగుండనప్పుడు అక్కడికి వెళ్తే, తన ఆవేదననిగూడా ఆవిడకి అంటించినవాడౌతాడేమోననే భయంతో ఆగిపోయాడు.

'మరీ యింత యిదైపోతున్నా నెందుకని?' అని అనేకసార్లు ప్రశ్నించుకున్నాడు తనని తాను. మాస్కోనించి దూరంగా వచ్చేశాను కదూ, అందుకనేమో అనుకునేవాడు కొన్నిసార్లు, డబ్బు చేతినిండా లేకపోవడం వల్లనేమో ననుకునేవాడు యింకొన్నిసార్లు, ఒకోక పర్యాయం, 'ముసలివాణ్ణై పోతున్నా' ననుకుని నిట్టూర్చేవాడు.

అతని కార్థిక యిబ్బందు లున్నమాటగూడా నిజమే. ఇవాన్ బొమ్మగీశాడన్న మాటేగాని, అది చూచి సంతోషించిన వా రెవ్వరూ లేరు ఇవాన్‌ని మినహాయిస్తే. ఇంతలో అవసరాని కొచ్చిందా అన్నట్టు వొక చిన్నపని తగిలింది— యేదో వ్యవసాయ ప్రదర్శనకని తెరలమీద బొమ్మలు గియ్యమన్నారు; ఆ తెరలమీద ఆవులూ, కోళ్లు వుండాలట. యేవో మంచి ఫోటోలు దొరకబట్టి ఆవుల బొమ్మలుమాత్రం తేలిగ్గానే వేసేశాడు. కాని కోళ్ళ బొమ్మలెయ్యాలంటే తాతలు దిగిరావాల్సొచ్చింది. ఆ బొమ్మలు తెల్లకోళ్ళవి కావాలన్నారు.

అలాంటి తెల్లకోళ్ళక్కడెక్కడా లేవు. కావాలంటే ప్రభుత్వ వ్యవసాయక్షేత్రానికి తీసికెళ్తాం, అక్కడలాంటికోళ్ళే వున్నై, వాటిని చూచి బొమ్మలు వేయొచ్చునన్నారు. అతనికోపం వచ్చింది: యింత బ్రదుకూ బ్రదికి యీ వెధవ కోడిపెట్టలబొమ్మలు గియ్యడానికి యాభైమైళ్ళెళ్ళాలీ? చివరి కొక మాగజైన్‌లో అవసరమైని బొమ్మలు దొరికినై; గీసేశాడు. నాలుగువేల ఏడువందల రూబుల్స్ జేబులో వేసుకున్నాడు.

ఐనా, యింకా వెలితిగానే వుంది; దాంతో మరీ కిందెట్టు మీదెట్టయ్యాడు. కాబట్టి అసలు చిక్కు, డబ్బులేనందువల్ల కాదు. వచ్చిన డబ్బులో మూడువేలు తల్లి కిచ్చాడు, బాగానే వుంది; ఐనా మనసు బాగుండడం లేదు. భయంకర పిశాచ మేదో ఆవహించి నట్లుం దతనికి. మాస్కోలో స్టుడియో నీది కాదని తీసేసుకున్నప్పుడుగూడా ఇలా లేడతను - షహోష్నికోవ్‌ని పెళ్ళిచేసేసుకుంటానని లయోలా వచ్చి చెప్పినప్పుడుగూడా అతని కింతబాధ కలగలేదు: లయోలా అంటే తనకి ప్రాణమని అనుకునేవాడు; ఐనా ఆవేళ సాయంత్రమే మీషాతో కలిసివెళ్లాడు కళాకారుల సంఘానికి; అక్కడ చ్వార్ట్జ్ భార్యని కలుసుకునీకలుసుకోవడంతోనే ఆవిడ వెంటబడి తిరగడం మొదలెట్టాడు - నిస్పృహకి చచ్చినా లొంగలేదు. ఇప్పుడంటే యెవరో నెత్తిమీద సుత్తితో కొట్టినట్లుంది, కాళ్ళకిం దెవరో

గోతులు తవ్వుతున్నట్లుంది - కాని వాస్తవానికి జరిగిందీ యేమీ లేదు. తానెచ్కా అతన్ని చూచి ముఖం తిప్పేసుకోలేదు, యిప్పుడే వున్నపళాన వెళ్లినా, యిదివరకటిలాగానే ఆహ్వానిస్తుంది. 'ఎప్పుడైనా మనసు మనసులో లేకపోతే నాదగ్గర కొచ్చేసెయ్' అన్నది తానెచ్కా. కాని, అక్కడికీ వెళ్ళబుద్ధిగావడంలేదు. ఈ వెధ పూరంటే విసుగెత్తిపోతూందని సోన్యాకి చెప్పాడుగాని, మాస్కోకి వెళ్లాలనీ అతనేమీ పడిచావడంలేదు. మాస్కోలోమాత్రం మాటలా, యెక్కడే చిత్రకారుడు నిచ్చె నెక్కుతున్నాడో, యెక్కణ్ణుం చెవడు దిగజారిపోన్నాడో వెయ్యికళ్ళతో చూడాలి, లెక్కలేసుకోవాలి, గుణించుకోవాలి, నాలుగు డబ్బులూ, యింత పేరూ వచ్చేదారి చూచుకోవాలి. ఆతనదంతా చేశాడు, చెయ్యడంలోగూడా బాగానే చేశాడు, కాని యిప్పుడక్కడి కెళ్ళాలని పించడంలేదు; ముప్పైనాలుగేళ్ళకే ముసలాడైపోయాడనుకోవడం న్యాయంకాదు, కాని మొత్తంమీద వయసు మళ్ళినట్లే వుంది. ఇక్కడతనికి అపకారం చేసినవాళ్ళూ యెవ్వరూ లేరు; స్థానికంగా పెద్ద చిత్రకారు డతనే; తెలివితేటలున్న స్నేహితుడు సొకొలొవస్కీ వున్నాడు; తానెచ్కా వుంది. తండ్రిగూడా యిప్పు డిదివరకంత జబ్బుగా లేడు, అదీ మంచిదే. తండ్రంటే తన కెంత ప్రేమో అత నింకా గుర్తించలేదు. కావాలనే తండ్రిని వెక్కిరించేవాడు, అందులో సందేహంలేదు, ఒప్పుకోవలసిందే, మరీ చిలిపితనం గూడాను. ముసలాయన అభిప్రాయాలు యీ కాలానివి కాదు తాతలనాటివే అనుకున్నా ముసలాయన చాలా మంచివాడు, అలాంటివాళ్ళు దొరకడం అరుదు, బాధపెట్టగూడ దాయన్ని ... ఇంతకీ ఒలోద్యా నిస్పృహకి కారణం యేమిటన్నమాట? బహుశా అదంతా ఆలోచనలమూలాన వచ్చిందేనేమో. మాస్కోలో అంటే అతనికి వూపిరాడేదిగాదు. ఎప్పుడూ ఫాక్టరీలో చుంచుపిల్లలా, ఆసులో కండెలా తిరుగుతుండేవాడు అక్కడినుం చిక్కడికీ, యిక్కడినుం చక్కడికీ. ఇక్కడంటే కావలసినంత విశ్రాంతి; అందు

కని ఆలోచనలుగూడా ప్రారంభమైనై. పిచ్చివాళ్ళు తప్పితే మంచివాళ్ళెవరూ ఆలోచించరనిపించే దినివరకతనికి – ఆలోచనంటే ఫలానా విషయాన్ని గురించని కాకుండా, ఊరికే ఆలోచించాలిగదాఅని అన్నిటిని గురించీ ఆలోచించిపారెయ్యడం – యిప్పు డతను చేసేదీ అదే. అంతకంటే కడుపు దేవే దింకొకటి లేదు.

ఇప్పుడు పరాచికాలాడ్డంగూడా తగ్గించేశాడు . ఒలోడ్యా; ఇప్పు డతని కళ్ళలో యిదివరకటి అ చిలిపితనమూ లేదు: ఆ చిలిపి చూపులు చూస్తే స్కూలు టీచర్లకి చెమటలు పట్టేవి, ఒకసారి తానెచ్కా- నిండాను లయ్యిందిగూడాను; యిప్పు డేది మాట్లాడినా మర్యాదగా. తనకి పట్టనట్టు మాట్లాడతాడు. ఒకసారి బస్సులో వెళ్తూంటే పక్కనే సావ్ చెంకో కూర్చున్నాడు; యిద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు; సొకొలొవస్కీ కనిపెట్టిన కొత్తయంత్రాన్ని గురించి చెప్పాడు సావ్ చెంకో. ఒలోడ్యాకి మెప్పన్నంటే గిట్టదు. కాని వొకసంగతిమాత్రం తెలిసొచ్చిందతనికప్పుడు: సావ్ చెంకో తా ననుకున్నంత బుర్రలేనిమనిషి కాదని. ఆవేళ సాయంత్రం యింటి కొచ్చి, చెల్లెలితో "సావ్ చెంకో తారసిల్లాడు, మంచివాడే సుమా...మంచి తెలివితేటలున్నై" అన్నాడు, ఒలోడ్యా. సోన్యా ఆశ్చర్యపోయినట్లు చూచిం దతనివంక. "అదంతా పట్టుకొచ్చి నాకు రిపోర్ట్ చేస్తావెందుకు ?" అని దులిపింది.

ఆవేళ సాయంత్రం చలిలో, సోన్యా, సావ్ చెంకోలు వీధిలో నడుస్తూన్నప్పుడే ఒలోడ్యాగూడా బయల్దేరాడు బయటికి, ఎక్కడికెళ్ళాలనే సంగతిగూడా ఆలోచించకుండా. వాళ్ళని చూచి ముసిముసిగా నవ్వుకుని, వీధి కవతలినైపుకు వెళ్ళాడు— అనవసరంగా వాళ్ళ కక్కనపడడ మెందుకు పానకంలో 'పుడకలా అనుకుని. యెక్కడికి కెళ్ళాలి తను ? 'సొకొలొవస్కీ-కి నేనంటే పడడంలేదు. క్రిందటిసారి వెళ్ళినప్పు డసలు మాట్లాడనుగూడా లేదు, కదలకుండా కూర్చున్నాడు బెల్లంకొట్టినరాయిలాగా. యెప్పుడూ ఆఫోన్కా-తోనే కూర్చునుంటాడు, యేం జేస్తాడో దేవుడికే తెలియాలి.

యిద్దరూ ఒకళ్ళని చూచొకళ్ళు మొహక్కుంటూ కూర్చోకుగద... సరే, యికిప్పు డెక్కడి కెళ్ళను ? ఓల్గా రెస్టారెంట్ కెళ్దామంటే పర్యటన కొచ్చిన అధికారు లందరూ యేదో నముల్తూ కూర్చునుంటారు విచారంగా, తాగుబోతు లదేపనిగా ఓడ్కా తాగి గల్లంతు చేస్తుంటారు. అక్కడికి వెళ్ళీ లాభంలేదు. బయటేమో చలి కొరుక్కుతినేస్తోంది.'

ఉన్నట్టుండి, సబురోవ్ గుర్తొచ్చాడు. వెళ్ళి అతన్ని చూచొస్తే ? మూడు సంవత్సరాల క్రితం, యాభై వొకటిలో, మాస్కోనుంచి సెలవుమీద వచ్చినప్పుడు చూచా డతని నిల్లు; అంతే. 'వెళ్తే అతను వ్రాసిన మంచిమంచి బొమ్మలూ చూడొచ్చు. పాపం, యెట్లావున్నాడో యేమో. వెళ్ళేప్పుడు చిరుతిండి పొట్లాల్లో కట్టించుకుని పట్టికెళ్తే బాగుంటుంది. చిరుతిండంటేనూ, కాస్త త్రాగడానికిస్తేనూ ఉబ్బితబ్బిబ్బైపోతాడు; ఆవాళ అమ్మపెట్టినవి మరీ మొఖంవాచినట్టు తిన్నాడుగూడాను.'

షాపులో కెళ్ళి సబురోవ్ కోసమని చిరుతిండీ, ఓడ్కా కొన్నాడు; అతని భార్యకోసమని వైన్ కొన్నాడు. టాక్సీ యెక్కి బయల్దేరాడు వూరి కవతల చివరనవున్న సబురోవ్ యింటికి. నది వైపుకు వంకరటింకరగా పోయే వీథంట టాక్సీ వెళ్ళడం కష్టమైపోయింది. దిగి కాలినడకన బయల్దేరి, యెట్లాగైతేనే, సబురోవ్ వుండే యిల్లు కనుక్కున్నాడు. ఇల్లు చాలాచిన్నది; ఇదివర కందులో వొక వ్యాపారస్తు డుండేవాడు; యిప్పుడు నాలుగు కుటుంబాలున్నాయి సబురోవ్ కుటుంబంతోగూడా కలుపుకుని.

గదిలో కెళ్తే, చిరాకేసింది ఒలోద్యాకి—ఏమిటీ గది యిలా వుంది! వాళ్ళంత గొప్పగా బ్రదకడంలేదని యివరకే తెలుసు గాని, మరీ యిలా బ్రదుకుతున్నారని వూహించుకోగూడ లేక పోయాడతను. కళాశాలభవనంలో వొకగదిలో వుండేవాడు సబురోవ్ వొకానొకప్పుడు, తర్వా తందులోనించి వెళ్ళగొట్టారు. అందులో నుంచి వెళ్ళగొట్టేముందే పెళ్ళి చేసుకున్నాడు. గ్లాషా

కొక గది దొరికింది—ఆ యిల్లేదో ప్రచురణశాఖ కిచ్చారు. రెండు మంచాలు, ఒక స్టౌ, వడదాకా బొమ్మలు—మనిషి రెండడుగులేసి తిరగడానికూడా వీల్లేకుండా వుంది.

ఒలోద్యా కొక యీజీచైర్ చూపించారు సబురోవ్ దంపతులు కూర్చోమని. లేచి, గబగబా, ఆ కుర్చీలోవున్న కార్డుబోర్డు ముక్కలూ, పేలికలూ, వార్తాపత్రికలూ, పగిలిన పింగాణీపాత్రల ముక్కలూ తీసి శుభ్రంచేసింది గ్లాషా. పసిపిల్లవాడిలా ఆనందపడ్డాడు సబురోవ్.

"బలే సమయానికొచ్చావ్ ఒలోద్యా, యెంత ఆనందంగా వుందని మాయిద్దరికీనీ. సరిగ్గా యివ్వాల్టికి రెండు సంవత్సరాలైంది మా పెళ్ళై. ఇవ్వాళ నలుగుర్నీ పిలిచి పండుగ చేద్దామనుకున్నా. గ్లాషాతో గూడా అన్నా పుఖోవ్ నాహ్వానిద్దామని. వీల్లేకపోయింది...నెలాఖరు రోజులుగాదూ. నిజం చెప్పనా ఒలోద్యా, యిక నే నేమీ చెయ్యలేననిపిస్తోంది థియేటర్లో యేమైనా పనుంటుందేమో తీసుకుంటారన్నారు; నిజమేననుకున్నాను, అదీ జరగలేదు. సరే, అదంతా యెందుకులే యిప్పుడు...నువ్వొచ్చావు, అదే చాలు; టీ తాగుదాం, యిట్లో తినేందుగ్గూడా వుందనుకుంటాలే గ్లాషా పట్టుకొస్తుంది..., చూశావా గ్లాషా' వీడూ నేనూ పదేళ్లు కలిసి చదువుకున్నాం స్కూల్లో. ఇవ్వాళొచ్చాడు మనింటికి. అదృష్టమంటే అలావుండాలి."

నవ్వుతూ కూర్చున్నాడు ఒలోద్యా.

"సరే, యిన్నాళ్లకందరం కలుసుకున్నాం కాబట్టి పండగ చేసుకుందాం పట్టండి. వైనుందిలే నాదగ్గిర, వస్తూ వస్తూ పట్టుకొచ్చాను"

కంగారెత్తిపోయింది గ్లాషాకి. రొట్టెముక్కన్నమాట లేదు యింట్లో, ఒలోద్యాగూడా మరచిపోయొచ్చాడు పట్టుకురావడం. పరుగెత్తికెళ్ళి పట్టుకొస్తానంది - ప్రభుత్వం షాపు ఇంకా మూసేసుండరు.

"కామెన్స్కీ నాటకం కంపెనీవాళ్లు రావడం గుర్తుందా నీకు సబురోవ్, నాన్నతో పోట్లాడానుగూడాను నేనప్పుడు; రాగి డబ్బు లేదు నాదగ్గర, మీరానుగూడా తీసికెళ్లా లనుకున్నాను నాటకం చూడ్డానికి, చివరికి నువ్వు 20 రూబుల్లిస్తే అప్పుడెళ్లాం, జ్ఞాపకం వుందా" అన్నాడు ఒలోద్యా, గ్లాషా వెళ్ళిపోయినతర్వాత.

సబురోవ్ నవ్వాడు.

"ఓ జ్ఞాపకం లేకేం. నీ దగ్గరున్న డబ్బులు మీరాకొక లెమొనేడ్ కొనిపెట్టడానికి సరిపోతాయనుకున్నావు, నువ్వుగూడా తాగడానికి లేవు. చక్కటి పిల్ల మీరా. ఇప్పుడెక్కడుందో తెలుసా నీకు ?"

"ఆగాగు, నేను చెప్పాలనుకుంటున్నది అదిగాదు. ఇప్పుడు డబ్బేమీ లేదుగా నీదగ్గర, నాకూ తెలుసులే. ఇదిగో యీ వెయ్యి తీసుకో, నాదగ్గ రిప్పుడింతకంటే యెక్కువ లేదు. ఇందులో కాండబ్బ గూడా అవసరంలేదు నాకిప్పుడు. ఎకెడమీ పిలిచిన్వి ఐంతర్వాత చెల్లగొడుదూగానిలే యీబాకీ. ఇప్పుడిప్పుడే తొందరేంలేదు. తీసుకో...నీ అన్నలుప స్నేహితుడిలాగా భావించు, యిది తీసుకోకపోతే నన్నవమానించినట్టే."

గ్లాషా వచ్చింది. తిండి ప్రారంభిద్దాం అన్నాడు సబురోవ్; ముందు బొమ్మలు చూద్దాం అన్నాడు ఒలోద్యా.

"ఎందుకురా బాబు, చూచినా నీ కవి నచ్చవేమో. కాస్త తాగి తిని పాతకాలపు ముచ్చట్లు చెప్పుకుంటే పొయ్యే దానికి" అన్నాడు సబురోవ్.

ఒలోద్యా ససేమిరా వినలేదు. బొమ్మలు చూడాలని వున్న మాట వాస్తవమేగాని, అంతకంటే యెక్కువైంది ఇంకొకటుంది; సబురోవ్ వూరికే మొఖమాటంపడుతున్నాడు; ఒలోద్యా ఆ బొమ్మల్ని చూచి, ప్రశంసించకపోతే తప్పక బాధపడతాడు లోలోపల; ఒలోద్యాకా సంగతి తెలుసు, ముందే బొమ్మలు చూడాలని పట్టుబట్టాడు; గ్లాషాగూడా అతన్నే సమర్థించింది:

"నిజంగానే, బొమ్మలు ముందు చూడవల్సిందే చెబితే నమ్మవుగాని ఒలోడ్యా, యీమధ్య వ్రాసిన ప్రకృతి దృశ్యాలూ, నా బొమ్మా - పచ్చగానులో - యెంతబావున్నాయని."

చిత్రలేఖనమంటే ఒలోడ్యాకి మంచియిష్టమేగాని, యిష్టమే నని యితికులముం దంగీకరించేవాడు గాదు, కళ గురించెవరైనా మాట్లాడుతూంటే పెదవులు కుట్టేసుకున్నట్లు మాట్లాడకుండానైనా కూర్చునేవాడు లేకపోతే అపహాస్యంగానైనా మాట్లాడేవాడు. కొన్ని సంవత్సరాలక్రితం వొకసారి, లెనిన్గ్రాడ్ వెళ్లి పురాతన కళాఖండాలన్నీ చూస్తూ ఒక వారంరోజులు గడిపాడు. అక్కణ్ణించి తిరిగొచ్చింతర్వాత మళ్ళీ యథాప్రకారమే: ఎక్కడ కమిషన్ సంపాదిద్దామా, కళాశాఖలోవున్న బ్లాండోవ్ నెలా బుట్టలో వేసు కోవాలా, లయోలా కేం బహుమానం యిద్దామా - అంతా వొకటే ఆలోచన.

సబురోవ్ వేసిన ప్రకృతి దృశ్యాలన్నీ కిమ్మనకుండా పరీక్షగా చూశాడు ఒలోడ్యా, ఆ బొమ్మలు బాగున్నాయనుకుంటు న్నాడో లేదో గూడా తెలియలేదు; తన భర్త పనిని చూచి యేమాత్రం హర్షించాడో తెలుసుకుందామని గ్లాషా యెంత ప్రయత్నించినా అంతుబట్టలేదు. 'ఆగాగు, యింకా చూడనీ' అనో, 'దానిమీద వెలుగు పడుతోంది, యింకా స్థిటుండు' అనో అన్నాడు మధ్యమధ్య. సబురోవ్ యీమధ్య బొమ్మలన్నీ బాగానే వేస్తు న్నాడా? లేక ప్రతిబొమ్మలోనూ మంచినే చూచే అలవాటు చేసు కున్నాడా ఒలోడ్యా? సబురోవ్కి విసుగెత్తిపోయింది. 'యిక చాల్లే, వెళ్లి భోంచేద్దాం, పద' అన్నాడు; ఐనా లాభంలేకపోయింది.

పిక్చర్ గాలరీల్లో, గొప్పగొప్ప చిత్రకారులు వ్రాసిన మంచిమంచి బొమ్మల్ని, చూచినప్పుడల్లా, మనసంతా తేలికైనట్లూ కేరింతలు కొడుతూన్నట్లూవుండేది ఒలోడ్యాకి, అప్పుడేచిగురిస్తూన్న చెట్టుని చూచినట్లూ, చక్కని అందమైన స్త్రీని చూచినట్లూనూ. కళిదివర కెప్పుడో బ్రదికున్నమాట నిజమేగాని, యిప్పుడు చని

పోయిందనీ, చనిపోయిగూడా చాలాకాలమైందనీ ఆతని వుద్దేశం. ప్రతి మూర్తిమీదా అదో గమ్మత్తుగా వుంటుంది ఏదో యెక్కడో చనిపోయినట్టూ, చనిపోయిన వాసన కొద్దిగా కొడుతున్నట్టూనూ — ఆ పరిశుభ్రమూ, ఆ చిరుచలీ, చూడడాని కొచ్చిన వాళ్ళ గుసగుసలూ. సబురోవ్ కృతులు చూచి స్తబ్ధుడైపోయాడు ఒలోడ్యా: యితనుగూడా తన సమకాలికుడే, ఒకే స్కూల్లో చదువుకున్నారు యిద్దరూ కలిసి; యింతకీ విశేషమిటంటే ఆ ప్రకృతి దృశ్యాలన్నిటినీ, యీయిన కింట్లోనే వొకమూల ఆకుంటిభాగ్యంలో కూర్చుని. ఆచిన్న కిటికీలోంచి బయటికిచూస్తూ వ్రాశాడు సబురోవ్. చూస్తే అంతా తేలిగ్గానేవుంది, అర్థంచేసుకోవాలంటే తాతలు దిగొస్తున్నారు — ఆ రంగుల కదలిక, గోధుమరంగు, నీలాకాశాల్లో లోతులు, ఆ నేల రంగుకన్న బరువు! ఈమధ్యనే వ్రాసిన భార్య బొమ్మనిగూడా చూపించాడు సబురోవ్, మరీ ఆశ్చర్యం వేసింది ఒలోడ్యాకి. బొమ్మ నాకుమల్లేనా వుందా అనడిగింది గ్లాషా; సమాధానం చెప్పలేదతను. అలాగే బొమ్మని చూస్తూ నిలబడిపోయాడు— ఆ నెత్తిమీది జుత్తు వంపుల్లో మెరిసే వెలుగు, ముఖంమీది గోధుమరంగు ఛాయలు. పచ్చని బ్లౌజు. ఇందాక చూచిన ప్రకృతి దృశ్యాల్లోనూ అంతే: చూచినకొద్దీ వ్యక్తమయ్యాయి ప్రకృతిలోని గొప్పా, వొప్పూ, తప్పూ అన్నీనీ— కరగే మంచూ, నీలి ఆకాశం. మోడైపోయిన కొమ్మల నలుపూ; ఉత్తర ప్రాంతంలో వచ్చే వసంతంలోని గారడీ. ఇప్పుడూ అంతే; స్త్రీ సౌందర్యమూ, అనాకారితనమూ - రెండూ - అభివ్యక్తమయ్యాయి; సాదాగా, ఏదో తెలిసీ తెలియని, కనిపించీ కనిపించని ఆ మూర్తి - గ్లాషా చిత్రలో- పెదవులచుట్టూ దోబూచులాడే ఆ చిరునవ్వుని చూచేందుకు జీవితమంతా ధారబోసినా గొప్పలేదనిపించింది.

మాట్లాడకుండా కూర్చుని, ఓడ్కా గ్లాసు తీసుకుని ఒక గ్లాసుడు ఓడ్కాగూడా తాగాడు ఒలోడ్యా మాట్లాడకుండానే.

అప్పుడు గుర్తొచ్చింది మాట్లాడవలసిందేనని. లేచి, యేదో గొప్ప విషయం చెబుతూన్నట్టు, "ఇవ్వాళ నీ చిత్రాన్ని చూశాను గ్లాషా, కాదు కాదు, నీ భర్త కళ్ళకి నువ్వెలా కన్పిస్తావో చూడగలిగాను; అదృష్టవంతుణ్ణి. సబురోవ్! నీ కుంచెలో గొప్పదనాన్ని చూడ గలిగా నివ్వాళ! మీ రింకా నాలుగుకాలాలపాటు సుఖసౌభాగ్యాలతో బ్రదకాలని కోరుకుంటున్నా" అన్నాడు.

అని, మళ్లీ గ్లాసు ఖాళీ చేశాడు. కాస్సేపున్న తర్వాత గ్లాషా అడిగిందతన్ని "నిజం చెప్పు ఒలోడ్యా, ఆ చిత్రాలన్నీ నచ్చినై నీకు?"

ఇప్పుడూ సమాధానం చెప్పలేదు ఒలోడ్యా. కాస్సే పాలోచించి, "యిదిగో సబురోవ్, అసూయనేనుంది చూశావ్, అంత చెడ్డది యింకెక్కడా వుండదు; నిన్ను చూస్తే అసూయేస్తోంది నాకు" అన్నాడు సబురోవ్ వైపు చూచి.

ఇంకో గ్లాసు నింపి, మళ్లీ ఖాళీ చేసేశాడు. సబురోవ్ వ్రాసిన ప్రకృతిదృశ్యం పటాన్ని మరోకసారి చూశాడు. ఆ పటంలో నేల రంగు మెరసిపోతున్న తుప్పులాగుంది, చెట్లూ చిన్న బూడిదరంగు యిల్లు, యెత్తుగా యేమీ లేదు ఖాళీ ఆకాశం. అదేపనిగా చూశాడు ఒలోడ్యా ఆ చిత్రాన్ని, చివరికి, విచారంగా ఒక చిరునవ్వు నవ్వి, "చాలా గొప్పగావుందీచిత్రం; నిజంగా" అన్నాడు.

"ఆ చెట్లుగీయడం కుదరలేదు. ఆ వక్కడ వుండీ లేనట్లుండాలి. ఆ చిత్రాన్ని నేను ఆకురాలుకాలంలో వొకనాడు వ్రాశాను. ఆవాళ వాతావరణంగూడా అదో గొప్పగా వుంది — క్రింది నేలది గూడా అదొక ప్రత్యేకమైన రంగు. మళ్ళీ అలాంటిదే, నలభయ్యొకటిలో ననుకుంటాను, చూశాను; యెక్కడోగాని కలూగా పట్టణానికి దరిదాపుల్లో. మేం వప్పుడు తిరోగమిస్తున్నాం. స్టెపనోవ్ గూడా నా వెంటే వున్నాడు, చాలా మంచివాడులే; వ్యవసాయ శాస్త్రజ్ఞుడు. అతని చిత్రం గీయాలని చాలాసార్లనుకున్నాను... మేం వప్పుడెలా వున్నామో చెప్పనవసరం లేదు నీకు, ఉన్నట్టుండి చూశాన్నేను— చిన్న కుటీరం వొకటుంది, దాని ప్రక్కనే చిన్న

వా గొకటి ప్రవహిస్తూంది, నేల అచ్చంగా అల్లాగే వుంది తుప్పుకి మల్లే. "చూడు!" అన్నాను స్టెపనోవ్‌తో. నే నెందు కలా అన్నానో అర్థంకాలే దతనికి మొట్టమొదట, తర్వాత చూచాడు. "నరకానికి తరిమి పారెయ్యాల్సిందే వాళ్ళని" అంటూ గర్జించాడు వున్నవా డున్నట్లుండి. తర్వాత, మలోయారో స్లావట్జ్ దగ్గర చనిపోయాడు" అన్నాడు సబురోవ్.

తర్వాత, చాలాసేపు స్టెపనోవ్ నిగురించే మాట్లాడుతూ కూర్చున్నాడు. కాని, అతను చెప్పేమాటలు వినడంలేదు ఒలోడ్యా; ఆ చిత్రంవంకే చూస్తున్నాడో, లేకపోతే నిర్ఘాంతపోయి అలాగే కూర్చుండిపోయాడో తెలియదు.

"ఇక వెళ్తాను. వెళ్ళాలని లేదుగాని వెళ్ళడమే మంచిదిలే" అంటూ లేచాడు చివరికి.

అతను వెళ్ళిపోయిం తర్వాత, గదంతా శుభ్రం చేసింది గ్లాషా. సబురోవ్ పరుపుమీద కూర్చున్నాడు రెండు చేతుల్లోనూ ముఖం కప్పుకుని. కునుకు తీస్తున్నా డేమో ననుకుంది గ్లాషా, చప్పుడు గాకుండా, మునికాళ్ళమీద నడుస్తూ తనపనులు చేసుకుంది. నెమ్మదిగా, అతి నెమ్మదిగా పిలిచాడు గ్లాషాని సబురోవ్; వచ్చి, రెండు చేతుల్లోనూ పొదువుకుంది గ్లాషా భర్తని.

"చూశావా, ఒలోడ్యాగూడా మెచ్చుకుంటున్నాడు గొప్ప చిత్రమని. సరటోవ్ దగ్గర కెళ్ళు నువ్వు. వాళ్లుగూడా, గుర్తిస్తారు తప్పకుండా. ప్రదర్శన యేర్పాటు చేస్తారు, తప్పకుండా చేస్తారు."

సబురోవ్ తలూపాడు.

"లాభం లేదు, ఆ చెట్లు సరిగ్గా కుదరలా. ఒలోడ్యా లక్ష చెప్పుగాక, నాకు తెలియదూ. తర్వాత, పైన ఆ కుడిచేతివైపు భాగం వుందే, అదింకా పూర్తికాలా. ఇంకా పనిజెయ్యాలి దాని మీద".

గ్లాషా ముఖంలో విచారాన్ని చూశాడు సబురోవ్. "నిరుత్సాహపడకు గ్లాషా, రొడినోవ్ చెప్పాడుగా మార్చి ఫస్ట్ తర్వాత

యేదో థియేటర్ పని యిప్పిస్తానని -యెవరో గీసిన చిత్తు బొమ్మల్ని బట్టి బొమ్మలెయ్యాలట. ఫర్వాలేదు. ఇకప్పుడు మనకీ కష్టాలుండవ్."

"వద్దొద్దు. నువ్వు నీచిత్రంమీద పనిజెయ్యడం మానుకోవద్దు. నేనన్నదసలు అదిగాదు. అందరూ నువ్వేసిన యీప్రకృతి దృశ్యాల్ని చూడాలనిమట్టుకే నేను కోరుకునేది. డబ్బుని గురించేమీ బాధపడబోక, డబ్బదేవస్తుంది, రాకపోయినా నెట్టుకుపోతాం. ఇవ్వాళ్లెంత సంతోషంగా వుందనినాకు. ఒలోడ్యా గొప్ప చిత్రకారుడు కాదని నాకూ తెలుసు. కాని, మంచిచిత్రాన్ని చూస్తే యిట్టే పసికట్టేస్తాడు; చూడగానే తెలుస్తుందా సంగతి".

"యేమిటీ, అతను గొప్పగా చిత్రాలు వేయలేడనా నీ వుద్దేశం? పొరపాటు. యేప్రిల్లో అతను మాస్కోనించి వచ్చిప్పుడు నన్ను చూడ్డానికనొచ్చాడు. అప్పుడు నేను పూలగుత్తి వెయ్యాలని ప్రయత్నిస్తున్నా; యెంతసేపటికీ కుదరలేదు. అతనలా నించున్నవాడు నించున్నట్టు పూర్తిచేసి యిచ్చేశాడు. ఆ బొమ్మే నువ్వు చూస్తేనా! నాకదేపనిగా చూడబుద్ధేసింది-ఒక నల్లకూజా, ఆ కూజాలో కళకళలాడే పెద్దపెద్దపూలు. విరామంలేని కళవళంపడే పూలు, అతనిలాగానే. ఇప్పుడిలా యెందుకుంటున్నాడో అర్థం కావడంలేదునాకు, మరీ హాస్యంవాడు తున్నప్పుడు చూశావా యెంతభయంకరంగా వుంటాడో. నేనే ప్రవర్తించలా సరిగ్గా అతనంటే—అప్పుడు వాళ్ళనాన్న పుట్టినరోజుకి వెళ్ళడమే, తర్వాత ...నేలేదు అతన్ని చూడ్డానికి. నేనతన్ని విసిగించానేమో నను... చూశావా, యిక్కడ్నుంచి వెళ్లాలనిలేదన్నాడు...యేంకా అతనికి యేమో...బహుశా నీలాంటివాళ్ళ నెవర్నైనా ...న్నడేమో."

... సందిగ్ధంలో పడింది, ఆ అమాయిక ముఖంమీద ...ండా విరిసిన లేనవ్వు, అదో వింత కాంతి నిచ్చింది, ...ఆ విడముఖంలా.

♦ ♦

తెల్లవారబోతోంది, జారేనేఁ మీద నడుస్తూ, యేటవాలుగా వున్న రోడ్డెక్కుతున్నాడు ఒలోడ్యా, వెనకనుంచి గాలి పిచ్చిగా వీస్తోంది; ముందుకు నెడుతోంది అతన్ని. మరీ అసంబద్ధంగా మాట్లాడానుకుంటూ...అబ్బ, మరీ ఆ సబురోవ్ బ్రదుకు—అదీ యేఁవంత పెద్దకష్టంకాదులే, కాని అతనుచేసే పనిగూడా యెవరికీ తెలియదుగద; అతన్నిచూచేందుకు వెళ్ళిన చిత్రకారుణ్ణింతవరకు నేనొక్కణ్ణే నన్నాడు. అతనొక వింతజంతువను కుంటారు యీాని యన్‌వాళ్ళు. నిజంగా అంతే - అత నిలా, అలా, రాజీపడకుండా, అనుకున్నపని చెయ్యాలంటే అలాగే వుండాలి మరి...చెబుతూంటే అసంబద్ధంగానూ, అర్థరహితంగానూ వున్నట్టుంటుంది గాని, నిజం గానే అసూయ పుట్టుకొస్తోంది అతన్ని చూస్తూంటే. నేనే గనక మాస్కోవెళ్లి, కాస్త చెమటోడ్చి, యింకాస్త కాకాపడ్తే వెంటనే వొక ప్రదర్శన యేర్పాటుచేస్తారు, యేదో బహుమానఁ విస్తారు; అందరూ ఆహాహా అనీ, ఓహోహో అని అంటారు. అంత జరిగినా, ఆ పిచ్చాడంటే నాకున్న అసూయపోదు. తానెచ్చా చెప్పింది గూడా నిజమే, ఆ కుంటమ్మాయి నతను పెళ్లి చేసుకోవడమే మంచిది- ఆవిణ్ణిచూచి, అతను వ్రాసిన చిత్రాల్లాంటివి, యెవళ్ళన్నా వచ్చి కూర్చుని గీయమంటే గీయలేం; వొట్టి నైపుణ్యంవుంటే చాలదు, ఆ చిత్రం వ్రాయాలని నీ అంతరాంతరాల్లోనే పుడితేనేతప్ప సాధ్యం గాదు. ఛ, మళ్ళీ యిదేవిఁటీ, యిలా గాలిలో ఆలోచిస్తాను, నేనూ పిచ్చివాణ్ణై పోతున్నాలావుంది. ఎంత పిచ్చివాణ్ణైనా సబు రోవ్‌లాగా మట్టుకు చిత్రాలు వ్రాయలేను. నాకంత ప్రతిభ లే వున్నదికాస్తా విసరిపారేసుకున్నాను. యేదో పిచ్చాసుప కూర్చుని, యితరుల వృత్తగువుల ప్రకారం, కోడిపెట్టలబో కూర్చుంటాను...ఇదేనా నాయనా ఒలోడ్యా! నువ్వు ఇదేనా? ఉఁహూఁ, యిదేనన్నమాట? సరే, వుందిగా, కోరుకున్నవారికి 'కోరుకున్నంత మహ

మర్నాడు అతని గదిలోకి తల్లి, నాదెజా వచ్చింది. "చూశావా, నాయనా నిన్ను గురించి పత్రికలో వ్రాశారు, నేను చదువుతా నాగు, ఆఁ...యిక్కడుంది 'చిత్రకారుడు ఒలోడ్యా వ్రాసిన వాస్తవిక చిత్రాల్ని గురించి యిక్కడ వుదహరించకుండా వుండగలగడ మసంభవం, అందులోనూ 'ఆయన ప్రత్యేక నైపుణ్యం ప్రతిబింబించే చిత్రాలవి. వాటితర్వాత...' సరే, అదంతా యింకో సంగతిని గురించిలే...బాగా వ్రాశారుకదూ?" అన్నది లోపలి కొచ్చి.'

నాలుగనబుద్ధేసింది ఒలోడ్యాకి, తల్లి కోపంవస్తుందని మానుకున్నాడు; తలూపి, "నాన్న బాగున్నారుకదమ్మా, మంచి దేలే, యెలావున్నారోనని బాధపడ్డా" అన్నాడు.

తల్లి సంతోషించింది, కొడుకుని ముద్దుపెట్టుకుంది, ఆవిడ భర్త యీ కొడుకుని సరిగా అర్థంచేసుకోలేదు; ఒలోడ్యాది చాలా మంచి హృదయం, కాకపోతే పైకలా కనబడతాడుగాని.

కిటికీ దగ్గరకెళ్ళి నిలబడ్డాడు ఒలోడ్యా; బయటేమీలేదు మంచుతప్పితే. గది వెచ్చగానేవుంది కాని యెక్కడో లోన, మనసులో, యేదోమూల చలివేస్తూనే వుందతనికి. వెళ్ళి ఓవర్‌కోట్ తెచ్చుకుని వేసుకున్నాడు. ఐనా, ఆ చలి వదల్లేదు.

# 10

భోజనాలు పూర్తయ్యాయి. చల్లబడుతూన్న టీ గ్లాసొకటి ముందుపెట్టుకుని కూర్చున్నాడు డిమిత్రీ, బెర్లిన్ సమావేశాన్ని గురించిన వ్యాసంవొకటి పత్రికలో చదువుకుంటూ. ప్రక్కనే సావ్చెంకో కూర్చున్నాడు.

“సెమియొనోవ్ని వుద్యోగంనుంచి తొలగించాలని చూస్తున్నాడు ఇవాన్. అతనికి బహుమానమిచ్చి యింకా నెలన్నా పూర్తికాలేదు. ఇప్పుడేమో అతనొట్టి స్వార్థపరుడని అంటున్నాడు. మిల్లింగ్ మెషీన్ శాఖలో సెమియొనోవ్లాగా పని చెయ్యగలవాళ్ళింకెవరూలేరు. మొన్న నేను పరీక్షగా చూశాను గూడాను, ‘లేత్’ నెలా నడపాల్సిందీ చూపిస్తున్నాడు కొంతమంది కుర్రవాళ్ళకి. ఇంకేమీలేదు, అతను స్వతంత్రంగా వుంటాడు, అంతే; అదేమో యీ ఇవాన్కి గిట్టదు. –దీ కాదనుకుంటాలే – వూరికే కోపం తీర్చుకుంటున్నా డనుకుంటా...”

ఇంకా వ్యాసం మీదే ధ్యానం వుందేమో, “ఇవాన్ కంత కోపంమాత్రం దేనికి?” అనడిగాడు డిమిత్రీ, పట్టనట్లే.

“ఇంకా మీదాకా రాలేదన్నమాట? ఆయన భార్య వదిలిపెట్టేసింది; అందుకూ ఆ కోపం.”

బాగా ఆత్మ సంయమం అలవాటు చేసుకున్న మనిషే డిమిత్రీ; ఐనా తెల్లబోయాడు, ముఖం అటుతిప్పి “ఈ లైట్లకి కాస్త షేడ్ పెట్టగూడదూ? అది మూడువందల వాట్లబల్బు; కళ్ళకూరికే బాధ కలుగుతుంది” అన్నాడు.

సావ్చెంకో, డిమిత్రీ బాధనేమీ చూళ్ళేదు “మీ రావిణ్ణి యెరుగుదురుగా, ఆవిడతన్తో యింత కాలం కాపరం యెట్లాచేసిందీ అని; చెప్పరూ?” అనడిగాడు.

చేతి గడియారం చూసుకుంటూ లేచాడు డిమిత్రీ. "ఎగో రోవ్ యెదురు చూస్తుంటాడు నాకోసం. ఆ వ్యాసం చదువుతూ సైమే చూచుకోలేను నేను. నిన్నటి సమావేశం చాలా బావుం దిలే – బిడావసలు మాట్లాడనే లేకపోయాడు. మరీ యిరుకులో పడిపోయాడు; ఫ్రెంచివాడుగదూ. బోయిలర్ బ్రాకెట్లు సరిపోవడం లేదని ఎగొరోవ్‌కి, పాపం వొకటే దిగులు. వెళ్ళిచూడాలి."

త్వరగానే స్థిమితపడి, ఎగొరోవ్‌తో మూడుగంటలసేపు గుక్క-విడవకుండా మాట్లాడాడాపూట బోయిలర్స్‌ని గురించీ, బ్రాకెట్లని గురించీ, వెల్డింగ్‌ని గురించీ. మాట్లాడటం ఐపోయింతర్వాత, "మీ ఆరోగ్యం యేమీ బాగున్నట్టులేదు. మరీ గదిలోనే కూర్చుం టున్నట్టున్నారు; కాస్త బయటిగాలిగూడా పీలవడం అవసరం. మొన్న గొరొఖోవ్‌గూడా చెప్పారు–కనీసం రోజుకి రెండుగంటల సేపు నడవడం మంచిదని. నాకెట్లాగూ వీల్లేదనుకోండి. ఐనా, రోజూ యింటికెళ్ళేప్పుడు నడిచే వెళ్తున్నా" అన్నాడు ఎగొరోవ్.

ఇంటికెళ్తూ, ఎలీనానిగురించి ఆలోచించాడు డిమిత్రీ. ఆలో చించవలసిందేమీలేదని తనకుతాను చెప్పుకున్నాడు, తనకేమీ సంబంధంలేని విషయమది. ఇదివరకే అనుకున్నాడు అదంతా అర్థం లేని సంగతని; అదంతా మరచిపోయి; తన జీవిత తాను గడపడం మంచిది.

ఐనా, ఎలీనా, ఇవాన్‌నెందు కొదిలిపెట్టింది? యెంత లేదన్నా ఐదు సంవత్సరాలకిపైగా కాపురంజేసిం దతనితో. పాపం, యీ నిర్ణయానికి వచ్చేందుకు చాలాబాధపడే వుంటుంది... 'మరీ నాకు మతిపోతోంది' అని బుద్ధి జెప్పుకున్నాడు తనకు తాను. 'అందులో వింతేంవుంది? ఇంతకాలం అతనితో కాపురంజెయ్యడవేం వింత, నిజానికొస్తే. క్రిందటి వేసవిలో నేనే ఆశ్చర్యపడేవాణ్ణి తరచు, వీళ్ళిద్దరూ మాట్లాడుకోడానికేం వుంటుందాఅని. అంటే, సావ్ చెంకో అన్నట్లు ఇవాన్ వొట్టి స్కౌండ్రెల్ అనిగాదు, సామాన్యమైన మనిషి, అంతే; ఆఫీసుముద్ర – రబ్బరుస్టాంపు – లాంటివాడు. సావ్

చెంకోఅంటే యువకుడు, ప్రతీదానిలోనూ గొప్ప చూడాలనుకుంటాడు, అదీగాక ప్రతీదీ వింతగానే, కొత్తగానే వుంటుం దతనికి; నేనంటే ఇవాన్ లాంటివాళ్ళని చాలామందిని చూశాను. వ్యక్తిగతంగా మంచివాడేనేమో ఇవాన్. తానంటే అతనికున్న ఆప్యాయాన్నిచూచి వూరుకున్నదేమో ఎలీనా. లేకుంటే ఆ చిన్నపిల్లే వాళ్ళిద్దరి సాన్నిహిత్యానికీ కారణమేమో. ఏదైతేనేం లింకు బలహీనంగా వుంది, వున్నట్టుండి, అగస్మాత్తుగా యివ్వాళ తెగిపోయింది; నాకేం సంబంధం. ఇదే క్రిందటి వేసవిలో జరిగుంటే, వెంటనే ఆవిణ్ణి చూచేందుకు పరుగెత్తేవాణ్ణి, వుత్సాహపరచేందుకు ప్రయత్నించేవాణ్ణి, యేమైనా సాయం కావాలేమో చూచేవాణ్ణి. ఏవీఁ వెనకాడకుండా, అతిసహజంగానే చేసేసేవాణ్ణివన్నీ అప్పుడైతే. అప్పుడే ఐతే, చాలా తేలిగ్గా చేసేసేవాణ్ణి. ఇప్పుడంటే, యెక్కడైనా వొకవేళావిడ యెదురుపడినా, ఆవిడతో మాట్లాడే ధైర్యంగూడా వుండదు – నా మనసులో సంగతి బయటపడిపోతుందేమోనని నా భయం! ఆవి డసలే తడిసి మోపెడైవుంది స్వంత బాధల్తోనే, దానికితోడు, అయాచితంగా, నేనుగూడా వెళ్ళడమెందుకు యీ నా సొంతగొడవతో. నే నేమైనా సావ్‌చెంకోనా? నా వయ సొచ్చేప్పటికి యేంచేస్తున్నావో ఆలోచించి మరీ చెయ్యాలి, బొమ్మ గీతలాగా వుండాలి అటూ యిటూ జెసక్కుండా. ఈ పప్పులేవీఁ వుడకవ్.'

రాత్రి ప్రొద్దుపోయేదాకా అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. నిద్రపోబోయేప్పుడు, పర్వాలేదిక స్థిమితపడ్డానని అనుకున్నాడు — యిక ముందిలాంటి రాత్రులు గడపాల్సిన పనుండదు. కాని, మళ్ళీ ప్రొద్దున్నే మేలుకున్నాడో లేదో, మళ్లీ అవే ఆలోచనలు: ఎలీనానుగురించే. ఇప్పుడెక్కడుందావిడ? ఆవిణ్ణోకేళ చూడదలచుకున్నా, యెక్కడుందో తెలియదాయె. ఎలా కలుసుకుంటాడు వెళ్ళి? యింకోపట్టణాని కెళ్ళిపోయిందేమో, లేకపోతే యేదైనా పల్లెటూరికే వెళ్ళిందో, తలిదండ్రుల దగ్గరకే వెళ్ళిందో...

సంవత్సరం పూర్తికాందే, మధ్యలో, వుద్యోగంవెలా వదుల్తుంది? వదలదు. కాని తాను స్కూలుకి వెళ్ళలేదు, కాకతాళీయంగానే ఆవిడ యెదురపడితేనా, ఆవిడకెదురున్నా, దగ్గరకెళ్ళి, యేమీమాట్లాడకుండా ఆవిడకేసి చూడగలిగితేనా, యెంతబావుండును.

యెంతకాలంనుంచి సాగుతోం దీగొడవ? సెలవ్వుంచి తిరిగొచ్చింతర్వాత ప్రారంభమైంది యీవేదన — ఆరుమాసాలౌతుంది. తన మనసుకంటేగూడా యీ గొడవే బలవత్తరమైపోయింది. కాని, దీనికి లోబడగూడదు, తమాయించుకోవాలి, తప్పదు.

'ఇంతకీ అసలావిడ ఇవాన్‌నెందు కొదిలిపెట్టినట్టు? నాకేమీ తెలియదాయె. బహుశా యీ బాధంతా ఆవిడగూడా పడుతూం దేమో? ఛ, అర్థంలేదు, ఆవిడలా బాధపడితే నాకు తెలీకుండా యెట్లా వుంటుంది. నవల్లో ఐతే, అలా జరుగుతుంది — ఆవిడేమో పొరపాటు పడుతుంది, అతనేమో గ్రహించలేడు — కథ చదివేట్టు చెయ్యడానికని కథనలా నడుపుతాడు రచయిత. యథార్థజీవితంలో యీ సంగ్దిగ్ధాలేమీ వుండవ్. పోనీ అలాంటి పొరపాట్లు జరుగుతాయనుకున్నా, అదంతా కుర్రవాళ్లైతే — సావ్ చెంకోలాగ — నిజమేననుకోవచ్చు, ఇప్పుడేం చెయ్యనని అతనిలాంటి వాడడిగితే.ఆశ్చర్యపడాల్సిన పనుండదు. ఆ వయసు దాటిపోయిందినాకు. ఊరికే భ్రమలు కల్పించుకుని ఆశ్వాసన పొందాలని చూడగూడదు నేను; అది పెద్దమనిషి లక్షణవూ కాదు.'

బోయిలర్ బ్రాకెట్లని గురించి మాట్లాడాలిరమ్మని పిలిపించాడు ఇవాన్ ఆవేళ మధ్యాహ్నం ఫాక్టరీలో. డిమిట్రీ వెళ్ళాడు. ఇవాన్ పాపం, మహా ఆలోచిస్తున్నాడా బ్రాకెట్లని సరిపుచ్చడమెలాగా అని. తా నా విషయాన్ని గురించి ఎగొరోవ్‌తో మాట్లాడిన సంగతి చెప్పాడు డిమిట్రీ; ఆవెల్డింగ్ పద్ధతిని మారిస్తేతప్ప లాభంలేదు. తర్వాత, అపూట యిద్దరూ కలిసి భోంచెయ్యాలని ప్రతిపాదించాడు ఇవాన్. జర్మనీ సమస్యనిగురించీ, ఎన్నికల్లో

గురించీ, చదరంగ పోటీల్ని గురించీ మాట్లాడుకున్నారు. యిద్దరూ. ఇవాన్‌తో చాలా స్నేహంగా వుండాలని, కావాలని ప్రయత్నం చేశాడు డిమిట్రీ. పాపం, ఇవాన్ యెంత బాధపడు తున్నాడో లోలోపల అనే విషయాన్నిగూడా గుర్తుకు తెచ్చు కున్నాడు డిమిట్రీ—ఆ బాధగూడా తనకంటె బాగా అర్థంజేసుకో గలిగేవాళ్లుండరు. బహుశా, యింతకాలమూ తానతన్ని సరిగ్గా అర్థం జేసుకోలేదేమో. ఇవాన్ మంచివాడని అనుకునేవాళ్లుగూడా చాలామందున్నారు, పనంటే వెనకాడడనీ, వొళ్లొంచి చేస్తాడనీ, ఫాక్టరీ అంటే పంచప్రాణాలుగా చూసుకుంటాడనీ, డిమిట్రీకిగూడ తెలుసు. ఆవేళ, నిప్పంటుకున్నప్పుడు, యెంత గొప్పగా ప్రవర్తిం చాడో గుర్తుకు తెచ్చుకుంటే చాలు. బలహీనతలు లేనిదెవరికి! అందరికీ వుంటాయి; యెవరిని వాళ్లు యెప్పుడూ అదుపులో పెట్టుకో వడమంటే అంత తేలిగ్గాదు; అక్కడిదాకా యెందుకు? ఇవానంటే అసూయ పడలేదనీ, అసూయపడినా అతన్ని సరిగ్గానే అర్థం చేసుకోగలిగాననీ తనమట్టుకు తా ననగలడూ?

డిమిట్రీ మాట్లాడే తీరుచూస్తే, ఇవాన్ మనసుగూడా కరి గింది: 'అతను చాలా మంచిపనివాడని నాకు మొదట్నించీ తెలుసు, మంచి కామ్రేడ్ గూడాను; వీపు వెనక కుట్రలుపన్నే రకంకాదు, సన్నణగదొక్కాలని చూడడు, సొకొలొవస్కీలాగ. ఎలీనాని గురించి యెవరైనా చెప్పారేమోఁ యితనిగ్గూడా, ఒకళ్ని గురించి చెప్పుకోవడంవంటే సరదాయేగా అందరికీ. ఎలీనాని బాగా యెరుగునుగూడాను యితను. మొట్టమొదట ఆవిడంటే ఆకర్షణ గూడావుండేదితనికి, కాని ఎలీనా యెలాంటిదో తెలుసునులే యితనికి—యివ్వాళ "ఊఁ" అంటే రేపు "వెళ్ళిరండి" అంటుంది; "యిక మీరు రానవసరం లేదులే" అంటుంది.'

ఇద్దరూ లేచింతర్వాత, "మీతో సీరియస్‌గా మాట్లాడా లనుంది. ఇక్కడ కాదులెండి, రేపాదివారంనాడు మాయింటికి భోజనానికి రావడానికేమీ అభ్యంతరం వుండదుగా మీకు? అప్పు

డై తే కూర్చుని తాపీగా మాట్లాడుకోవొచ్చును'' అన్నాడు ఇవాన్. అని, ఒక చిరునవ్వు విసిరి, "యిప్పుడు మీరూ నేనూ వొకటే; మీలాగానే బ్రహ్మచారినై పోయ్యా''నన్నాడు.

ఆ చివరి వాక్యాన్ని గురించి ఆలోచించాడు డిమిట్రీ, తర్వాత: 'నిజంగానే పాపం, చాలా బాధపడుతున్నాడు, కాకపోతే తన్ను తాను కంట్రోలు చేసుకుంటున్నాడని నే ననుకోవాలని అతని వుద్దేశం. అతను గట్టిమనిషనే విషయం నాకిదివరకే తెలుసు, కాని ఎలీనా అంటే అతని కింత యిష్టమని యిదివర కనుకోలేదు నేను... దేన్నిగురించి మాట్లాడతాడబ్బా? ఎలీనానిగురించి కాదుగదా? కాదనుకుంటా; నాకు మరీ మతిపోతోంది, యితనులగ్గూడా మతి లేదనుకోవడం మొదలెట్టాను. హెడ్డాఫీసునుంచి యేవో ఆదేశా లొచ్చాయి. బహుశా బ్రెయ్నిన్ పథకాన్ని గురించి ... ఐతే, ఆఫీసులోనో, కేంటీన్‌లోనో మాట్లాడొచ్చునుగా? ఏదైతేనేంలే... ఎలీనా యేం వాలోచిస్తుందో యిప్పుడు.'

ఆవాళ మధ్యాహ్నమల్లా పనిజేశాడు. తర్వాత మళ్లీ తన ఆలోచనల్ని నిలదొక్కుకోవాలని ప్రయత్నంచేశాడు కాని, హృదయం యెనుకు తిరిగింది. ఇంటి కెళ్తూ, ముందు వెళ్తూన్నది ఎలీనాయే ననుకున్నాడు అకస్మాత్తుగా; గబగబా నడిచాడు కలుసు కుందామని; తీరాచూస్తే ముసలావి డెవరో మూటపట్టుకు నెళ్తోంది. ఐనా, ఆ నీలి నీలి మసకలో ఎలీనా కనిపిస్తూనే వున్న దనిపించిం దతనికి.

నిజాని కందులో అర్థమేమీ లేదు. ఐనా, యింతకీ అస లావిడ యెక్కడున్నట్లు?

ఆవేళ రాత్రి క్లబ్బు కెళ్ళాడు - ప్రపంచ వ్యవహారాల్ని గురించి బ్రెయ్నిన్ వుపన్యాసం వుంది; ఫ్రాన్స్‌ని గురించతను యేం చెబుతాడో వినాలి. 'ఎలీనాగూడా వస్తే!' అనే ఆలోచన్ని దాచేసు కున్నాడు తనలో తానే - అప్పుడప్పుడూ యిలాంటి ప్రసంగాలు వినేందు కొస్తూనేవుంటుంది. క్లబ్బు కెళ్ళేప్పటికి ఆలస్యమైంది, అప్పటికే లైట్లన్నీ తీసేశారు. ఆ చీకటి హాల్లోనే తడుముకుంటూ

వెళ్ళి కూర్చున్నాడు, బ్రెయ్నిన్ యూరప్‌నిగురించి మాట్లాడ్డం ఐపోయింది; ఆసియానిగురించి మాట్లాడుతున్నాడు : 'అంటే యేమిటంటే పాకిస్తాన్‌లో అమెరికన్ సైనిక స్థావరాలుండడం ఇండియా కిష్టంలేదు.' కాస్సేపటికి లైట్లు వేశారు మళ్లీ; ప్రేక్షకుల్లో ఎలీనా లేదు.

మర్నాడు సాయంత్రం సినీమా కెళ్లాడు. ఈసారి, యింకెందుకో వెళ్ళానని సమర్థించుకోడానిగ్గూడా వీల్లేదు. అదొక పాత సినీమా; యిదివరకు రెండుసార్లు చూసేసిందేగూడాను.

మూడో రాత్రి యేదో ఎమెచూర్ ప్రదర్శన కెళ్ళాడు - కొంతమంది గిటారిస్టులు, బల్గేరియన్ నృత్యం చేసేవాళ్లిద్దరూ, శాంతి పోరాటాన్నిగురించి కాత్యాస్తోల్యారోవా పాడే పాట. కదలకుండా మెదలకుండా కూర్చున్నాడు. వెనక్కి తిరిగి చూడేందుగ్గూడా సాహసించలేకపోయాడు. ఎలీనా కనిపించదనీ, చివరికి ఆ 'గొడవ' కి లొంగిపోవడమే జరిగిందనీకూడ తెలుసతనికి.

ఆ వారమంతా వెదికాడు ఆవిడకోసం. వెళ్ళి స్కూలు బయట నిలబడేవాడు జారే మంచుగడ్డల్ని చూస్తూ ఆలోచిస్తున్నట్లు; కాని స్కూలు ముంగేటు తెరిచేప్పుడల్లా అయ్యే శబ్దంకోసం చెవులు రిక్కించుకుని చూస్తుండేవి. ఎలీనా అప్పుడప్పుడూ పుఖోవ్ యింటికి వెళ్ళే అలవాటుందని తెలుసు కాబట్టి, పుఖోవ్ యిల్లెక్కడుందో తెలుసుకొని వాళ్లింటిదగ్గర కెళ్ళి, బయటే కొరుక్కుతినే చలిలో, నిండా రెండు గంటలసేపు నిలబడ్డాడు ఎలీనా కన్పిస్తుందేమోనని.

ఇక యీ నిస్పృహనీ, ఆవేదన్నీ భరించలేనని తెలుసుకని, ఇక లాభంలేదు, యీ 'గొడవ' మానెయ్యాలనుకున్నాడు, మానేస్తానని వాగ్దానం చేసుకున్నాడు తనకు తనే. ఆవేళ శనివారం. ఫాక్టరీ పనైపోగానే, యింటి కెళ్లి చెఖోవ్ పుస్తకం తీసి, చదవడం ప్రారంభించాడు. సావ్‌చెంకో వచ్చాడు.

"ఓహో, యింట్లోనే వున్నారూ! నాటకానికి కెళ్దాం రండి, హేమ్లెట్ నాటకం ఆడుతున్నారు, యిదే మొదటిరోజుకూడాను.

టిక్కెట్లు నేను కొన్నానులెండి. షేక్స్పియరంటే యిష్టంవని చెప్పారుగా మీరు."

సావ్ చెంకో ఆ టిక్కెట్లు వారంరోజులక్రిందటే కొన్నాడు; యీ లోపలే సోన్యాతో ఆ గొడవ జరిగింది, యిక ఆ రెండో టికెట్తో ప్రయోజనం లేదు, డిమిట్రీ యింట్లో వెలుతురుండడం చూచి, వస్తాడేమో అడిగి చూద్దామనుకొన్నాడు. కాని వస్తాడనే ఆశ యేమంత లేదు. అందుకనే,

"వస్తాను, యెందుకు రానూ......స్కూలొదిలిపెట్టింతర్వాతింతవరకూ హేమ్లెట్ చూడ్డం పడనేలేదు" అని డిమిట్రీ అనేప్పటికి ఆశ్చర్యపోయాడు సావ్ చెంకో.

నిజానికి, డిమిట్రీ బయల్దేరింది హేమ్లెట్ నాటకంకోసం గాదు. నాటకమాడితే, మొదటిరోజే తప్పక హాజరౌతానని చెప్పింది ఎలీనా యిదివరకొకసారి. 'ఇప్పుడావిడ కింకా యితర గొడవ లనేకం వుండొచ్చుననుకో... ఐనా చెప్పలేం, వచ్చినా రావచ్చు...ఐనా యిలాంటి ఆహ్వానా న్నంగీకరిస్తే తప్పేమీలేదు. బజార్లో వాళ్ళింటికీ, వీళ్ళింటికీ యెదురుగా నిలబడ్డంకంటే కనాకష్టం యేంవీ కాదిది.'

హేమ్లెట్ని తదేకదీక్షతో చూస్తున్నాడు సావ్ చెంకో, రంగాలంకరణ బాగావుండడం, ప్రక్కనే డిమిట్రీ కూర్చుని వుండడం అందుకు మరింత దోహదం జేశాయి. డిమిట్రీగూడా నాటకాన్ని అతిశ్రద్ధగా చూస్తున్నట్లే కన్పించాడు; మొదటి ఇంటర్వెల్లో బయటికిగూడ వెళ్ళకుండా కుర్చీలోనే కూర్చున్నాడు, ప్రోగ్రామ్ చదువుకుంటూ. ప్రోగ్రామ్లో 'గొప్ప కళాకారుడు తయారుచేసిన'... అనే మాట పదోసారి చదువుకుంటూ, 'నేనూ సావ్ చెంకోలాగానే ప్రవర్తిస్తున్నా, ఛ? ఇంకా అతనే మెరుగనుకుంటా కాస్త, నాకంటె' అనుకున్నాడు సిగ్గుపడుతూ.

తర్వాతి ఇంటర్వెల్లో సావ్ చెంకోతో కలిసి బయటికెళ్లాడు సిగరెట్ కాల్చుకునేందుకు; క్రిందికి వెళ్తూంటే, ఎలీనా యెదురు

పడిందికాని, అప్పు డావిణ్ణిగురించి ఆలోచించడంలేదు డిమిట్రీ. మాట్లాడకుండా ఆవిణ్ణి దాటి నాలుగడుగులు ముందుకేశాడు. ఆవిడతోపాటు యింకెవరో స్త్రీ వున్నారు, బహుశా డాక్టర్ వీరా యేమో ననుకున్నాడు డిమిట్రీ. వెంటనే, నైనక్కి ... పరుగెత్తాడు:

"ఎలీనా!"

ఎలీనా ఆగింది. "మీరు నన్ను గుర్తించలేదనుకున్నా" అంది యెంతో సాఫీగా.

డాక్టర్ వీరానిగూడా పలకరించుదామని ప్రక్కకి తిరిగాడు డిమిట్రీ ఆవి డక్కడ లేదు; అంతర్థానమైపోయింది. ఏంమాట్లా డాలో తోచక అలాగే నిలబడిపోయాడు మాట్లాడకుండా; ఎలీనా గూడా అలాగే నిలబడిపోయింది మాట్లాడకుండా. చివరి కెలాగై తేనేం తెగల్చుకొని, డిమిట్రీయే

"మిమ్మల్ని వొచ్చి కలుసుకుందామనుకొన్నానుగాని, యెక్కడుంటున్నారో తెలిసేలేదు......యిక్క డిలా కలుసుకోగలుగుతానని అనుకోనే లేదు" అన్నాడు.

ఎలీనా నవ్వింది. "ఏం యెందుకనుకోలేదు? నాటకాలంటే యిష్టంవని చెప్పాగా మీకు. ఇదివరకటి మనిషిని కాదిప్పుడు... చాలా హుషారుగా వుంటోంది. చీకూ చింతా లేదు. ఏదో క్లాసుతో బాధపడుతున్నానని చెప్పాగదూ యిదివరకు; యిప్పుడా బాధేమీ లేదు; చాలా బాగా చదువుతున్నా రిప్పుడు. పుఖోవ్ చాలా సాయం చేశారులే, ఆ పుణ్యమంతా ఆయనదే. మొత్తంమీద అంతా దివ్యంగావుంది. ఇప్పుడు నేను డాక్టర్ వీరాతో కలిసుంటున్నా. ప్రత్యేకం వొకగదిగూడా యిస్తామన్నారుగాని, యింకా కొన్నిరోజులు పోవాలి. షూరావాట్టుకు షూరా డాక్టర్ వీరాని వదలడమే లేదు; అంత అలవాటైపోయింది ఆవిడంటే. ఇప్పుడు చూచినా గుర్తుపట్టలేరు షూరాని, అంతెదిగింది. రంగు పెన్సిళ్లుగూడా కొన్నాను యివ్వాళ షూరాకని. నా కేమీ తోచడం లేదనుకోకండి, యింత హాయిగా యిదివర కెప్పుడూ వుం డెరగన్నేను. ఎప్పు

డన్నా వస్తే అలా మా యింటికి రండి, తప్పకుండా సంతోషిస్తాను. అంతేగాని, వూరికే రావాలి కాబట్టనిమట్టుకు రాకండి, యెవరూ వుండరేమో మాట్లాడ్డానికి, మరీ వొంటరిగా వుంటూందేమో అని మాత్రం అనుకోకండి. బోలెడుమంది స్నేహితులున్నారు నాకు. రాత్రి స్టూడెంట్స్ పార్టీ చేసుకుంటే వెళ్ళాను. డాన్సుగూడా చేశాను. దానికితోడు పనిగూడా యెక్కువైంది. ఇప్పుడు నన్ను ప్రభుత్వ విధానాలు ప్రజలకి తెలియజెప్పాలని వొక చిన్న పేట గూడా అప్పగించారు. ఇవ్వాళ రాత్రినాటకం చూడ్డానికి వీలుంటుందనిగూడా అనుకోలేదు నేను. ఈ నటనేమీ నచ్చలేదు నాకు, ఒఫీలియాదంతా తెచ్చి పెట్టుకున్నట్లుగా వుంది; ఆ ఇజుముద్రోవ్, హేమ్లెట్ పాత్రని అభినయిస్తూంటే హేమ్లెట్ అంతర్ముఖుడా అనిపిస్తుంది. హేమ్లెట్ అంటే చక్కని సజీవమైన గట్టి మనస్తత్వం వున్న పాత్ర అని నా వుద్దేశం. అంతేగదూ? యేమంటారు" అంటూ గబగబా, గుక్క తిప్పుకోకుండా మాట్లాడేసింది, యెక్కడ మాట్లాడడం ఆపివేస్తానో అని భయపడిపోయినట్లు. హేమ్లెట్ని గురించి, డిమిట్రీ తన అభిప్రాయం చెప్పక ముందే, "యిక వెళ్లొస్తాను డిమిట్రీ, వీరా చూస్తూంటుంది నాకోసం" అంటూ చేయి చాచింది కరస్పర్శకోసం.

ఆ చేతిని మరికాస్సేపు తన చేతిలోనే వుంచుకున్నాడు డిమిట్రీ.

"ఎలీనా, నిన్ను గురించి వొకటే ఆలోచన నాకు..."

ఇంకో నిమిషం ఆగితే, యేడుపొచ్చేస్తుందేమో ననిపించింది ఎలీనాకి. కాని స్థిమితపడి, "నా కేమీ విచారంలేదని చెప్పానుగా, హుషారుగా వుంటున్నా, బాగా హుషారుగా వుంటున్నా. నన్ను గురించేమీ బాధపడకండి" అన్నది యిదివరకటిలాగానే తొందర తొందరగా.

పారిపోయింది.

నాటకం ఐపోయింతర్వాత, మాట్లాడకుండా, సావ్చెంకోతో పాటు, యింటికి బయల్దేరాడు డిమిట్రీ. సావ్చెంకోకి నాటకం

బాగానే నచ్చింది, యింకా అతని చెవుల్లో గింగురుమంటూనే వున్నాయి పాత్రల మాటలు. డిమిత్రీ ఆలోచనల్లో డిమిత్రీ వున్నాడు: 'యిక, అంతా తేలిపోయినట్లే. ఫ్రుఖోవ్ యింటిముందు నిలబడి సౌఖ్యాన్నిగురించీ, సోయినిగురించీ కలలుగనడం అనవసర మిక, ఆవిడ్ని కలుసుకోకపూర్వం యెలా బ్రదికానో?— ఇదీ వొక వింతిగానే వుంది. బ్రదికాను, చదువుకున్నాను, పనిచేశాను. ఇక ముందుగూడా అంతే, ఆవిడ లేనేలేనట్లు, ఆవిడ్ని యెరగనేలేదను కుని మళ్ళీ బ్రదకాలి. జీవితం అంటేనే అంత, ఎడారిలాంటిది. సౌఖ్యం అంటే - అది సావ్ చెంకోలాంటి యువకులకి. ఇప్పుడిక - నా గదీ, టేబులూ, టేబుల్ మీద లైటూ, నా డిజైన్లూ నేనూ తయారు, ఇక నాతో యెవరూ వుండకుగూడాను. ఇప్పుడు నే నెళ్ళేది యింటికే గాదు; తిరిగి మళ్ళీ నాలో నేను ప్రవేశిస్తున్నాను, నా వొంటరిబ్రదుకులోకి తిరిగి ప్రవేశిస్తున్నాను. ఇక ముందు బుద్ధితక్కువ పనులు చెయ్యకుండా జాగ్రత్తపడాలి, కలలు గనడం మానెయ్యాలి.'

♦ ♦ ♦

ఎలీనా ఆ రాత్రంతా మాట్లాడుతూనే వుంది డాక్టర్ వీరాతో. ఇంటికి రావడమే తడవుగా ప్రారంభించింది నాటకాన్నిగురించి మాట్లాడ్డం. ఒఫీలియా పాత్రని అభినయించికూడా చూపింది వీరాకి—తానెచ్చా- అసలా పాత్రని సరిగా అభినయించనేలేదు. ఉన్నట్లుండి, యెక్కెక్కి యేడవడం ప్రారంభించింది ఎలీనా. వీరా గాభరా పడిపోయింది, వెంటనే లేచి, యేవో నాలుగు మాత్రలు వేసి, ప్రక్కనే కూర్చుని, చేతుల్లోకి తీసుకుంది. ఇక అంతా చెప్పేసింది ఎలీనా:

"నాకూ తెలుసు యిదంతా పిచ్చితనమని. నన్ను తాను ప్రేమించడంలేదని హెచ్చరించాడు — ఊహించనుగూడా లేడట ఆవిషయం — నేను మరీ బుర్రలేని సీతాకోకచిలుకనట, మా యిద్దరం యేవిషయంలోనూ వొకటి కాదట, ఈ మాట లన్న

దతనే. నే నతన్ని ప్రేమిస్తున్నానంటే, అది, నా తప్పుకాదు; ఐనా అతని కిష్టంలేనిదే, చచ్చినా వెళ్ళను అతనిదగ్గరికి. తన మూలానే, నేను మా ఆయన్ని వదిలిపెట్టానని అనుకుంటున్నాడు, సహజంగానే; అప్పుడప్పుడూ వచ్చి చూసెళ్తుంటానన్నాడు. చచ్చినా రానివ్వను...నేను మరీ స్కూలుపిల్లలాగా ప్రవర్తిస్తున్నా ననుకుంటున్నావేమో నువ్వు. ఇది అల్లాటప్పావ్యవహారం గాదు. ఇంతవర కిలాంటి వ్యవహారం యెప్పుడూ తటస్థపడలేదు నాకు, యిదే మొదలు......యేమైనాసరే, నన్ను చూచి యితరులు జాలి పడాల్సినఅవసరం లేదు. నువ్వు తప్పకుండా న న్నర్థంచేసుకో గలవనే నా ధైర్యం, యిం తనుభవించావా...అబ్బ, భరించలేం వనుకో..."

ఎలీనా స్థిమితపడేవరకూ ఆగి, "సరేగాని ఎలీనా, నువ్వంటే ఆయనికి లక్ష్యమేలేదని యెందు కనుకుంటున్నా" అనడిగింది వీరా.

"అందులో యేమీ అనుమానంలేదమ్మా. నేను చెప్పింది మట్టుకు ఖాయమే.ఆవాళ క్లబ్బులో అలా మాట్లాడాడే,అందుకనే... యిప్పుడంటే నన్ను చూచి విచారపడుతున్నాడు. నాకు ధైర్యం చెప్పాలని చూస్తున్నాడు. నన్నుచూచి యితరులు జాలిపడుతూంటే చూస్తూ వూరుకోలే న్నేను. అతనంటే నాకు ప్రేమే, అంతమట్టుకు నాకు బాగా తెలుసు. ఇవ్వాళ రాత్రి మనం మెట్లెక్కుతూంటే అతను కనబడ్డప్పుడు, నా తలంతా గిర్రున తిరిగింది, పడిపోతానేమో ననుకున్నా..."

ఎందుకనోగాని, సొకొలొవస్కీ చెప్పిన ఎడారి మొక్క సంగతి జ్ఞప్తికొచ్చింది వీరాకి. 'ఇలా ప్రేమించి, బాధపడి, యేడిస్తే యెంతబావుంటుందో, అదే వొకహాయి, అదే వొక ఆనందం...'

# 11

ఎలీనానిగురించి ఆలోచించగూడ దనుకున్నాడు ఇవాన్; అలా ఆలోచిస్తూ కూర్చుంటే వూరికే తలక్రిందులైపోతున్నాడు, భయంభయంగాగూడా వుంటోంది. అట్టే చూస్తే, యిందు మూలాన ఫాక్టరీలో జరిగే వుత్పత్తికూడా దెబ్బతగిలేట్టుంది అనిగూడా అనుకున్నాడు. క్రిందటి ఆదివారంనాడు షూరాని తీసుకొచ్చిం దతనింటికి ఎలీనా; షూరాని షికారుకు తీసుకెళ్ళాడు. తర్వాత ఇంటికొచ్చి, దాగుడుమూతలాట ఆడాడు. ఆడుతూ ఆడుతూ పడక గదిలో దాక్కున్నాడు. "ఎక్కడున్నావో తెలుసులే నాన్నా. చెప్పనా, పరుపు మంచం కింద దాక్కున్నావ్" అంటూ చేతులు చరుస్తూ, చప్పట్లు కొట్టింది షూరా. షూరాని తీసికెళ్ళేందుకని ఎలీనా వస్తే అతి పరీక్షగా చూశాడు ఆవిడవంక; బాగానే వున్నట్లనిపించింది ఆరోగ్యంగా. ఐనా ఎలీనా కేం బాధ! ఈపాటి కెవళ్ళ మీదో కన్నుగూడా వేసేసు టుంది బహుశా. విడాకులు తీసుకోడానికి సిద్ధంగానేవుం దేమో కనుక్కుందా మనుకున్నాడు; సిద్ధంగా వుంటే అధికారపూర్వకంగా యేం కారణం చెప్పవలసిందీ ఇద్దరూ కలిసి ఆలోచించుకోవచ్చును. 'ఎందుకులే, అదంతా యిప్పుడెందుకు. కావాలనుకుంటే తనే అడుగుతుంది నన్ను; ఐనా ఇప్పుడు మాట్లాడ లేనులే, అసలే అంతా అస్తవ్యస్తంగా వున్నప్పు డిప్పుడెందుకులే' అనుకుని, వూరుకున్నాడు.

గృహజీవితమంతా ఛిన్నాభిన్నమై పోయింది, యీ సర్వనాశనాన్నుంచి, నెమ్మదిగా తేరుకుంటున్నా ననే నమ్మాడతను; కాని మరచిపోలేని ముద్రవేసీ మరీపోయింది యీ అనుభవం. నిన్నమొన్నటివరకూ, తన జీవితాన్నిగురించి ఆలోచించినప్పుడల్లా, చిన్నగాపోయే విశాలమైన రోడ్డని అనుకునేవాడు. అనుభవించ

టాని కతనూ అనుభవించాడు కొన్ని కష్టాలు, ఒకసారి తన వుద్యోగాన్ని గురించిగూడా భయపడవలసి వొచ్చింది, కాని తర్వాత తనని తనే మందలించుకున్నాడు మరీ ఒక్కొక్కనాటి మనసుని అదుపులో పెట్టుకోలేకపోతున్నందుకు, క్షణికోద్రేకాలకు లోనౌతున్నందుకు; యెలాగో అవన్నీ దాటేశాడు, అంతకంటె భిన్నంగా జరగడానికక్కడా వీల్లేదు తన జీవితమన్న తర్వాత. అంచేత యిప్పుడుగూడా తనకు తానే నచ్చ జెప్పుకున్నాడు: 'ఇంత కలవరపడడ మెందుకు? ఆవిడ లేకపోయినా బ్రదగ్గలను' అని. నిజాని కత నావిణ్ణిగురించి పెద్దగా ఆలోచిందీ లేదు: అదంతా గతం, ఫర్వాలేదు, అదే అలవాటైపోతుంది. కాని నమ్మకం తగ్గిపోతూంది, యేమిటో అంతా అయోమయంగా వుంది. తానంటే పడనట్టున్నారు అందరూ. ఇప్పు డూరికే కోపం వచ్చేస్తూంది, అలాంటప్పుడు అధిక ప్రసంగంగూడా చేసేస్తున్నాడు. త నెప్పుడూ మంచినే చూస్తానని గర్వించేవా డిదివరకు; యిప్పు డెటు చూచినా అనుమానంగానే చూస్తున్నాడు యెవ రేం అపవాదులు వేస్తున్నారోనని, యెవ రెక్కడ కుట్రలు పన్నుతున్నారోనని.

ఎలీనా వెళ్ళిపోయి, సోమవార నాటికి పదిహేను రోజులు. మంగళవారంనాడు పార్టీ మీటింగు జరిగింది. మీటింగులో ప్రారంభోపన్యాసం చేస్తూ, ఫాక్టరీకమిటీ అధ్యక్షుడు, సిబిర్ ట్సేవ్, గృహనిర్మాణం ప్రసక్తి తెచ్చాడు: ఆ యిళ్ళెవరకే కట్టవెయ్యవలసింది. ఔనన్నట్టు తలూపాడు ఇవాన్. "అందులో సందేహం యేమీ లేదు" అనిగూడా అనేశాడు. అవకాశం దొరికినప్పుడల్లా సిబిర్ ట్సేవ్ ఆమాట అనకతప్పదని తెలుసు ఇవాన్కి! సిబిర్ ట్సేవ్ అంటే రోజు కొక డజనుసార్లన్నా కార్మికుల కష్టాలు చెవులారా వినే మనిషి! కార్మికులవి గృహాలుగూడా కావు; గుడిసెలు, నిజంగానే అధ్వాన్నంగా వున్నై, యెప్పుడు కూలినా కూలిపడొచ్చును. ఇక ఫర్వాలేదు, ప్లాన్లుగూడా ఎప్రూవైపోయినై, పునాదులు కట్టడంగూడా యింకో రెండు మూడు నెలల్లో ప్రారంభ

స్తుపోతుంది. సొకొలొవస్కీ అనవసరంగా జోక్యం కలిగించుకుని, సిబెక్ట్రేనని సమర్థించకపోతే, 1952 కే కనీసం మూడు కొత్త మేడ లైనా పూర్తయిపోవాలిసిందని అనకపోతే, వినీవిన ట్లూరుకునేవాడే ఇవాన్. సొకొలొవస్కీ గూడా కల్పించుకునేప్పటికి ఇవాన్‌కి మండు కొచ్చింది: ఫౌండ్రీ అన్నిటికంటే అగ్రస్థానం వహిస్తుంది, అది దేశం మొత్తానికే అవసరమైన విషయం; ఆ విషయం సొకొలొవస్కీకీ తెలుసు, తెలియందేమీ కాదు. ఐనా అత నీ విషయం పార్టీ మీటింగులో లేవనెత్తాడూ అంటే— 'అది మొదటిరకం డెమొగాగీ'. సొకొలొవస్కీ వూరుకోలేదు; "పార్టీ కర్తవ్యాలేమిటోగూడా తెలియనట్టు మాట్లాడుతున్నారు కామ్రేడ్ ఇవాన్" అన్నాడు తాపీగానే. తర్వాత, ఎన్నికలమీదికి మళ్ళింది చర్చ, సభ ప్రశాంతంగా ముగిసింది.

ఇంటికెళ్ళింతర్వాతగూడా, యిదే విషయాన్ని గురించి ఆలోచించాడు ఇవాన్. 'గృహనిర్మాణం విషయం సొకొలొవస్కీ లేవనెత్తాడంటే, అందులో తప్పకుండా యేదో కిటుకుండివుండాలి. మొత్తంమీద దేనికోగాని ప్లానేస్తున్నాడు. అసలువిషయం గృహనిర్మాణం గాదు. ఈ కొత్తరకం భవనాలని ఆపాలని నేననగానే శోకతొక్కిన తాచులా లేచాడు, "ఐతే బ్రేకులగ్గూడా బ్రేకు లెయ్యాలనా మీ వుద్దేశం" అంటూ. అందులో హాస్యమేమీ లేదు, తలబిరుసుదనం తప్పితే. మొత్తంమీద యేదో కుట్రమట్టుకు పన్నుతున్నాడు. అందులో సందేహ మేమీ లేదు. అతనికిది కొత్తగూడా కాదు; మొదట్నుంచీ యింతే, యూరల్స్‌లో సపునోవ్‌ని ముంచాలని చూశాడు - అక్కడది పారలేదు, వెంటనే పెట్టేబేడా సర్దించి పంపేశారు - ఇక్కడికొచ్చి నామీద పడాలని చూస్తున్నాడు అసలతని యెత్తేమిటో తెలుసుకోవాలి ముందు. ఇంతకీ అతనేసే యెత్తేమైవుంటుందబ్బా?'

ఒక్క క్షణం తటపటాయించాడు ఇవాన్ — గోరంతలు కొండంతలు చెయ్యడంలేదుగదా తను? సొకొలొవస్కీది మొద

ట్నుంచీ అంతే వేధనబుద్ధి, యెప్పుడూ యెవరో వొకర్ని సూదితో పొడుస్తూనే వుంటాడు, తననిమట్టుకు తనని యెన్నిసార్లు గేలిచేశాడో, లెక్కలేదు! ఐనా గత ఆరు సంవత్సరాలనుంచీ పనిచేస్తున్నారు యిద్దరూ కలిసిమెలిసి ఒకేచోట. ఇక లాభం లేదనుకున్నాడు ఇవాన్ — యీ సారి అలా కాదు. 'మానవు డేదో పసిగట్టుంటాడు; అతని కళ్ళే అలాంటివి, డేగలాంటివి.' నన్నేదో సాధించాలని కాక పోతే, అతని కేమీ సంబంధంలేన్ని యిళ్లసంగ తెందుకు యెత్తవల సొచ్చింది?'

'ఆ ఫాక్టరీయే నా పంచప్రాణాలూనూ' అనుకున్నాడు ఇవాన్, అందులోనూ యిప్పుడు ఎలీనాగూడా లేదా. ఇంతకీ అసలీ త్యాగ్షుడు నన్నాడబెరుకుతాడా అని? ఉద్యోగంలో పై మెట్టెక్కుతూ పైకే పోవాలని నే నెప్పుడూ అనుకోలేదు. ఐనా యీ ఫాక్టరీ డైరెక్టర్ పదవిచ్చి, నాలో వాళ్ళకున్న విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. ఇక నాకు మిగిలిందిగూడా అదే.'

నిజంగానే గత రెండువారాల్నుంచీ ఇవాన్ రాత్రింబగళ్లు పనిచేస్తూనే వున్నాడు; రెండు షిఫ్టులూ స్వయంగా వెళ్ళి చూచాడు, ప్రతీ వర్క్‌షాప్‌లోకీ వెళ్ళి కార్మికుల్తో మాట్లాడాడు

ఆదివారంనాడు తప్పక మీకోసం యెదురు చూస్తుంటానని మళ్ళీ డిమిట్రీకి జ్ఞాపకంచేశాడు ఇవాన్ శనివారంనాడు. బహుశా త్రెయ్నిన్ ప్రాజెక్ట్‌ని గురించి మాట్లాడతాడేమో ననుకున్నాడు డిమిట్రీ: ఇవా నెప్పుడు మాట్లాడినా దాన్నిగురించే మాట్లాడుతూ వచ్చాడు, మళ్ళీ అదంతా ఒక్కసారి తిరగెయ్యా లనుకుంటున్నా డేమో.

చాలా ప్రేమగా ఆహ్వానించాడు ఇవాన్, డిమిట్రీని. భోజనం చేస్తూండగా, మొట్టమొదట, ఫాక్టరీలో రోజూ జరిగే విషయాల్ని గురించి మాట్లాడుకున్నారు యిద్దరూ. తర్వాత, యుద్ధకాలంనాటి విషయాలు తెచ్చాడు ఇవాన్. డిమిట్రీగూడా విస్తులామీద జరిగిన యుద్ధాన్నిగురించి ఒక కథ చెప్పాడు. ఒకరి అనుభవా లొకరికి

తెలియని యిద్దరు యుద్ధవీరుల కేర్పడే సాన్నిహిత్యంతో మాట్లాడు కున్నారు యిద్దరూనూ.

"మీరిక్కడికి వచ్చి రెండు సంవత్సరాలే ఐనా. మీ రప్పుడే మాలో వొకళ్లై పోయ్యారు, మీ రెంతసేపూ ఫాక్టరీ అభివృద్ధికే పాటుబడుతున్నారు. ఇప్పుడు నా కా ఫాక్టరీయే ననుకోండి సర్వస్వమూనూ" అన్నాడు ఇవాన్, భోజనాల దగ్గర్నుంచి లేచిం తర్వాత.

ఆమాట లంటూన్నప్పు డతని కంఠం వణికింది: యేమనాలో తోచలేదు డిమిత్రీకి. 'పాపం ఎలీనాఅంటే యెంత ప్రేమో యితనికి!'

ఇవాన్ చెప్తూనే వున్నాడు: "మీకూ తెలుసుగా. ఫాక్టరీ అంటే పెద్ద కుటుంబంలాంటి దనుకోండి. నలుగురవ్వూ కలిసి మెలిసి పని జెయ్యాలి. మొత్తంమీద మనందరం స్నేహంగానే వుంటున్నా మనుకోండి. ఒక్కటంటే వొక్కటేవుంది పెద్దలోపం. నా ఆత్మ గౌరవానికీ దీనికీ సంబంధం లేదు, అంతమట్టుకు చెప్పగలను మీకు. నే నసలే రైతుకుటుంబంనించి వచ్చినవాణ్ణి; వున్న దున్నట్టు, కుండ పగలగొట్టినట్లు మాట్లాడే స్వభావం నాది. పనిచేసేప్పుడు తప్పితే, క్రమశిక్షణంటే లక్ష్యమే చెయ్యను. ఆ గేటు కాస్తా దాటింతర్వాత, యిష్టంవొచ్చినట్లు మాట్లాడొచ్చనే తరహా మనిషి నన్నమాట. కాని, అనుమానాలు పెట్టుకొని, అలాంటి వాతావరణంలో పని జెయ్యడం కష్టం. సొకొలొవస్కీకి చెప్పకోదగ్గ అనుభవంవుందని నేనూ వొప్పుకుంటాను; కాని అతని ప్రవర్తన చూస్తూంటే, ఇకత నితో కలిసి పనిజెయ్యడం సాధ్యం కాదనిపిస్తోంది నాకు. చాలా ప్రయత్నంచేశాను; ఎన్ని జరుగుతూన్నా చెవులూ, కళ్ళూకూడా మూసుకున్నాను. ఇక నావల్లకాదు...'

"అతన్తో కలుపుగోలుగా వుండడం కష్టమే కాని, చాలా బాగా పనిజేసే మనిషి" అన్నాడు డిమిత్రీ ఓదారుస్తూ, "చంగానే, నేనైతే అతని మాట లేవీ పట్టించుకోను. నా కతన్తో బాగా

పరిచయం లేదనుకోండి - ఆఫీసు బయట మేం ఎప్పుడూ కలుసుకోను గూడా లేదు - కాని కాస్త్యాయన నోరు మంచిదికాదని చెబుతాడు ఎగొరోవ్. నిజంగానే నేనైతే అతని మాట లేమీ పట్టించుకోను ఇవాన్."

"అహాం అదికాదు, ఆయన నోటినిగురించి కాదు నే నంటున్నది. ఒక్క సంగతి చెప్పండి - ఆయ నలా యెప్పుడూ ఆ వర్క్‌షాప్లలో అలా సి. ఐ. డి. లాగా తిరుగుతా డెందుకు చెప్పండి? ఎప్పుడూ తన గదిలో కూర్చున్నట్టే కన్పించడు. ఎందుకనో అందర్నీ అనుమానిస్తాడు - ఎగొరోవ్‌నీ, మిమ్మల్నీ ..."

"అదేమీ కాదు! డిజైనరన్న తర్వాత యెప్పుడూ గదిలో కూర్చుంటే యెలా జరుగుతుంది - వెళ్ళి, ఆచరణలో అవన్నీ యెలా నడుస్తున్నాయో చూచుకుంటూ వుండకపోతే యెట్లా? అసలతనికి అట్లా వెళ్ళి చూస్తూండమని చెప్పిందిగూడా నేనే. ఆయన నోరు మంచిది కాదుకాబట్టిగాని, లేకుంటే మీరుగూడా అలా అనుకోగలిగేవారు కారు."

"సరే, అతని నైజాన్ని గురించిగూడా మనం ఆలోచించాలి గదా, లేకుంటే అతని మంచి చెడ్డ లెలా నిర్ణయించగలుగుతాం? ఇదివర కతను వుద్యోగం చేసేచోట యేమైందో తెలుసా? చెప్తా వినండి ఆ మానేజర్ పేరు సవునోవ్, చదువుకున్నవాడు, తెలివితేటలున్నవాడు, కష్టపడి వుత్సాహంగా పనిజేసేరకం; ఆ ఫాక్టరీని సొంత కాళ్ళమీద నిలబడేట్టు చేసిందిగూడా అతనే. తాను ప్రవేశపెట్టదలచుకున్న ప్రాజెక్టుని కావాలని తోసేశారనుకుని, అతనిమీద కత్తిగట్టాడు యీ సొకొలొవస్కీ యిదంతా జరిగిందెప్పు డనుకున్నారు? యుద్ధకాలంలో. అప్పుడు మీరూ, నేనూ యుద్ధం చేస్తూ, కందకాలలో చలికి గడ్డకట్టుకుపోతున్నప్పు డిదీ ఈ సొకొలొవస్కీ చేసిన ఘనకార్యం: తన ప్రమోషన్‌కోసమని యింకో మంచి మనిషికి నష్టం చెయ్యడానిక్కూడా వెనుదియ్య లేదన్నమాట. తర్వాతిదంతా బయటపడింది, స్థానిక పత్రికలో ఒక

వ్యాసంగూడా పడింది యీ తతంగాన్నంతటినీగురించి. ఎరిగిన వాళ్ళని పట్టుకని యెలాగైతేనేం, ఆ గణ్డం దాటి బయటబడ్డాడు"

"యెదుకనోగాని, వింటూంటే నమ్మశక్యంగాకుండా వుంది...అలాంటి మనిషలా కన్పించడు."

"అది కాదు డిమిట్రీ, మీరందర్నీ నమ్ముతారు, అదీ వచ్చిన చిక్కు. సొకొలొవ్‌స్కీ యింకా చాలా చేశాడు...మీరొచ్చేప్పటికి ఒరోసన్ యిక్కడే వున్నాడుగదూ; చాలా మంచివాడు పాపం; చాలారోజులు జబ్బుతో బాధపడ్డాడుగూడాను, యేదో గుండెకు సంబంధించిన జబ్బు; లక్ష్యపెట్టకుండా తిరిగాడు. అసలతను చనిపోవడానికి కారణమేమిటో తెలుసా మీకు?— అదే కదుళ్ళ గొడవ. ఆ తప్పంతా యెవరిదనుకున్నారు? సొకొలొవ్‌స్కీది. తప్పంతా ఒరోసిన్‌మీదికి తోశాడు, మానవుడు తీసుకు తీసుకు చనిపోయాడు. అసలు తప్పు ప్రోజెక్టులో వుంది, అందులో సందేహమేమీ లేదు."

"ఒరోసిన్‌ని నేనేమీ యెరగను; నే నొచ్చేప్పటికే హాస్పిటల్లో చేరాడతను. తప్పులు చెయ్యనివాళ్ళెవరుగాని, అలాంటి తప్పుని సొకొలొవ్‌స్కీ తెలుసుకోలేకపోయాడంటే నమ్మడం కష్టమే. మొత్తంమీద అతను చాలా మంచి డిజైనర్."

ఇంతవరకూ శాంతంగా మాట్లాడుతున్నవాడల్లా, ఒక్కసారి కోపంతో లేచిపడ్డాడు ఇవాన్, అసలే దవడలు వదులొదులుగా వుంటాయే యెగిరెగిరిపడ్డాయి.

"నే చెబుతున్నాగా, అతనంత చెడ్డమనిషెక్కడా వుండడు. అందులో సందేహమేమీ లేదు. పార్టీ మీటింగుకి రాలేదు మీరు, వస్తే తెలిసొచ్చేది. అక్కడతనీ యిళ్ళు కట్టడాన్ని గురించి యెందుకు లేపాడనుకుంటున్నారు? కార్మికులెట్లావుండేదీ పట్టిందనుకుంటున్నారా అతనికి? అదేమీ కాదు, దమ్మిడీయెత్తుగూడా విచారించడు. సిబిర్‌ష్తేవటాకూ - కార్మికుల్నిగురించి ఆలోచిస్తాడతను. నేను మాత్రం? ఆ కూలీల గుడిసెలు చూచినప్పుడల్లా, చాలా బాధ

పడతాను. ఇక వాళ్ళుగూడా మానవమాత్రులుగా నివసించడానికి తగిన సౌకర్యాలు యిప్పుడు చేయబోతున్నాంగదాఅని యెంతో బరువు దించేసినట్లుంది నాకు. ఆదీగాక, డైరెక్టర్ని కాబట్టి అదంతా చూచుకోవలసిన బాధ్యత నాదేగా, అతన్ది కాదుగా. ఆ మాటే అన్నానో లేదో, పార్టీ నిర్మాణాన్నిగురించి బోధించడం మొదలెట్టాడు నాకు. అత నెవరు చెప్పండి అలా నాతో మాట్లాడ్డానికి?"

ఇవాన్ని శాంతపరచా లనుకున్నాడు డిమిత్రీ:

"మిమ్మల్నవమానించాలని అనుకొనుండడు సొకోలోవస్కీ. అతనుగూడా పార్టీమెంబరుగా చాలాకాలంనించి వుంటున్నాడు చూడండి..."

దీనితో, తనని తానే మరిచిపోయాడు ఇవాన్: వాళ్ళ్ళపైనా తెలీకుండా ఒక్క గుక్కని అరిచేశాడు:

"ఉండాలి చాలా కాలంనించి!...మీ కసలు తెలుసా అతని సంగతి!...అతని పాతచరిత్ర తెలుసా యెలాంటిదో...అతని కుటుంబం అంతా విదేశాల్లో వుంది బెల్జియంలో. ఇదంతా వొట్టి పుకారే ననుకుంటున్నా రేమో? కాదు. కానే కాదు...అతని ఫైళ్ళు తిరగేసి చూడండి...నే నివివర కెప్పుడూ యీ విషయా లెత్తలేదు, యేదో నాగొడవ నేను చూసుకునే మనిషిని కాబట్టి ... అనేక సార్లిదివరకు అతని వైపున నిలబడి అతన్ని సమర్థించానుగూడాను —యిప్పు డదంతా తవ్వడం యెందుకులే? పని చెయ్యడాని కతని కవకాశం యిచ్చారు, చెయ్యనివ్వండి, నాకేమీ అభ్యంతరంలేదు... కాని, అత నంత పత్తిత్తనిమాత్రం చెప్పకండి నాతో, అందులోనూ నన్ను విమర్శించుతాడూ...బాగా ఐతే నూటి కేభైపాళ్ళు నమ్మొచ్చునేమో అతన్ని, అంతే. అందులో సందేహ మేమీ లేదు..."

డిమిత్రీ యేమీ మాట్లాడలేదు, ఆలోచిస్తూ కూర్చున్నాడు: 'యిదంతా చిత్రంగావుంది; ఒక్కమనిషిలోనే యెన్నిరకాల స్వభావాలో వుంటాయి. యుద్ధాన్నిగురించి ఇవాన్ మాట్లాడుతూంటే, యెంతో సన్నిహితు డనిపించింది నాకు. తనతో కలిసి యుద్ధంలో

పోరాడినవా రందరంటేనూ యెంతో ప్రేమగా మాట్లాడాడు; అది
వూరికే వుపన్యాసధోరణిలో చెప్పేదిగూడా గాదు, నిజంగానే
చాలా అప్యాయతుంది అతనికి వాళ్ళంటే. అట్లా మాట్లాడి ఒక
గంటన్నా కాలేదు... అప్పుడే ఒకళ్ళమీద లేనిపోని అభాండాలు
వేస్తున్నాడు, అపవాదులు వేస్తున్నాడు. నన్నెందుకూ యిక్కడికి
పిలిచాడు? నన్నుగూడా యిందులోకి లాగడానికా? ఒకోనిన్ని
గురించి చెప్పింది వచ్చినా నమ్మేందుకు వీల్లేదు. సొకొలొవస్కీ
చాలా నిక్కచ్చైన మనిషి; అదీగాక అతనిలాంటి శిక్షైన రింకెక్కడా
దొరకడు. అంటే, అతన్నీ, నన్నూ కలిపి ఒకే యింట్లో వుండమంటే
అదివేరు, అందుకు నే నొప్పుకోంపోవచ్చు; వూరికే అందర్నీ కసుస్తా
డంటారు అందరూ. అతనుమాత్రం యెందుకూ అలా చెయ్యడం?
—జీవితం పెడుతూన్న బాధలు చాలవూ, అంతకంటె పదునుగానే
వుంటాయే జీవితం కోరలు. ఏమో, బహుశా అతన్ని జీవితం
బాగా కరిచిందేమో, అందుకే అత నలా తయారయ్యాడేమో?
యేదేమైనా అతనమాత్రం చాలా నికార్సైన మనిషి. సావ్ చెంకో
చెబుతూంటే యేమిటో అనుకుని మందలించానుగాని; ఈ ఇవాన్
మరీ దండగమారి మనిషి, సావ్ చెంకో చెప్పింది రైటే. అస
లితనితో మాట్లాడ్డాని కెందుకొచ్చానో, యిత నిచ్చిన యీ వోడ్కా
యెందుకు తాగానో అర్థం గావడంలేదు. అసలీ ఛండాలమంతా
యెందుకు వినాలి నేను?'

డిమిత్రీ లేచాడు :

"ఇక వెళ్ళాలి; పనుంది." వెళ్తూ, వెళ్తూ తలుపుదగ్గ రాగి,
"సొకలొవస్కీని గురించి మీ రన్నమాటలు నే నొప్పుకోలేను.
అదిమాత్రం మరచిపోకండి" అన్నాడు.

తర్వాత చాలాసేపు విచారించాడు ఇవాన్ తప్పుచేశానే
అని; నాలుక కరుచుకున్నాడు. ఎంత బుద్ధితక్కువపని జేశాడు!
ఐతే డిమిత్రీగూడా సొకొలొవస్కీతో కలిసిపోయ్యాడన్నమాట;
అందులో సందేహ మేమీ లేదు. ఇప్పటి కిద్దరే, స్కౌండ్రెల్స ...

'ఇంతకీ ఎలీనాదగ్గఁకి డిమిత్రీ యిదివర కొచ్చింది యేదో తత్వ శాస్త్రం మాట్లాండేందు కేనా అని? ప్రతీవాళ్ళనీ నమ్మతా న్నేను. ఎలీనా సంగతిమట్టుకు, యెప్పుడైనా, కలలోనైనా అనుమానించ గలిగానా ఎలీనాని? ఐనా, చివరి కిలా తయారైంకాలా యెందుకూ పనికిరాకుండా ...

'మొత్తంమీద, ఎలీనా యింట్లో వున్నప్పుడు యిల్లంతా కళకళలాడుతుండేది. ఇప్పుడేగనక యీ యింట్లో షూరా వుంటే. వెళ్ళి శుభ్రంగా ఆడుకునేవాణ్ణి. ఎందుకనో యిల్లంతా బేలు మంటూంది.

'బోయిర్ బ్రాకెట్స్‌ గురించి డిమిత్రీ చెప్పింది కరెక్టే — అసలు చిక్కు వెల్డింగ్ దే. రేపు ఎగొరోవ్‌ని కలుసుకోవాలి, బాగుచెయ్యొచ్చును ...

'సొకొలొవస్కీకి మాస్కోలో యేమాత్రమో పలుకుబడి వుండుంటుంది. అందులో సందేహ మేమీ లేదు. నన్నీ వుద్యోగంలో నుంచి తీసేయిస్తాడా నిజంగానే? "ఇదిగో అబ్బాయ్, జాగ్రత్త, యెవరినోట్లోనూ వేళ్ళు పెట్టగూడదు; జాగ్రత్తోసుమా" అనే చెప్పే వారు నాన్నగారు. తర్వాత, చాలా మార్పులొచ్చాయి—పెద్ద పెద్ద ఫాక్టరీలు లేచాయి; యిదివరకు బాతులు కాచుకునేవాణ్ణిప్పుడు ఫాక్టరీ డైరెక్టర్ నయ్యాను — ఐనా, ఒకట మాటమట్టుకు వొప్పు కోక తప్పదు, యిప్పుడుగూడా రొమ్ము విరుచుకుని తిరగడం మంచిదిగాదు, యితరు ల్నినవసరంగా కవ్వించగూడదు. లేకపోతే యేం జరుగుతుందో తెలుసా? ఎలీనాని నమ్మాను, మోసంచేసింది; డిమిత్రీని నమ్మాను, అతనేమో యిలా స్కౌండ్రెలై పొయ్యాడు... బాగానేవుంది నా వ్యవహారం! ఛ, యింత ఛండాలంగా యిదివర కెప్పుడూ లేదు...యేమిటాఅని ఆలోచిస్తే, జరిగిందేమీ వున్నట్టూ కనబడదు.'

ఇంతలో ఖిట్రోవ్ వచ్చాడు. 'ఆఁ, సిసలైన స్నేహితు డొచ్చాడు, నా కష్టా లేవిఁటో తెలుస్తా యతనికి' అనుకున్నాడు ఇవాన్; అనుకుని హుషారుపడ్డాడు.

హద్దూ, అదుపూ లేకుండా మాట్లాడేశాడు ఇవాన్— సొకొలొవస్కీని చీల్చిచెండాడు, తిట్టాడు, నానామాటలూ అన్నాడు. "నిజంగానా!", "నాకు తెలియనే తెలీదు దే!" అనో, "యింతపనీ జరిగిందన్నమాట!", "అంత ఛండాలు డన్నమాట!" అనో మధ్య మధ్య వ్యాఖ్యానించాడు ఖిట్రోవ్. ఆమాత్రం ప్రోత్సాహం దొరికేప్పటికి, సొకొలొవస్కీ గత చరిత్రనికూడా తవ్వడం ప్రారంభించాడు ఇవాన్: "కుటుంబాన్నంతా విదేశాలకి పంపించేశాడు, యింకేఁవన్నా వుందా! అస లతను కమ్యూనిస్టు కాడు" అన్నాడు.

*　　　　*　　　　*

ఇవాన్‌తో మాట్లాడి వెళ్ళింతర్వాత, డిమిట్రీగూడా త్వరగా కోలుకోలేకపోయ్యాడు. విసుగుపుట్టింది. అదృష్టవశాత్తూ, సొకొలొవస్కీని ప్రధాన కార్యాలయంలోనివా ళ్ళందరూ మెచ్చుకుంటారు; అదీగాక, రోజులుగూడా మారాయి, ఇవాన్ అత న్నేమీ చెయ్య లేడు. 'ఐనా, యిదంతా మహాఁదారుణంగా వుంది. ఆ మాటే అతన్తో అనెయ్యలే దెందుకని నేను? నోరు మూసు క్కూర్చోవడం అలవాటైపోయిం దనుకుంటా నాకు – కళ్ళమూసు చూడడం అలవాటై పోయింది, అదే తప్పసలు. ప్రారంభంలో అలాగే వుంటుంది మరి – యిల్లు కట్టేప్పు డెలావుంటుంది మరి? ఎక్కడ చూచినా అంతా చిందరవందరగా, యెక్కడ చూచినా పనికిరానివీ, అవసరంలేనివీ పడుంటాయి; యికిప్పుడు అంతా వూడ్చేసి, యిల్లు శుభ్రం చేసు కోవాలి – ఆ యింట్లో నివసించడంగూడా ప్రారంభించాంగా. ఇవాన్‌లాంటివాళ్లు 'చెప్పులోని రాయి' లాగా తయారౌతారు అక్కడక్కడా.

'ఇంకొకటుంది, సావ్ చెంకో చెప్పిందంతా నిజంగా వాస్తవం గాదు. ఇవాన్ అసలే పనికిరా డనగూడదు— అతని పనంటే పడి చస్తాడు, యుద్ధంలోగూడా బాగా పనిచేసినవాడిలా కన్పిస్తాడు. ఇన్ని విభిన్న ప్రకృతు లెలావుంటాయో వొకే మనిషిలో? ఇప్పు డంటే అత న్నొదిలిపెట్టేసిందిగాని ఎలీనా, ఒకానొకప్పు డావిడ గూడా అతన్ని చూచి ఆకర్షింపబడిందన్నమాట నిజమేగా, అంటే ఆవిడ ప్రేమకి పాత్రమైన దేదో అతన్లో వుండేవుండాలి. అతను స్కౌండ్రెల్ కాదు — యింకా పూర్తికాని, సగం సగం మనిషి.

'ఒక మెషీన్ మంచిచెడ్డలు చూచి, పనికిరాని భాగాలు తీసి వేసి, ఆ స్థానంలో పనికివచ్చే కొత్త కొత్త భాగాలు వెయ్య వచ్చును మెషీనైతే. అదే మనిషైతే యేం చేస్తాం ? యిదేగనక వొక సంవత్సరంక్రితం అడిగితే, ఇవాన్ చాలా మంచి పనివాడనే చెప్పేవాణ్ణి — అప్పుడూ అతన్లోవున్న పనికిరానిగుణాలు తెలుసు నాకు; ఐనా వాటినిగురించి ఆలోచించగూడ దనుకున్నా నప్పుడు; మనిషిగామాత్రం అతను చాలా చిందరవందర మనిషనే అంగీక రించాలి. ఏదో బురదగుంటలోనుంచి పైకెక్కినట్లుం దిప్పుడు.

'ఇంకోరకం మనస్తత్వం వున్న మనుషు లుండాలి—సావ్ చెంకోలాంటివాళ్లు—భవిష్యత్తునుగురించి కలలు కనగలిగినవాళ్లు. ఎక్కవలసిం దేమో నిటారు పర్వతాలు, గాలిగూడ సరిగ్గా అందదు; వూపిరితిత్తులు మంచివికానివా ళ్ళేక్కేందుకు పనికి రారు. దీనికీ, వయసుకీ నిమిత్తం లేదు. ఇవాన్ తలగూడా తన్నే వాళ్ళు కొంతమం దున్నారు సావ్ చెంకో వయసువాళ్ళల్లోగూడా. ముసలి పుఖోవ్‌నిగురించి ఎలీనా యేం జెబుతుందో చూస్తే చాలదూ, ఐనా చాలా గడ్డురోజుల్లో పెరిగి పెద్దవాడైన మనిషి. మంచివాళ్ళూ, చెడ్డవాళ్ళూ యిదివరకూ వున్నారు, యిప్పుడూ వుంటారు. మనిషి గౌరవనీయుడైతే యే యిబ్బందీ వుండదు: మంచి మార్గంలోకి తప్పకుండా వస్తాడు. మిగతావాళ్ల సంగతేమిటి మరి ? విజ్ఞానం వున్నంతమాత్రాన సరిపోదు, మనిషి భావాలకుగూడా

శిక్షణ నివ్వాలి. అమెరికానే తీసుకోండి — కావలసినంత చదువు సంస్థ లున్నాయి, విజ్ఞానశాస్త్రానికి సంబంధించిన పత్రికలు చూస్తేనే తెలుస్తుంది ఆ విషయం. వాళ్లు కట్టిన పెద్ద పెద్ద లేబొరేటరీ ప్రయోగశాలల్ని చూస్తేనే చాలు! కాని నీగ్రోలంటే వాళ్లు చూపే చిన్నచూపు, ఆ ప్రవర్తన, వాటికే కుదించివేస్తుంది మనిషైన ప్రతివాడినీ — నూటికి నూరుపాళ్ళూ రాక్షసత్వం.

'కాని భావాలకు శిక్షణ నిచ్చేదెలా? చాలా కష్టం. క్రిమియాలో ద్రాక్షపళ్ళని పండించడం కష్టంకాదు — నావ్ చెంకో లాటివాళ్ళని కాస్తైన మనుష్యుల్లాగా తయారుచెయ్యడంలాంటిదే అదీనూ. కాని అడవిద్రాక్షే వుందనుకుందాం - అంటే పడుచుదనంలో ఇవాన్ అన్నమాట, అతని కొక అంతరాత్మని ప్రసాదించాలి - ఉత్తరధ్రువంలో ద్రాక్ష పెంచడంలాంటిదిది. కష్టమే, కాని సాధ్యం కూడాను - అందుకు తగిన ఉత్సాహమూ, గ్రహణశక్తీ, పట్టుదలా వుండాలి. కనీ, వినీ యెరుగని అపూర్వ విజయాలు సాధించారు మన ప్రజలు; నిజంగానే మన ప్రజ వీరప్రజ, ప్రతీ వ్యక్తీ కూడా అలాగే వుండాలి: వుండడం అవసరం. ప్రజంతా వువ్వెత్తుగా లేచినప్పుడు ఇవాన్ మాత్రం లేవడా? యుద్ధంలో వీరోచితంగా ప్రవర్తించలా? ఇక్కడమాత్రం, ఆవేళ నిప్పంటుకున్నప్పుడు? మనిషిలో సగభాగాన్ని గురించి చాలా శ్రద్ధ వహించాం; కాని, మిగతా సగాన్ని గాలికి వొదిలిపెట్టాం. సగం యిల్లు పరిశుభ్రంగా, అద్దంలా వుంటే, మిగతా సగమూ అపరిశుభ్రంగానూ, చీకటిగానూ వుంది. చాలాకాలంక్రితం, నేను చదువుకునే రోజుల్లో, చదివిన గోర్కీ వ్యాసం గుర్తొస్తోంది; మన సోవియట్ మానవత్వమే మన కవసరం అని అన్నాడు గోర్కీ. ఆ మాటే మరచిపోయాం. ఆ విధి యింకా పూర్తికాలేదు; పరిపూర్తి చెయ్యాలి. ఆ రోజుల్లో అంటే అది వూహామాత్రమే, సంభావ్యమాత్రమే; ఆ సమస్యల్నటినీ యెదుర్కొని పరిష్కరించాల్సిన సమయం ఆసన్నమై చాలకాలమైంది.

'నాకుమట్టుకు నేను? ఇవాన్‌ని తిడతానేగాని. నాయిల్లు నేను చక్కబెట్టుకున్నానా? నా ఆలోచనలకీ, నేను బ్రదికే విధానానికీ మధ్య యింకా గోడలు పెట్టుకునే కూర్చున్నాను. ఆ వ్యవసాయిక ప్రజ్ఞని, జుబ్జోవ్‌ని, ఆ సర్వాభిప్రాయాన్ని విమర్శించి, ఖండించడం వెందుకు? ఎందుకు చేశాను నేనా పని? రెండు నాల్కల మనిషినని నన్నతడు నిందించినా తప్పు లేదు. "పుస్తకాల్లో అలావుండడం మంచిదేగాని, జీవితాని కది పనికిరాదు" అనీ' "యిది యిలా వుండాలనడం వేరు; దాని నమల్లో పెట్టడం వేరు"అనీ' "నియమాలు వేరు; అనుభవాలు వేరు" అనీ యెన్నిసార్లనలేదు నేను? అదంతా వొట్టి కపటనాటకం.

ఐనా, నిక్కచ్చిగానూ, నికార్సుగానూ వుండగూడదని గాదు నామతం. మరైతే యిలా జరిగేందు కాకారణం వేమిటి? మనం త్వరత్వరగా మారుతూండడంవల్లనేమో బహుశ; బహుశా మనం త్వరత్వరగా అభివృద్ధి పొందుతూండడంవల్లనేమో. ఒక్కసారి మనసు వెనుకబడిపోతూంటుంది, మరోసారి హృదయం వెనుకబడిపోతూంటుంది. సావ్‌చెంకో మిగతావాళ్ళకంటే యింకా స్త పరిపూర్ణమైన మనిషి; 1930 అనుభవాలతనికి లేవు, యుద్ధకాలం నాటి అనుభవాలతనికి లేవు. ఎప్పుడూ మరికొంత కావాలంటాడు —అతని కా హక్కుంది. ఇదివర కెప్పుడో, కలల్లోమాత్రమే చూచిన విషయాల దరిదాపుల్లోకి యిప్పుడు, జాగ్రదవస్థలోనే, వస్తున్నామేమో అని పిస్తోంది...'

డిమిట్రీ నిద్దేపోయ్యాడో, లేకుంటే వూరికే కళ్ళుమూసుకుని ఆలోచనాతరంగాల్లోనూ, భావాల్లోనూ, సాంకేతిక వూహా చిత్రాల్లోనూపడి కొట్టుకుపోయాడో? జఖారియెవ్‌ని గుర్తుకు తెచ్చుకున్నాడు, జఖారియెవ్, స్టారోబెస్కోల్ దగ్గర యుద్ధంలో చనిపోయాడు. చనిపోతూ, చనిపోతూ, "ఏం పర్వాలేదు, అంతా చక్కబడి పోతుంది" అన్నాడు. తర్వాత, నెస్టర్, లిప్సెంకిన్, గొణుక్కుంటూ అన్నమాటలు విన్నాడు: "బహుమానం నా

కివ్వడ మేమిటి? నే నొక్కణ్ణేకాదది కనిపెట్టింది — మేం అందరం కలిసి ఆలోచించాం దాన్నిగురించి" అన్నాడు లిస్సింకిన్. తర్వాత, సావ్ చెంకో అన్నమాటలు విన్నాడు: "బాంబులు చూపించి భయపెట్టలేరు మనల్ని - మన పక్షాన భావాలున్నై, ఆదర్శాలున్నై; బెసకని మాటలూ, జారని గౌరవమూ వుంది మన పక్షాన" అంటున్నాడు సావ్ చెంకో. చల్లగా, హృదయపూర్వకంగా ప్రేమించే మానవులు, మనుషులు గట్టివాళ్లైనా, హృదయాలు కోమలమైనవాళ్ళు, - తన శతాబ్దంలోనే, తన చుట్టూనేవున్న అపూర్వ మానవజాతి కనిపించింది డిమిట్రీ కళ్ళముందు. కళ్ళకుగట్టి నట్టు; హృదయపు లోతుల్లోంచి,' నిర్మలంగా పైకుబికిన చిరునవ్వు లాస్యంచేసిం దతని ముఖంమీద. ఎలీనా గుర్తుకొచ్చిం దప్పుడతనికి, భవిష్యన్మానవజాతినిగురించి కలలుగనడం ప్రారంభించా డప్పుడతను; ఆ కలల ఔద్ధత్యంలోనూ, తీవ్రతలోనూ, పట్టుదలలోనూ ఎలీనా సమ్మిళితమైపోయింది అతని ఆలోచనలలోనూ, జీవితాశయంలోనూ, ఆశయ ఆచరణలోనూ ఎలీనా అలా ఏకమైపోవడాని కదే ప్రప్రథమం.

# 12

ఖిట్రోవ్‌కి ఇవాన్ చెప్పిన కథంతా బాగా నచ్చింది. సొకొలొవస్కీ కపటనాటక మాడుతున్నాడనీ, కావాలని విధ్వంసానికి పూనుకుంటున్నాడనీ, తన కుటుంబాన్నంతా బెల్జియందేశానికి పంపించివేశాడనీ తెలిసిపోయిందని చెప్పేశాడు యింటికెళ్ళి భార్యతోనూ, పెద్ద కొడుకుతోనూ.

"ఇవాన్ అంత అజాగ్రత్తగా మాట్లాడేమనిషి కాదు; చాలా జాగ్రత్తైన మనిషి, ప్రతీ మాటా ఆచి, తూచి మాట్లాడేరకం. సొకొలొవస్కీ గుట్టుకాస్తా తెలిసిపోయు టుంది పైవాళ్ళకి" అంటూ, ఆ పైవాళ్ళెవరో చెప్పేందుకు చేయిలేపి చూపించాడు.

అంతటితో ఆగలేదు. వెళ్ళి, ఎంజనీర్ ప్రొఖొరోవ్‌తో చెప్పాడు, క్లబ్ మానేజర్, డోబ్జిన్‌స్కీతో చెప్పాడు. ఎవరికి వారికే, "మీ కాక్కబట్టి చెబుతున్నానుసుమా," అనే అన్నాడు. ప్రొఖొరోవ్ మట్టుకు అదంతా ఖిట్రోవ్ వుబుసుపోకమట్టుకేననీ, చెల్లని దమ్మిడీయెత్తుగూడా చెయ్యదనీ అనుకున్నాడు. డోబ్జిన్‌స్కీ అలా అనుకోలేదు, ఖిట్రోవ్ చెప్పింది విని సంతోషించాడు గూడాను. సొకొలొవస్కీ అంటే అతని క్కాస్త మంటగూడాను; ఇదివరకెప్పుడో వొకసారి క్లబ్బు కార్యకలాపాల్ని గురించి హేళన చేశాడు సొకొలొవస్కీ. అదీగాక, యేదైనా వార్త ఆర్భాటంగా యితరులకి చేరవేయడమంటే సరదా డోబ్జిన్‌స్కీకి. మొత్తంమీద ఖిట్రోవ్ చెప్పిన కథకింకాస్త వుప్పూ, కారమూ కలిపి, విన దలచుకున్నవాళ్ళ కందరికీ చెప్పివేశాడు.

ఖిట్రోవ్ భార్యకి బాంక్‌లో వుద్యోగం; అక్కడ పనిచేసే వారికి ఆవిడ చెప్పివేసింది. ఖిట్రోవ్ పెద్దకొడుకు పదోక్లాసులో చదువుకుంటున్నాడు. ఇంటర్వెల్‌లో అతనూ చెప్పేశాడు తోటి

వాళ్ళందరికీ, సొకొలొవస్కీని పట్టుకున్నారనీ, అతను బెల్జియం దేశస్థుడని బయటపడిందనీ, త్వరలోనే విచారణగూడా ప్రారంభ మౌతుందనీనీ.

మూడురోజు లయ్యేప్పటికి వందలకొద్దిమందికి తెలిసి పోయింది సొకొలొవస్కీకేదో ప్రమాదం వాటిల్లిందని. తెలియందల్లా ఒక్క సొకొలొవస్కీకే; కన్వేయర్ బెల్టుమీద యేదో పనుంటే, అదే చూసుకుంటున్నాడు సొకొలొవస్కీ, సాయంత్రం పూట అరబ్ వ్రాతప్రతులు చదువుకుంటున్నాడు. "ఇంకో రెండు వారాల దాకా పీరాదగ్గరకెళ్ళి లాభంలేదు — మరీ అదేపనిగా వస్తున్నావని అంటుంది. రెండు వారాలంటే మాటలా? పదిహేను రోజులు!..." అనుకుంటున్నాడు.

తర్వాతొకసారి ఇవాన్‌ని కలుసుకుని, సిగ్నలింగ్ సిస్టమ్‌ని గురించి ఇవాన్ చెప్పింది నిజమేననీ, ఆ ప్రకారం తన ప్రాజెక్ట్‌లో కొన్ని మార్పులు చేయదలుచుకున్నాననీ చెప్పాడు. అతను మాట్లాడే ధోరణి చూస్తే ఇవాన్‌కి సందేహం వొచ్చింది: 'బహుశా నేను పొరబడ్డానేమో. పనంటే మరీ పడిచస్తాడీమనిషి; అదతని అల వాటు. ఆ ప్రాజెక్ట్‌నిగురించి నే చేసిన సూచనలుగూడా చాలా వరకు ఆమోదించాడు, యెకసక్కెంగా ఒక్కమాటగూడా అనలేదు. అనవసరంగా తుళ్ళిపడ్డానేమో నేను. తొందరపడి ఆ మాటలన్నీ అనకుండా వుండాల్సింది. పర్వాలేదు, యిద్దరం కలిసి పని చెయ్యగలం...'

క్రమక్రమంగా కుదుటబడింది ఇవాన్ మనసు. తర్వా తొచ్చిన ఆదివారంనాడు, క్రొటోవ్‌తో కలిసి చేపలు పట్టేందుకు వెళ్ళాడు. మంచుగడ్డలు పగిలినచోట నీరంతా మసగ మసగ్గా వుంది, వూరికే బుడగలు లేస్తున్నాయి హుషారుహుషారుగా. "ఈ సారెలాంటి చేప పడుతుందో చూద్దాం" అంటూ కూర్చున్నాడు ఇవాన్. ఇంటి కొచ్చేప్పుడు "సొకొలొవస్కీ గొడవేమైంది?" అనడిగాడు క్రొటోవ్, దారిలో. "ఆ ప్రాజెక్ట్‌లో యేదో మార్పులు

చేస్తున్నాడు. అతని పనతనికి తెలుసు మని ఏలాంటివాడైనా” అన్నాడు ఇవాన్; అప్పటికి వారంరోజులక్రితం చీఫ్ డిజైనర్‌ని తిట్టింది తాను కానేకానట్లు.

మరో వారం గడిచింది. మన సేమీ బాగుండనప్పుడు సొకొలొవస్కీమీద విరుచుకుపడ్డ ఆదివారాన్నిగురించి ఇవాన్ మరచిపోయి చాలా రోజులైంది. ఐనా, యిప్పటిగ్గాని స్కూల్ టీచరు పుఖోవ్‌కి చేరలేదు ఆ వార్త.

“ఇవాన్ంతపని చెయ్యగలడని కలలోగూడా అనుకోలేదు నేను. ఎలీనా మంచిపనే చేసింది, అతన్నొదిలిపెట్టేసింది. కుటుంబాన్ని బెల్జియం పంపించి సొకొలొవస్కీ యే ననేది ఇవాన్ పుట్టించిన కట్టుకథ. నేనేగనక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌నైతే యీపాటికి ఇవాన్ చెవు లెక్కేసేవాణ్ణి” అన్నాడు పుఖోవ్ భోజనందగ్గర కూర్చొని.

ఒలోద్యా మనసు చివుక్కుమంది: ‘ఛాఛ, యెంత ఛండాలం! నాన్న కేమీ తెలియదు; వొట్టి అమాయకుడు.. ఇవాన్ పుక్కేమీ మునగదు, నష్టపడేది సొకొలొవస్కీయే. సొకొలొవస్కీని చూచి గూడా చాలా రోజులైంది; నేనుగూడా తప్పుకుతప్పుకు తిరుగుతున్నాననుకుంటాడో, యేం ఖర్మో, అంతకంటె అపహాస్యం వుండదు. . .’

అదేరోజు సాయంత్రం సొకొలొవస్కీ యింటికెళ్ళాడు ఒలోద్యా. సొకొలొవస్కీ పనిలో నిమగ్నుడై వున్నాడు; టేబుల్ నిండా పెద్ద పెద్ద డ్రాయింగులు పరచివున్నై. ‘ముసలివాడైపోయి నట్టున్నాడే అనుకున్నాడు ఒలోద్యా. నిర్మాణ కార్యక్రమం ఫోటోలు కొన్ని ఒలోద్యా ముందుకు తోసి, “అవి చూస్తూండు. ఇప్పుడే ఐపోతుందిలే యీపని” అన్నాడు సొకొలొవస్కీ.

నిర్మాణ కార్యక్రమం అంటే ఒలోద్యా కేమంత పెద్ద ఇష్టం లేదు కాని, ఆ ఫోటోల ఆల్బంమీద వ్రాసిన పంక్తులు చూశాడు:

"1931 లో మొట్టమొదటి బ్లాస్ట్‌ఫర్నేస్ నిర్మాణానికి స్మృతి చిహ్నంగా యూరీనీ వ్లాదిమిరోవిచ్ సొకొలొవస్కీకి—సహచర కార్మికులు" అని వుంది దానిమీద. 1931 లో ఒలోద్యా వయసు పదకొండేళ్ళు. 'సొకొలొవస్కీ నిజంగానే ముసలివాడై పోయాడు. ఆయనకీ నాకూ పోలికేమిటి? యేమీ లేదు. ప్రతీదాన్ని సందేహించే మాషని అనుకునేవాణ్ణి నేను. దేనిలోనూ నమ్మకంలేని మనిషిని కలుసుకోవడం మంచిదే ననుకునేవాణ్ణి. అతన్నేమిటి? సందేహించడమేమిటి?— తన పని తాను హృదయపూర్వకంగా చేస్తాడు, గో సంరక్షణని గురించిన వ్యాసాలు పదే పదే చదువుతాడు—అందరు సోవియట్ పౌరులలాంటివాడే. కాకపోతే చాలామందికంటే యింకాస్త యెక్కువ తెలివితేటలున్న మనిషి. అందుకనేనేమో ఇవాన్ కీయనంటే మంట. ఒక్కసారి కిందపడితే అంతే, యింకెవ్వరూ నమ్మరు, యేకో అదృష్టజాతకుడై పుట్టాలి అలా నమ్మకం సంపాదించాలంటే — ఇవాన్‌లాగా. సొకొలొవస్కీ యెంత బాధపడుతున్నాడో తెలుసుకోగలను నేను. ఈ వుద్యోగంలోనించి తీసెపారెయ్యలేదు అదే పదివేలు; ఆ అదృష్టంచాలు. ఏం అదృష్టంలే? రేపెల్లుండో తీసవతలపారేస్తారు.'

"బాగా చలేస్తోందే" అన్నాడు సొకొలొవస్కీ తలెత్తకుండానే.

"ఇక్కడ బాగా వేడిగానే వుందే; అదీగాక మీరు స్వెటర్ గూడా వేసుకున్నారు" అన్నాడు ఒలోద్యా.

"ఆరోగ్యం చెడిపోయిందనుకుంటా; జలుబుగూడా చేసినట్టుంది" అంటూ గొణిగాడు సొకొలొవస్కీ.

ఒక గంట గడచిన తర్వాత, పని అవతలకి నెట్టి, "యీమధ్య ఎక్కడా కనపడలేదేం? ఏం చేస్తున్నావ్? బాగా పనిచేస్తున్నావా?" అనడిగాడు సొకొలొవస్కీ.

"ఏదో కొద్దిగా ... మిమ్మల్ని విసిగించడం యెందుకులే అని."

అని కాస్సే వూరుకున్నాడు ఒలోడ్యా. చివరి కెట్లాఐతేనేం, పెగల్చుకుని, "ఆఫీసులో గొడవేమిటో జరిగిందని విన్నాను?" అన్నాడు.

"పెద్దగొడవేమీం కాదు...ప్రోజెక్టుని అక్కడక్కడా మార్చాలిసొచ్చింది...పెట్టిన అభ్యంతరాలు సకారణమైనవే."

సొకొలొవస్కీ- వాళ్ళేమీ బావుండలేదు; పండుకోవాలని పిస్తూంది. ఒలోడ్యా అక్కడ కూర్చునున్నాడు; పండుకునేందుకు వీల్లేదు. అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఒలోడ్యా కదల్లేదు.

"ఏం, ఆ ఫోటోలు బావున్నయ్యా?" అనడిగాడు సొకొలొవస్కీ.

"చాలా బావున్నై" అన్నాడు ఒలోడ్యా, యంత్రంలా.

'ఈయన కాగొడవే తెలిసినట్టు లేదే' అనుకున్నాడు ఒలోడ్యా. అదీ మంచిదేనేమో...ఇలాగే కూర్చునిపనిచేసుకుంటూ వుంటాడు...ఇవాన్ అగస్మాత్తుగా దాడిచేస్తాడు. ముందుగా హెచ్చరించడమే మంచిది. చెప్పవలసిన సమాధానాలన్నా ఆలోచించుకుంటాడు.'

"ఆఫీసుని గురించి యెంత కడిగా ననుకున్నారిందాక ? మిమ్మల్ని నాశనం జెయ్యాలని ఇవాన్ ప్రయత్నిస్తున్నాడు" అన్నాడు ఒలోడ్యా పైకి.

"నిజంగానా? ఎందుకూ?...ఆ కొత్త మోడెల్‌ని గురించా?"

లేచి, సొకొలొవస్కీ-దగ్గర కెళ్ళాడు ఒలోడ్యా: "మీరు మీ కుటుంబాన్ని విదేశాలకి పంపారని అంటున్నాడతను."

సరిగ్గా అదే సమయానికి, ఓ ఘటన జరిగింది. సొకొలొవస్కీ- యింటికి వచ్చినప్పుడల్లా బిస్కట్‌ముక్కలూ అవీ తెచ్చి, ఫోమ్కా— సొకొలొవస్కీ కుక్క—కి లంచం మేపుతూనే వుండే వాడు ఒలోడ్యా; ఐనా యింతవరకూ అదతనికి అలవాటు పడ లేదు. తన యజమాని కంతదగ్గరగా యెవరెళ్లినా సహించలేదు ఫోమ్కా. అప్పటివరకూ సోఫాకింద వున్నదల్లా వొక్కుదుటున

లేచి, ఒల్గోడ్యా కాళ్లు పట్టుకుంది. సొకొలొవస్కీ అక్కడేవున్నాడు కాబట్టి సరిపోయింది; వెంటనే విడిపించాడు.

"ఒట్టిఫూల్! అంగడిమీదా కలబడటమే" అన్నాడు చికాగ్గా.

ఆ మాటలు ఫోమ్కా నుద్దేశించి అన్నాడో, ఇవాన్ నుద్దేశించన్నాడో అర్థంకాలేదు ఒల్గోడ్యాకి. ఇవాన్ పుట్టించిన పుకారు తప్పని అంటాడేమో సొకొలొవస్కీ అని చూచాడు ఒల్గోడ్యా; సొకొలొవస్కీ మాట్లాడలేదు; సోఫామీద పడుకుని, "నువ్విక్కడంత వేడిగా వుందంటావు, నా వొళ్ళంతా యిలా వణికి పోతూంటే" అన్నాడు.

అప్పుడుగాని ఒల్గోడ్యాకి అర్థంకాలేదు నిజంగానే సొకొలొవస్కీ ఆరోగ్యం చెడిపోయిందనీ, బహుశా జలుబుగూడా చేసిందేమోననీనీ.

"టీ చెయ్యమంటారా? లేకుంటే బైటికెళ్లి బ్రాందీ తీసుకొస్తాను, వెళ్ళమంటారా!" అనడిగాడు.

"నా కవేమీ అవసరం లేదుగాని, ఒక మాటడుగుతా చెప్పు. లియొనార్డో దావిన్సీ వేసెనరంగులు సరిగ్గా వుండకపోవడానికి కారణమేమిటి? యిదివర కెప్పుడో యెక్కడో చదివానుగాని, అర్థంకాలేదు. అసలా లోపం ఆ మట్టిరంగుల్లో వుందా? లేక ఆయన అవి సరిగ్గా కలపలేదా?"

"తెలియదండీ! నిజం చెప్పనా అండీ, అసలు నాకా విషయాలు తెలియనే తెలియవ్."

కాస్సేపటిదాకా ఇద్దరూ మాట్లాడలేదు.

"నిద్రపోతారా? నే వెళ్తాను..." అనడిగాడు ఒల్గోడ్యా.

"వెళ్ళొద్దులే, కూర్చో. నన్నేమీ విసిగించడంలేదు నువ్వు. ఒక సంగతి చెబుతా, లియొనార్డో చిత్రాలంటే యిష్టమేనా నీకు?"

నే నా చిత్రాలు చూడం దొక్కసారే; చెప్పడం కష్టం."

"అతని మనసంటేనూ, ఆయన కృష్టమైనవంటేనూ చాలా యిష్టం నాకు! ఒకేసారి చాలా విషయాలమీద అభిరుచివున్న

వ్యక్తులు డేవారు యిదివరకు. మైఖేలాంజెలో కవిత్వం వ్రాసేవా డనే సంగతి తెలుసా నీకు? ఐన్‌స్టైన్ కవిత్వం వ్రాయగలడం టావా? నా కోటేలా యియ్యి; అదిగో గోడని వెళ్ళాపుతోంది."

'తన మనసేమీ కుదుట చెంద లేదని చూస్తున్నాడులా వుంది' అనుకున్నాడు ఒలోద్యా: 'ఇవాన్ వేసిన అపవాదాల్ని కాదనడం చాలా అవమానకరం అని అనుకుంటున్నాడు. అదీ నిజమే నేమో. నేనసలు చెప్పకుండా వుండాలింది. అనవసరంగా బాధించాను. నేనొచ్చేప్పటికి చక్కగా పనిచేసుకుంటున్నాడు. ఇప్పుడేమో అక్కడ పడుకుని అసందర్భాలన్నీ మాట్లాడుతున్నాడు. జ్వరం గూడా వచ్చుండాలి వెళ్ళి డాక్టర్ని పిలుచుకురావాలి; ఇలాంటప్పుడు వదిలేసి వెళ్ళగూడదు.'

సొకొలొవస్కీ మళ్ళీ ప్రారంభించాడు:

"యెప్పుడో పాతకథల్లో చదివానొకచోట బంతిచెట్టొక ఋతువుకాలం మాత్రమే బ్రతికి, పూలుపూస్తు దనీ, తర్వాత చని పోతుందనీ. అదంతా పచ్చి అబద్ధం. మొన్నీ మధ్యనే వొకబంతి చెట్టు చూశాను బొటానికల్ గార్డెన్స్‌లో. పూలు పూచి ది, ఋతువు గడిచిపోయింతర్వాతగూడా కళకళలాడుతూవుంది చక్కగా. కాకపోతే ఆ పూలు పూచేటప్పుడుమాత్రం, బాగా, జాగ్రత్తగా చూడాలి; అంతే."

ఒలోద్యాకి భయం వేసింది; సొకొలొవస్కీకి జ్వరం ఉధృత మైనట్లుంది.

"ఇప్పుడే వెళ్ళి డాక్టర్ని పిలుచుకొస్తానండి."

"ఊరుకోవోయ్, ఆఁ, యివ్వాళ తారీఖెంత?"

"పంధొమ్మిది."

"మరీ బుద్ధిలేకుండాపోతోందేఁ నాకు. ఇవ్వాళ యిరవయ్యొక టనుకుంటున్నా యింకా. నా మాటలు పట్టించుకోబోకు సుమా; మరీ అర్థంలేకుండా మాట్లాడుతున్నానల్లే వుంది. తల పగిలిపోతోంది."

"వెళ్ళి డాక్టర్ని పిలుచుకొస్తా. జ్వరం వొచ్చింది మీకు."

"నాకు డాక్టరెందుకయ్యా? జలుబు చేసిందని యిందాకనే చెప్పానుగా నీకు."

ఇంకో గంటసేపున్నాడు ఒలోద్యా.

"నాతల బద్దలై పోతోంది. ఛ..." అన్నాడు సొకొలొవ్స్కీ ఒక్కసారిగా.

ఒలోద్యా లేచాడు :

"వెంటనే డాక్టర్ని తీసుకొస్తా వెళ్ళి."

"తగు ఒలోద్యా, ఆగాగు! డాక్టర్ పీరాని మ్మట్టుకు తీసుకు రాబోకు. అంతగా పిలవాలనుకుంటే, గొరొహోవ్ని పిలువు; అసలెందుకు, పిలవడం మానెయ్యరాదూ."

గొరొహోవ్ వచ్చి చూచి, అది ఇన్ఫ్లుయెంజాలాగా వుందనీ, ఐతే న్యూమోనియాగూడా కావచ్చుననీ, గుండె యేమంత బలంగా లేదనీ ... అన్నాడు. కేంఫర్, పెన్సిలిన్ ఇంజక్షన్లిచ్చేందుకు, వెంటనే వెళ్ళి బారిఖేనాని పంపుతానని చెప్పాడు. మర్నాడుదయం వచ్చి మళ్ళీ చూస్తాన్లెమ్మని ధైర్యం చెప్పాడు.

ఆ రాత్రికి అక్కడే వుండిపోయాడు ఒలోద్యా. నిద్ర పోతున్నట్లున్నాడు సొకొలొవ్స్కీ".

సొకొలొవ్స్కీ నిద్రపోలేదు. జ్వరంమూలాన ఆలోచించ లేకపోతున్నాడు; అందుకని జ్వరంమీద కోపంగూడా వచ్చిందతనికి; ఆలోచన లొకదానొకటి తరుముకుంటూ వస్తున్నై, ఒకదాని సరసనొకటి పరుగెత్తుతున్నై, కన్పించినట్లే కన్పించి అంతర్ధానమైపోతున్నై. ఒలోద్యా చెప్పిందాన్ని గురించి ఆలోచించాలనుకున్నాడు సొకొలొవ్స్కీ. అదీ కథ, మళ్ళీ గత చరిత్రనంతా తవ్వాలనుకుంటున్నా రన్నమాట! ఆ విషయం ఎన్నిసార్లు సమాధానం చెప్పాడో లెక్కలేదు! చివరికి అందరూ అర్థంచేసుకున్నామన్న వాళ్ళే; "ఓ, అదా సంగతి," అన్న వాళ్ళే. ఉన్నట్లుండి మళ్ళీ యే సవునోవో, పోలిష్చుక్కో, ఇవానో బయల్దేరారు, మళ్ళీ మొదలు – 'ఎలా, ఏవిటి, ఎందుకు;' అంటూ.

'ఇంకో రెండు నెల్లు గడిచేప్పటికి, యింకెన్ని నిద్రమాత్రలు వేసుకున్నా లాభంలేని పరిస్థితొస్తుంది నాకు, అప్పటికి యీ ఇవాన్ గూడా, ఆ జారే దవడలాడించుకుంటూ వచ్చి, యెంతో గొప్పగా, "ఓ, అదా సంగతి! అర్థమైందిలే" అంటాడు. అసలు గమ్మత్తేమిటంటే, వాళ్ళందరికీ అర్థమయ్యే దేవిటో నాకర్థం కావడంలేదు. నాకూతురు, తెల్లసముద్రం జాలరి మనుమరాలు, పేరు 'మేరీ' యెలా ఐందో తల పగలగొట్టుకున్నా అర్థం కావడంలేదు నాకింతవరకూ. 'మేరీకి నా ఆశీస్సులు." పుష్కిన్ సందర్భంవేరు. ఇది వ్రాసింది మాయా బొలబనోవా; టెన్నిస్ పార్టీల్ని గురించీ, కాలిఫోర్నియా ఆకాశాన్ని గురించీ కలలు గని, నామ రూపాల్లేని బౌరివాజ్ సివాకుల్లో, నాజీసైనికుల బూట్ల చప్పుళ్ళమధ్య ప్రాణాలు విడిచిన దౌర్భాగ్యురాలు బొలబనోవా... యీ పడుచువాళ్ళెందుకూ మరీ యింత బుర్రలేకుండా ప్రవర్తిస్తారు! - పడుచువాళ్లు మాత్రమే కాదేమో అలా ప్రవర్తించేది - మాషా అలాంటి అర్థంలేని ట్యూనిక్ యెలాతొడుక్కోగలిగిందో అర్థం కావడం లేదునాకు. "సానుభూతి పరురాల్ని" అని వ్రాసింది. కాని ఒక దేశప్రజ కార్యకలాపాలంటేనూ, త్యాగాలంటేనూ, బాధలంటేనూ సానుభూతి పడడం సాధ్యమా? ఆ ప్రజల్లో ఒకళ్లైమై వాళ్లతోపాటు మంచీచెడ్డా- అన్నీ — అనుభవించనైనా అనుభవించాలి, లేకుంటే నోరు మూసుకు కూర్చోనైనా కూర్చోవాలి...ఐతే నన్నెళ్ళగొట్టాలనే ఇవాన్ ప్రయత్నిస్తున్నాడనేది స్పష్టం. న్యూసెన్స్. ఆ కొత్త మోడెల్ పూర్తి చేసెయ్యాలి. సిగ్నలింగ్ పర్వాలేదు, దానికి తగిన కట్టుదిట్టం చేసేందుకు నేనున్నాగా...బహుశా రేపొక ప్రముఖవ్యాసం పడుతుంది పత్రికలో, యిదివరకు యూరల్ ప్రాంతంలో జరిగినట్టుగానే. ఆ వ్యాసానికి రచయిత యేం శీర్షిక పెడతాడో? "అదిదేగ కాదు; బెర్జిడాన్ పిచ్చుక!" అంటాడేమో, కాదు కాదు, యిప్పుడు కాదు; యీసారి యిదివరకటిలా తప్పించుకోలేరు వాళ్ళు. ఇవాన్ గ్రహించని విషయాలింకా చాలా వున్నై...అస

లతనీ ప్రచారం యెందుకు ప్రారంభించాడో ? పార్టీ మీటింగ్‌లో అతనికి వ్యతిరేకంగా మాట్లాడానని కోపంవచ్చిందేమో బహుశ. ఐనా, నేనెలా వూరుకోగలను ? బ్రహ్మాండమైన యంత్రాలమీద పనిచేసే కార్మికులు పాడుపడిన గుడిసెల్లో, చిల్లులుపడిపోయిన కప్పులకింద నివసిస్తుంటే చూస్తూ వూరుకునేదెలా ? యీవిషయం పార్టీమీటింగులో తప్పితే యింకెక్కడ మాట్లాడ్తాం ! ఆర్కేం జెల్‌స్క్‌లో నికితాచెర్నీ—విప్లవం నాటి బోల్షివిక్, లెనిన్‌నిగూడా యెరుగునతను - అంటూండేవాడు : "మన అంతరాత్మ పార్టీయే" నని. "నేనూ పార్టీసభ్యుణ్ణేగా" అంటాడు ఇవాన్. ఎప్పుడూ ఇవాన్‌ని గురించే ఆలోచిస్తానెందుకు ? అతనందు కష్టుడుగాదు. సభ్యత్వం దరఖాస్తులు నింపడమే గాదుగా జీవితంలోకల్లా గొప్పవిషయం ! అదంతా మళ్ళీ తిరిగి వ్రాయాలినేను. అంతకు ముందే చచ్చిపోతే చిక్కేలేదు, వ్రాయాల్సిన అవసరమే వుండదు. ఇదివరకు వ్రాసిందే సరిపోతుంది. యేంటీ నాబుర్ర తా యిలా ఐపోయింది? ఇదివరకెప్పుడూ లేదేయిలా...ఇవ్వాళ ఇరవయ్యొకటో తారీఖేనని అనుకున్నాను; పంధొమ్మిదేనని తేలింది. వీరాదగ్గరికి ఇరవై ఐదులోపల వెళ్ళగూడదు. ఆరునోజులన్న మాట. ఫర్వాలేదు, ఏమంత దూరంగాదు...ఒకేళ యీజబ్బు బాగా తీవ్రమైందే నేమో ? యెంతకాలం వుంటుందో ఇలా ? క్రిందటిసారి నామీద కోపం వచ్చింది వీరాకి; ఆయెడారి మొక్కని గురించి మాట్లాడకుండా వుండాల్సింది నేను...మేం యిద్దరం యెప్పుడు కలుసుకున్నా, మాట్లాడుకోడానికేవీ వున్నట్టే కన్పించ దెందుకని ; మాయిద్దరి హృదయాలూ గడ్డకట్టుకు పోయాయా అనిపిస్తుంది...ఇవ్వాళ బాగా చలిగావుంది, అందుకనే జలుబుచేసింది నాకు...మిరియాలబ్రాందీ తాగితేసరి, చెమటపడుతుంది, జలుబంతా వదిలిపోతుంది. ఈ డాక్టర్లింతే, గోరంతని కొండంతలు చేస్తారు. వీరాకూడా అంతే... "అంటువ్యాధి" అన్నాడు యిందాకొచ్చిన గోరొఖోవ్. ప్రేమనలా అంటించడం సాధ్యంకాదే. ఆపని లియొనార్డోవల్లా కాలేదు,

పుష్కినూ చెయ్యలేక పోయ్యాడు. కాజాన్ స్టేషన్ ప్లాట్‌ఫారమ్మీద సైనికుడన్న మాట లేవిఁటి? అతను వెళ్ళిపోబోతున్నాడు రైలెక్కి; అతన్ని ప్రేమించినమ్మాయిగూడా వచ్చింది స్టేషన్‌కి. "మయకొవస్కీ రివాల్వర్‌తో ఆత్మహత్య చేసుకున్నాడంటున్నారు" అన్నాడతనా ఆ అమ్మాయితో. మయకొవస్కీ యెవరో ఆ యమ్మాయికి తెలియదు. సైనికుడి చెయ్యపట్టుకుని, "వాన్యా! నువ్వెళ్ళిపోవడఁ యెందుకూ?" అనడిగిందా అమ్మాయి. నాతల బద్దలై పోతోంది. ఇంటికి నిప్పంటించాడనుకుంటా ఒలోద్యా, అతనలాంటి వాడే; కాల్చేసిన సిగరెట్లెక్కడ బడితే అక్కడ పారేస్తాడు. చాలా పెద్ద మంట! ఒలోద్యాగూడా అందులోపడి కాలిపోతే? తానే చిత్రమూ గీయలేదంటా డతను. డ్రాయింగులన్నీ జాగ్రత్తగా దాయాలి... లియొనార్డో వుపయోగించిన మట్టిరంగులేవిఁటో ఒలోద్యాకి తెలియదెందుకని? పెద్దగడ్డం వుండేది లియొనార్డోకి; లీజాని ప్రేమించాడతను. సెమియొన్ మఠం దగ్గరొక సరస్సుంది, అందులోదూకి చనిపోయింది లీజా. ఆ లీజా, యీ లీజాకాదు, ఇంకొకర్తె. ఇప్పుడక్కడ ఆ సరస్సు లేదు—అక్కడొక సంస్కృతీభవనం వుందిప్పుడు. ఫాక్టరీ మంచిదేగాని, ఆ పాత ఫర్నేసులు పెట్టారెందుకూ అక్కడ? అనవసరంగా, బోలెడు బొగ్గుతినేస్తా యీఫర్నేసులు. నిప్పంటుకుంది, అంతా వ్యాపించి పోతూంది. క్రింద మెట్లదగ్గరొక నీళ్ళ పంపుంది...."

ఆర్పేయండి, లేకపోతే...అని అరిచాడు సొకొలొవస్కీ బిగ్గరగా.

ప్రక్కనున్న దీపానికున్న 'షేడ్' క్రిందికి దించాడు ఒలోద్యా. కాస్సేపూరికినే, నిశ్శబ్దంగా వున్నాడు సొకొలొవస్కీ; తర్వాత మళ్ళీ యేదో గొణుక్కోవడం ప్రారంభించాడు: 'మేరీ', 'ఎడారి మొక్క', 'రసాలు' అనే మాటలు వినిపించాయి ఒలోద్యాకి, మధ్యమధ్య.

'వృక్షశాస్త్రమంటే బాగా యిష్టంవేమో' అనుకున్నాడు ఒలోడ్యా: 'బంతిమొక్కల్ని గురించి మాట్లాడాడు. అన్నీ తెలుసు కోవాలనే! లియొనార్డో యేంరంగు లుపయోగిస్తే మాత్రం యీాయనకెందుకు? సబురోవ్ వుపయోగించే రంగులూ నే నుప యోగించే రంగులూ వొకటే; ఫలితంలో కావలసినంత తేడా... మేరీ యెవరో. పూర్వాశ్రమంలో ప్రేమించినావిడేమో. విదేశాల్లోనే వుంటా యలాంటి పేర్లు. సొకొలొవస్కీ గూడా ప్రేమించా డన్నమాట, విచిత్రమే మరి. నిజంగానే యెప్పుడైనా బెల్జియం వెళ్ళాడేమో. ఈయన్తో చెప్పకుండా వుండాల్సింది. నే నామాటలు చెప్పింతర్వాతే యిలా పడిపోయి, సంధి పుట్టినట్లు మాట్లాడ్తున్నాడు. ఇదంతా నాతప్పే...'

మనసు వికలమైనంత మాత్రాన న్యూమోనియా రాదని ఒలోడ్యాకీ తెలుసు. ఐనా, సొకొలొవస్కీ యిలా వుండడాని క్కారణం వాళ్ళూ వీళ్ళూ వేసే వెధవ పుకార్లన్నీ తానిక్కడ చెప్పడం వల్లే నని అనుకున్నాడు ఒలోడ్యా.

మర్నాడుదయం గొరొఖోవ్ వచ్చాడు. చూచి, దిగులు పడ్డాడు.

"యింకో డాక్టర్‌తో గూడా ఆలోచించి చూస్తాను; ప్రొఫెసర్ బైకోవ్‌ని పిలుస్తాను" అన్నాడు.

పట్టణంనుంచి ప్రొఫెసరొచ్చాడు. గొరొఖోవ్‌తో చాలా సేపు మాట్లాడాడు ఆ ప్రొఫెసర్. వాళ్ళు మాట్లాడుకునే సాంకేతిక భాషలో పదాలు ఒలోడ్యాకి అర్థంకాలేదు కాని, వొకటి మాత్రం పసిగట్టాడు వాళ్లిద్దరూగూడా కాస్తగాభరాయే పడు తున్నారని. హాస్పిటల్‌కి తీసికెళ్ళడం మంచిదేమోనని సూచించాడు గొరొఖోవ్. బైకోవ్ తల అడ్డంగా వూపాడు:

"ఆయన్ని కదల్చడం మంచిదికాదు; నర్సుని సంపాయించ లేరూ?"

సొకొలొవస్కీ-వద్ద బారిఖినా వుండిపోయింది. సాయంత్రం అవుతూండగా యింటికెళ్లిపోయాడు ఒలోడ్యా. అన్నయ్య అలసి పోయిరావడం గమనించింది సోన్యా:

"యేమిటీ కథ?"

జవాబు చెప్పకుండా, తనగదిలోకెళ్లి పోయాడు.

♦ ♦ ♦

రెండురోజులవరకూ స్పృహరాలేదు సొకొలొవస్కీ-కి. మూడోనాడుదయం కళ్లు తెరిచాడు. చాలా ప్రొద్దెక్కే-వరకూ నిద్రపోయాననీ, ఫాక్టరీకెళ్ళేప్పటికి ఆలస్యమౌతుందేమోననీ అనుకున్నాడు; మంచంపక్క-నేవున్న టేబుల్ మీదికి చెయ్యిచాచాడు, (యిదివరకెప్పుడూ గడియారం పెట్టేవాడాబల్లమీద,) దాని మీదున్న మందుసీసా కిందపడి పగిలిపోయింది. అప్పుడు గుర్తొచ్చిందతనికి: 'నేను జబ్బుపడ్డాను, గొరొఖోవ్ వచ్చాడు...' కళ్లుమూసుకుని మిగతాసంగతులు గూడా గుర్తుకుతెచ్చుకోవాలని చూచాడు. 'ఒలోడ్యా వచ్చాడు, నాకుజ్వరంవొచ్చింది, పెద్దమంట గూడా పుట్టింది...కాదు, కాదు అది కల ఐవుంటుంది...' తలంతా యేమిటో కలగాపులగంగా వున్నట్లుంది. ఒక్క-టిమాత్రం, యెందు కనోగాని, చాలా స్పష్టంగా గుర్తుంది; లియొనార్డో వుపయోగించిన రంగు లేమిటని అడిగాడు ఒలోడ్యాని, ఒలోడ్యా చెప్పలేక పోయాడు.

క్రమ క్రమంగా అన్నీ గుర్తుకురావడం ప్రారంభించినై, ఇవాన్ నిగురించి చెప్పాడు ఒలోడ్యా...ముఖం అంతా కుంచించుకున్నాడు సొకొలొవస్కీ-. గొంతెండిపోయినట్లుంది, తుప్పుతిన్నట్లుగావుంది నోరంతా...'ఆ బెల్జియం వ్యవహారం వింటేనే తల నొప్పొస్తోంది...వెంటనే లేచెళ్ళి, వీరాని చూడాలి. ఒక్కో-సారి మనల్ని మనం మరిచిపోతాం...టైమెంతయ్యిందో యిప్పుడు. బాగా వెలుగ్గావుంది. అంటే ఆవిడ యింటిదగ్గర వుండదన్నమాట, జబ్బింకా

పోలేదనుకుంటూ నాకు, కళ్లు పీకుతున్నాయి, యీతల నాతల కానట్టుంది, తలని లేపాలన్నా లేపలేకపోతుంటే...'

బిగ్గరగా మూలిగాడు. బారిఖీనా వచ్చింది కాని అత నావిణ్ణి గమనించలేదు; మళ్లీ స్పృహతప్పి పడిపోయాడు.

మళ్ళీ అతను కళ్ళు తెరచేప్పటికి సాయంత్రమైంది, వీరా అతనిమీదికి వంగి యేదో చేస్తూంది. సొకొలొవస్కీ వంక చూస్తోంది వీరా; అప్పుడావిడ కళ్ళలో కన్పించిన భావాల్ని అత నంతవర కెప్పుడూ చూడలేదు. ఏదో మాట్లాడాలని నోరు తెరి చాడు, ఏమీమాట్లాడలేక పోయాడు, 'వీరా!' అని మాత్రం అన గలిగాడు.

"మీరిప్పుడు మాట్లాడగూడదు" అని ఆజ్ఞాపించింది వీరా.

అక్కడి నుంచవతలికి వెళ్ళి "ఆ యన నన్ను గుర్తించారు" అని చెప్పింది బారిఖీనాతో, వీరా.

అలాగే కళ్ళుమూసుకుని పండుకున్నాడు సొకొలొవస్కీ: 'నేను వీరాని చూచినమాట నిజమేనా? కలా? తెలుసుకోవాలి, చాలా అవసరం...ఆవిడ డాక్టరు, ఆ సంగతే మరచిపోయాన్నేను. జబ్బు పడ్డాననుకుంటూ...యేమీ అర్థం కావడంలేదే...యేమిటీ నా బుర్రిలా తగలడుతోంది? అంతా అయోమయంగావుంది...'

సొకొలొవస్కీ దగ్గరకొచ్చింది బారి ఖీనా:

"మళ్ళీ స్పృహ తప్పినట్టుందమ్మా... డాక్టర్! డాక్టర్ వీరా! యేమిటీ మీరలా వున్నా రేమిటీ?"

ఒకగ్లాసుడు మంచినీళ్ళు తెచ్చిచ్చింది డాక్టర్ వీరాకి, బారి ఖీనా? కాని త్వరగానే సంబాళించుకుంది వీరా? తమాయించుకుని,

"నేను ప్రొఫెసర్ లైకోవ్ కి ఫోన్ చేస్తాగాని, కేంఫర్ ఇంజక్షనివ్వగలవూ నువ్వు?" అనడిగింది బారిఖీనాని.

# 13

వ్యవసాయ క్షేత్రాల్లో పనిజేసే వాళ్ళింకా చాలామంది కావాలని, యెప్పుడో నవంబరులోనే చెప్పాడు సిబిర్ట్సేవ్. అనే టప్పుడతను కాస్త వెనకాముందూ ఆడాడు గూడాను: అందుకు తగినవాళ్ళని వెంటనే పంపాలని వ్యవసాయ క్షేత్రాలు కబురుమీద కబురు పంపుతున్నాయి. వాళ్లకి కావలసింది సదుంవంచి పనిజేసే వాళ్లు; గాలిరకంకాదు; కష్టపడిపనిచేసే వాళ్లని పంపేందు కేమో ఇవాన్ అంగీకరించడు. ఎలా పంపుతాడు మరి? రెండు ట్రాక్టర్ ఫాక్టరీలకి కావలసిన కన్వేయర్ బెల్టులూ, వ్యవసాయక్షేత్ర యంత్రాల కేంద్రానికి కావలసిన పనిముట్లూ తయారుచేస్తున్నాడు తన ఫాక్టరీలో, యిదీ వ్యవసాయ క్షేత్రాల కోసం చేసేపనేగా. 'ఎవరినీ బలవంతపెట్టగూడ దసలు, అందుకేనో యీ ఇవాన్ వొప్పుకోడాయె' అనుకున్నాడు సిబిర్ట్సేవ్.

మెషీన్ ట్రాక్టర్ స్టేషన్‌కెళ్ళేందుకు, లాపాకోవ్ వొప్పుకున్నాడు. "యేంవైనాసరే, అతనెళ్ళడానికి వీల్లేదు" అన్నాడు ఇవాన్. "ఐతే, యేంజెయ్యమంటావయ్యా బాబూ!" అని విసుక్కున్నాడు సిబిర్ట్సేవ్. కావాలంటే, ఫాక్టరీలోకి కొత్తగా వచ్చిన వాళ్లని వ్యవసాయ క్షేత్రాలకి పంపించమన్నాడు ఇవాన్. ('ఇంకా పూర్తిగా ఉత్పత్తి కార్యక్రమంలోకి దిగనివాళ్లూ, పనిచెయ్యబోతుంటే కాళ్లకీ చేతులకీ అడ్డంవచ్చేవాళ్లూ' వాళ్లు ఇవాన్ దృష్టిలో) కాస్త ఆలోచించి, "ఐనా, చీజోవ్‌తో మాట్లాడి చూడండి, అతనిదివరకు ట్రాక్టర్ డ్రైవర్‌గా పనిజేశాడు" అని చెప్పాడు ఇవాన్. ఒక సంవత్సరం క్రితం చీజోవ్ గూడా స్టెఖోనవైటే (యెక్కువ నైపుణ్యంతో, కోటాకంటే యెక్కువపని పూర్తిచేసిన మనిషి). కాని తర్వాత తాగుడికలవాటుపడ్డాడు (అతనితండ్రిగూడా

తాగుబోతే). అతన్ని వుద్యోగంలోనుంచి తీసేద్దామనే అనుకున్నాడు ఇవాన్, "ఇంకో ఛాన్సిచ్చాను, యికెప్పుడూ వొక్కబొట్టుకూడా ముట్టనని ఒట్టుపెట్టుకున్నాడు" అంటూ వాయిదావేస్తూ వచ్చాడు.

జనవరి నెలాఖరున, స్థానికపత్రిక ఒక ఫోటో ప్రచురించింది; వ్యవసాయ క్షేత్రాల్లో పనిజేసేందుకిష్టపడి, అవసరమైన కాగితాల మీద సంతకాలు పెడుతూన్నవారు నలుగురున్నారా ఫోటోలో: చీజోవ్, మరిముగ్గురు యువకులూ.

చీజోవ్‌తో కుండపగల గొట్టినట్టు మాట్లాడాడు సిబిర్జ్షేవ్: 'యిదిగో, చీజోవ్, వెళ్లాలనే నీకు నాసలహా, మరీ తాగుడు లోబడి కిందామీదా తెలియకుండా కొట్టుకుపోతున్నావ్ నువ్వు. ఎప్పట్నుంచో చెప్తున్నాడు ఇవాన్ నిన్ను డిస్మిస్ చేస్తానంటూ అతనలా అనడం కరెక్టగూడాను.'' చీజోవ్ కాస్సేపు గొణిగాడు, కాస్సేపాలోచించుకున్నాడు, మళ్లీకాస్సేపు గొణుక్కుని, ''యేం ఐతే మళ్లీ మావాళ్ళదగ్గిరికేవెళ్తా. వాళ్ళందరూ చాలా మంచివాళ్లు'' అన్నాడు.

బెల్కిన్‌గూడా, అప్పుడే, 'రెడ్ వే' సమిష్టిక్షేత్రాని కెళ్లాడు. యుద్ధమైంతర్వాత; లిథూనియాలో ఒక అడితీపని అప్పగించారతనికి. బాగా నమ్మకస్థుడు, బాగా బలంవున్నవాడు, యెవళ్లేది చెప్పినా, "తర్వాతేం జెబుతారా అని ఆశ్చర్యపోతున్నా" అనేవాడు; అని, చెప్పిన పనికాస్తా తు.చ.లు తప్పకుండా, చక్కగా చేసేసేవాడు. అతను మళ్లీ సమిష్టి క్షేత్రానికి వస్తున్నాడనివిని, ఏంటొనీనా పావ్‌లోవ్నా చాలా సంతోషించింది. పని జేసేందుకు కావలసినన్ని చేతుల్లేవే అని విచారిస్తుండే దావిడ. ఆ సమిష్టి క్షేత్రమంటే మాటలా-మరి;తొమ్మిదివేల హెక్టార్లభూమి(హెక్టారంటే షుమారు రెండున్నర యెకరాలన్నమాట), దగ్గర దగ్గర మూడువేలు పశువులు, ఒక పెద్ద కోళ్లదొడ్డి, పళ్లతోటలు, యింకొక పెద్ద తేనటీగల పెంపకం - అందర్నీ కలిపితే నూట అరనైముగ్గురు గూడా లేరు పనిచేసేందుకు. బెల్కిన్ వచ్చేప్పటికి ఆవిడ ఆశలు

మరింత యెక్కువయ్యాయి: ఇంకా కొంతమంది వచ్చే అవకాశం గూడా వుందన్న మాట.

తర్వాత నాలుగైదురోజులికి, "మా మేనల్లుడు శాషా మాస్కోనించి వుత్తరం రాశాడు, తనగ్గూడా యిక్కడికే రావాలనుందని. మరి..." అన్నాడు రేడియొనోవ్ వచ్చి, "రమ్మను" అంది పావ్లోవ్నా, "యిక్కడసలు మనుషులేరీ, అదే అసలు చిక్కు మనకి."

శాషా వచ్చాడు. ఒక చిన్న సహకారసంస్థలో గుమాస్తాగిరీ చేస్తూండే వాణ్ణనీ, ఆరోగ్యం చెడిపోయి డాక్టర్ దగ్గరకెళ్తే మంచి గాలి పీలవాలని చెప్పాడనీ అన్నాడు. అక్కడ అతనికి స్వంత గది అంటూ లేదట. పరిసరాలన్నీ త్రోలుకంపు కొడుతూండేవట. చివరికొక చాస్ట్నిక్ (రష్యాలో వ్యక్తిగత వ్యాపారం చేసుకునే వాళ్లు; వీరిసంఖ్య చాలస్వల్పం) గదిలో ఒకమూల అద్దెకి తీసుకోక తప్పలేదట. ఇంతెందుకు, ఒక్క మాటలో చెప్పాలంటే, ట్రాన్స్ఫర్ కావాలని కోరుకున్నాడు; వచ్చాడు.

లేత సొరకాయలు కొయ్యడమంటే మహాసరదా శాషాకి. అతనొచ్చింతర్వాత, మూడురోజులకల్లా, అందరికీ తెలిసిపోయింది: డ్రెస్డెన్లో అతని యుద్ధదళం వున్నచోట వొకమేక ఆరు పిల్లల్ని కన్నది అనీన్నీ, యెప్పుడూ తల్లివెంట పడి తిరిగేవి, కోడిపెట్టవెంట కోడిపిల్లలు తిరిగేట్టు, మాస్కోలో ఒక ఫోర్మన్ శాషాకొక బాతు గుడ్డిచ్చాడు, ఆగుడ్డు వందేళ్ళక్రింత నాటిది, మొట్టమొదట కాస్సేపు సందేహించాడుగాని, తర్వాత తినేశాడు; పుష్కిన్ సమాధిమీద శాషాపూలు పెడుతూండగా సినీమా తీశారు—మొదటిసారి బాగా లేదని మళ్లీ రెండోసారిగూడా తీశారు, తెరమీద చాలాబాగా కన్పించింది; ఒకసారి బస్సులో వెళ్తూంటే శాషాకి లైసెంకో (ప్రఖ్యాత సోవియట్ వృక్షశాస్త్రజ్ఞుడు) కన్పించాడు, కన్పించి యీ యేడు శీతాకాలం యేమంత పెద్దచలిగా లేదని అన్నాడు: యీ యేడు పంటలెలా వుంటాయని అడిగాడు శాషా ఆయన్ని,

సరిగ్గా చెప్పలేనుగాని మొత్తంమీద యిదివరకటిలా వుండదనిమాత్రం చెప్పాడు లైసెంకో, శాషాకి.

"ఆరోగ్యమేదో బాగాలేదంటాడు, వూరికే వసపిట్టలా వాగుతుంటాడు, యెలా యితగాడితో చచ్చేది!" అనుకున్నది, మొట్టమొదట్లో, పావ్‌లోవ్నా. కాని, చెప్పేకథలన్నీ పూర్తైపోయే ప్పటికి, చక్కగా పనిజెయ్యడం ప్రారంభించాడు శాషా. సమిష్టి క్షేత్రంలో ఒక బల్లబాగుచేశాడు, ఆవులదొడ్డి అంతా శుభ్రం చేశాడు; ఇదివరకు సైన్యంలో కాంపౌండర్‌గా పనిచేశాడనీ, వడ్రంగంగూడా బాగా తెలుసుననీ లారీ నడపడంగూడా చేత నౌననీ తెలిసింది తర్వాత్తర్వాత. "శాషా రావడం మంచిదేఐంది" అన్నది పావ్‌లోవ్నా, రేడియోనోవ్‌తో.

కాని, చీజోవ్ గూడా వస్తున్నాడని తెలిసేప్పటికి అగ్గిమీద గుగ్గిలమైపోయింది పావ్‌లోవ్నా; "ఈ వ్యవసాయ క్షేత్రాలకి, వున్నవాళ్ళల్లోకల్ల మెరికెల్లాంటి వాళ్ళని పంపుతున్నామనేమో పత్రికలు రాస్తాయి; వీళ్ళేమో చీజోవ్‌లాంటి వాళ్ళని పంపుతా రిక్కడికి. అట్లాంటి తాగుబోతుని నాజన్మంలో చూళ్ళేదు. కిందటేడు వేసంకాలంలో క్లబ్బుకి నిప్పెట్టినంతపని చేశాడు. అట్లాటాళ్ళొద్దు బాబూ మనకి" అన్నది.

చీజోవ్ వచ్చాడు; మనిషి చాలా విచారంగా వున్నాడు. కొడుకు వచ్చాడని సంతోషించాడు తండ్రి; రెండు బుడ్లు బయటికి తీశాడు; యిద్దరూ నోటి కప్పగించారు. ద్రవం పడేప్పటికి, చీజోవ్‌కి మాంచి హుషారొచ్చేసింది; ఇవాన్‌ని తిట్టడం ప్రారంభించాడు; "వాడిమూలానే ననుకుంటూ నాకీ తాగుడలవాటైంది, అబ్బ, యెంత వేధించుకుతింటాడని, వాడు డైరెక్టరూగాదు, యేమీగాదు, వొట్టి పప్పుదద్దమ్మ. వాణ్ణి కట్టుకున్న పెళ్ళావే వుమ్మేసింది వాడిమొఖం మీద." "అయ్యో నాయనా, ఆయనపెళ్లాం మన ఎలీనా యేరా బాబూ!" అన్నది పక్కన కూర్చున్న తల్లి. "ఆఁ, ఆఁ, అదే" అంటూ హుషారుగా తలూపాడు చీజోవ్: "చిన్నప్పుడు నేనిద్ద

రవ్వూ కలిసొచ్చుకునేవాళ్ళం. యాపిల్‌పళ్లు దొంగతనం జేశామని వొకసారి మాయిద్దర్నీ పట్టుకుని చితకదన్నాడు మావయ్య, వొక సారాళ్ళ నాన్న నాకొక చిన్న బొమ్మగూడా చేసిపెట్టాడు - పంది బొమ్మ, చిన్నతోకా అదీనీ! అచ్చంగా ఇవాన్‌కి మల్లేనే వుందది. సుఖంగా వుంటందిగదాఅని, డైరెక్టరు పెళ్లాం అనిపించుకోవొచ్చు గదా అని గబగబా పెళ్ళిచేసుకుంది ఎలీనా, అడిగిందే చాలని. చివరికి వాడితో కాపరంజెయ్యడంగూడా కష్టమైపోయి, యింటో నించి బైటికొచ్చేసింది. నిజంగానే, నేచూచింది చెబుతున్నానంటే.''

('అమ్మకి వుత్తరం వ్రాయాలి' అని చాలాసార్లనుకుంది ఎలీనా; మళ్ళీ వ్రాస్తే గాభరాపడి పోతుందేమోనని భయం; రేపు వ్రాద్దాం, యెల్లుండి వ్రాద్దాం అనుకుంటూ - చివరికి వ్రాయనే లేదు. ఈ మధ్యనే వొక వుత్తరం వ్రాసింది అంతా బాగానే వున్నారనీ, తనకెక్కడా తీరిక దొరకడంలేదనీ, షూరా డ్రాయింగులు బాగా వేస్తోందనీ, త్వరలోనే మళ్ళీ వుత్తరం వ్రాస్తానని చెప్పింది కాని, తన జీవితంలో వచ్చిన పెద్దపెద్ద మార్పుల్ని గురించి చెప్పనేలేదు ఆ వుత్తరంలో).

మర్నాడు ప్రొద్దున్నే లేచి పావ్‌లోవ్నా దగ్గరకెళ్ళింది చీజోవ్ తల్లి. వెళ్ళి, "మాఅబ్బాయొచ్చాడమ్మా"అని చెప్పింది నవ్వుతూ.

పావ్‌లోవ్నా అంటే చీజోవ్ తల్లికెప్పుడూ యిష్టమే లేదు: 'అందరిమీద అవ్వలు చేస్తుంది. జెనరల్‌కిమల్లే ఆర్డర్లిస్తూ తిరుగుతుంది. ఆ పాటి నాకు తెలవదా యేంటి? పోనీ, యిక్కడావిడ అధ్యక్షురాలే అనుకుందాం, ఐతేమాత్రం మా ఆయన తాగి తందనా లాడుతున్నాడని అడగడానికి పావ్‌లోవ్నా అడుగుతుందే; ఆ అధికారం యెవరిచ్చారీవిడకి? అదంతా నాకర్మ. యీవిడకెందుకూ అంట. అక్కడి కాడికి మొగుడు పెద్దఆరిందా యేమిటి, వెనానాకొస్తే నాకలేడా మనిషి! ఆవుల్నింకికి మల్లెయ్యడం చాతగాదన్న ఐనా నోరు మూసుక్కూర్చోదే.'

అలాగే నవ్వుతూ, ఎలీనా సంగతులేమైనా తెలిశాయా అని గూడా అడిగింది చీజోవ్ తల్లి పావ్‌లోవ్నాని. ఈమధ్యే వొక చిన్న వుత్తరం వచ్చిందని చెప్పింది పావ్‌లోవ్నా.

"ఐనా ఎలీనాకి తీరికన్నమాట లేదు, రెండు షిఫ్టులు పని చేస్తోంది, యెన్నికల వ్యవహారం గూడా అప్పగించారట".

"ఎలీనా విడాకులు తీసుకుంటోందని చెప్పాడు మాఅబ్బాయి-మొగుణ్ణొదిలిపెట్టేసిందంట, పాపం యెట్టావుందో అడుగుదావనొచ్చా. వొంటరిదా, దానికితోడు చిన్నపిల్లగూడా నాయె."

పావ్‌లోవ్నా మనసు నదుపులో పెట్టుకుంది: ఎలీనాని గురించి యేమీ మాట్లాడలేదు, చీజోవ్ యేం జెయ్యాదలచుకున్నాడని మాత్రం అడిగింది; "వూరికే చూచిపోదామని వచ్చాడా, యిక్కడే వుండి పనిజేస్తాడా ?"

భర్తతో గూడా యీ విషయమేమీ చెప్పలేదు పావ్‌లోవ్నా. ఆవాళ రాత్రల్లా నిద్రేపోలేదు, ఎలీనాని గురించే ఆలోచన. చీజోవ్ యెందుకూ పనికిరాని తాగుబోతే ఐనా, మరీ యింత అబద్ధం పుట్టించడు—భర్తంటే తనకి మొదటున్న సంతృప్తిలేదని చెప్పిన ఎలీనా మాటలు గుర్తుకొచ్చాయి పావ్‌లోవ్నాకి. 'నిజవేఁ అయ్యుండాలి, భర్తని వదిలేసింది, ఐనా తల్లినిగదా, నాకొకవుత్తరం వ్రాసి పడెయ్యకూడదూ'. కాస్సేపు కన్నీరు కార్చింది, వెళ్ళి కూతుర్ని చూడవలసిందేనని నిర్ణయించుకుంది. 'వెళ్ళి షూరాని వెంటబెట్టుకొస్తా. లేకుంటే ఎలీనాకి గడవడంకష్టం.'

♦ ♦ ♦

పావ్‌లోవ్నా డాక్టర్ వీరా యింటికి వెళ్ళేప్పటికి, ఎలీనా లైబ్రరీకెళ్ళి పోయింది, వీరా యెవరో రోగిని చూచేందుకు వెళ్ళింది గొరొఖొవ్‌దగ్గర పనిజేసే నాస్త్యా తెరచింది తలుపు "ఎలీనా వుండేదిక్కడేనా ?" అనడిగింది పావ్‌లోవ్నా బిగబట్టుకుని.

షూరా, అమ్మన్నుపి గుర్తించలేకపోయింది. పావ్‌లోవ్నా పిలిస్తే, వెళ్ళి నాస్త్యావెనక దాక్కుంది షూరా. కాస్సేపటికి యింటికొచ్చింది ఎలీనా.

"నీ తల్లిగదా, నాకు ఒక్క ముక్కంటే ఒక్కముక్క వ్రాసిపడెయ్యగూడదూ" అంది పావ్‌లోవ్నా, యేడ్చి పదేపదే.

తర్వాత, స్థిమితంగా, "షూరాని నాతోపాటు తీసుకెళ్తాను, కనీసం, నువ్వు నిలదొక్కుకునేదాకానైనా వుండనీ దాన్ని నా దగ్గర, మీ నాన్నగూడా సంతోషిస్తారు. ఇంకా అలాగే వున్నారనుకో చిన్నపిల్లల్తోనే ఆడుతూ, బొమ్మలు చేసిపెడుతుంటారు వూళ్ళో పిల్లలకందరికీ...సెలవుల్లో మనూసురా నువ్వుగూడా... అదికాదమ్మా, యెంతకాదన్నా నీ అమ్మనిగదా, వొక్క వుత్తరం రాయగూడదమ్మా నాకు! చీజోవ్ తల్లొచ్చి, యేదో మాట వరసలో, చెప్పేదాకా తెలియనే తెలియదాయె నాకు, వాళ్ళబ్బాయిగూడా వచ్చాడు, యిక్కడే వుంటాడు, వాళ్ళ నాన్న పెట్టేపాట్లు చాలవన్నట్లు — యెరుగుదువ్‌గా నువ్వు, నిన్నెప్పుడూ భయపెడుతూండేవాడు, పొట్టిదానివౌతావంటూ యేడిపించేవాడు. ఇప్పటికీ అదేవరస. వొకరోజు పనిజేస్తే, నెలరోజులు తాగుతూ కూర్చుంటాడు — ఇప్పుడిక కొడుకుగూడా వచ్చాడు. ఆఁ అదే, ఆయన భార్యవచ్చి "మీ ఎలీనా విడాకులు తీసుకుంటాందంట" అని చెప్పింది. గుడ్లనీరు గుడ్లల్లో కుక్కుకుని వూరుకున్నా ఆవిడ ముందు." అన్నది,

"నేం జేసింది తప్పంటావా?" అనడిగింది ఎలీనా.

"అవేం మాటలమ్మా. మీ అమ్మని గదా నాక్కూడా చెప్పలేదే అనే బాధేకాని...నువ్వు చేసింది తప్పో వొప్పో చెప్పడానికి నేనెవర్ని?...యెవళ్ళ కాళ్ళమీద వాళ్లు, అందులోనూ ఇంకో చిన్నపిల్లుంటే, నిలబట్టం కష్టంవమ్మా...యెప్పుడన్నా వచ్చి, చూసెళ్తుంటాడా వాళ్ళ నాన్న?"

"ప్రతి ఆదివారమూ, షూరానితీసికెళ్ళి తనకి చూపిస్తుతూ వుండాలని షరతు పెట్టారాయన. మొదటి ఆదివారంనాడు నేనే తీసుకెళ్ళాను. రెండో ఆదివారంనాడు తనకితీరిక లేదని ఆయనే కబురంపారు. మొన్న మళ్ళీ మళ్ళీ నేను ఫోన్‌చేశాను యెప్పుడు తీసుకు రమ్మంటారో అనుగుదామని, ఇప్పుడు పని బాగా వొత్తిడిగా వుందనీ చాకొలెట్లు పంపుతాననీ చెప్పారు – ఇగ్రోవ్‌తో కలిసి చేపలు పట్టడాని కెళ్తుంటారు బహుశః. షూరా అంటే ఆయనకి పంచ ప్రాణాలూ ననుకున్నా నేను, అలా అనుకునే మొట్టమొదట ఒక నిర్ణయానికి వచ్చేందుకు గూడా చాలా రోజులు తటపటాయించాను".

"నువ్వనుకున్నావూ!" అన్నది అయిష్టంగా పావ్‌లోవ్నా, "లక్ష సంగతులనుకున్నావు నువ్వు. చాలా గొప్ప పనివాడని మాత్రం అనుకోలా? ఇతరుల్ని బాగా అర్థంచేసుకుంటాడనీ, అతని కొక గొప్ప ఆత్మ వుందనీ గూడా అనుకున్నావుగా? అబ్బబ్బ ఎంత చెప్పేదానివి అతన్ని గురించి: ఇప్పటికీ జ్ఞాపకం వుంది నాకు."

ఎలీనా కళ్ళలో నీళ్ళు తిరిగాయి గిర్రున; పావ్‌లోవ్నా బాధ పడింది కూతుర్ని చూచి:

"అదేమీ మనసులో పెట్టుకోవద్దమ్మా...మర్చిపో, యేమీ లేదు, అతన్ని అర్థంచేసుకోవడంలో పొరపాటు పడ్డావు; అంతే. నువ్వే నన్నమాటేమిటి బాగా యెరిగిన పెద్దవాళ్ళే పొరపాటు పడుతూంటారు అట్లాంటి విషయాల్లో; నేను నిన్ను మందలించాలని గాదు ఆమాటలంది. ఒక్కటిమట్టుకు నిజం: అతను మంచివాడు కాదు; మొదట్నించీ అనుకుంటూనేవున్నా నేను. మీ రహస్యాలు నాకు తెలియవనుకో,—వాటి సంగతికాదు నేనిప్పుడు మాట్లాడేది... పెళ్ళైంతర్వాత మీ యింటికొచ్చినప్పుడే చూశానతన్ని జాగ్రత్తగా... తోటిమనుషులంటే దయాదాక్షిణ్యాలు బొత్తిగా లేవు వాళ్ళసంగతి అర్థంచేసుకోవాలని ప్రయత్నంగూడా చెయ్యడు. నాకింకా బాగా జ్ఞాపకం: ఫాక్టరీ స్టోర్స్‌లో వస్తువులేమీ లేవేమని

అడిగాను అప్పుడతన్ని. ఏమైనాకావాలంటే ఫాక్టరీవాళ్ళంతా పట్టణాని కెళ్ళాలిసి వచ్చేది. రానూపోనూ మూడుగంటలు. కావాలంటే యెంతో కొంత తను చెయ్యగలడని అందరికీ తెలుసు, ఫాక్టరీ నడపడవే సరిపోతాం దిరనై నాలుగ్గంటలూ అన్నాడతను. ఇంకేం జెప్తా! తర్వాసిక మెషీన్లగురించి గొప్పలు చెప్పడం మొదలుపెట్టాడు. స్టోర్స్ గురించి అబద్ధాలుగూడా ఆడాడు; కావలసినవన్నీ సరిపడా వున్నాయన్నాడు, పంచదారగూడా వుందని బొంకాడు. ఇంకోకసారి, నే నక్కడుండగానే ఫాక్టరీ మనిషొకత నొచ్చాడు, తన భార్య గర్భిణీ మనిషనీ, ఆస్పత్రి కెళ్ళే లారీమీద ఆవిణ్ణి పంపడానికి వీలౌతుందేమో తెలుసుకోడాని కొచ్చాననీచెప్పాడా మనిషి; "ఇక్కడ లారీలున్నదందుకే ననుకున్నావా ?" అన్నాడు మీ 'ఆయన ?' "ఆ గర్భిణీ స్త్రీ అంటే జాలన్నా కలగలేదా మీకు ?" అనడిగాను తర్వాత—ఈయన నవ్వాడమ్మా, నవ్వి, 'యేం ఫర్వాలేదు. యే ఐదురూబుల్లో డ్రైవర్ చేతిలోపెట్టి, వాళ్ళపని వాళ్ళేలాగూ పూర్తి చేసుకుంటారు, మధ్య నేనెందుకూ విచారించడం !" అన్నాడు. ఇలాంటివాళ్ళేనమ్మా మనుష్ని వేధించుకుతినేది— నువ్వేన్నైనాచెప్పు, వాళ్ళకేమీ లక్ష్యంవుండదు... చీజోవ్ తల్లి చెప్పేనప్పుడు, ఆ రాత్రల్లా కంటిమీద కునుగ్గూడా లేదు నాకు - యేమీ సంబంధంలేని యింకోమనిషిద్వారా వినాల్సొచ్చిందిగదా యీ వార్త అని బాధపడ్డాన్నేను - ఐనా సంతోషించాను నువ్వుచేసిన పనికి - అలాంటి కొయ్యబొమ్మతో కాపురం యెవరు చేస్తారు."

"ఐతే, అతనంటే యిదివరకటంత యిష్టంలేదని నేనంటే కోప్పడ్డావెందుకు ?"

'నువ్వేంచేసుకున్నావో తెలియలేదప్పుడు. ఒక కూతురు పుట్టింది - ఫర్వాలేదింక కలిసిపోతార్లే అనుకున్నాను. తల్లి కెంతెంత బాధ్యతలుంటాయో తెలీయదమ్మా నీకు, పూరా పెద్దదైంతర్వాత నీకే తెలిసొస్తుంది; ఒక్కొక్కసారి సలహాలుగూడా యివ్వడానికి

సాహసించలేవు...అదంతా పోనివ్వమ్మా – అట్లాంటి సలహావేవీ లేకుండానే పెరిగి పెద్దదానవయ్యావు నువ్వు...యింతకీ అసలు నువ్వు నీ కన్న తల్లిగ్గూడా చెప్పకుండా యెందుకుదాచావో యిప్పటికీ అర్థంకావడంలేదు నాకు."

'హేమ్లెట్' నాటకం దగ్గర డిమిట్రీని కలుసుకుని పదిహేను రోజులై పోయింది; ఐనా యింకా అతనితో జరిగిన సంభాషణని గురించే ఆలోచిస్తూంది ఎలీనా. 'ఎందుకూ నేనంటే అతనికంత జాలి? అతని హృదయం చాలా మంచిది. కాబట్టే మరీ కష్టంగా వుంది నాకు. షూరాయే లేకపోతే, నేనిలా వూరుకో గలిగేదాన్ని కాదు. ఇలా అయ్యేందుకు వీలుందని కలలోగూడా అనుకోలేదు నేను. కాలేజ్‌లో చదువుకునేప్పుడు, అక్కడున్న ఆడపిల్లలు 'ప్రేమించాం' అంటూండే వాళ్ళు; ఆ ప్రేమించిన వాళ్ళతో కలిసి సినీమాల కెళ్ళేవారు, ఆ మాటలు చెప్పుకుంటూ పొట్టలు చెక్కలయ్యేట్టు నవ్వుకునేవారు అందరూ కలిసి. నేనూ, అలాగే, ఇవాన్‌ని ప్రేమించాననుకున్నా. మరీ కుర్రతనం...యిదొక గాయంలా వుంది, యిరవై నాలుగ్గంటలూ అదక్కడ వున్నట్టుగానే వుంటుంది నాకు, మానదు, యిప్పుడు మరీ బాధగావుంది ... డాక్టర్ వీరా చాలా గొప్పమనిషి, చాలా సాయంజేసింది నాకు నిజంగానే. నా జబ్బు పోగొట్టలేకపోయినా, ఐనా యీ జబ్బుకి మందేం వుంటుంది గనక, నన్ను చూచుకుని నేనే సిగ్గుపడడం మానేశాను కనీసం; అందులో సిగ్గుపడవలసిందేవీ లేదని చూచేట్టు చేసింది నన్ను, సిగ్గుపడడం వెందుకు ? యేవీలేదు ... ?'

తన ఆలోచనలన్నీ తల్లికి తెలిసిపోతాయేమోనని భయపడింది ఎలీనా. 'ఎలా తెలుస్తాయి ? అతను లేనిదే బ్రదకలేనని నా ముఖంమీద యేవన్నా వ్రాసుంటుందా చదువుకోడానికి ?...' అని ధైర్యం చెప్పుకుంది తనకు తానే, 'నేను చెప్తే తెలుస్తుంది అమ్మకి; ఐనా అలాంటివి తెలుసుకోవలసిన అవసరం అమ్మకి లేనే లేదు ... ఐనా యిప్పుడు షూరాగూడా లేకుండా బ్రదకడం కష్టవే.

నిద్ర లేచేప్పటికి ఆ పెద్ద వుయ్యాలమంచంలో, గుప్పెట్లు బిగించుతూ, దొంగనవ్వు నవ్వుతూ, "చూశావే అమ్మా నువ్వు నిద్రపోవడంలేదులే" అంటుంది ప్రతిరోజూ. నిద్ర లేచేప్పటికి షూరా కన్పించకపోతే, యింకేమైనా వుందా?

కూతురుతో చాలాసేపు మాట్లాడింది పావ్‌లోవ్నా; యిద్దరూ కలిసి ఎలీనా బాల్యాన్ని గురించి మాట్లాడుకున్నారు. తర్వాత, "యిక రేపు యింటికెళ్ళిపోతానమ్మా" అన్నది తల్లి కూతురితో:

"షూరానిగూడా తీసుకెళ్తాను."

"యేమోనమ్మా, అది లేకపోతే వుండలేననుకుంటానమ్మా" అంది ఎలీనా.

తల్లి కూతురువంక చూచి, వూరుకుంది యింకేమీ మాట్లాడకుండా.

ఇద్దరూ కలిసి, ఎలీనా తండ్రినిగురించి మాట్లాడుకున్నారు. పావ్‌లోవ్నా చిరునవ్వు నవ్వింది:

"మొన్నీమధ్యే ఖడ్గమృగం బొమ్మ వేశారు మీ నాన్న, పోలికలన్నీ చక్కగా కుదిరినై, అచ్చంగా పుస్తకంలో బొమ్మల్లే... ఎలీనా! మమ్మగదూ, షూరాని పంపించమ్మా, మళ్లీ నీకు సెలవులు రాగానే పంపిస్తాగా. మీ నాన్నగూడా సంతోషిస్తారు, యీ మధ్య ఆయన కస లేవీ తోచడంలేదుగూడాను. "షూరా గూడా లేదాయె" అంటున్నారీ మధ్య మరీ అదేపనిగా."

"సరేలేమ్మా, తీసుకెళ్లు" అని అంగీకరించింది ఎలీనా విచారంగానే, "యింకో నెల్లో వచ్చేస్తాను షూరాకోసం. ఐనా అంత తొందరేవిటమ్మా వెళ్లడానికి? ఇంకొక రోజుండి వెళ్లగూడదూ?"

"ఏలుండదమ్మా, రుతువుగూడా వచ్చేస్తాందా, బోలెడంత పనుంటుంది. నాట్లేస్తాననుకో, అంతవరకేవీ భయంలేదు నాకు; కూరగాయలగొడవే మరీ యిదిగా వుంది – సరిపడ్డంతమంది మనుషులా లేరు, అదృష్టవంతులం, బెల్కిన్ వచ్చాడు, సగం భారం

తగ్గినట్టుంది; కేడియొనోవ్ మేనల్లుడుగూడా వస్తానని చెప్పివచ్చాడు, మహా చెడ్డ వాగుడుపిట్ట ఐనా పర్వాలేదులే పని బాగానే చేస్తాడు. యెందుకూ పనికిరాని నాసిరకం ఆ చీజోవ్ వొక్కడే. ఇవాన్ మాకు పంపిన బహుమతే ఆ చీజోవ్. ఇవానంటే మరీ నాకంత వెగటెందుకో చెప్పనా? నే నిప్పుడతనిదగ్గిరి కెళ్లి, 'యెందుకయ్యాత ఆ చీజోవ్‌ని మాకు పంపావ్?' అనడుగు తాననుకో; యెందు కడిగారో అనిగూడా ఆలోచించకుండా, 'చీజోవ్ చాలా గొప్పపనివాడు' అని చెప్పేస్తాడు. కోళ్లగుడిసెని చూపించినా సరే; పర్వాలేదదియిల్లే, అందులోనూ మనుషులు కాపరం చెయ్యొచ్చునంటాడు. ఏదైనా వొక రోడ్డు చూపించి, 'బాగా లేదు అంతా గుంటలు గుంటలు పడింది' అంటే; 'అదేనా మెయిన్రోడ్డూ' అంటాడు. అతనంటే విసుగెత్తిపోయిందనుకో అందరికీనీ! దాషాకాగ్నైనుగునువ్‌గా నువ్వు? రేగిప స్లేరిపెట్టేవాడు వాళ్ల మీషా నీకు - గుర్తుందా? యుద్ధంలో చనిపోయాడతను. దాషా వుందే, మంచి తెలివితేటలున్న మనిషి, తరచు ఆవిడ సలహాలు తీసుకుంటూవుంటా న్నేను. సరేనా, ప్లీనరీ సెషన్ రిపోర్టు (1953 సెప్టెంబరు 26న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ చేసిన తీర్మానం) పత్రికల్లో పడగానే, నాదగ్గిరి కొచ్చిందావిడ; వచ్చి, 'దేశంలో పశుసంపద తగినంత లేదనివుంది రిపోర్టులో. అంటే, తొందరలోనే కావలసినన్ని పశువులొచ్చిపడతాయి; చూస్తూండు. ప్రజల్ని నమ్ముతున్నారమ్మా వాళ్లు - అదీ అసలు సంగతి' అన్నది. మన వూరొస్తే, నువ్వే కళ్లారా చూద్దూగానమ్మా, ప్రతీ మనిషీ యిదివరకటికంటే చాలా మెరుగు..."

మర్నాడుదయమే, తల్లినీ, షూరానీ వెంటబెట్టుకుని స్టేషన్ కెళ్లింది ఎలీనా. టాక్సీ యెక్కగానే నిద్రపోయింది షూరా. ఎలీనా ఆలోచిస్తూ కూర్చుంది. "యేమిటమ్మా, యింకా యేదో దాస్తూనే వున్నట్టున్నావ్" అనడిగింది పావ్‌లోవ్నా అకస్మాత్తుగా.

ఎలీనా బిత్తరపోయింది. నిజంగానే, అంతా తన ముఖంమీద వ్రాసుందా? 'చెప్పేసెయ్యనా అమ్మకి? – వొద్దొద్దు, చెప్పగూడదు, ఆవిడ అర్థంచేసుకోలేదు. ఆవిడ తరహా వేరు. ఐనా, అసలు నే చెప్పగలిగితే, సిగ్గుతో చచ్చిపోనూ.'

"నే నేమీ దాయడంలేదమ్మా. నువ్వెళ్ళిపోతున్నావే అని విచారంగా వుంది; అంతే."

అంతటితో వదిలిపెట్టింది వాళ్ళమ్మ; అమ్మ సందేహం తీరే వుంటుందని ఆశించింది ఎలీనా. కాని, చివరికి, వెళ్ళిపొయ్యేప్పుడు, "యీసారిగూడా అందరికీ తెలిసింతర్వాతేగాని తెలియదన్నమాట మీ అమ్మకి. ఐనా ఫర్వాలేదమ్మా, నువ్వు సుఖంగావుంటే అంతే చాలు నాకు; నువ్వు చిన్నదానివీ, చితకదానివీ కాదు, నీ విషయాలు ఆలోచించుకోగల స్తోమతుంది నీకు, యింకా వాళ్ళ సలహాలూ, వీళ్ళ సలహాలూ అవసరంలేదు నీకు" అని అన్నది కూతురి చెవిలో పావ్‌లోవ్నా.

# 14

ఆవేళ సాయంత్రం, ఇవాన్ చాలా హుషారుగా వున్నాడు; అతనంటే అతనికే అమిత విశ్వాసంగూడా కుదిరింది. జీవితాంతం వరకూ మరచిపోగూడదని సాయంత్ర మది. సొకొలొవస్కీ వొంట్లో బాగుండలేదు కాబట్టి అనుకున్న సమయానికి జరగదేమోనని భయపడ్డాడు ఎగొరోవ్; యిబ్బందుల్ని గురించే యెప్పుడూ ఆలోచించే దిమిత్రీగూడా, మే మొదటి తేదీనాటికి కొత్తమోడల్ రెడీ ఔతుందని అంగీకరించాడు. ఆ వాళే దాన్ని నలుగురి ముందూ పెట్టారు. దేశం మొత్తంమీదే ప్రముఖమైన విషయ మది; పత్రికల్లో అచ్చువేస్తారు, బహుశా రేడియోలోగూడా చెబితే చెప్పొచ్చు.

ఇంటిదగ్గరే భోంచేశాడు ఇవానా వేళ మనస్ఫూర్తిగా. కడుపునిండా, తిన్నాడు రొట్టెముక్కలమీద వెన్న బాగా మందంగా పూసి, మళ్ళీ వాటిమీద కోడిగుడ్లు పెట్టుకుమరీ. గ్రూషా చాలా బాగా చేస్తుంది వంట ... సంతృప్తిగా నవ్వుకున్నాడు ఇవాన్. ఫాక్టరీ వుద్యోగంలో తాను ప్రవేశించిన సంవత్సరం గుర్తుకు తెచ్చుకున్నాడు. ఆ నాడు పనిచేసే మెషీన్లకీ, యీనాడు తయారయ్యే కన్వేయర్ బెల్టులకీ — హస్తిమశకాంతరం! ప్రతి కొత్తమోడెలూ, తన జీవితంలోనే ఒక నూతనాధ్యాయమని అనిపించిం దతనికి; 'రోజు రోజుకీ వృద్ధిపొందుతున్నాం, అందులో సందేహ మేమీలేదు, చూస్తే చాలు కడుపు నిండిపోతుంది. ఈ సాయంత్రం సెలవుతీసుకుంటే బాగుంటుందనిపించిం దతనికి. టేబుల్ మీదున్న 'ఒగొనియోక్' (కథల పత్రిక) తీసుకుని ఒక చిన్న కథ చదువుకున్నాడు. ఆ కథలో వొక స్టోర్ మేనేజరుంటాడు, కాలేజిలో చదువుకునే వొకమ్మాయిని పెళ్ళిచేసుకోవా లనుకుంటాడతను, కాని చివరికా వివాహం జరగదు; తర్వాతిద్దరి

మనసులూ మారిపోవడంవల్ల, వీళ్ళలాంటి విషయాలు వ్రాస్తా రెందుకూ? అనుకున్నాడు ఇవాన్, 'ఛ, కథేమీ, బాగా లేదు. ఆ మానేజ రెలా పని చేసేవాడో చెబితే బాగుండేది; బహుశా వొట్టి పనికిమాలినవా డయ్యుంటాడు - యెప్పుడూ వొక్క వస్తు వన్నమాటగూడా స్టోర్‌లో లేకుండా......ఆ కథప్రకారమైతే మా స్టోర్ మానేజర్, బోరిస్సెర్గోగూడా యెవళ్ళనో వొకళ్ళని ప్రేమిస్తూండి వుండాలి; పట్టణంలో అప్పుడే మంచిమంచి చేప లమ్ముతున్నారని చెప్పాడు ఖిత్రోవ్, యిక్కడ వీలుతప్పితే యింకేమీ దొరకవాయె...నేను మళ్ళీ పెళ్ళిజేసుకోవడమే మంచి దనుకుంటా - ఫాక్టరీ డైరెక్టర్‌కీ, ప్రేమ వ్యవహారాలకీ లంకె అందదు.' ఆ చిత్రకారుడు, ఒలోడ్యాలాగా పూలగుత్తులివ్వడం, హుషారుచెయ్యడం గుర్తుకొచ్చి, నవ్వుకున్నాడు. 'వ్యవహారం అంతా తాపీగా చూసుకుందాం' అనుకున్నాడు చిరునవ్వుతో, 'గుణంగలఆడది కావాలంటే, కురూపిని వెదకమంటారు, కాని అదంతా వొట్టి నాన్సెన్స్. ఖిత్రోవ్ భార్యగూడా చాలా గొప్పగా వుండుంటుంది పడుచుదనంలో, ఎలీనాఅంటే మరీ బాధ్యత తెలీని మనిషి, పిల్లలకేం పాఠాలుచెబుతుందో, యెలా చెప్తుందో అర్థం కాదు. కొంతకాలం నన్నే తికమకలుపెట్టింది. సరుకులేనివాణ్ణి కాదు కాబట్టి తమాయించుకున్నాను సమయం వచ్చేప్పటికి."

పదీ యాభై ఐంది. రేడియో తిప్పాడు ఇవాన్. ఒక చెవటు అప్పగించి విన్నాడు. జెకోస్లవేకియాలో కార్మికులు, కొత్త సోష లిస్టు పథకాన్ని పూర్తిచేసేందుకు నడుంగట్టారు, బొలీవియాలో విలువైన ఖనిజాల వుత్పత్తి పడిపోయింది, విదేశాలన్నిటితోనూ వర్తక వ్యాపారాలు జరుపుకోడానికి ఈజిప్ట్ పత్రికలన్నీ సుముఖంగా వున్నాయి. తర్వాత వాతావరణాన్ని గురించి చెప్పింది రేడియో. సాధారణంగా శనివారంనాడు వినేవాడు ఇవాన్ వాతావరణం రిపోర్ట్. అతని కా రిపోర్ట్సంటే నమ్మకం వుండిగాదు ఆ వినడం, విన గానే, "చూశావా! వాతావరణం చాలా బాగా వుంటుందట,

వాళ్లు చెప్పేదదీ; అంటే మనం తడిసి పందుం ఔతాఁవన్నమాట! అనేవాడు ఖిట్రోవ్‌శో. ఇవ్వాళ సోమవారం. అ చేత వాతావరణాన్ని గురించి అంతపెద్దగా పట్టించుకోలేదు ఇవాన్. 'ఇంకో యిరవై నాలుగ్గంటలవరకూ వాతావరణం చాలా ప్రశాంతంగా వుంటుంది, మంచు సాధారణంగా పడుతుంది, గాలి తుఫాను వస్తుంది; ఓల్గా జిల్లాల్లో మధ్యజిల్లాలకీ, క్రింది ప్రాంతాలకీ యీవాతావరణం వర్తిస్తుంది.' – 'మళ్లీ అబద్ధాలు మొదలు. చలిగానే వుంది, అందులో సందేహమేమీలేదు, ఐనా ఫాక్టరీనుంచి వచ్చేప్పుడు చూశాగా, పెద్ద గాలేమీలేందే.' తర్వాత కొన్ని సోవియట్ పాటలొచ్చాయి రేడియోలో, విన్నాడు; అందులోనూ—

పిరికికండ, బెదురుగుండె పేరెరుగం మేం
నిర్భయముగ నిర్భీతిగ ముందడుగేస్తాం *

అన్న పాట బాగా నచ్చింది, రేడియోంతోపాటు కూనిరాగం గూడా తీశాడు ఇవాన్. తర్వాత, బిగ్గరగా ఆవులించాడు, కోటు తీసి కుర్చీమీద వేశాడు, నెమ్మదిగా బూట్లు విప్పుకోవడం ప్రారంభించాడు.

ఇంకో గంటకి తెల్లవారుతుందనగా, గాలి బాగా వెయ్యడం మొదలెట్టింది, మామూలు గాలికంటే బాగా తీవ్రంగా వుంది. ఇవాన్ యింటిముందున్న భూర్జవృక్షం ఆ గాలి విసురుకు తట్టుకోలేక, విరిగి పడింది కాపలామనిషి యింటిమీద. వులిక్కిపడి లేచాడు ఇవాన్ మంచంమీదినుంచి; నిద్రమత్తులో వున్నాడేమో ఆ 'ఫెళ ఫెళ' శబ్దం యేమిటో తెలియలేదతనికి; యెవరో తన యింటి తలుపు పగులగొడ్తున్నారనిపించింది. గబ గబా డ్రెస్ చేసుకుని బజారులోకి పరుగెత్తాడు. అంతా చల్లగా యుగంలావుంది. ఫాక్టరీకెళ్దామని బయల్దేరాడు, యెదురుగాలి నడవనీలేదు, వెనక్కి తోసేసింది. హాస్పిటల్‌దగ్గర ఎగొరోవ్ కన్పించాడు, నెత్తిమీద టోపీ

* రాంభట్ల కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతతో — అనువాదకుడు.

లేను, మాషి గాభరా గాభరాగా వున్నాడు, యేదో కేక లేస్తున్నాడుగాని ఇవాన్‌కి వినిపించ లేదు. ఎట్లాఐతేనేం, ఇవాన్ చెవుల్లో గూడ పడ్డాయా కేకలు; కార్మికుల గృహాల్లో కొన్ని కూలిపోయాయి. ఉన్నకొద్దీ గాలివిసురెక్కువైంది; తుఫానులా విజృంభించింది. గుడ్డిగా, కోపంగా, యెనురులేని వుధృతంతో విజృంభించింది; చెట్లువిరిగి పడిపోయినై, దీపస్తంభాలకి స్తంభాలువూడి అవతల పడ్డై, కప్పులకి కప్పులే యెగిరిపోయినై — మనుషులికి మనుషుల్నే తిప్పితిప్పి గింగిరాల్ కొట్టించిందా తుఫాను, వాళ్ళంతా మనుషులే కాదన్నట్టు, యేవో చిన్న చిన్న కొయ్యముక్కలే నన్నట్టు, యెండి గడ్డికట్టుకుని వాడెక్కున మంచుగడ్డల్ని చేత్తోతీసి విసిరినట్టు విసిరింది ముఖాల మీదికీ, కళ్ళమీదికీ, హేకిలిచేస్తూ వేసే యీ లల్లా ధ్వని చేసుకుంటూనూ, బుయ్‌మంటూనూ.

“చాలా పెద్ద తుఫాను...అలాంటి తుఫాను చూచేయెరగం” అన్నారు జనం, తర్వాత. ఎర్షోవ్ తాతమాత్రం అందు కంగీకరించ లేదు; యింతకంటె ఛండాలపు తుఫాన్ని 1908 — తన పెళ్లి జరిగిన యేట — చూశానని చెప్పాడు. తుఫాను వీచిన ఆ భయంకరమైన రాత్రిని తలచుకుని, మూఢంగా తనలోకి తానే ముడుచుకు పోయ్యాడు. ఆ తుఫాను, నిష్పక్షపాతంగా, చాలా జిల్లాల్లో వీచిందనీ, ప్రతి జిల్లాలోనూ యెంతో కొంత నష్టం జరిగిందనీ, అందులో దైవాంశ యేమీ లేదనీ నమ్మడమే కష్టమైపోయింది ఇవాన్‌కి — అదీ గాక అంతకుపూర్వం రేడియో ప్రసారం చేసిన 'వాతావరణ వార్తల్లో గూడా వుంది తుఫాను వచ్చే సూచన. నీచుల్తోనూ, అసూయాపరుల్తోనూ కలిసి జట్టుగట్టి తనమీదికి దాడిచేసిందీ తుఫాను; యెలాగైనాసరే తనగూడా ఆ యింటిముందున్న భూర్జ వృక్షాన్ని పడగొట్టినట్లుగానే పడదొయ్యాలనీ, కూకటివేళ్ళతో పెల్లగించి వెయ్యాలనీ — అనిపించింది ఇవాన్‌కి.

ఇంట్లోంచి బయటికి రాగానే అనుకున్నాడతను — ఇదేదో కొంపముంచేందుకే వచ్చిందని. యంత్రాలన్నీ కూర్చేందుకని వేసే

సెడ్ గ్రీమ్‌ని, కలుసుకొని గడగడ వణికిపోయాడు. ఎగొరోవ్‌ని చూడగానే అనుకున్నాడు: 'యిక నేరమంతా నామీదికే తోస్తాడు. “మూడు కొత్త బ్లాకులూ వేసి” అనీ, “యింతవరకూ కట్టలేదెందుకనీ?” అనీ నన్నే అడుగుతాడు. ఇక ఇవానే అన్నీ భరించాలి.'

ఆ వాళ్ళంతా యెముకలు విరిగేట్టు పని జేశాడు. 'బి' ప్రాంతం గుడిసెల్లో వుండే తొమ్మిదికుటుంబాలకీ, వొంటరిగావుండే యిద్దరు బ్రహ్మచారులకీ కొత్తయిళ్లు చూపించాలి వుండేందుకు. పట్టణకమిటీ కార్యదర్శి, ఉషాకోవ్ నెళ్ళి కలుసుకున్నాడు ఇవాన్; ఖాళీవున్న యిళ్ళల్లో ప్రవేశించేందుకు 'చీటీముక్కలు' యిమ్మని అడిగాడు.

“ఆవిషయం యింతవరకూ యెందుకని ఆలోచించలేదు” అంటూ కేకలేశాడు ఉషాకోవ్. తనని తాను సమర్థించుకోవాలనే ప్రయత్నమేమీ చెయ్యలేదు ఇవాన్: “కొంతమందిని తీసికెళ్ళి, యంత్రాలు కూర్చేందుకని వేసిన షెడ్‌లో పెట్టాం; యిప్పుడు మీరాదుకోకపోతే చాలాకష్టం” అని చెప్పాడు. ఆరు చిన్నచిన్న యిళ్ళమీద కప్పు లేచిపోయాయి తుఫానుమూలాన. ఫర్నిచరూ, ట్రంకులూ, మూటలూ లారీలనిండా యెక్కించారు. ఒకావిడ బిగ్గరగా వెక్కెక్కి యేడుస్తోంది. “నీ గుండె చల్లబడిందా?” అన్నాడు సెమియోనోవ్ అనే మెషీన్‌బిల్డర్, ఇవాన్‌వంకచూచి; విననట్లూరుకున్నాడు ఇవాన్. వినోగ్రడోవ్ ఫోర్మన్ కుటుంబాన్నంతా – అతని భార్యా, పిల్లలూ, అత్తా – తనింటికీ తీసుకెళ్లాడు ఇవాన్. పట్టణ ఎగ్జిక్యూటివ్ అధ్యక్షుడిదగ్గర కెళ్ళి “మూడుటన్నులు యినప చువ్వలు పంపండి, యిళ్ళకప్పులు బాగుజేస్తాం” అని చెప్పివచ్చాడు. అక్కడికీ, యిక్కడికీ టెలిఫోన్ చేసి, యిళ్ళకప్పులికి కావలసిన రాతి పలకలు సంపాయించాడు, ఆడవాళ్ళ నోదార్చాడు. చెయ్యగలిగిందంతా చేశాడు.

కాని. అధ్యక్షుడితో మాట్లాడుతున్నా. వినోగ్రడోవ్ అత్తకు ధైర్యంచెబుతున్నా, హాస్టళ్లోకి కొన్ని కార్మిక కుటుంబాల్ని పంపితే

యెలావుంటుందని శిబిర్ జైవ్‌తో మాట్లాడుతున్నా గూడా, ఒక్క సంగతిమాత్రం యెప్పుడూ ఇవాన్ బుర్రలో సుత్తిదెబ్బలు కొడుతూనేవుంది: 'యిక నా పనై పోయినట్టే; యికెందుకూ కొరగాను. యెంతమందియిళ్ళు కూలిపోయినయ్యనీ, యెంతమంది కెంత నష్టంకలిగిందనీ, యెంత కొయ్యసామానూ యినుపసామానూ కావాలనీ లెక్కలేస్తున్నారు అందరూ; అంతేగాని నా గొడవ పట్టించుకునే వాళ్లెవళ్లూ కన్పించడంలేదు. నేను ఇవాన్ జుర్నాల్లియోవ్‌ని, నేనూ యిందులో భాగాన్నే. నేనూ నికార్సైన సోవియట్ పౌరుణ్ణే, నా జీవితం అంతా ప్రభుత్వసేవకే వినియోగించాను, అర్పణచేసాను, నే నివ్వాళ ముక్కచెక్కలై పోయాను; యీ తుఫానొచ్చి ముక్కచెక్కలు చేసేసింది నన్ను, ఐనా ఒక్కళ్లూ నా గొడవ పట్టించుకోవడంలేదు.

యేం జరుగుతుందో ననే బాధతో ఆరురోజులు వేచి చూచాడు ఏడోనాడు పట్టణ కమిటీ కార్యదర్శి ఆఫీసునుంచి ఫోన్ వచ్చింది: కేంద్రకమిటీ మీకు కబురుపంపింది; మీరే వ్యక్తిగతంగా వచ్చి రిపోర్టివ్వాలి. యేదో పెద్ద ప్రమాదం జరుగుతుందని అనుకుంటూనే వున్నాడు ఇవాన్, ఐనా యీ వార్త వినేప్పటికి, కంగారుపడిపోయాడు, చేతిలో వున్న ఫోన్ రిసీవర్ వదిలిపెట్టేశాడు; గుయ్‌మంటూ కిందపడిపోయింది రిసీవర్, అతనదేం వినలేదు. 'ఉషాకోవ్ ఫోన్ చెయ్యలేదెందుకని? నాతో మాట్లాడదలచుకోలేదన్నమాట అతను. యింత దారుణమైన విపత్తొస్తుందని అనుకోలేదు. యేదో, మంత్రివర్గం నాలుగైదు ప్రశ్నలు పంపుతుందేమో సమాధానం వ్రాయమని అనుకున్నా. కాని 'కేంద్రకమిటీకి రిపోర్టే!' "రిపోర్టు". యిందులో రిపోర్టుచెయ్యడానికేంవుంది? తుఫానొచ్చింది, ఆమాత్రం తెలియందెవరికి? నా చావుకొచ్చిందివంతా, అదీ అసలు సంగతి. ఇందులో యేమైనా న్యాయం వుందా? వాతావరణాన్ని నేనేమైనా కంట్రోలు చెయ్యగలనా, చావగలనా? ఆ ఫౌండ్రీ కట్టకపోతే, మేం మా కోటా చచ్చినా పూర్తిచెయ్యగలిగే వాళ్లం

కాదు. ప్రభుత్వాని కెంత లాభం చేశావేం... మొదట్లోనే గృహనిర్మాణ పథకం పాస్చేశాను. తర్వాత కోటాకంటే యెక్కువ పని చేసినందుకు రెండుసార్లు నన్ను ప్రశంసించారు, యిప్పుడేమో నా పుట్టి ముంచుతున్నారు. ఎందుకు? తుఫానొచ్చింది కాబట్టి. ఈ తుఫానే గనక రాకపోతే, ఆ కొత్తమోడల్ తెచ్చినందుకు, మే మొదటి తేదీన నన్ను పిలిచి, మళ్లీ ప్రశంసించేవాళ్ళే. ఛ, యిందులో న్యాయమేమీ లేదు. అంతా అన్యాయం. పసిపిల్లవాణ్ణిగూడా కాదు నేను, ముప్ఫయ్యొనిమిదేళ్లొస్తున్నాయి నెత్తిమీదికి, నేను సర్వనాశనమై పోతున్నా; కారణమేమిటో తెలుసా, వాతావరణం!'

గృహనిర్మాణంలో జరిగిన ఆలశ్యాన్ని గురించి. మాస్కోకెవరు రిపోర్టు పంపివుంటారా అని చాలాసేపాలోచించాడు ఇవాన్. 'బహుశా సొకొలొవస్కీయే పంపివుంటాడు. ఇంతకీ, అతన్ని నొక్కకుండా వూరుకున్నాను. బెల్జియంలో అతని కుటుంబం వున్నదనేది చక్కని ట్రంప్ కార్డ్; అదుపయోగించి, అదనులో అడుగేస్తే యీపాటికి తుడిచిపెట్టేసేవాణ్ణతన్ని నామరూపాలు లేకుండా, యేం లాభం. మరీ అంతజాలి వుండగూడదు, యింకా యిప్పుడతన్నేం చెయ్యగలను? యింతకీ అతను కానేకాదేమో—యింకా సొకొలొవస్కీకి జబ్బుగానేవుందనీ, యింకా మంచంమీదనుంచి లేవనేలేదనీ చెబుతున్నాడు ఎగొరోవ్. ఐతే యింకెవరు పంపుంటారబ్బా? సిబిర్‌జేవ్ కాదు, అంతధైర్యం లేదనికి. ఉషాకోవ్ అయ్యుండాలి, మరీ యీమధ్య ఆ యిళ్ళగురించి మహా పీక్కుతింటున్నాడు నన్ను, ఐనా అసలతని కెందుకిదంతా? ఫాక్టరీకి బాధ్యత వహించవలసినవాణ్ణి నేను. అలా వదిలిపెడ్తే యింకేం, అతని గొప్ప తెలియొస్తూ, అందులోనూ ప్రమోషన్‌కోసం చూస్తున్నాడీమధ్య మరీని...యింకా మంత్రివర్గంనుంచి వార్తలేమీ రాలేదు. (*ఉషాకోవ్ పార్టీబాధ్యుడు, అదీగాక ఇవాన్ కింతవరకూ మంత్రివర్గంనుంచి యెలాంటివార్తా రాలేదు, అంచేత గృహనిర్మాణంలో జరిగిన ఆలశ్యాన్ని గురించిన రిపోర్టు ప్రభుత్వశాఖలద్వారా వెళ్లివుండదనీ, పార్టీ శాఖల

ద్వారానే వెళ్లిపోవాలనీ ఇవాన్ ఊహ.) తప్పకుండా ఉపాకోవే ఐ వుంటాడు; సొకొలొవస్కీ అతన్ని యెక్కేసుంటాడు. మంచం మీదనుంచి లేవకుండానే, యేదో వొక అపవాదు సృష్టించి, పట్టణ కమిటీకి ఫోన్ చెయ్యొచ్చును, అందులో యేముంది; సాధ్యమే... యెవళ్లైతేమాత్రం వేంలే, యింతకీ సర్వనాశనం ఔతూందిమట్టుకు నేనే అని తెలిపోయిందిగదా!'

మాస్కో-కెళ్తూ, రైల్వేక పార్ట్ మెంట్ లోగూడా అలాగే దీర్ఘంగా ఆలోచిస్తూ కూచ్చున్నాడు, కిటికీ బయట కనిపించే ప్రకృతి దృశ్యాల్నిగూడా చూడకుండా; కండక్టరొచ్చి 'టీ కావాలా' అనడిగినా సమాధానం చెప్పలేదు. రైల్వేప్రయాణం అంటే బాగా యిష్టమే అతనికి — కంపార్ట్ మెంట్ లోకి వెళ్ళగానే చారల పైజమాలు తొడిగేసుకునేవాడు, మిగతావాళ్ళతో కలిసి పేకాటో, చదరంగమో ఆడేవాడు, కోడిమాంసం లొట్టలేసుకుంటూ తినేవాడు, మదిత్తే కదిత్తే టీ తెప్పించుక్కు తాగేవాడు, రేడియో పెట్టుకునేవాడు, తన ఫాక్టరీ వుత్పత్తిని గురించి అందరికీ వినపడేట్లు బిగ్గరగా చెప్పేవాడు, క్రొకొడైల్ (సోవియట్ హాస్యపత్రిక) చదువుతూ పగలబడి నవ్వేవాడు ('అతన్ని బలేగా విమర్శించారులే, రోగం కుదిర్చారు'); మొత్తంమీద బాగా హుషారుగా గడిపేవాడు ప్రయాణం అంతా. ఇప్పుడలా కాదు, ఏదిచూచినా వెగటేస్తూంది, వాంతొచ్చినట్లుంటోంది. తనతోపాటు ప్రయాణం చేస్తూన్న రైల్వే ఎంజనీరు బుద్ధిలేని వదరబోతు; ఆ రేడియోలో వచ్చే పాటలన్నీ వెధవపాటలే, తలనొప్పి వస్తోంది; ఆ స్టేషన్లని చూసినా, మంచులో నుంచి తొంగిచూచే యిళ్ళని చూచినా వికారం పుట్టుకొస్తోంది — అంతా అలాగేవుంది ఛండాలంగా. చివరికి మంచుగూడా పడవలసినంత పడడంలేదు, పంటలుగూడా అలాగే యెండిపోతున్నై; రెస్టారెంట్లో కట్లెట్ లు సరిగ్గా వుడకలేదు; టీ యేమో చేపలకంపు కొడుతోంది; కంపార్ట్ మెంటంతా వేడిగా వుండి వుక్కబోస్తూంది, కిటికీలోనుంచేమో వొట్టి ఝామురుగాలి కొడుతోంది.

చీకటిపడింది; రైల్వే ఎంజినీర్ పందుకుని గురకలు కొడుతున్నాడు; పైనున్న బెర్త్ మీదకెక్కి పందుకుని అదేపనిగా ఆలోచించడం ప్రారంభించాడు ఇవాన్. అసలెందుకిలా జరిగిందీ, యేం జరిగిందసలు అనుకుంటూ ఆలోచించాడు, ఆలోచించాడు. కిటికీ తెరగుండా సన్నని నీలి వెలుతురు వచ్చిపడుతోంది, ఎంజినీరుదగ్గి, పక్కకొత్తిరిగి, సిగరెట్టంటించాడు – ఐనా ఇవాన్ ఆలోచిస్తూనే వున్నాడు; వున్నట్టుండి అతనికంతా అర్థమైపోయింది: 'అసలు దీనికంతకీ మూలకారణం ఎలీనా. వెధవ నవల్లన్నీ చదివి, ఒక చక్కని, నికార్సైన సోవియట్ పౌరుడి జీవితాన్ని పునాదులకంటా కదలించి పారేసింది ఆ నిర్భాగ్యురాలు. ఫాక్టరీ గతేంకాను! మే మొదటి తేదీనాటికి, కొత్త మోడల్ తీసుకొస్తావని చెప్పాం – యికిప్పుడేమౌతుంది! సొకొలొవస్కీ యేమంత చెప్ప డిజైనర్ కాదన్నమాట నిజమే, సొకొలొవస్కీ సిగ్నలింగ్ పథకం అంతా మార్చేశాడు కాబట్టి డిమిట్రీకూడా సంతృప్తిగానే వున్నాడు – విమర్శనేది అల్లాటప్పా వ్యవహారంగాదు, చాలా గొప్పవిషయం! – అంతా బాగానే వుంది కాని ఫాక్టరీని ఐక్యపరచే సూత్రమంటూ యేమీ వుండదిక. ఎగొరొవ్ బాగా అనుభవమున్న ఎంజినీరే, చాలా ప్రాక్టీస్‌కూడా వుంది కాని మనిషిలో పలుకులేదు, మరీ ఆ భార్య చనిపోయిందగ్గర్నుంచీ జారిపోతున్నాడు. ఇంతవరకూ వున్న సోమరిపోతులు యిష్టంవచ్చినట్టు చేస్తారిక. డిమిట్రీకి మంచి భవిష్యత్తుంది, అందులో సందేహమేమీలేదు, కాని అతనింకా చాలా చిన్నవాడు. నేను లేకుండా ఆ ఫాక్టరీ యెలా నడుస్తుందో వూహించుకోవడమే కష్టంగా వుంది నాకు! – ఆ ఒక్క ఆడది అంతా యింత అస్తవ్యస్తం చేసిపోయిందంటే యింకేమనుకోవాలి–యిలాంటి దింతవరకూ యెప్పుడూ జరిగుండదు. డిమిట్రీ ఆ క్లబ్బులో చెప్పాడే, అదంతా నూటికి నూర్పాళ్లా నిజమే – ఒక్కరాయంటే వొక్కరాయి తీయడం ప్రారంభిస్తేచాలు యిల్లుకిల్లే పడిపోతుంది. అంతకంటే యింకా జరిగేదిమాత్రం యేంవుందిలే? – వెధవ పుస్తకాలన్నీ అమ్మివేస్తు

న్నారు - యెందుకో యెవళ్లకీ తెలియదు - యికిప్పుడు భావాల్ని గురించిగూడా మాట్లాడ్డం ప్రారంభించారు, భావాలట; భావాలు !- యిదీ ఫలితం చూస్తునే వున్నాంగా, కనబడుతూనేవుందిగా...అసలొక గట్టిసూత్రమంటూ వుంటే...అదీ అసలు కావాల్సింది. నేను నాకోసమే బ్రదికానని యెవళ్లూ అనలేరు; నేను బ్రదికింది ఫాక్టరీ కోసం. ఇప్పుడి కేం లేదు, అంతా పోయింది, తుడిచిపెట్టుకు పోయింది, తునాతునకలై పోయినదూలాలూ, పగిలిపోయిన అద్దం ముక్కలూ, చెత్తాచెదారమూ - యిదీ ఇవాన్ బ్రతుకు.'

ఎంజనీర్ లేచి, వొక పార్సెల్ విప్పి రొట్టెలు బైటికితీసి, "తీసుకోండి, యింట్లో తయారుచేసినవే, మాఆవిడ చేసింది, తీసుకోండి" అన్నాడు ఇవాన్‌తో.

వద్దన్నాడు ఇవాన్, యేమీ తినబుద్ధికావడంలేదు, దేనిమీదికీ మనసుపోవడంలేదు. అతని ఆలోచనలే అలా వున్నై:

'యెందుకయ్యా నీ కంత పొంగు? యేం చూసుకునయ్యా అంత మురిసిపోతున్నావ్, కాస్త చెబుదూ! ఇవ్వాళిట్లాగే రొట్టెలుచేసి పెడుతుంది, రేపెవరో వృక్షశాస్త్రజ్ఞుడు కనబడతాడు, బస్, నువ్విక ఆ యింట్లో వుండేందుకే వీల్లేదు. చూడు, దొంగనవ్వు నవ్వుతూ యెట్లా కూర్చున్నాడో, మంత్రివర్గం పిలిచిందని చెబుతున్నాడు, బహుశా ప్రమోషనొస్తుందనేమో ఆశ. ఇప్పుడే రైలు పట్టాలుదప్పి పడిపోతుందనుకో — ఒకటి - రెండు - మూడు వెళ్ళవతల పడడవేం, యీ నాన్సెన్సేమీ పనికిరాదు. యెవ్వర్నీ నమ్మడానికి వీల్లేదు.'

♦ ♦ ♦

మాస్కోకి బయల్దేరేముందు, రెండు మూడురోజుల్లో తిరిగొచ్చేస్తానని చెప్పాడు ఇవాన్, ఎగొరోవ్‌తో - యిలాంటప్పుడు మాస్కోలో యెక్కువరోజు లుండగూడదు, వెంటనే వచ్చెయ్యాలి, నేమొదటితేదీకి కొత్త మోడెల్ వచ్చెయ్యాలిమరి. కాని, వారం

గడిచింది, ఐనా ఇవాన్ యింకా తిరిగి రాలేదు. ఇంతలో హెడాఫీసునుంచి ఫోనొచ్చింది; ఒక కొత్త డైరెక్టర్, గొలొవనోవ్, వస్తున్నాట్ట; ఏప్రిల్ రెండో వారానికల్లా వచ్చి ప్రవేశిస్తాట్ట వుద్యోగంలో.

ఎగొరోవ్ కెళ్ళి, బ్రెయ్నిన్‌కి చెప్పాడు; బ్రెయ్నిన్ సంతోషించాడు:

"గొలొవనోవ్ నెరుగుదు న్నేను, అతన్తో కలిసి స్వెర్డ్లోవస్క్‌లో పని జేశాను. మంచి చెడ్డా తెలిసినవాడు, సమర్థుడు.

"సరే బాగానేవుంది ... ఐతే కొత్తమోడల్‌ని మే మొదటి తేదీనాటికి పూర్తి చేసెయ్యొచ్చును గదా."

"ఓ, తప్పకుండా."

ఇంతలో బ్రెయ్నిన్‌కి ఇవాన్ సంగతి గుర్తుకొచ్చింది:

"ఇవా నేమైనట్టు?"

"ఇంకేంవుంది, కన్పిస్తూనే వుందిగా, ఊడబెరికుంటారు. అతన్నూడబెరకాలని చాలాకాలంనించి అనుకుంటున్నారని విన్నా, ఐతే యింకో మనిషికోసం చూడొద్దూ మరి, అందుకని ... గమ్మత్తే మరి—సొకొలొవస్కీ చెప్పాడు నాకు కిందటేడు, ఇవాన్ వుద్యోగం వూడుతుందని. వూరికే హాస్యంవాడుతున్నాడేమో అనుకున్నా అప్పుడు — సొకొలొవస్కీ నెరుగుదువుగా, యెప్పుడూ యెగతాళి చేస్తుంటాడు ..."

నవ్వి, ప్రావ్దా పత్రిక తెరిచాడు బ్రెయ్నిన్.

ఇంకా, ఫ్రాన్స్‌లో ప్రభుత్వానికి మెజారిటీ వచ్చేట్టులేదు; ఐతే మొత్తంమీద యేదో వుందన్నమాట.

ఇవాన్ వుద్యోగం పోతుందని చాలాకాలంక్రితమే సొకొలొవస్కీ చెప్పాడన్న సంగతి గుర్తుకొచ్చింది ఎగొరోవ్‌కి. యెంతో కొంత తెలిసే వుంటుంది, లేకపోతే యెందుకు చెబుతాడు ...... అంతే, తర్వాత ఇవాన్ సంగతే మరచిపోయాడు ఎగొరోవ్.

♦ ♦ ♦

"నువ్వూ, ఇవాన్ చాలా దగ్గరిస్నేహితులని అందరికీ తెలుసు; నీక్కూడా యేమీ యిబ్బందిరాదుగదా" అనడిగింది భర్తని ఖిత్రోవ్ భార్య.

ఖిత్రోవ్ ఆలోచించాడు.

"సెంగినాదంగాదూ, ఇవా నొట్టి నాపిసరుకు, తాను వలచిందే రంభ; తాను మునిగిందే గంగ. నాక్కూడా విసుగెత్తిపోతే. అతను పోవడం మంచిదేగాని, యీ కొత్త పక్షి - గొలొవనోవ్ - యెలాంటివాడో గూడా చూడాలి. ఐనా, ఇవాన్‌కంటే చెడ్డవాడు మట్టుకు కాబోడులే."

ఎవరు మాట్లాడినా గొలొవనోవ్‌ని గురించే, ఇవాన్ పేరెత్తినవాళ్ళే లేరు. ఇవాన్ యింట్లో పనిజేసే గ్రూషామాత్రం పదేపదే అనుకునేది ఇవాన్ వచ్చి, సామానంతా యెప్పుడు సర్దేసుకుంటాడాఅని. యిల్లంతా చిందరవందరగా వుంది. కొత్త వుద్యోగి గూడా వచ్చేరోజులు దగ్గరకొచ్చినై. పనేదో తొందరగా కాకపోతే, తర్వాత మళ్ళీ యిల్లంతా బాగుచేసేందు కాలస్యమౌతుంది.

ఎప్పటిలాగానే, ఫాక్టరీ సైరన్ కూస్తానేవుంది. సమయం ప్రకారం, మెషీన్లన్నీ యథాప్రకారం పనిజేస్తానేవున్నై. కార్మికులందరూ నవ్వుకుంటూనూ, హాస్యాలాడుకుంటూనూ, తమ తమ పనులు చేసుకుంటూనే వున్నారు. ఇవాన్‌లేని వెలితి యెవరికీ కనబడ్డట్లేలేదు. తుపానుమూలాన యిళ్ళుపడిపోయిన వాళ్ళుమాత్రం, కాస్సేపతన్ని తిట్టుకున్నారు; తర్వాత తాసంగతే మరచిపోయారు.

ఫ్రూంజ్ వీధిలో, కార్మికుల కోసమనికట్టే గృహాలకని వేసిన పునాదులుచూచి చంకలెగరేశారు కార్మికులు.

"రెండు గదులూ, స్నానాలకొక గదీ, వంటకొకగదీ - మన జీవితమే మారిపోతాంది. సాగాల్సిందే యీ పని" అన్నది వినోగ్రడోవ్ భార్య.

"ఇవాన్ యేమయ్యాడు? ఎక్కడున్నాడు? ఒక్కరికీ గుర్తులేదు. తుపానొస్తుంది, అందరినీ కష్టపెడుతుంది, నష్టపెడు

తుంది, వెళ్ళిపోతుంది; ఆ గర్జన లాగిపోయింతర్వాత అ విషయం యెత్తేవాళ్లెవళ్లుంటారు.

శీతాకాలం చివరిరోజులు. వీధి కొకవైపున మంచుగడ్డ లింకా గట్టిగానే వున్నాయి కాని, రెండో వైపున, అప్పుడే, మంచు గడ్డల్నుంచి పెద్ద పెద్ద చినుకులు కారడం ప్రారంభమైంది.

జబ్బుపడ్డ సొకొలొవస్కీ, మంచందిగడాని కదే మొదలు, దిగి, కిటికీదగ్గర కెళ్లి, బయటికి చూశాడు; కిటికీఅంతా మకిలి మకిలిగా వుంది; బయట మంచు బూడిదరంగు పులుము కున్నట్లుం దతి మృదువు మృదువుగా. “రేపో మాపో వసంతకాలం వచ్చే స్తుంది” అనుకున్నాడు సొకొలొవస్కీ.

# 15

తన భవిష్య జీవితాన్ని గురించి చాలాసార్లు ఆలోచించుకుంది సోన్యా, భవిష్యత్తులో తాను పనిజెయ్యబోయే ఫాక్టరీని గురించి వూహించుకుంది, తానా పని బాగా చెయ్యగలుగుతుందో, లేదోనని విస్తుపోయింది. కాని, ఆ వూహాలన్నీ ఆధార రహితాలు; మసక మసగ్గా వుండేవి, పట్టపగలే కళ్ళుమూసుకుని కన్న కలలు. ఇప్పుడు, తనని పేంజా పట్టణం పంపబోతున్నారని తెలిసేప్పటికి, యిక తన పడుచుతనం గడచిపోయిందన్నమాట తలవని తలంపుగా గుర్తుకొచ్చింది. విద్యార్థుల్తో స్నేహాలూ, పరీక్షలూ, లెక్చర్లూ, సావ్ చెంకోతో కలహాలు — అవన్నీ పాతసంగతులు. ఇక తన ముందుండేవి — ఆ ముక్కూ మొఖమూ యెరగని పట్టణమూ, కొత్తఫాక్టరీ. నూతన బాధ్యతలూ. నిజమే, స్కూల్లో తాను చేసిన పనిని అందరూ ప్రశంసించారు, స్కూల్లో యిచ్చిన ఎక్సర్సైజులు తప్పితే యింకేమీ తెలియదే తనకి? ఆచరణలోకొచ్చేప్పటికి తానేమాత్రం పనికొస్తుంది? మన నూరికే మరచిపోతాం, తప్పులు తండోపతండాలుగా దొర్లుకుంటూ వస్తై. క్రిందటి సంవత్సరం ప్రాక్టికల్స్‌లో వచ్చిన అనుభవమే చాలు, ఆచరణలో యెన్ని కష్టాలెదుర్కోవలసి వస్తుందో తెలుసుకునేందుకు.

"ఈ కొత్త పరిస్థితులికి అలవాటు పడడం నాకు తెలియదనుకుంటా" అన్నది సోన్యా, తండ్రి, పుఖోవ్‌తో. కూతురికి ధైర్యం చెప్పేందుకు ప్రయత్నించాడు పుఖోవ్, యెప్పుడూ అలాగే అనిపిస్తుంది, చచ్చినా చెయ్యలేమనుకుంటాం; చివరికి అలా అనుకున్న మనమే అన్నీ చక్కగా నిభాయించుకొచ్చేస్తాం, పాతికేళ్ల క్రితం తానా పట్టణం వెళ్ళిన సంగతి చెప్పాడు పుఖోవ్ – చాలా చక్కగానుంటుం దా పట్టణం, యెక్కడచూచినా తోటలు, గొప్ప

సాంప్రదాయాలున్న పట్టణం అది; రష్యన్ రచయిత సాల్టికోవ్ 'ష్చెడ్రిన్' పెంజా పట్టణంలోనే పెరిగి పెద్దవాడయ్యాడు, ఆ పట్టణానికి దగ్గర్లోనే తార్ఖానీ గూడా వుంది, తార్ఖానీ అంటే లెర్మొంటోవ్ కవి దేశం. సోన్యా నవ్వుకుంది; మరింత భయమేసింది ఆవిడకి. 'లెర్మొంటోవ్ యిక్కడుంటే నాకేంటట? నిజమే, ఆయన కవిత్వం చదివితే మన హృదయాలు స్పందిస్తాయి, యీ రోజుల్లో మన అనుభవాలు ఆనాటిలాంటివే కాకపోయినాగూడా. ఇంతకీ నేనా పట్టణా పార్కుల్లో పగటికలలు కంటూ కూర్చుంటాననా నాన్న వుద్దేశం? నా కావలసింది ఫాక్టరీ, ఫాక్టరీలో పనీ, ఆపని నేనెంతవరకు బాగా చెయ్యగలనూ అని.'

ఇప్పటికీ, తల్లిదండ్రుల్తోనే వుంటోంది సోన్యా, సావ్‌చెంకో వచ్చి తనని చూస్తాడా లేదాఅని యింకా ఆశ్చర్యపోతూనేవుంది (సోన్యా యెక్కడి కెళ్తుందో సావ్‌చెంకోకి తెలియనుగూడా తెలియదు); ఆవిడనుకున్నట్టూ, యిప్పటికీ వున్న ప్రపంచంఅంతా పుట్టినప్పట్నుంచీ యెరిగిన ప్రపంచమే; ఐనా ఆవిడ వూహాలన్నీ, ఆ ప్రపంచాన్ని దా[illegible], యెక్కడో దూరంగావున్న, యెప్పుడూ చూచెరుగని పెంజా పట్టణం వైపుకే పరిగెత్తుతూన్నై.

ఫిబ్రవరి చివరివారంలో వెళ్ళిపోవలసింది, ఆ ప్రయాణం ఆగిపోయింది, ఆవిడబదులు బోరిసోవ్ వెళ్తాడనీ, ఆవిడకి వ్యవసాయం యంత్రాల కేంద్రంలో పనిస్తారనీ అనుకున్నారు. చివరికి, సోన్యాయే పెంజా పట్టణం వెళ్ళాలని నిర్ణయించారు మళ్ళీ. "వెళ్ళే ముందు టీపార్టీ చేసుకుందాం" అన్నాడు తండ్రి వుషాకోవ్.

సోన్యా అంగీకరించలేదు: "యిప్పుడు కాదు. అక్కడ యెంతో కొంత పనిజేసి సెలవుమీద వొచ్చినప్పుడు డిప్లొమా యిచ్చే పార్టీలన్నీ. అంతేకాని యిప్పుడెందుకూ?" అన్నది.

సోన్యా వెళ్ళిపోతుందని విని, తల్లి నిట్టూర్చింది: 'అక్కడికెళ్ళిమాత్రం యెలా వుండగలుగుతుంది? అసలు దాని కెళ్ళాలని లేదు. సావ్‌చెంకో అంటే అమ్మాయి యిష్టంలేదంటే నమ్మన్నేను,

పైకి కనబడనివ్వకుండా దాస్తోంది, అంతే తప్పితే...సావ్ చెంకో గూడా చాలా మంచబ్బాయి; వాళ్ళిద్దరికీ పెళ్లైపోతే బాగుండును; పెళ్ళి చేసుకోకుండానే వెళ్ళిపోతూంది - వయసులోగూడా వుంది; అతనూ? అతనక్కడే వుండిపోతాడు - అతనూ బాగా పనున వాడే, తలెప్పుడు తిరిగిపోతుందో, యేవో, యెవళ్లు చెప్పగలరు. వాళ్ళిద్దరూకలిసి యేదో వొకటనుకుని దగ్గరకొస్తే బావుండును. అప్పుడు నా కీ ఆరాటం లేకుండా పోతుంది.'

ఇంకొద్దిరోజుల్లో సోన్యా వెళ్లిపోతుందనగా, వుండబట్టలేక పోయింది తల్లి :

"సావ్ చెంకో యెప్పుడూ రానేరాడేంమ్మా నిన్ను చూడ్డానికి? యీమధ్యెప్పుడూ పోట్లాడుకోలేదుగదా మీరిద్దరూ కొంప దీసి?"

"అతన్తో పోట్లాడ్డంవెందుకూ? తీరికుండడంలా అతనికి"

"నువ్వెళ్ళిపోతున్నానని తెలుసా ఆ యబ్బాయికి?"

"తెలుసు, యెందుకు తెలియదూ? బజార్లో కలుసుకున్నానతన్ని. నాన్నని చూడ్డానికి రావాలనుకున్నాననీ, తీరిక లేకపోవడం మూలాన పడ్డంలేదనీ చెప్పాడు."

సోన్యా సిగ్గుపడింది! అబద్ధాలాడడంలో ఆరితేరిపోయింది తను! 'ఆవాళ రాత్రినుంచీ అతన్ని చూడనుగూడా లేదు నేను... యెక్కడికెళ్తున్నానో తెలుసుకోవడానికి ప్రయత్నించనుగూడా లేదతను. నేనంటే లక్ష్యమే లేదతనికసలు. అలాగే అనిపిస్తోంది నాకు మరి...యివేవీ చచ్చినా చెప్పను అమ్మకి...ఐనా యీ గొడవంతా అమ్మకెందుకు' అనుకుంది సోన్యా. అనుకుని, వాళ్ళమ్మతో, బిగ్గరగా "యెందుకూ అదేపనిగా అతన్ని గురించడుగుతావ్? నిజమే, అతను మంచివాడే, నేనూ వొప్పుకుంటాను, కాని నేననుకునే ఆదర్శ వ్యక్తతనుగాదు. ఆకర్షణలేందే, మనషుల్ని వూరికే చుట్టూ తిప్పుకోవడంవంటే తలనొప్పి నాకు" అంది.

ఆవేళ రాత్రల్లా పుఖోవ్‌కు గడ్డుగావుంది, యింతకుముం దెప్పుడూ అతనంతబాధ పడలేదు. యిక బ్రతకను, చనిపోతానను కున్నాడు; అందరిదగ్గరా సెలవు తీసుకున్నాడు మానసికంగా; లేచి మంచంమీద కూర్చుని, మరకలు పట్టిన కిటికీవంక చూస్తూ, చాలా జాలిపడ్డాడు; 'పాపం, నాదెజా! యిప్పుడిక సోన్యాగూడా వెళ్ళి పోతూంది, యికొంటరిగా యెలా బ్రదుకుతుందో?' అనుకుని వుసూరుమన్నాడు.

ఆవిణ్ణి లెగ్గొట్టకుండా అలాగే పడుకున్నాడు, మర్నా డుదయంగూడా యేమీ చెప్పలేదు భార్యకి, మధ్యాహ్నందాకా అలాగే, మంచంమీదనే, పడుకున్నాడు; తర్వాత లేద్దామని యాతనపడ్డాడు గాని వీలుకుదరలేదు; పండుకోవడంతప్పితే గత్యం తరం లేకపోయింది; అంచేత సెరియోజాని చూచేందుకూ-డా వెళ్ళలేదు. వస్తానని వాగ్దానంచేశాననే సంగతి గుర్తుకొచ్చీగూడ.

తనని తాను, బయట నిలబడి చూచుకోవడం ప్రారంభిం చాడు పుఖోవ్: 'సోన్యా నన్నుచూచి నవ్వుతుందంటే తప్పకుండా కారణం వుండేవుంటుంది; నిజవే మరి - సెరియోజాని చూడాలని నేనిలా బాధపడడం చూస్తే నవ్వుపుట్టదూ మరి. యేమిటో. యీ ప్రపంచం నిజంగానే చిన్నదేవో ననిపిస్తుంది; జానెడు బెత్తెడు... కాని చెయ్యగలిగిందిమాత్రం వేముంది? పోరాటం సాగిస్తూనే వుండాలి, లేకపోతే బ్రదకడవే కష్టం. పడుచువాణ్ణిగా వున్నప్పుడు, అందరితోనూ భుజంకలిపి పోట్లాడాను. అదొక్క విప్లవంరోజుల్లోనే గాదు-అంతకు చాల ముందుగూడానూ, తర్వాతానూ - నా పనితో పోట్లాడాను. నాతో నేనే, నాలో నేనే పోట్లాడుకున్నాను - అదెవ రికీ తెలియదు. యెదురుదెబ్బలూ, వైఫల్యాలూ, విచారాలూ, సందేహాలూ - అనేకం తగిలాయి, వచ్చాయి, కలిగాయి; మన షుల్లో నాకున్న విశ్వాసం సడలిపోకుండా వుండేందుకు పోట్లాడాను, ఇప్పటికీ, నేనింకా పోట్లాడుతూనే వున్నాను, సెరియోజాతో మాట్లాడేప్పుడూ; అతనికి నా అనుభూతులూ, నా భావాలూ,

నా ఆలోచనలూ యెంతో కొంత అందజెయ్యాలని ప్రయత్నించి నప్పుడూ. మృత్యువుతోనూ పోట్లాడుతున్నాను నేను. చుట్టూ చక్రబంధం పన్నుతోంది మృత్యువు, నాకోసం పొంచిచూస్తోంది. రాత్రిపూట, అంతా చీకటిగానూ నిశ్శబ్దంగానూ వున్నప్పుడు, నాతో కలియబడి నన్నోడించాలని చూస్తుంది, ఐనా నా చేతనైనంతవరకు పోట్లాడుతూనే వున్నాను. వృద్ధాప్యంలో మనిషి యెండిపోతాడు, ముడుచుకుపోతాడు యెండిపోయిన పండులా, దూరదృష్టికూడా పోతుందన్నమాట నిజమే కాని, చూపు కానేమేర సన్నమైపోతుంది, బిగదీసుకుపోతుంది. యితరుల జీవితాల్ని గురించి ఆలోచించేందుకు ప్రయత్నిస్తాను నేను; ప్రతి రాత్రీ మృత్యువుతో యీ గదిలోవుండి పోట్లాడవలసొస్తోంది, యీ గదిగోడలు పడగొట్టి బయటి ప్రపంచంలోకి వెళ్లాలని ప్రయత్నిస్తాను. అక్కడికి వెళ్లినా, నే చేసే పనదే, యింతకాలంనుంచీ, నా జీవితమంతా చేస్తూ వచ్చిన పనే. సోన్యా కిప్పుడప్పుడే యిదంతా అర్థంకాదు, చెప్పినా ప్రయోజనం వుండదు.'

గత కొన్ని వారాలుగా, ఒలోడ్యా అంటే పుఖోవ్ భావం గూడా మారిపోయింది. ఇదివరకు ఒలోడ్యాని చూస్తే అసహ్యం పుఖోవ్‌కి; కాని యిప్పుడు ఒలోడ్యా చిలిపికళ్లు చూసినప్పుడల్లా "పాపం, ఒలోడ్యాకి తెలివితేటలున్నాయి, ప్రతిభవుంది, చెడ్డవాడేమీ కాదు, ఐనా ఏదో లోపంవుంది యితన్లో, బాగా ముసలివాడైపోయిన బైరాగిలాగా, విదూషకుడిలా జీవితం గడపాలని చూస్తాడు" ఒలోడ్యా భావాల్ని తానేమీ మార్చలేనని తెలుసు పుఖోవ్‌కి, అతనితో వాదించడం మానవేశాడు, అతను చేసే గేలి వినీవిననట్లు నటించాడు. అప్పుడప్పుడూ మాటలద్వారానో, చేష్టలద్వారానో అతనంటే తనకున్న ప్రేమని మాత్రం వ్యక్తం చేసేవాడు. ఈ సంగతి ఒలోడ్యాకూడా కనిపెట్టాడు, కాని అందువల్ల తనలో వచ్చిన మార్పు మాత్రం తండ్రికి తెలియనీయగూడ దనుకున్నాడు.

తన వుద్యోగాన్ని గురించిన సందేహాన్ని గురించీ, భయాన్ని గురించీ తండ్రికి చెప్పింది సోన్యా. ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. ఈ సంభాషణ జరిగేప్పుడుగూడా చాలాసార్లు తండ్రీ, కూతుళ్ళొకరినొకరు అర్థంచేసుకోవడం కష్టమే అయింది.

"యెప్పుడూ ప్రజలు ప్రజలంటారేవిటి నాన్నా మీరు? ప్రజలంటే నాకేమీ భయంలేదు. మాపై మేనేజర్ చివరికి ఇవాన్ లాంటివాడుగా తయారైనా నేనేమీ జడవను...పుస్తకాల ప్రపంచంలోనుంచీ, మెషీన్ల ప్రపంచంలోకి వెళ్తున్నాను గదా, నిభాయించుకోగలనా అనే నే నడుగుతూంది—అదీ నాకు పట్టుకున్న భయం" అని వివరించింది సోన్యా, మాట్లాడుతున్నది మాట్లాడుతున్నట్టే వుండి. పుఖోవ్ కేమీ తోచలేదు. కాని, అంతలోనే, వారిద్దరిమధ్యావున్న ఆంతరంగిక సంబంధం మేల్కొన్నది, అందుకు యిద్దరూ సంతోషించారు. ఇంకొద్దిరోజుల్లో యిద్దరం విడిపోతామే అన్న భావంకూడా చాలవరకు సహాయ పడుతుంది బహుశా (మళ్ళీ కలుసుకుటామా? అని యిద్దరూ ప్రశ్నించుకున్నారు. తమలో తామే, విచారపడుతూ).

అన్నిటినీ సిద్ధాంతీకరణ్యంగానూ, ముక్తసరిగానూ చూస్తున్నట్టు కనిపించే సోన్యా ప్రవర్తన అంతా నటనేనని, గర్వంతోనూ, వుద్రేకంతోనూ సమ్మిళితమైపోయిన పిరికిపడుచు హృదయాన్ని ప్రవర్తన దాచిపెడుతోందనీ, ఆ సంభాషణ జరిగింతర్వాత, పుఖోవ్ కి దృఢపడిపోయింది.

వెళ్ళిపోయేముందొకనాడు తన గదిలో కూర్చునుంది సోన్యా; గదంతా శుభ్రంగావుంది, వెలితివెలితిగా; విద్యార్థినిగా వున్నప్పటి డైరీలూ, కాలేజ్ స్నేహితులనుంచీ, సావ్ చెంకోనుంచీ వచ్చిన వుత్తరాలూ అన్నీ చింపి, కాల్చేసింది, నిన్న మొన్నటి వరకూ తన జీవితంలోని అనేక ఘటన్ని గుర్తుచేసే చిన్న చిన్న వస్తువులన్నిటినీ యేరిపారేసింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది—తల్లి, నాదెజా, బజారు కెళ్లింది. ఒలోడ్యా యిప్పుడింటి దగ్గరే వుండడం

లేదు—యీ మధ్య ఒక క్లబ్బు హాలులో బొమ్మలు వేసేందుకతన్ని నియమించారు. చెవులు నిక్కబొడుచుకుని విన్నది సోన్యా; నాన్నతో మాట్లాడుతూందెవ్వరు? గొరొఖోవా? కాదే, కంఠం ఆయన్ది గాదు...

"మీరిది చెప్పగలరూ?" అంటున్న దా అపరిచిత కంఠం, "ఆవిడ మాటన్నప్పుడు, నాకు చాలా భయం వేసింది, యిక బ్రదకలేనేమో ననుకున్నా. తర్వాత నవ్వుకున్నా ననుకోండి, యింకా అనేక కర్తవ్యాలున్నె నాకు, ప్రతీదీ యథాప్రకారమైపోయింది - యేదో మాయలో పడ్డాననీ, ఆ మాయ కాస్తా యిప్పు డంతర్ధానమై పోయిందనీ అనుకున్నా, మళ్ళీ యిప్పుడు, వున్నట్టుండి, గుర్తొస్తోంది ఆ వుదంతమంతా, కారణమేమిటో అర్థం కావడంలేదు నాకు...మీరు చెప్పగలరూ?"

"నాకూ అలాంటి అనుభవం జరిగింది; అదిగూడా ఒక్కసారే నేమో ననుకునేవ్! కాదు. (ఇది ఆవిడ తండ్రికంఠం.) మనిషి వూరికే మరిచిపోతా డంటారు కాని అది నిజంకాదు. మరచిపోవాలని అనుకున్నప్పుడు మరిచిపోతాడు, కాని నిజమైందేదో యెప్పుడూ తలలో వుంటుంది చిట్టచివరదాకా - చచ్చిపోయేదాకా అని గూడా చెప్పగలనిప్పుడు..."

కుతూహలాన్ని చంపుకోలేక, వోరగా వేసివున్న తలుపు దగ్గరకెళ్ళి చూచిది సోన్యా. ఆ మాట్లాడేదెవరో చూద్దామని: మొఖమంతా మొటిమలూ, యెర్రటి జుట్టూ, మందపాటి కళ్ళద్దాలూ. - యెవరో కుర్రాడు. ప్రఖోవ్ చూచాడు సోన్యాని.

"యెవరూ అ, సోన్యా! నువ్వేనా? రామ్మా లోపలికి పరిచయంచేస్తాను. మా స్నేహితుడు సెరియోజా యితను; మా అమ్మాయి సోన్యా, మెకానికల్ ఎంజనీర్."

తన గదిలోకి వెళ్ళిపోయింది సోన్యా. 'నాన్నొక వింతమనిషి. ఇంకా యెవరితోనో పెద్దవాడితో మాట్లాడుతున్నాడనుకున్నా. ఆ కుర్రాణ్ణి పట్టుకుని యేదో పెద్ద మనిషితో మాట్లాడుతున్నట్టు...

అర్థంలేదు...నాతో యెప్పుడూ మాట్లాడలేదట్లా. ఇంకా యెవరో నాన్న పాత స్నేహితుడేమో ననుకున్నా' కాని సోన్యా అంతటితో సంతృప్తిపడలేదు, మళ్ళీ దీర్ఘంగా ఆలోచించింది. 'నాన్న చేసేది రైటునేమో. నాన్నవంక ఆ కుర్రాడు యెంతో భక్తివిశ్వాసాల్తో చూస్తున్నాడు. ఆవేళ, మేం యిద్దరం వాదించుకున్నప్పుడు నాన్న అన్నారు తనలో కొంతభాగాన్ని తనులికి అందజెయ్యడమే తనుద్దేశం వని. ఒలోద్యా కోనా—నాన్నలా చెయ్యలేను; ఇక నేనున్నానంటే ఆయన సహాయమే అవసరం లేదన్నట్టు నటిస్తాను, ఏదో నా దృక్పథం నాదన్నట్టుంటాను. అందుకని యీ కుర్రాళ్ళందరికీ శిక్షణ యిచ్చాడన్నమాట...ఐనా, సావ్ చెంకోని గురించి ఆయన్తో యెలా మాట్లాడగలను! సగం చావాలి అడగడానికిముందు. అదీగాక అలాంటి విషయాల్ని గురించి యెవళ్ళుమాత్రం యేం సలహా యివ్వగలరు గనక. ఐనా యిప్పుడదంతా అనవసరం—. నేనెలాగూ వెళ్ళిపోతున్నాను, సావ్ చెంకోయేమో నన్ను ప్రేమించడంలేదు. అంచేత ఆ సమస్యలేదు. మేం యిద్దరవూం కలిసి తీయించుకున్న ఫోటోగూడా చింపిపారేశాను. ఇక నేను కొత్త జీవితాన్ని ప్రారంభించాలి—యీ పాత బెడదన్నీ వదులుకునీ, వదలించుకునీనీ.

సోన్యా వెళ్ళిపొయ్యేనాడు, ఆవిడతోపాటు నాదెజా, ఒలోద్యాలు గూడా వెళ్ళారు స్టేషన్‌కి. సోన్యాతండ్రి యింటిదగ్గరే వుండిపోయాడు—స్టేషన్ చాలా దూరమనీ యీ చలిలో బయల్దేరి వస్తే మళ్ళీ లేనిపోని బాధని కొనితెచ్చుకోవడమే ఔతుందనీ, గట్టిగా చెప్పి, రాకుండా చేసింది సోన్యా. ఆలస్యమౌతుందేమోనని సోన్యా గాభరా పడడంవల్ల, ఒక గంట ముందుగానే వచ్చేశారు స్టేషన్‌కి.

సోన్యాకిప్పుడు బాగా హుషారుగానే వుంది. - ఆఁ, వూరికే లేనిపోని కష్టాల్ని వూహించుకుందిగాని అసలా యిబ్బందులేవీ వుండకపోవచ్చు; ట్రెయినింగ్ పొందాను, తన శ్రమశిక్షణేదో తనకుంది. ఏం ఫర్వాలేదు నెగ్గగలదు.

వెయిటింగ్ రూమంతా వాత్తైడిగావుంది, యెవరో చిన్నపిల్ల కప్పెగిరిపొయ్యే ట్లేడుస్తోంది. జీవంలేని యెకసక్కాలాడాడు ఒలోడ్యా. తల్లి, నాదెజా, ఇట్లోచేసే రొట్టెల్ని గురించదేపనిగా మాట్లాడింది లోపలున్న విచారాన్ని యింకా వెనక్కి నెట్టేందుకు. సోన్యా ప్రయాణంకోసం కొన్ని కాకపోతే కొన్నైనా తయారు చేద్దామను కుంది గాని, దురదృష్టవశాత్తూ, రొట్టెలుచేసే యంత్రం చెడి పోయింది.

"నూట డెబ్బయ్యోగో నంబరు రైలు రత్ష్చేవో, కిర్సానోవ్, తాంబోవ్ ప్రాంతాలగుండా వెళ్తుంది; త్వరలోనే బయల్దేరబోతూంది. ప్రయాణీకు లందరూ తమ తమ స్థానాల్లో కూర్చోవాలి."

"రత్ ష్చేవో—అదినాది"

ప్లాట్ఫామ్మీద సగందూరం వెళ్ళిందోలేదో సోన్యా ఆగి పోయింది; ముఖంమీదేదో భయం ఆవరించింది.

"వెళ్ళిపోతున్నదని చూడ్డానికొచ్చావా నాయనా! మంచి పని చేశావ్!" అంది సోన్యాతల్లి.

సావ్ చెంకో వచ్చాడు.

సోన్యా యేమీ మాట్లాడలేదు. తల్లిచేయి పట్టుకున్నాడు: ఒలోడ్యా "రామ్మా, వెళ్ళి ట్రెయిన్ను చూద్దాం" అన్నాడు.

ఇద్దరూ వెళ్ళిపోయారు.

"యెప్పుడెళ్తున్నానో యెలా తెలిసిందీ నీకు!"

"మీ అన్నయ్య చెప్పాడు."

"అలాగా. మరి నన్ను చూచేందుకీ మధ్యెప్పుడూ రాలేదే!"

"నేను రావడం నీ కిష్టంలేదేమోనను కున్నా. ఇష్టమేనా నీకు?"

"నేనందదిగాదు; రాకుండా వుండడం యేమీ మంచిదికాదు."

"ఆవాళట్లా మాట్లాడావే మరి...ఆ మాటల్నిబట్టి నీ కిష్టం లేదేమోనను కున్నా."

"నీకిష్టమేనా రావడం?"

"యెందుకూ అలా అడుగుతావ్ ? మనం గేట్ దగ్గర నించున్నప్పుడు..."

"వెళ్ళిపోయేప్పుడుగూడా పోట్లాడుకోవడం యెందుకులెద్దూ. అప్పుడు నిన్ను లోపలికి రమ్మన్నాగా, రాలేదేం ?"

"అందరితోనూ కలిసి టీ తాగుదాం, రమ్మన్నావ్; అంతేగా"

"నేను పైకిచెప్పేదీ, నా లోపలివుద్దేశమూ ఒకటే నను కుంటున్నావన్నమాట ?"

"సెలవుమీా దెప్పుడొస్తావ్ సోన్యా ?"

"నీకేమైనా పిచ్చెత్తిందా ? యిప్పుడప్పుడే సెలవెట్లా యిస్తారు ? యింకా పనన్నా ప్రారంభించలేముగదా."

"క్రిందటేడు సెలవు తీసుకోలేదు నేను, నీకు తెలుసుగా ? నేనే వస్తా పేంజా."

"వొద్దొద్దు... సెలవెప్పుడు తీసుకుందామని ?"

"వెంటనే. ఐతే రావొద్దన్నమాటా ?"

"వచ్చి, అక్కడ ప్రొద్దుగూకులూ యేంజేస్తా ? అక్కడ నీకేమీ తోచదు. పేంజా అంటే ఏకేషన్ అనుకుంటున్నావేమిటి ?"

"నేనక్కడకొచ్చేది పట్టణం చూచేందుకుగాదుగా, నిన్ను చూచేందుకొస్తాను."

ట్రెయిన్ని చూచి, ఒలోడ్యా అతనితల్లీ వచ్చేశారు. రైలు చాలా బాగుగా వుందని చెప్పింది నాదెజా; సోన్యాఏంకచూచి, బాగా చలిగా వుందనీ, నించోవడం మంచిదికాదనీ, యింకాస్సేపు నడిచొస్తే మంచిదనీ సూచించింది.

"సోన్యా, నన్ను మరచిపోవుగదూ ?" అనడిగాడు సావ్ చెంకో, అపనమ్మకంగా అడిగినట్లు.

"అనవసరమైన విషయాలైతే మరిచిపోతాం. అవసరమైన వాటిని మరిచిపోం."

"మరిచి అవసరమనే అనుకుంటున్నావ్ గా."

"ఇప్పుడెట్లా తెలుస్తుంది? యింకా నేను పరీక్షించనే లేదాయె, మర్చిపోతానేమో!"

"ఇప్పుడేమనుకుంటున్నావో చెప్పవూ?"

అతనివంక చూచింది సోన్యా; ఆవిడకళ్ళు నల్లబడ్డాయి. చుట్టూ జనం నిలబడివున్నందుకు ధన్యవాదాలర్పించుకుంది, లేకపోతే అతన్నక్కడ ముద్దుపెట్టుకునేదే.

"వినపడడంలేదూ? రైళ్లోకెక్కాలంటున్నాడు కండక్టర్" అన్నాడు ఒలోద్యా.

తల్లిని ముద్దుపెట్టుకుంది సోన్యా, తర్వాత ఒలోద్యానిగూడా ముద్దెట్టుకుంది. ఏమైనా చెప్తుందేమో తనకని చూచాడు సావ్ చెంకో. చేయిచాచింది సోన్యా. ఆవిడకళ్ళు మెరిసిపోతున్నై:

"వెళ్ళింతర్వాత వుత్తరం వ్రాస్తాను ..వింటున్నావా, అమ్మా? వెళ్ళగానే వ్రాస్తా...నాన్న నడిగానని చెప్పు."

◆ ◆ ◆

సావ్ చెంకో ఫాక్టరీ కెళ్తున్నాడు బస్ మీద. భీతి కుడిచి నట్లున్నాడు. తనతో యేమీ అననేలేదు సోన్యా. చివరికి యిద్దరూ పోట్లాడుకున్నట్లో, రాజీపడ్డట్లోగూడా తెలియలే దతనికి. ఆ వుత్తరం వ్రాస్తానని చెప్పింది తనతో నేమో ననిపించింది కాస్సేపు, కాని చూస్తే వాళ్ళమ్మతో చెప్పినట్లుంది. "నేనంటే యిష్టంలేదు సోన్యాకి. అది స్పష్టంగానే కనిపిస్తోంది. పెంజా వస్తానని నే నన్నప్పుడు "వొద్దొద్దు" అంది ఐనా, మరి నావంక అట్లా చూచిందేం, అలా చూస్తూంటే ముద్దుపెట్టుకో బుద్ధేసింది నాకు. యేమిటో సోన్యాని గురించి ఆలోచించకుండా వుండలేకపోతున్నాను మరీ యీమధ్య. డిమిట్రీ అన్నట్లు యిదంతా వూహాగానమే ననుకుంటా. ఐనా, డిమిట్రీ అలాగే అంటాడు, ముసలివాడై పోయాడుగదూ - ముసలాడు కాదనుకో, ఐనా బాగా పెద్దవాడే, దగ్గర దగ్గర నలభై వుండవూ? వుంటై - ఆ వయసులో యిలాంటి ఆలోచనలు రావు. సోన్యానిగురించి ఆలోచించకుండా వుండలేను. ఇంకో గమ్మత్తుంది:

మేం యిద్దరం కలవడం యెలాగూ కష్టమని తెలుసుకాబట్టి, నేను విచారించాలి న్యాయంగా ఐతే, మరి నేనింత సుఖంగా వున్నానేమిటి ?, సామాన్య స్నేహితుల్ని పంపించడాని కెళ్తేనే దుఃఖం వస్తుందే – యిప్పుడింత హుషారుగా వున్నానేమిటి నేను ? సోన్యా అంటే నాకు చాలా ప్రేమ వుంది. అందులో అనుమాన మేమీ లేదు. ఐతే, మరి నేనింత హుషారుగా యెందుకున్నట్టు ? చాలా కారణా లున్నాయనుకుంటా. నా భవిష్యత్తు చాలా బావు టుందని చెప్పాడు డిమిట్రీ. అస లవసరమైన విషయం అదీ. మా ఫాక్టరీగూడా దివ్యమైన ఫాక్టరీ, బొమ్మల పుస్తకంలో చూచినట్టు చూడాలనిపిస్తుంది ఫాక్టరీని. మొట్టమొదట ఆ కన్వేయర్ బెల్ట్ – అదేం వుందిలే, తేలికే, రోజూ చూడొచ్చు ! మా మెషీన్లు ట్రాక్టర్లని తయారుజేసే ఫ్యాక్టరీ చూడాలి తర్వాత, తర్వాత పెద్దపెద్ద ట్రాక్టర్లు స్టెప్పీలలోకి వెళ్ళడం, తర్వాత పైరు, కనుచూపుమేరవరకూ పరచుకున్న పైరు, తర్వాత రోజురోజుకూ వృద్ధిపొందే దేశం, రోజురోజుకూ బలవత్తరమయ్యే దేశం, రోజురోజుకూ సౌభాగ్యవంతమయ్యే దేశం, సిరిసంపదలలో తులతూగే దేశం, తర్వాత కమ్యూనిజం...అలాంటి ఫ్యాక్టరీలో వుంటే అందరూ సుఖంగానే వుంటారు, అందరూ హాయిగానే వుంటారు. దీనికితోడు యితర విషయాలు గూడా వున్నై: హేమ్లెట్ నాటకం. శీతకాలం ఐపోవొచ్చింది, రేపోమాపో వసంతం వొచ్చేస్తుంది. – వసంతకాలంలో అందరూ హుషారుగానే వుంటారు. దీనికి తోడు సోన్యా గూడావుంది. సోన్యాకి నేనంటే ప్రేమేనా ? యేమో, నాకు తెలీదు. కాని సోన్యావుంది, యింతక్రితమేగా నేనావిడతో మాట్లాడాను, అదే పదివేలు...ఉత్తరం వ్రాస్తుందా నాకు ? వ్రాస్తే పెంజావెళ్తాను; వ్రాయకపోతే వెళ్ళను-యేమైనాసరే వెళ్ళను; సెలవే తీసుకోను అసలు... వెళ్ళి, వెల్డింగ్ పద్ధతి బాగానే వుందని చెప్పాలి డిమిట్రీకి – అంతా అనుకున్నట్టే వుంది – కిన్నస్లో దాన్ని చెక్ చేస్తూనేవున్నాం. వెళ్ళి, అంతా శుభ్రం చెయ్యాలి, లేకపోతే వూరుకోరు.'

డిమిట్రీ యింట్లోకి వెళ్ళేముందు, దువ్వెన బయటికితీసి, అద్దంలో చూసుకుంటూ దువ్వుకున్నాడు సావ్‌చెంకో. తన కనులు తనకే విచిత్రంగా కన్పించాయి. 'దీనికి కారణం సోన్యాని గురించి ఆలోచించడమే. ఇకిప్పుడు వెల్డింగ్‌ని గురించి ఆలోచిస్తాను; మళ్లీ నాకళ్ళు యధాస్థానంలోకి వెళ్లిపోతాయి.'

♦ ♦ ♦

రైలుపెట్టె గుమ్మంలోనే నిలబడుంది సోన్యా. ఇంతకు పూర్వం ప్లాట్‌ఫామ్‌మీద వదలివేసివచ్చిన ప్రపంచంలోనే వుంది సోన్యా యిప్పటికీనీ. 'వస్తానని చెప్పాడు...తప్పకుండా రావా లనుంటే, సరే, రానీ...నాన్న చెప్పింది అక్షరాలా నిజమే—మరచిపోదగిందే మరచిపోతాం, యికోనెల్లో మరిచిపోతాడేమో నన్ను. నిజంగా రావాలనుకుంటే, వేసవిదాకా రావొద్దని వొక వుత్తరం వ్రాయాలి. కాని, నేనుత్తరంవ్రాస్తే చాలు, వచ్చేస్తాడు. ఇప్పుడేమీ నిర్ధారణ చేసుకోకుండా వుండడమే మంచిది—దేనికదే నిర్ధారితం ఔతుంది...మంచుఅంతా బూదివన్నెగా వుంది—అలాగేవుండాలి, త్వరలోనే ఏప్రిల్ వచ్చేస్తుంది...పేంజాలో అంతా సవ్యంగానే వుంటుం దనుకుంటా.'

కంపార్ట్‌మెంట్ లోపలికి వెళ్ళింది సోన్యా. తుప్పురంగు స్వెటర్ వేసుకున్న లావాటిమని షాకతను "మన వర్క్‌షాపుల్లో వెంటిలేషన్ పద్ధతి చాలా మంచిది" అంటున్నాడు సైన్యంలో పని చేసే డాక్టర్‌తో.

సోన్యా ఆలోచించింది: నే నెళ్లే ఫాక్టరీలో పనిజేసే మనిషే నేమో యీాయన బహుశా. అదీమంచిదే, యీయన్నడిగి తెలుసు కోవొచ్చు. ఆ ఫాక్టరీలో మెషీన్లెలాంటివో...కాదు, అది గడియారాల ఫాక్టరీ, నాది కాదు...అబ్బ, యేమిటీ, మరీ అలాంటి సిగరెట్లు కాలుస్తాడు...మొత్తంమీద సావ్‌చెంకో రావడం మంచిదే ఐంది — ఇదేమిటీ యింకా మూడుగంటలన్నా కాలేదు, అప్పుడే

నిద్రొస్తోంది, రాత్రి నిద్రపోలేదుగదూ.. రిత్‌ష్చెవో దగ్గర రైలు మారాలి, ఇంకాస్సేపటికిగాని రాదు ఆ జంక్షన్...'

నిద్రపోయింది సోన్యా, తల కొద్దిగా వొకవైపుకు వంచి; సంతోషంగా, ప్రశాంతంగా వుంది దాని ముఖం. స్నానాల గదుల్లో షవర్లు (నీళ్ళు పైనుంచి వర్షపుజల్లులాగా పడేట్టుచేసే సాధనం) పెట్టించాలని చూశాంగాని, బడ్జెట్‌ని కోసెయ్యడంవల్ల సాధ్యం కాక పోయిందని చెబుతున్నాడు తుప్పారంగు స్వెటర్ వేసుకున్నలావుపాటిమనిషి. చెబుతూ, చెబుతూ అగస్మాత్తుగా ఆగిపోయి, సోన్యా వంక చూడడం ప్రారంభించాడు అంతే; తల్లీనం ఐపోయాడు.

వసంతకాలం ముందుండే చెమ్మతోని బూడిదరంగు మంచు దుప్పట్లు కప్పుకున్న పొలాల్లోబడి, నెమ్మదిగా, గుప్పుగుప్పుమంటూ ముందుకు సాగిపోతూంది రైలు.

# 16

గడియారం చూశాడు సొకొలొవస్కీ. నాలుగు గంటలైంది... యింకాస్సేపు పండుకోవచ్చు.

పక్కలో ప్రవేశించి వారంరోజు లౌతుంది. కాని, ఆ జబ్బుపడినదగ్గర్నుంచీ, నరాల నిస్సత్తువ యెక్కువైపోయింది, నిద్ర సరిగ్గా పట్టడమే లేదు యెన్ని మందులు మింగినా.

ఇవాన్‌ని గురించి ఒలోడ్యా చెప్పిన సంగతులన్నీ. జ్వరంగా వున్నప్పుడే, గుర్తుకొచ్చాయి సొకొలొవస్కీకి. అతనికి ఆశ్చర్యమూ కలగలేదు, కోపమూ రాలేదు; "మళ్ళీ మొదలు" అనుకుని, ఆవులించాడు ఆమర్దాగా. ఈ విషయాన్ని గురించంత ప్రశాంతంగా ఆలోచించుకోవడం చూస్తే అతనికే ఆశ్చర్యంవేసింది – న్యాయానికి ఇవాన్ చాలా దారుణంగానే ప్రవర్తించాడు మరి. ఆరేళ్లు కలిసి మెలసి ప్రవర్తించింతర్వాత..."ఐనా దీనివల్ల పెద్ద మునిగిపోయే దేంవుందిలే? యేదిచూచినా ఆశ్చర్యం వెయ్యడంలేదు నాకిప్పుడు; వీరా అన్నట్లు దేన్నీ పట్టించుకోకపోవడం అలవాటు చేసుకున్నాన్నేను."

ఒలోడ్యా వచ్చి, ఇవాన్‌ని వుద్యోగంనించి తీసివేశారని చెప్పినప్పుడు, "అలాగా... అంతేమరి, జరుగుతుందనుకున్నదే జరిగింది" అన్నాడు. అలా యెందుకనుకున్నారని ఒలోడ్యా అడగలేదు, పైకెలా వున్నా సొకొలొవస్కీ గూడా తన తండ్రిలాంటి వాడేనని ఒలోడ్యా విశ్వాసం; వాళ్ళిద్దరూ వొకటే: అంతిమ విజయం న్యాయానిదేనని నమ్ముతారు వాళ్ళు.

జబ్బులో, పదిహేనురోజులు పండుకున్నాడు మంచంమీద సొకొలొవస్కీ, అప్పుడు ప్రతిరోజూ వుదయంవచ్చి పోతుండేది డాక్టర్ వీరా. సాయంత్రంఐన దగ్గర్నుంచీ వొకటే నిరీక్షణచేస్తుండే

వాడు సొకొలొవస్కీ— ఆవిడ మళ్ళీ యెప్పుడొస్తుందా అని; కాని వీరా మొట్టమొదటే చెప్పింది "మీరెక్కువగా మాట్లాడగూడదూ" అని అంచేత తన హృదయంలోవున్న విషయాలు చెప్పేందుకతను సాహసించలేక పొయ్యాడు. అప్పుడప్పుడూ హుషారివ్వడానికి ఒలోద్యా వచ్చి పోతుండేవాడు. వచ్చినప్పుడల్లా యేదో పిచ్చాపాటీ మాట్లాడి వెళ్తుండేవాడు. ఒకనాడు స్పానిష్ చిత్రరచనని గురించి ప్రసక్తించాడు సొకొలొవస్కీ. ఒలోద్యా నవ్వాడు: "క్రిందటి నాడేమో కోడిపెట్టల్ని వెయ్యమన్నారు. ఇప్పుడేమో జీవితంలో ఆనందాన్ని సంపూర్ణంగా అనుభవించే యువతి చిత్రం గీయమన్నారు ఆ యువతి చేతుల్లో చాకొలేట్లు టాఫీలు, సరే, యికా చాకొలేట్లు చాలా శ్రేష్ఠమైన వయ్యుండాలనీ, మంచి ఖరీదైన వయ్యుండాలనీ వేరే చెప్పాల్సిన అవసరంలేదు, అందులోనూ ఆ చాకొలేట్లు అచ్చంగా మనకుదొరికే వాటిలాగనే వుండాలట. మీరేమో గోయా (స్పానిష్ చిత్రకారుడు)ని గురించి మాట్లాడమంటారు నన్ను!"

ప్రొద్దు గడిచేదికాదు—చెయ్యడానికేమీ పనిలేదు, నిద్ర పోదామంటే నిద్రరాదు, పోనీ యెవరితోనైనా మాట్లాడుతూ కూర్చుందామంటే మనుషుల్లేరు—కూర్చుని ఓ ఆలోచించేవాడు సొకొలొవస్కీ; తన పసితనాన్ని గురించీ, సిగ్నలింగ్ విధానాన్ని గురించీ, యుద్ధంలో చనిపోయిన తన స్నేహితుల్ని గురించీ, మేరీప గురించీ, కొత్త కొత్త వెల్డింగ్ పద్ధతుల్ని గురించీ, ఇవాన్స గురించీ, యితర గ్రహాలమీది జీవకోటుల్ని గురించీ, పిలాటోవ్ ఆపరేషన్ని గురించీ, జాగృత ఆసియాని గురించీ, శాంతి పోరాటాన్ని గురించీ. కాని, దేన్నిగురించి ఆలోచిస్తున్నప్పటికీ, మనసు మళ్ళీ మళ్ళీ వీరా వైపుకే పరుగెత్తేది. జ్వరంలో వాళ్ళు తెలియకుండా పడుకున్నప్పుడొకసారి, స్పృహవచ్చి కళ్ళుతెరిచిచూస్తే కనిపించిన వీరాకళ్ళని గుర్తుకు తెచ్చుకునేవాడు. ఆ చూపులో యేదో అసాధారణ

విశేషం వుంది. ఇప్పుడు వీరా యేమని అనినా, ఆ విశేషాన్ని మాత్రం
మరచిపోలేకపోయాడతను. ఒక్కోసారి, 'అదంతా నేను వూహించు
కున్నదేనా?—యేమో! జ్వరం మరీ యెక్కువగా వున్నప్పుడు—
నిజంగా నేనావిణ్ణి చూసిందప్పుడేనా, లేకుంటే బాగా స్పృహవచ్చి
ఆవిడ మాటలూ, చేష్టలూ బాగా చూడగలిగిన స్థితేర్పడిం
తర్వాతనా? యేమో! నమ్మకం కుదరడంలేదు నేను చూచింది
మట్టుకు ఆవిడ కళ్ళనే, ఆ కళ్ళే చూశానని నా నమ్మకం. ఆ
చూపుదే ఆ ఆర్ద్రత' అని అనుకునేవాడు తనలో తానే.

నాలుగున్నరైంది. ముళ్ళమీద కూర్చున్నట్లుంది సొకొలొవ
స్కీకి. జబ్బు పడింతర్వాత, మొట్టమొదటి సారిగా, యివ్వాళ
వెళ్ళి వీరాని చూస్తాడు. తానంటే అంత జాగ్రత్తవహించినందుకు
ధన్యవాదాలర్పిస్తాడు. ఇప్పుడెలావుందని అడుగుతుందావిడ;
యింకా తాను డాక్టర్ననే భావం చూపించేందుకు ప్రయత్ని
స్తుంది. తర్వాతిక మూగనోము పడుతుంది, తాను మాట్లాడేందుకు
యేమీ వుండదు. "కాదు, కాదు, అలాఐతే కుదరదు, మూగి
లాగా కూర్చోడమంత చెడింకేమీ లేదు, ఆ గదినంతా మాటల్తో
నింపివేసెయ్యాలి. ఏదోవొకటి మాట్లాడుతూనే వుండాలి.
ఫోమ్కా ఒలోడ్యామీదపడి కరిచిందని చెబుతాను. రకరకాల
చాకొలెట్లని ఒలోడ్యా చిత్రీకరించబోతున్నాడని గూడా చెబుతాను
యిదే సందర్భంలో - యీ సందర్భం కాకపోతే యింకో సంద
ర్భంలో నైనాసరే - తాంగ్ కాలంనాటి చైనా శిల్పకళ గురించి
గూడా ప్రస్తావిస్తాను. బహుశా వీరాగూడా యేదోవొకటి చెబు
తుందప్పుడు నాకు...ఇవాన్ భార్య తనతోనే వుంటోందని చెప్పింది
వీరా యిదివరకు - ఎలీనా ఎగొరోవ్నా అనుకుంటాను, ఎలీనా
బోరిసోవ్నా యేమో బహుశా? - యిప్పుడు గూడా అక్కడే వుండి
వుంటుందావిడ; యింకేం, అంతా సవ్యంగానే గడిచిపోతుంది -
యేదో మామూలుగా టీ త్రాగుతూ మాట్లాడుకునే మాటలు.
ఆమాటలైపొయ్యేప్పటికి యెవరో వొకరొచ్చి వీరాని పిలుచు

కెళ్తాను, డాక్టర్ గదూ; యెవ్వరూ వచ్చి పిలవకపోతే, నేనే లేచి, యిచ్చేస్తాను. ఇకప్పుడు లేచి కూర్చుంటే మాత్రం వొరిగేదేం వుంటుంది గనుక?...కాని, ఆవిడ నావంకలా చూడడం నాకెందుకు కనిపించిందీ అని? యేది జరిగినా, అది మాత్రం మరచిపోలేన్నను. ఐనా, మాటలూ, వ్యాఖ్యానాలూ, చిన్న చిన్న దృశ్యాలూ అవసరమా నిజంగానే? సాయంత్రం అయ్యేప్పటికి మంచి మంచి రంగులన్నీ మాయమైపోతాయి, అంతా మూగవోయి నట్లుంటుంది, అంతా నిరుత్సాహంగా వుందా అనిపిస్తుంది. కాని, ఆ లోతు - ఆ నిశ్శబ్దత - తల తిరిగిపోతుంది దాంతో..."

ఐదింటికల్లా లేచాడు. ఒళ్లు విరుచుకుని, పొట్టమీద దేకుతూ ముందుకొచ్చింది ఫోమ్కా, వురసూహాల్వేన మిస్తా. ఫోమ్కా అదోవింతరకమైన కుక్క. మామూలు మంచికుక్కల్లా, యిచ్చకంగా దయకోసం దేవుళ్లాడుతున్నట్లు, గెంతనూ గెంతదు, హుషారుగా అరుస్తూ తోకాడించుకుంటూనూ రాదు, వచ్చి, సొకొలొవస్కీ కాళ్ళ కొట్టేసుకుని పండుకుంటుంది, తర్వాత తల పైకిలేపి, సొకొలొవస్కీ కళ్ళలోకి చూచి ది ప్రేమనీ, బాధనీ, భయాన్నీ, కళ్ళలో పొదువుకుని.

"యేమిటే పిచ్చి! అలావున్నావ్!" అనడిగాడు సొకొలొవస్కీ, "యేమైనా పీడకలొచ్చిందా నీకు? నీ కలలో నిన్నెవరైనా కొట్టారా?"

కళ్లు రెప్పవెయ్యకుండా చూచింది ఫోమ్కా, సొకొలొవస్కీవంక. అచ్చంగా మనిషికళ్ళలాగానే వున్నాయి ఫోమ్కా కళ్లు విచారంగా. 'పాపం, యేదో చెప్పాలనుకుంటుంది, మాటలురావు. ఎంత సిగ్గుచేటు. పాపం బాగా కొట్టారేమో పట్టుకుని. ఇక్కడి కొచ్చింతర్వాత కూడా యిదివరకటిలాగానే వుంది—పిచ్చెత్తినట్లు కాపలాకాస్తూ; బాల్యదినాల్లో నామీదికి తూగ్గానే పట్టుకోవడం మంచిదే ఐంది. దీని పీడావదిలించుకో. లేకుంటే యిబ్బందిపడతా వంటాడు బిలోవ్స్కీ. నేనే వొదిలిపెడితే దీన్నింకా దగ్గరతీసేవాళ్ళెవ

ళ్లుంటాయి ? సించున్నదాన్ని నించున్నట్టు కాల్చిపారేస్తారు. అది నావంక చూచే చూపే చాలు. నేనంటే దానికి బాగా విశ్వాసం వుందని చెప్పేందుకు; యిదీ మరీయింత పిచ్చిగావుండడాని క్కారణం దీని జీవితవేఁనేమో...'

ఆరయ్యేప్పటికి గడ్డమదీ చేసుకుని, ఫోమ్కాని వెంటబెట్టు కెళ్లాడు గడిబయటికి. ఆవాళ్టి పత్రికొచ్చిందేమోనని చూచాడు, పత్రిక్కి, బదులు సన్నగా, పొడుగ్గావున్న కవరొకటి కిందపడింది పెట్టెలోనుంచి—మేరీ వ్రాసిన వుత్తరం.

నాన్న గారూ,

ఈ మధ్య నా జీవితంలో పెద్దపెద్ద మార్పులనేకం జరిగాయి. పారిస్‌లో అంతా యెదురే తిరిగిందిగాక, కొత్త కొత్తవి బోలెడున్నై, ప్రేక్షకుల్ని లాగడమంటే మాటలు కాదు; ఒక ప్రదర్శనం యిద్దామని చూశాను, అప్పుల్లో పడ్డాను, చివరికి బ్రస్సెల్స్ వెళ్ళిపోయాను. నాకోసమని ఒక ప్రదర్శనం యేర్పాటుచేశా రిక్కడ. సాయంకాలం పత్రిక వొకదాంట్లో, నా నృత్యాన్ని గురించొక వ్యాసం వ్రాశాడు నాభర్త, ఫెలిక్స్ వాండర్ వెల్డ్; నా భర్త కళావిమర్శకుడు. మేం వొకళ్ళ నొకళ్ళం కలుసుకునేందు కదీ కారణం; పెళ్ళి చేసుకుందాం అన్నాడు; సరేనన్నాను. పత్రికల్లో వ్యాసాలు మాత్రమేవ్రాసి, బ్రదకడం దుర్లభమేగా సహజంగా, అంచేత పగలల్లా బాంక్‌లో పనిజేస్తాడు. చాలా సున్నితమైన హృదయం అతనిది, ఒకళ్ళ నొకళ్ళం చాలా బాగా అర్థం చేసుకుంటున్నాం మేం. మాస్కో విలేఖరిగా, ఒక ప్రముఖ పత్రిక తనని మాస్కో పంపబోతూందని ఈ మధ్యనే చెప్పాడొకసారి; మాస్కో వెళ్ళి అక్కడి నాటకరంగాన్ని గురించీ, ప్రాక్పశ్చిమ వ్యాపారానికున్న అవకాశాన్ని గురించీ వ్రాయాలని చెప్పారట ఆ పత్రికాధిపతులు. ఇదింకా

ఖాయం కాలేదనుకోండి, ఐనా ఆయనవెంట నేనుగూడా మాస్కో రావాలని కలలుగంటూ ఉవ్విళ్ళూరుతున్నాను. అక్కడికొస్తే మిమ్మల్నీ చూడగలుగుతాను, మాస్కోలో నా నృత్యాన్ని ప్రదర్శించగలుగుతాను. కమ్యూనిస్టుకాకపోయినా చాలా మంచివాడు ఫెలిక్స్, నే చెప్పేదంతా చెవులు కోసుకుని మరీ వింటాడు; నేను పుట్టింది రష్యాలోనే ననే విషయం చచ్చినా మరచిపోను నేను. నా అభిప్రాయాలూ, మీ అభిప్రాయాలూ వొకటి కాదనుకుంటా; ఐనా మొత్తం మీద నన్ను సానుభూతిపరురాలుగా జమకట్టుకోవచ్చు. అక్కడ మీ జీవితవిధానం యెలా వుంటుందో నాకేమంత బాగా తెలియదనుకోండి, ఐనా అందులో యేముంది, ఫెలిక్స్‌తో కలిసి నే నక్కడికొస్తే అంతా యిట్టే అర్థమై పోతుంది; నాకు ఆ భాషగూడా బాగా తెలుసు, అదేగా అసలు కావలసింది గూడా. అంచేత, యీలోపుగా రెండు ప్రభుత్వాలమధ్యా పేచీలేమీ రాకుండావుంటే, ఆ పత్రికాధిపతుల మనసీలోపుగా మారిపోకుండా వుంటే, మనం యిద్దరం త్వరలోనే కలుసుకోవచ్చు నన్నమాట.

మీ కూతురు,

మేరీ వాండర్ వెల్డ్,

అదీ పనిగా అటూ యిటూ తిప్పిచూశాడా పూలకాగితాన్ని సాకొలావ్‌స్కీ. మేరీ ఫోటోగ్రాఫ్‌ని తదేకదీక్షతో పరిశీలించాడు. తల్లి పోలికలు కొన్నివున్నై మేరీకి...

ఆయస్సరం. పనికెళ్ళేందుకు కింకా టైముంది. ఏదోవొక పుస్తకం తీశాడు చదువుదామని బెన్వెనూటో సెల్లినీ జీవితకథ. మళ్ళీ మూసేశాడు పుస్తకం. అనుకోకుండానే కూచ్చుని వ్రాయడం ప్రారంభించాడు:

నా మేరీ,

ధన్యవాదాలు, నువ్వు మాస్కో వచ్చినప్పుడు, నిన్ను చూచేందుకు ప్రయత్నంచేస్తాను. నువ్విప్పుడెలా వుంటావో వూహించుకోలేకుండా వున్నాను. నువ్వు విద్యార్థినిగా వున్నప్పుడు తీయించుకున్న ఫోటోలో కొంతగాకపోతే కొంతైనా గుర్తించగలిగాను కాని, మరీ ఆ గ్రీక్ ట్యూనిక్ లోవున్న ఫోటో అసలర్థమే కాలేదు నాకు. నీ వుత్తరమూ అర్థం చేసుకోలేకపోయాను నేను. పెద్ద పెద్ద విషయాల్ని గురించి గూడా చాలా తేలిగ్గా మాట్లాడుతున్నావ్ నువ్వు. మాస్కో చూడాలనుకుంటున్నావని తెలిసింది నీ వుత్తరం చూస్తే; యిక్కడ నృత్యం చెయ్యాలనుకునే నీ ప్లానెంత వరకు నెరవేరుతుందో చెప్పడం కష్టం; మాకు చాలా మంచి నృత్యసభా వుంది; నృత్య నిపుణులూ వున్నారు. బహుశా నువ్వు వినేవుంటావ్. నువ్వూ, నీ భర్తా, అతను నిజంగానే మంచివాడైతే, తప్పకుండా యీ నూతన ప్రపంచాన్ని చూచి ఆనందించ గలుగుతారు. కాని, మాస్కోలో పుట్టావు కాబట్టి, యిక్కడివారి నర్థంచేసుకోవడం తేలికని మట్టుకు అనుకోకు. గొగోల్ కూడలిదగ్గర యిసుక దిబ్బల దగ్గర ఆడుకునేదానివి నువ్వు చిన్నప్పుడు; నాకు బాగా జ్ఞాపకం; నీతోపాటింకా అనేకమంది పిల్లలుగూడా ఆడుకునే వారక్కడ. మేం యెలా యెందుకు జీవిస్తున్నామో ఆ పిల్లలికి తెలుసు: వాళ్లు పెరిగి పెద్దయ్యిందిక్కడ, యిక్కడే పని జేశారు, యెన్నో కష్టాలూ, సుఖాలూ అనుభవించారు, కలలు గన్నారు, మీ అమ్మ నిన్ను బెల్జియం తీసికెళ్లడం, నీ పొరపాటేమీ కాదు; నిజమే కాని, నువ్వీ విషయాలన్నీ యింకా సహేతుకంగా పరిశీలించాలి, యీ దేశం వచ్చేప్పుడు నువ్వొక విదేశస్థురాలివిగా, ప్రయాణీకురాలిలా వస్తున్నావనే విషయాన్ని గుర్తించగలగాలి నువ్వు. మా జీవితవిధా

నందేమిటో తెలియదని నువ్వంగీకరిస్తున్నావు. నువ్విక్కడకొచ్చి, కొన్నిరోజులుండి, నేనూ, నా సహచరులూ యెలా పనిచేస్తున్నామో, మాకెందుకు సంతోషం కలుగుతుందో, కోపంయెందుకు వస్తుందో చూచినప్పటికీగూడ—నువ్వేమీ అర్థంచేసుకోలేవు. ఇదో విభిన్నప్రపంచం, చాలా తేడావుంది మీ ప్రపంచానికీ యీ ప్రపంచానికీ! యిదంతా యిక్కడే యెందుకు జరిగింది? ఇంకెక్కడా, వుదాహరణకి బ్రసెల్సులో, యెందుకు ఒరగలేదు? మాకు రొట్టె తక్కువా, హృదయం యెక్కువా కావడంవల్లనే కావచ్చును బహుశా. ఇదంతా సామాన్యమైన విషయంకాదు, అదంతా కష్టాలు పరిచిన చాలా పెద్దబాట. ఎప్పుడైనా అవకాశముంటే ఆలోచించు. ఒక్కోసారి నేను ట్యాపిక్కునీ, వుత్తరాన్నీ మరిచి పోతాను; మరిచిపోయి 'నాకూతురు' అని మాత్రమే అనుకుంటాను. నా చిన్నారి మాషాఅని పిలుస్తాను. వింతలెప్పుడూ జరుగుతూనే వుంటాయి, కాని ఆ పెంకు వెనుక దాక్కున్న...వ్రాస్తూవ్రాస్తూన్న పెన్ కిందపెట్టి ఆశ్చర్యంగా చూశాడు సొకొలోవస్కీ వ్రాస్తూన్న వుత్తరానికేసి. 'నాకు మరీ బుద్ధిలేకుండా పోయిందనుకుంటూ ... యెవరికీ నేనీ వుత్తరం వ్రాస్తున్నది. యెందుకు?... యేవిషయాన్ని గురించైనా మేరీకి తెలిసేట్లెలా వ్రాయగలను? అక్కడి, నేను చెప్పే బోధనలన్నీ మేరీకి కావలిసొచ్చినట్టు ఫెలిక్స్ మంచివాడైతే, అతను బాంకులోకూర్చునేది మార్కెట్‌కోసంకాకపోతే, గత్యంతరంలేకనే అతనట్లా కూర్చోవలసొస్తే, ఆ మంచి ఫెలిక్స్‌తోనే ప్రశాంతంగా బ్రతకనీ మేరీని... కోరిస్తాను మేరీకి-వూరికే ధన్యవాదాలందజేస్తాను, చాలు.'

పూర్తికాని వుత్తరం తీసుకుని, చింపి, చిన్నచిన్న ముక్కలు చేసి అవతల పారేశాడు.

ఇంకో గంట తర్వాత, బ్రెయ్నిన్‌తో బ్రెయ్నిన్ పథకాన్ని చర్చించడం ప్రారంభించాడు. మేరీనిగురించీ, వాళ్ళిద్దరి ప్రపంచాల్నీ వేరు చేసే అగాధాన్ని గురించీ ఆలోచించడం మానివేశాడు. బ్రెయ్నిన్ పథకం ప్రకారం తయారైన మోడెల్ 'లేద్'వున్న దతని ముందు. చాలావరకు బాగా నేవుంది కాని యింకా కొన్ని లోపాలు గూడా వున్నై. బ్రెయ్నిన్‌కి సొంత ఆలోచనలు తక్కువ; అక్కడున్న ఆ వాల్వ్ అనవసరం; పాత లేద్‌లోగూడా వుంది కాబట్టి దీనికూ్కడా అలాగే వుంచేశాడు బ్రెయ్నిన్... ఆ ఆలోచనలో నిమగ్నుడైపోయి బహిర్భ్రమించాన్నే పూర్తిగా మరచిపోయాడు సొకొలొవస్కీ.

ఆవేళ సాయంత్రం యెనిమిదింటికి, వీరా యింటికెళ్ళాడు. ఎలీనా బోరిసోవ్నా (ఎలీనా ఎగోరోవ్నా కాదుగదా?) వుంటుందేమోనని భయపడ్డాడుగాని, ఆవిడక్కడ లేదు, బయటికెక్కడికో వెళ్ళింది. తను వెళ్ళడంమూలాన వీరాకి కోపంవచ్చిందనీ, చేసిన మర్యాదచూస్తే, యిష్టంలేకుండా చేసినట్లుందనీ అనుకున్నాడు.

"పని బాగా వాస్తికీగావుందా?"

"లేదు."

తనింకేం మాట్లాడ్తాడు? మాట్లాడేందుకు విషయమేమీ కన్పించడంలేదు. దేన్నిగురించి మాట్లాడదామా అని ఆలోచించేందుగ్గూడా సమయంలేదు. ఎలీనా అక్కడుంటేనే బాగుండేదేమో. 'ఇదివరకటి రోజుల్లో యేదో వొకటి మాట్లాడుతూనే వుండేవాళ్ళం. అప్పుడప్పుడూ మౌనంగా కూర్చున్నా, మొత్తం మీద యేదో వొకటి మాట్లాడుతూనే వుండేవాళ్ళం. మరిప్పుడో—యేమీలేదు. ఏదోగాని మారింది. మారిందనే సంగతి వీరాకూ్కడా తెలుసు. ఇలా యేమీ మాట్లాడకుండా యెంతసేపని కూర్చోగలం?'

సంభాషణ ప్రారంభిద్దామని ప్రయత్నించాడు:

నాకు జబ్బుగా వున్నప్పుడు; చూచేందుకని వస్తుండేవాడు ఒలోడ్యా. మొన్నొకసారొచ్చినప్పుడు, గోయాని గురించి మాట్లాడాం. గోయా వేసిన చిత్రాలు రెండున్నై, "పశుమదనం", "వృద్ధాప్యం" అని; చీపురుపట్టుకుని యిల్లూడ్చినట్టు, యెక్కువ కాలం వున్నవాళ్ళని వూడ్చిపారేస్తుంది మృత్యువు...సరే, చాలా రకాల చాకొలేక్లేవేరో చిత్రించుతున్నానని చెప్పాడు తర్వాత ఒలోడ్యా. మరీ గందరగోళంగా వుందతని పరిస్థితి, ఒలోడ్యా పరిస్థితే. ఇంకా పెద్దవాడు కాలేదతను. ఛ ఛ, నేనసలు చెప్పదలచుకొందది కాదు... లియొనార్డో గురించి అతన్నడిగానని చెబుదామనుకున్నాను...

వాక్యం మధ్యలోనే ఆగిపోయాడు సొకొలొవస్కీ, ఐనా, లియొనార్డో యేం మట్టిరంగు ఉపయోగించాడో యిప్పుడెందుకు వీరాకి చిరాకేస్తుంది. అలిసిపోయా నంటుంది. ఏమీ మాట్లాడకుండా కూర్చుంటేనే మంచిది.

టేబుల్ మీద పరచినగుడ్డని అటూ యిటూ సర్దింది వీరా, యిక్కడున్న లాంటర్నతీసి అక్కడ పెట్టింది, వెళ్ళి కిటికీ తెర వేసింది, మళ్ళీవెళ్ళి తెంతీసింది. ఏదో మరి అతిథిని మర్యాద చేయాలిగదా.

"ఇవ్వాళ్ళే పుఖోవ్ని చూచొచ్చాను. ఆయన శిష్యుడు గూడా వొకతనున్నాడు అక్కడ, మంచికుర్రాడు, శరీరశాస్త్ర మంటే బాగా యిష్టంవట అతనికి, డాక్టరీ చదవాలనుకుంటున్నాడు...మీరు రలసిపోలేదుగదా, సొకొలొవస్కీ ? మొన్న మరీ జబ్బునేసిందా, యిప్పుడెక్కువగా పనిచెయ్యగూడదు మీరు..."

సొకొలొవస్కీ యేమీ మాట్లాడలేదు. అవతలి గదిలో గడియారం తొమ్మిది కొట్టింది. గబగబా లేచి, వినపడీ వినపడకుండా, గొంతే పెగలనట్టూ, "వీరా గ్రిగోరీవ్నా, క్రిందటిసారొచ్చినప్పుడు చెప్పానే వొక మొక్కని గురించి..."అంటూ మాట్లాడ్డం ప్రారంభించాడు సొకొలొవస్కీ, "నేను జబ్బుపడ్డప్పుడూ..."

వెంటనే, అతని మాటల కడ్డొచ్చింది వీరా గాభరా పడుతూ :

"వద్దొద్దు! మీరలా అనగూడదు!"

మళ్ళీ నిశ్శబ్దం. వీరా అటుతిరిగింది, సాకొలొవస్కీ ఆవిడ ముఖం కన్పించలేదు. తను జబ్బుపడ్డప్పుడు వీరా యెలా చూచిందో గుర్తుకు తెచ్చుకుంటున్నా డతను.

"యూజనీ వ్లాడిమిరోవిచ్, మనం చిన్నపిల్లలం గాదు. అదంతా మాట్లాడుకోవడం యెందుకు చెప్పండి?" - అన్నది వీరా గొంతులోమాట గొంతులోనే మాయమైపోతూన్నట్లు.

గంట మోగింది: కుద్రియావ్ తెవ్జల యింటికెళ్ళాలి వీరా.

గబగబా కోటు తొడుక్కొంది వీరా, తలకు రుమాలు కట్టుకుంది. ఇక చాలారోజులవరకూ కలుసుకునేందుకు వీలుండదని అతనికి తెలుసు. "ఇకుంటాను, వీరా గ్రిగోరీవ్నా" అన్నాడు బాధగా.

ఏమీ తోచలేదు వీరాకి, కలవరపడి, "వద్దు వ్లాడిమిరోవిచ్, నేనొచ్చేదాకా వుండండి, యిప్పుడే వచ్చేస్తా" అంది.

చిరునవ్వు నవ్వింది వీరా. ఆవిడ ముఖంలోకి యౌవ్వనం తొంగి చూచినట్లైంది, యేవో మధురస్మృతుల్లో లీనమైపోయి నట్లుంది. అప్పుడే గనక ఎలీనా వీరానిచూస్తే, "నాకంటే వీరాయే చిన్నది" అనుకునేది తప్పకుండా. కాని ఎలీనా అక్కడ లేదు. హాలులో దారి చీకటిగా వుండడంమూలాన సొకొలొవస్కీ ఆవిడ చిరునవ్వునీ చూడలేకపోయాడు, ఆ కళ్ళల్లో తొణికిసలాడే భావాల్నీ కనిపెట్టలేక పోయాడు. తాను జబ్బుపడ్డప్పుడు చూచిందే తనవైపు, యిప్పుడూ అచ్చంగా అలాగే చూస్తోందని పించింది సొకొలొవస్కీకి.

కిటికీ దగ్గర నిలబడి, ఆవిడకోసం నిరీక్షిస్తూ వుండిపోయాడు యెంతో ఓపిగ్గా.

కిటికీ బయటంతా యేదో కలవరం కలవరంగా వుంది. హమ్మయ్య, శీతకాలం పారిపోతూంది.

వీధిలో కాలిదారంటవున్న మంచంతా కరిగింది, ప్రవాహమై ప్రవహిస్తోంది: కాస్త అక్కడే ఆ తోటముందు మాత్రం యింకా స్తుంది. కిటికీలింకా అలాగే బాధించున్న తెర చేందుకు వీల్లేకుండా. బయటెవరో మాట్లాడుకుంటున్నట్లుమాత్రం వినిపిస్తోంది.

ఉన్నట్టుండి, ఒక్కసారిగా జగత్తంతా యెంతో సజీవంగానూ, వుషారుగానూ కేరింతలు కొడుతూం దనిపించింది.

'అంతా గమ్మత్తుగావుందే, యింకాస్సేపుంటే వీరా వచ్చేస్తుంది, ఆవిడొచ్చిం తర్వాత యేం మాట్లాడాలో యింతవరకూ ఆలోచించుకోనేలేదు నేను. నేనేమీ అనను. అంటే, "వీరా, చూశావా! వసంతం వచ్చింది" అంటాను; అంతే.'

# 17

ఒలోద్యా మళ్లీ వస్తాడని కలలోగూడా అనుకోలేదు తానెచ్కా. జనవరితర్వాత యింతవరకత నావిడదగ్గరకు రానేలేదు. బజారులో రెండుసార్లు కన్పించాడు: లాభంలేదు, నే నెందుకూ పనికిరాకుండా పోతున్నాను అని అన్నాడు. ఎప్పుడైనా వచ్చినా రావొచ్చుగాని, అందువల్ల లాభమేమీ వుండదు, వొకళ్ళ నొకళ్లు బాధపెట్టుకోవడం తప్పితే, తనతో వున్న సంబంధంకాస్తా తెగ తెంపులుచేసుకోవా లనుకుంటున్నాడని అర్థంచేసుకుంది తానెచ్కా. అర్థంచేసుకుని కొద్దిగా యేడ్చిందిగూడాను, యేడ్చింతర్వాత అతనే కరెక్టనుకుంది—వూరికే తాత్సారం చేసేకంటే, విడివడాలను కోగానే విడివడిపోవడమే మంచిది.

మళ్ళీయిప్పుడు కొండమీదినుంచి వూడిపడ్డట్లొచ్చిపడ్డాడు. కోపంవచ్చిం దావిడకి.

"మళ్ళీ నేను కన్నీరు కారుస్తానని నువ్వేమీ అనుకోవాల్సిన పనిలేదు. విడిపోదామన్నావ్ నువ్వు. నే నొప్పుకున్నాను. మళ్ళీ వెనక్కెళ్ళా లనుకోవడంలో అర్థంలేదు."

ఒలోద్యా నవ్వాడు:

"నీ కిష్టంలేందేదో నీతో వొప్పించాలనేమీ రాలేదు నేను. నా మనసేమీ బాగాలేదు, బయటేమో వసంతం. అలా వెళ్తూంటే మీాయిల్లు కన్పించింది. నాలాగేనే నువ్వూ బాధపడుతున్నావేమో ననుకున్నాను, నాతోపాటు, కాస్సేపలా షికారుకొస్తావేమో నను కున్నాను; అలా పార్కుకెళ్ళొచ్చును."

ఒలోద్యా అనుకున్నది నిజమే; యీమధ్య తానెచ్కా మనసుగూడా యేమీ బావుండలేదు; సంతోషించదగిం దేమీ కన్పించలేదావిడకి తన జీవితంలో. ఒలోద్యాకి దూరమైన తర్వాత,

గ్రిఫ్ జ్యోవ్ నటుడు ఆవిడంటే శ్రద్ధచూపించడం మొదలెట్టాడు, అతనంటే ఆవిడ కేమీ యిష్టం కలుగలేదు. తెలివితేట ల్లేవు, నిలువంతా అసూయే అతనికి, చెమట చేతులు; యెందుకు బాధపడ్తావ్, యిక్కడేదీ లాభంలేదని చెప్పేసిం దతని ముఖంమీదనే. సాయంత్రం పూట పనేమీ లేనప్పుడు, వొంటరిగా యింట్లోనే వుండిపోయేది, లేసు అల్లుకునేది, డికెన్స్ పుస్తకాలు తీసి చదువుకునేది. లేకుంటే వూరికే మంచంమీద పడుకుని కాలంగడిపేసేది, అప్పుడప్పుడూ తలగడలో తలదూర్చి కన్నీరు కార్చేది. నాటకరంగంమీదగూడా యేమీ రాణించలేదు, యీమధ్య ఆవిడ వేసిన పాత్రలన్నీ అపజయమైనట్లే లెక్క. హామ్లెట్ నాటకంలో ఒఫీలియాపాత్ర వేసింది, అదీ దుంపనాశన మైపోయింది; ప్రేక్షకులు కరతాళధ్వనులు చేశారు. ఐనా యింతకంటే ఛండాలంగా యిదివరకెప్పుడూ నటించలేదనే ఆవిడ అభిప్రాయం. తర్వాతొక సోవియట్ నాటకంలో వేషం వేసింది; విదేశాల యేజెంటుగా పనిచేసే వొక ప్రొఫెసర్ గుట్టు బయటికి లాగే పాత్ర అది; లెబొరేటరీ ఎసిస్టెంట్. అది మరీ దారుణం. సజీవమైన మాటొక్కటి లేదందులో; ప్రొఫెసర్ని నిందిస్తూ ఆవిడ వుపన్యాస ధోరణిలో ప్రసంగిస్తూంటే, ప్రేక్షకులు విరగబడి నవ్వారు; అప్పుణ్ణే యేడుద్దామనిపించింది తానెచ్చాకి: అర్థంలేని యీ నట నేమిటి? పలుకులేని ఈ మాటలు అనడ మేమిటి? తన కీ ఖర్మెందుకూ అని. వేసవికాలం వచ్చేస్తోంది. కాపిన్ జైవా గ్రామసీమకి పోయి, తన తల్లితో వుండే కాలం వెళ్ళబుచ్చుతుంది హాయిగా. దానిలో వాయ్యాల్టా వెళ్తుంది – ఎవరో భూగర్భశాస్త్రజ్ఞుడితో వ్యవహారం నడుపుతోంది. తా నెలా గడుపుతుం దీవేసవంతా– జూలై అంతా పర్యటన, ఆగస్టులో సెలవు – జెనీవో వెళ్ళేందు కనుమతి కావాలని కోరుకోవాలి, అక్కడి కెళ్తే పర్వాలేదు, వున్న డబ్బు సరిపోతుంది, కాని అక్కడేం జరుగుతుందో యిక్కడుండే వూహించుకోవచ్చును: భోజనాల సమయంలో, ఆవిడమీద చేసిన వంటలవల్ల కలిగేలాభా లేమిటో, సవిస్తరంగా, చికిత్సకోసమని

అక్కడికొచ్చే వాళ్ళందరికీ చెప్పడం; పురుగులు పట్టిన పుట్టగొడుగుల్ని మధ్యాన్నంపూట సేకరించడం; భోజనం చేసేప్పుడు యెవరో వొకరు చెడ్డ్రతాగి గల్లంతు చేస్తారు; యిక దాన్ని గురించి ఆ వాళ్ళల్లా అందరూ విమర్శలూ, వ్యాఖ్యానాలూ చేస్తారు; తర్వాత 'ఒగోని యోక్' పత్రికలో వచ్చే క్రాస్వర్డ్ పజిల్! 'బ' అక్షరంతో ప్రారంభమయ్యే ఆరక్షరాలున్న ఒకానొక ఖనిజ పదార్థాన్ని గురించీ, యిరవైమంది తలలు పగలగొట్టుకుంటూ కూర్చుంటారు.

"సరే, వెళ్దాంపద...కోటు వేసుకోనా, కేప్ (ఈ డ్రెస్సుకు చేతులుండవు, భుజాల్ని మట్టుకు కప్పుతుంది) వేసుకోనా, చెప్పు నీ కేది బావుంటుందో?"

"కేప్ వేసుకో. నీ కదే బావుంటుంది, వాతావరణంకూడా బాగా నేవుంది, యివ్వాళసలు బయటికి వెళ్ళనే లేదా నువ్వు?"

"వెళ్ళాను, కాని గుర్తులేదు, అంత పరిశీలించలా."

బజారంతా హుషారుగా వుంది, కాలిదారి తడితడిగా మెరిసి పోతూంది. కాని తానెచ్కా యిదేమీ చూడడంలేదు, నిరుత్సాహంగా నడుస్తోంది. తన నవమానించేందుకే, ఒలోద్యా యిలా షికారుకు రమ్మని ఆహ్వానించా డనిపించింది. 'తను సైగ చేస్తేచాలు గతమంతా మరచిపోయి కుక్కలా వెంటబడి వస్తానని అతని వుద్దేశం అదేమీ కాదు. ఇదివర కెప్పుడో అతనంటే యిష్టపడుండొచ్చును, యిప్పుడా రోజులు పోయాయ్.'

ఒలోద్యాకి గుచ్చుకునేట్లు మాట్లాడా లనిపించింది.

"ఈమధ్య మ నిద్దరికీ అసలు పరిచయమే లేదు. బాగు న్నావా? పోనీ, నీ భాషలోనే అడుగుతాను, బాగా సంపాదిస్తున్నావా?"

"ఏం సంపాదన లే. నా అదృష్ట మేమీ బాగుండలా. ఇవాన్ బొమ్మవేశాను. బొమ్మ ప్రారంభించినప్పు డతను మన పరిశ్రమలకి నాయకుడు, యిప్పుడేమో అతని వుద్యోగం వూడగొట్టారు. ఇప్పు

డెక్కడో ఆఫీసుముద్రలు చేసే కార్యాలయంలో మానేజర్‌గా వున్నాడట. ఆ బొమ్మకి పరిరూపాబుళ్ళుగూడా రా విప్పుడు."

"విచారంగావుందా, బాగా?"

"మొత్తంమీద చూస్తే లేదనే చెప్పాలి. అత నా వుద్యోగంలోనుంచి తొలగించడం మంచిదే."

"ఇంతకీ, ను విప్పు డేం జేస్తున్నట్టు?"

"క్లబ్బులోవా ళ్ళావో బొమ్మలేసిపెట్టమంటే వేసిచ్చాను. అలాంటిదే యిం కేదో పని దొరుకుతు దనుకు టున్నా."

"అంటే పర్వాలేదన్నమాట, మొత్త మీద నీపని బాగానే వుండన్నమాట...సరేగాని, సబురో వేం జేస్తున్నా డిప్పుడు?"

"చిత్రలేఖనం. మొన్నరాత్రి వా ళ్ళింటిదగ్గరే వున్నా నేను. ప్రదర్శనకోసమని రెండు చిత్ర లు పట్టుకెళ్ళారట యూనియన్ వా ళ్ళొచ్చి. వున్నవాటిల్లో చెడ్డవే యేరికెళ్ళారంటా డతను, యేదైనా, పట్టుకెళ్ళారు, అంతేచాలు."

"బలే గమ్మత్తుగా వుందే, ఇదివర కతన్నిగురించేగా తల తిక్కమని ఫంటూండేవాడివి నువ్వు, తలతిక్కమ పని యెందు కంటున్నావో నిరూపించాలనిగూడా చూచేవాడివి."

ఒలోడ్యా యేమీ మాట్లాడలేదు. వాళ్ళ ముం దొక జంట నడుస్తున్నారు, వెనకనుంచీ చూచినా తెలుస్తూనేవుంది వాళ్ళిద్దరూ ప్రేమికులనీ, యేదో విషయం చాలా తీవ్రంగా మాట్లాడుకొంటు న్నారనీ ఒలోడ్యాకి నవ్వొచ్చింది.

"ఎవరైనా చూస్తే మ నిద్దరం యాభైయేళ్ళక్రితం పెళ్ళి చేసుకున్నవాళ్లం అనుకుంటారు."

"ఎందుకని, అంత పెద్ద జాగ్రత్తగా గుర్తుంచుకోవాల్సిందేమీ కనబడ్డంలేదే నాకు."

"నాకుంది...ఐనా పర్వాలేదు. ఆ కంటిభార్య బొమ్మిం కొకటి వేశాడు సబురోవ్, ఈసారి లేత యెరుపు బ్లౌజ్ వేసుకుందావిడ."

"బాగుండలేదా నీకు ?"

"బాగా లేకపోవడ మేమిటి? నిజంగానే చాలా బాగానచ్చింది. అలాంటివి ప్రదర్శనలకోసం తీసుకోరు వాళ్ళు."

"ఇంతకీ నీ అభిప్రాయం మేమిటి?"

"ఆఁ, యేమీ లేదు. నేను మరీ పొట్టకక్కుర్తిమనిషినీ అని- సంతోషంగా వుందా నీకు ?- ఐనా అందులో కొత్తేంవుంది."

అందరూ అలాంటివాళ్లేననేవాడివిగా యిదివరకు. ఇప్పుడిదేమిటీ యిలా అంటున్నావ్ ?"

"ఏమోఁ."

"ఇవ్వాళింతవరకూ నవ్వొచ్చేమాటగాని, జీవితంవంతా కాచి వడపోసినట్టు వొక్క గొప్పమాటగాని అనలేదే నువ్వు, నువ్వు పాత ఒలోడ్యావేనా అనిపిస్తూంటే !"

"నాసంగతి నాకు తెలిసివచ్చింది. తప్పుడుదారిని పడిపోతున్నావనేవారు మా నాన్న. నేనూ అలాగే అనుకున్నా. ఇప్పుడేమోఁ నే నస లేదారినీ నడవడంలేదని బైటబడింది. ఐనా అందులో చర్చించాల్సిందేంవుందిలే, అందులోనూ యింతచక్కని రోజున ఆ చర్చలన్నీ యెందుగ్గనక...ఒఫీలియా వేషం వేశావటగా నువ్వు ?"

"ఆ, వేశాను, ఛండాలంగా."

"సాన్ చెంకో చాలా గొప్పగా చెప్పాడే నువ్వు చాలా బాగా నటించావనీ; నిన్ను చూస్తేనే హృదయం స్పందించిందనీ, అచ్చంగా నువ్వు నటించినట్లుగానే ఒఫీలియా వుంటుందని తానెప్పుడూ వూహించుకుంటూండేవాణ్ణనీ అన్నాడతను."

"అతనూరికే సంతృప్తిపడిపోతాడేమోఁ, వొకటిమట్టుకు ఖాయం, నేనంత అసహ్యంగా యిదివరకెప్పుడూ యేపాత్రా నటించలేదు; ఒక్కొక్కసారలా పాత్రలోకి ప్రవేశించనేలేకపోయ్యే దాన్ని... యిదివరకు నువ్వు అలాంటి దేమీ అవసరంలేదని నవ్వేసే

వాటివిగా. ఆ విషయంలోగూడా నీ వుద్దేశాలు మార్చుకున్నావా? ఇంతకీ కళంటూ వొకటున్నదని అంగీకరిస్తావా ?''

''ఆ ప్రశ్ననిగురించి యెప్పుడూ ఆలోచించలేదు నేను. ప్రధానంగా ఆలోచించింది, కళలో నా కేమీ స్థానం లేదూ అని; విచారించవలసిన విషయమేదైనా అసలు సంగతదే. నా కొక్క దమ్మిడీమెత్తు తెలివితేటలుగూడా లేకనైనా లేకపోవాలి. వొకేళంత కంటే యింకొక అణాకానీ తెలివితేటలెక్కువే వున్నా, వాటి నన్నిటినీ మొట్టమొదట కనిపించిన బొప్పాయిగుండులో పెట్టి పోగొట్టుకునైనా పోగొట్టుకునుండాలి. ఐనా ఆ గొడవంతా యిప్పుడెందుగ్గాని... మన ప్రేమికుల్ని చూశావా. ఇద్దరూ పోట్లాడుకున్నట్టున్నారు, ఆ అమ్మాయి వీధి కష్టంపడి అవతలి వేపు కెళ్లింది ఆ అబ్బాయిగూడా పరుగెత్తి కెళ్ళాడు అమ్మాయి వెంటే. ఇప్పు డిద్దరూ కలిసి మళ్లీ యిందాకటిలాగానే, మనం నడిచేవైపునే నడుస్తున్నారు."

"అతనే గెలిచాడనా నీ వుద్దేశం ?"

"అది కాదు, యివతలివైపున యెండగా వుంది సావ్ చెంకో, సోన్యాలుగూడా యెప్పుడూ యిలాగే పోట్లాడుకొంటూనూ వుండేవారు, మళ్ళీ కలుస్తూనూ వుండేవారు.''

''వాళ్ళిద్దరూ వివాహం చేసుకుంటారా ?''

''లేదు, సోన్యా పెంజా వెళ్ళిపోయింది. ఇక వాళ్లిప్పుడు వుత్తరాల్లోనే పోట్లాడుకుంటారు, వుత్తరాల్లోనే కలుస్తారు గూడానూ. సోన్యా లేని వెలితి నాన్నగారికి బాగా కన్పిస్తోంది."

"అన్నట్టు, యెలావున్నారాయన ?''

''రెండురోజుల్నుంచీ కాస్తమెరుగేగాన్నీ, డాక్టర్లకేమీ ఆశున్నట్టు కన్పించదు. ఆ మనోదార్ఢ్యాన్ని బట్టి, రొమ్ముబలంతో కొట్టుకొస్తున్నా డాయన, అంతే."

''మీ నాన్న చాలా అసాధారణమైన మనిషి. నీ కది తెలుసా ?''

"నా కంతా తెలుసు, తానెచ్కా. చాలా విషయాలు బయటి కనను నేను."

అత నెంతో బాధపడుతూ అన్నా డా మాటలు, తానెచ్కా విచారించింది యిందు కడిగానా ఇలా అని. 'ఎప్పుడూ అదేపనిగా హేళన చెయ్యకూడదు మనిషి. మారిపోయాడు — పోజు ల్లేవు, సూత్రాలు వల్లించడంలేదు. చాలా బాధ పడుతూండుంటాడు తనలాగానే...'

"దిగాలుపడకు, ఒలోద్యా. తరచు నేనూ అంతేననుకో. ఐనా, ప్రతీదీ మారిపోవచ్చునుగదా అనుకుటాను వొకోక్కసారి వుండుండి, నవ్వబాకు, మారేందు కవకాశంవుందనే నా దృఢాభిప్రాయం. అద్భుతాల్లో నమ్మకం వుందా నీకు?"

"అద్భుతం వంటే ?"

"అద్భుతంవంటే...నువ్వే వున్నావనుకో, మనసంతా యేమీ బాగుండదు, అంతా చికాకుచికాకుగా వుంటుంది, వున్నట్టుండొక్కసారి అంతా సరైపోతుంది, ప్రతీదీ మారిపోతుంది; అంటే అంతా యీ పట్టణమూ, ప్రజలూ యిలాగే వుంటారు — ఐనా ప్రతీదీ విభిన్నంగా వుంటుంది, అర్థం కాలా ?"

"మనసు మారడానికేంవుంది ? ఏ వెధవ సంగతివల్లనైనా మారొచ్చు. సొకొలొవస్కీని చూశా న్నిన్న. ఇదివరకు చెప్పే వాణ్ణితన్నిగురించి గుర్తుందా. అలాంటి మూతిముడుపు శంభయ్యనిం కెవ్వరినీ చూడలా నా జన్మలో. నిన్న నే నెళ్ళానా, వెళ్ళేప్పటికి నవ్వుతూ, పేలుతూ వున్నాడు. ఏవిటీ విశేషం అనికూడా అడిగాను. 'ఏమీ లేదు, వసంతం వచ్చింది' అన్నాడు. అరవైయేళ్ళయినా వుంటా యతనికి. వసంతం యిదివర కెన్నిసార్లు చూశాడో జన్మలో? అద్భుతంవంటే అదేనా? గనక నువ్వంటే, వొప్పుకుంటా నేను.

"అది కాదు, నేను వాతావరణాన్నిగురించీ. రుతువుల్ని గురించీ కాదు మాట్లాడుతున్నది, అంతకంటే లోతులు తరచి

చూడొచ్చును. ఎవరినో కలుసుకుంటావు, మనో వాక్కాయ కర్మలతో ప్రేమిస్తావు. లేకుంటే యేదో పని ప్రారంభిస్తావు. తర్వాత ఆ పనే నీ పంచప్రాణాలూ ననుకుంటావ్ సబురోవ్‌లాగా. నువ్వే చెప్పావుగా అతను చాలా హాయిగా వున్నాడని? అలాగే, సొకొలొవస్కీ గూడా యేమైనా చేశాడేమో తన పనిలో, అంత సంతృప్తి దొరికేది; పనంటే చాలు, వళ్లు మరచిపోతాడని నువ్వేగా చెప్పింది".

"శుక్రగ్రహంలోగూడా జీవులున్నాయని యే ఖగోళ శాస్త్రజ్ఞుడైనా అన్నా, తనువే మరచి, వినేరకం సొకొలొవస్కీ, జీవితంలో అతని కావలసిందదే. తానెచ్కా, అటు చూడు, మన ప్రేమికులుగూడా పార్కుకే వెళ్తున్నారు."

"సహజమేగా, ఆ పార్కునిండా వుండేదే ప్రేమికులు. ముద్దులు పెట్టుకుంటూ కూర్చుంటారు. అక్కడికెళ్ళి మనం చేసేదేమిటి? పోట్లాటలూ, కాట్లాటలూనూ, చిన్నపిల్లల్లాగ."

"ఏమీ చెయ్యం. వాళ్ళిద్దరూ సుఖంగావుండాలని కోరుకుందాం. వాళ్ళ ముఖాలుగూడా మన కగపిస్తే బాగుండేది. కనిపించకపోతే కనిపించకపోయినట్లే, వాళ్ళిద్దరూ బాగా మంచి అందమైనవాళ్ళే ననుకుందాం.

వేసవికాలంలో, ఆపార్కులో కెళ్లితే బాగా వేడిగా వుంటుంది. సంగీతం వినిపిస్తుంది, చెట్లనిండా దుమ్ము దుమారమూ, పార్కంతటా బెంచీలమీద కూర్చుని, పత్రికలు చదువుకుంటూనో, పిచ్చాపాటీ మాటాడుకుంటూనో వుంటారు జనమంతా. కాని యిప్పుడు పార్కంతా ఖాళీఖాళీగా వుంది. ప్రేమికులూ, వెర్రివాళ్లూమాత్రమే వున్నారు—అంతా బురదబురదగావుంది, యింకెవ్వరొస్తారుమరి. అక్కడక్కడా యింకా మంచుమాపికలున్నై, నీడల్లో, గుంటల్లో మంచు మెరుస్తోంది. ఎండపొడలు పడేచోట్లమాత్రం అప్పుడే పచ్చగడ్డి మొలకెత్తుతోంది, దూరంగావున్న బయలంతా చాలా మట్టుకు నల్లగానే వున్నది కాని, ఒక మూలమాత్రం కొద్దికొద్దిగా

పచ్చబడుతోంది, అక్కడక్కడా, వొకటిరెండు చెట్లమీద తెల్లటి మొగ్గలు వెండిలా మెరసిపోతున్నై. పక్షు లన్నీ యెగురుతూ కూస్తున్నై; అరుస్తున్నై; ఆహారంకోసమో, నివాసంకోసమో వెదుక్కుంటున్నాయేమో బహుశా. కాని, వాటి కలకలం చూస్తే మట్టుకు, యేదో హుషారుగా వింతవింత మాటలు చెప్పుకుంటున్నా యనిపిస్తుంది.

"చూశావా తానెచ్కా నువ్విందాకన్న అద్భుతమంతా కళ్ళముందే జరుగుతోంది."

"నువ్వనే దేమిటీ, నా కేమీ అర్థంకావడంలా."

"శీతాకాలమైపోయింది — అదొక అద్భుతం. నే నన్నది కాదనకు మరి, ఆ కేప్ వేసుకొచ్చేప్పటికి అసలే వేడెక్కినట్లుంది, కోటు వేసుకొస్తేనే బావుంటుందని అనుకున్నట్టున్నావ్ నువ్వు. ఆ చెట్లప్పుడే మొగ్గలు తొడిగాయి-అది రెండో అద్భుతం. పచ్చగడ్డి-అది మూడోది. అన్నిటికంటే మించిన అద్భుతం యింకొకటుంది, అదుగో అటు చూడు! ఆ చిన్న బిందువు... తెలుపంత తెల్లగా... అక్షరాలా మంచుగడ్డలోనుంచి పుట్టుకొస్తోంది..."

మంచు బిందువుని అరచేతిలోకి తీసుకున్నాడు ఒలోద్యా. అతని చేతిలోనుంచి, తన అరచేతిలోకి వంచుకుంది తానెచ్కా అతి జాగ్రత్తగా "నిజంగానే, చక్కని మంచుబిందువు" అంది నవ్వుతూ.

ఇంతవరకూ వాళ్ళ ముందు ముందు నడుస్తూన్న ప్రేమికులు కూర్చున్నారు. ఒలోద్యా మందహాసం చేశాడు: "మంచి పని చేశాడు, రెయిన్కోట్ (వాన తొడుగు) తీసి బెంచీమీద పరిచాడు, బల్లంతా తడితడిగా వుందిగాదూ అందుకని. చూశావా, నే నన్న మాట నిజమే—యెంతందంగా వున్నారో చూడు వాళ్ళిద్దరూ. అతను బహుశా ఫస్టియర్ చదువుతూండుంటాడు. ఆ యమ్మాయి గూడా యే హైస్కూల్లోనో చదువుతూనేవుంటుంది బహుశా. స్కూలు పరీక్షలు దగ్గర కొచ్చాయ్. ఐనా యిప్పుడా అమ్మాయి

ఆ పరీక్షల్ని గురించి కాదు ఆలోచిస్తూంది. ఇప్పుడా అమ్మాయి కూర్చుంటూన్నదింకొక పరీక్షకి, యింతకంటే కష్టమైన పరీక్ష గూడా యింకొకటుండదేమో!...వాళ్ళ సంతోషం చూస్తూంటే ముచ్చటేస్తోంది నాకు."

"ఎట్లా ఐతేనేం, బయటికి లాక్కొచ్చావు నన్ను, మంచి పని చేశావ్, ఒలోద్యా. అదేవిటో విచారంవిచారంగానూ, చీకటిచీకటిగానూ వుంది నా గదంతా, నాలోకి నేను ముడుచుకుపోయి కూర్చున్నా ఆ గదిలో...యిక్కడ చాలా బాగుంది, అంతా గొప్పగా, మనోహరంగా, దివ్యంగా వుంది."

"నిజంగానే దివ్యంగా వుంది! యిదివరకనేక వసంతాలు చూశానుగాని, యింత హాయి యెప్పుడూ అనుభవించలేదు. గుంటల్లో గడ్డకట్టుకున్న మంచుని పగలగొట్టడమంటే మహా సరదాగావుండేది చిన్నప్పుడు నాకు తెలుసా? ఒకసారి అట్లా పగలగొడుతూ, పగలగొడుతూ, మోకాళ్ళదాకా కూరుకుపోయాను, యింటికెళ్ళి తన్నులు తిన్నాను. బలే హుషారుగా వుంటుందిలే. మళ్ళీ అలాగే చెయ్యాలనిపిస్తోంది యిప్పుడు: వ్లాదిమిర్ పుఖోవ్, వయసు 34, ఆర్టిస్టుల యూనియన్ మెంబరు, యిప్పుడాగిపోయిన 'సోవియట్ ఆర్ట్' పత్రిక ప్రశంసావర్షానికి పాత్రుడయిన చిత్రకారుడు, యిప్పుడు యిక్కడ బహిరంగంగా, పదహారేళ్ళ స్కూలుపిల్లవాడిలా ప్రవర్తించబోతున్నాడు; కాచుకోండు!"

దూరంగా వున్న పెద్ద గోడదగ్గరికి పరుగెత్తాడు ఒలోద్యా. గోడంతా మంచు గడ్డకట్టింది, మెరిసిపోతోంది. వెళ్ళి మంచుగడ్డ తలదన్నాడు విసురుగా. తన్నినకొద్దీ వుత్సాహం యెక్కువయింది. ఉత్సాహం యెక్కువయినకొద్దీ యింకెచ్చి తన్నుతున్నాడు ఒలోద్యా. అతనలా యింకెచ్చి తన్నుతూంటే కడుపు చెక్కలయ్యేట్టు పకపకా నవ్వుతూ చూస్తూ కూర్చుంది తానెచ్కా. పైన వసంతాకాశంలోనించి, ముసుగు తొలగించి కళకళలాడుతూ

ప్రకాశించాడు సూర్యుడు, తానెచ్కానీ, ఒలోడ్యానీ, తడితడి పార్కు బెంచీమీద కూర్చున్న ప్రేమికుల్నీ, నల్లటి బయలునీ, శీతాకాలం చలిలో ముడుచుకూర్చున్న ప్రపంచాన్నీ—అంతటినీ — తన వేడివేడి వెలుగుతో ముంచెత్తుతూ.

# 18

బజారునేపడి నడుస్తూంది ఎలీనా. ప్రక్కనే కరిగిన మంచు గుంటల్లో స్నానమాడుతున్న పిచ్చుకల్ని చూడడం లేదు, ఆకాశం మీదున్న నీలి నీలి మాలికల్ని చూడడం లేదు. వచ్చేపోయేవాళ్ళ ముఖాలమీద నృత్యంచేసే నవనవారుణకాంతుల్ని చూడడం లేదు. తనని చూచి తానే ఆశ్చర్యపోతూంది. 'ఏరా మట్టుక ఏరా! యెంతమారిం దెంతమారిపోయింది. మరీ పుట్టుమచ్చలాంటి మనిషిని నేను, యెదుగూ బొదుగూ లేని పుట్టుమచ్చలాంటిదాన్ని. శిలా ప్రతిమనైపోలేదుగదా నేను.'

ఇదివరకొచ్చిన సందేహాలకీ, కలిగిన ఆవేశానికీ, పొడసూపిన గర్వానికీ, అర్థం లేదనిపించిం దిప్పుడు. పుస్తకాల్లో చదివిందంతా తనకి వర్తించుతూందనుకొంది. మనసారా ప్రేమించిన డిమిట్రీని, ఆ ప్రేమకు యెల్లలంటూ లేవు, జీవితానికి నిలువునా అడ్డంపడి మరీ దారిచేసుకుంది ఆ ప్రేమ. ఏమిలాభం? డిమిట్రీకి తానంటే ప్రేమే లేదు. అలాంటప్పుడు యేంజేసిమట్టు కేంలాభం? లాభం లేదు.

పైన ప్రకాశించే సూర్యుణ్ణీ, చుట్టూ కప్పుకున్న శీతకాలపు నిశ్శబ్దాన్ని బద్దలుజేస్తూ కిలకిలలాడే నవ్వుని చూస్తే భయమేసింది ఎలీనాకి. తన ఆవేదనలో తాను మునిగితేలుతూ ముందుకు నడిచింది ఎలీనా.

“ఇంతకీ తర్వాతేమి జరిగినట్టు?” అని ప్రశ్నించుకుంది తనని తాను. జవాబు దొరకలేదు. ప్రతీదాన్నీ స్థిరీకరించి, నిర్ణయించే మాట ఒక్కటే వుంది, పుట్టినప్పటినుంచీ వింటూనేవుంది ఆ మాట.

సోవియట్ స్ట్రీట్‌లో, బస్ స్టాప్‌దగ్గర చూశాడు డిమిట్రీ ఆవిణ్ణి. గొంతు చించుకుంటూ కేకేశాడు:

“ఎలీనా!”

ఇంతవరకెప్పుడూ, అతనలా పిలవలేదావిణ్ణి, పేరుపెట్టి. చాలు. అదే పరిష్కరించేసింది అన్ని సమస్యలూనూ.

ఎవరి దాకానో యెందుకు. అంత కొత్త నిమిషం క్రింద ఇవాన్‌దగ్గరకే వెళ్ళి, యింకో నిమిషంలో నువ్వు వీధికడ్డంబడి, పేరుపెట్టి కేకలేసుకుంటూ అలా పరుగెత్తుతావని చెబితే, అతని మట్టుకతనే వొప్పుకునేవాడు కాదు. తనని తాను నిగ్రహించుకోగల శక్తి వుందతనికి, కావాలంటే అతని జీవితమే సాక్ష్యమిస్తుందందుకు నిలబడి. ఎలీనాని కలుసుకుంటానని అనుకోలేదతను; యేమీ తోచక అటూయిటూ చూస్తూ, నడుస్తూ, నాకూ ఆవిడకీ పరిచయం యేర్పడింది క్రిందటి వసంతంలో, అంటే సంవత్సరమైందన్నమాట. నెలలుగాని, సంవత్సరాలుగాని లెక్కబెడుతూ కూర్చోవడంవల్ల లాభంలేదని తెలిసొచ్చింది నాకిప్పుడు. ఏదైనాసరే. యిక నేనావిణ్ణి మరిచిపోలేను. జీవితమంతా యేదో వెలితివెలితిగా, బరువుబరువుగా వుంటోంది. ఆవిడ బ్రతికున్నది అని అనుకుంటే చాలు, యెంతో హాయిగా వుంటుంది! నన్ను మనిషినిచేసిందావిడ నన్నావిడ పూర్తిగా మార్చేసింది. క్రిందటి శీతకాలంలో, పాఠకుల క్లబ్బులో, ఆ అర్థంలేని అభిప్రాయాలెందుకు వుపన్యాసమిచ్చానో అర్థంకావడంలేదు! జీవితం అనుకున్నంత రాచబాట కాదు, చిక్కులమయం. ఎలీనా నిక నేను చూడను..."

ఇద్దరూ ప్రక్కప్రక్కనే నడుస్తున్నారిప్పుడు, గందరగోళంగా వున్నాయి వాళ్ళ మనసులు, గబగబా నడుస్తున్నారు, ఆలోచించకుండానే మాట్లాడేసుకుంటూ.

"నేనటు వెళ్తూవెళ్తూ, బస్ స్టాప్‌దగ్గర చూశానిన్ను."

"వింతగానే వుంది, కేక వినగానే అనుకున్నా ఆ గొంతు నీదేనని... బయటికెందుకొచ్చానో తెలియదు... సామాన్యంగా ప్రొద్దుగూకులూ యింటిదగ్గరే కూర్చుంటా..."

"తొందర పనేమీ లేదుగా?"

"లేదు, లేదు, మీకూ?"

"నాకా ?"

కనుబొమలు లేపి, ఆశ్చర్యంగా, పరీక్షగా చూశాడు డిమిత్రీ: నిజమే, ముందున్నది నిజంగా ఎలీనాయే.

కిటికీ ప్రక్కనే నిలబడి, కిటికీ అద్దాలు కడుగుతున్నా రెవరో వాకాడవి, అద్దం తళతళా మెరుస్తూంది నీలివెలుగుని ప్రతిబింబిస్తూ. ఎవరో ఒక చిన్నబ్బాయి ఐస్‌క్రీమ్ తింటున్నాడు. ఒక చిన్నపిల్ల పూలగుత్తి పట్టుకెళ్తూంది. వాళ్ళిద్దరూ దాటిన ఆచెట్టు—ఎలీనా కింకా గుర్తుంది, ఆకురాలుకాలంలో ఒకానాటి సాయంత్రం పాతారాచెట్టు నక్కడ, చుట్టూ జనం గుంపులుగుంపులుగా నిలబడి చూశారుగూడాను అప్పుడు. ఇంకా మోడుమోడుగానే వుందా చెట్టు; ఐనాకళ్లు కుంచించుకుని పరీక్షగా చూస్తే, మోడు మొదల్లో సన్నగా పచ్చగా మెత్తినట్లుంది. 'తేదీ యెంత ? యేమీ గుర్తుకు రావడంలేదు. ఏమీ అర్థంకావడంలేదు, అస లేం జరిగిందీ యింతకీ? యెక్కడి కెళ్తున్నాం యిప్పుడు మేం ?'

"ఎక్కడి కెళ్తున్నాం విప్పుడు ?" అని తానే ప్రశ్నించుకుంది బిగ్గరగా.

ఇద్దరూ కలిసి నాలుగంతస్థుల భవనందగ్గర కొచ్చారు; డిమిత్రీ వుండే దా యింట్లోనే. గబగబా లోపలి కెళ్ళిపోయారు. హాల్లో యింకా చలిగానే వుంది. శీతకాలం యింకా ఆ గదిని వదలిపెట్టి పోలేదు. చీకటి ! మెట్లుగూడా సరిగ్గా కన్పించడంలేదు. డిమిత్రీకిగాని, ఎలీనాకిగాని చలివేస్తూందనిపించలేదు. తల లేపి చూచింది ఎలీనా; ఎలీనా కళ్ళామసకవెలుతురులో మెరసిపోయాయి. ఎలీనాని డిమిత్రీ ముద్దుపెట్టుకున్నాడు. చిన్నపిల్లల కేకలూ, వీధిలో నడిచే కారుల రణగొణధ్వనీ, – వసంతకాలంలో ప్రతిరోజూ వినిపించే చప్పుళ్ళన్నీ వినిపిస్తున్నాయి బజారునుంచి.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B182 |
| పుస్తకం పేరు | బాగోగులు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 251 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | haseema |
| పరీక్ష చేసినది | daveed |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | NO |